**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

Bibliographic Record Target

తులసిదాసు, కొత్తయింటి.
భక్తచరితామృతము / కొత్తయింటి తులసిదాసుచేత రచియింపబడినది.- చెన్నపురి : స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాల, 1907.
344 p. :ill. ;21 cm.
Record no. 753

Tulasidāsu, Kottayiṇṭi.
Bhaktacaritāmṛtamu / Kottayiṇṭi Tulasidāsucēta raciyimpabaḍinadi.- Cennapuri : Sṭār Āph Iṃḍiyā Mudrākṣaraśāla, 1907.
344 p. :ill. ;21 cm.
Record no. 753

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB     Date filming began:

శ్రీమతేరామానుజాయనమః,

# భక్తచరితామృతము




ఇది

శ్రీవిష్ణు నామ సంకీర్తన రాకా కుంభో[illegible]త్రము

తులసిదాసు చరిత్రము శ్రీవెంకటాద్రిస్వామి చరిత్రము

జయదేవ చరిత్రము

మొదలగు గ్రంథములకుకృతి కర్తయు

శ్రీవాధూల గోత్ర సంజాత ఉభయ

వేదాంతాచార్య

శ్రీమాన్, చోళసింహపురం కందాడ రంగాచార్య

చరణసరోజాశ్రయుండును

శ్రీమాన్ అల్లూరి వేంకటాద్రిస్వాములవారి

కరుణాకటాక్ష పాత్రుండునగు

కొత్తయింటి, తులసిదాసుచేత

రచియింపబడి

మొదటి కూర్పు 2000

చెన్నపురి:

స్టార్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె

రిజిష్టర్ కాపిరైట్] 1907 సం॥ [వెల రూ ~~1-0-0~~ 1-0-0

# ప్ర క ట న.

ఈ గ్రంథము వలయువారలు చెన్నపురి, గుజిలివీధిలో గాజుల వ్యాపారముచేయు, ఉప్పు, కృష్ణస్వామి శెట్టిగారి వద్దనున్న మఱియు శ్రీమాన్-అల్లూరి, వేంకటాద్రిస్వాములవారి భగవద్ధాన మందిరమున కొ-తులసిదాసువద్దను వ్రాసి తెప్పించుకొన వచ్చును.

ఈ భక్తచరితామృతము గ్లేసు 16 పౌను కాకితములచె అచ్చువేసిన పుస్తకము ఒకటికి రూ 1-0-0

రఫ్ఫు కాకితములలో అచ్చువేసిన పుస్తకము ఒకటికి రూ 2-8-0

శ్రీ విష్ణునామ సంకీర్తన, రాకాకుంబారు చరిత్రము, తులసిదాసు చరిత్రము, ఒకటిగా బయిండుచేసిన-గ్రంధమొకటికి రూ 0-5-0

శ్రీమాన్-అల్లూరి వేంకటాద్రిస్వాముల చరిత్రము ఒకటికి 0-4-0

అరవములో వచనకావ్యము పై స్వాములవారి చరిత్రము ఒకటికి రూ 0-2-0

జయదేవుల చరిత్రము ఒకటికి రూ 0-2-0

ఇట్లు,
కొ-తులసిదాసుడు.

# విజ్ఞాపనము.

పూర్వము ఉత్తరదేశంబున నవతరించిన ఒకభగవద్భక్తుఁడు సర్వశాస్త్రార్థ వేత్తయై జ్ఞానభక్తి వైరాగ్య శీలుఁడై భాగవతప్రియుండై ప్రియదాసుండని తిరునామము వహించిన ఒకసుజ్ఞాని వేంచేసి యుండెను. అతఁడు భగవత్కృపావిశేషంబుచేత నెడతెగక సర్వ కాలంబుల యందును శ్రీహరి గుణానుభవంబులం గొనియాడుచు నఖిల దివ్యదేశంబులను నఖిలతీర్థంబులను సేవించుచు వచ్చుచుండఁగా అచ్చటచ్చట వేంచేసియుండు భగవద్భక్తులయొక్క అపార మహిమంబులను కొందఱు భాగవతులు కొనియాడఁగ విన్నవానిని తాను నేరుగా సేవించినవానిని చరిత్రరూపముగా వ్రాయుటకు ఉద్దేశించి సంస్కృతభాషయందు గ్రంథస్థముగా వ్రాసి ప్రపంచంబంతయు ప్రకాశింపఁజేసెను. ఇట్టి ఈగ్రంథమును కాశిక్షేత్రంబున విలసిల్లెడు అగ్రదాసుల ప్రియశిష్యుండగు నాబాజీయను మహాత్ముఁడు గాల్వియర్ భాషయందు రచియించి వానినిహిందూస్థాని దేశం బెల్ల ప్రబలపఱచెను.

తదనంతరము కొంతకాలమునకు వానిని మహీపతి బావాజీయను మహాత్ముండు మహారాష్ట్ర భాషయందు భక్తవిజయము, భక్తలీలామృతము, సంతవిజయము, సంతలీలామృతమను తిరునామంబులనుంచి నాలుగుగ్రంథములుగా వ్రాసి మహారాష్ట్ర దేశం బెల్ల ప్రబలించెను.

తదుపరి కొంతకాలమునకు తంజావూరిలో ప్రసిద్ధికెక్కియుండిన తులసీఅయ్యాయనువారు భక్తవిజయంబును మాత్రము ద్రావిడభాషలో వచనరూపముగా రచియించి ప్రసిద్ధిగావించిరి. మఱికొన్నాళ్లకు దానిని శ్రీమాన్, కోయిల్ ధనాల, దేవరాజస్వాములు ఆంధ్ర భాషయందు వచనరూపముగా వ్రాసివెల్లడిపఱచిరి. పిదప 1901 వసంవత్సరము వె-బాలకృష్ణ మొదలారిగారు భక్తవిజయము, భక్తలీలామృతము, సంతవిజయము, సంతలీలామృతము, అను యీ నాలుగు గ్రంథములు మహారాష్ట్ర భాషయందుండి తాను సొంతముగా తెనుఁగుభాషలో తోహరాకవితలుగ రచించి భక్తమాలా అనుతిరునామముంచి ప్రబలపఱచెను. ఆభక్తమాలాయన్న గ్రంథమును ఆధారముగా నుంచుకొని దాసుఁడు భక్తవిజమందు 52 చరిత్రములును, భక్తలీలామృతమందు 90 చరిత్రములును, సంత విజయమున 11 చరిత్రములును, సంతలీలామృతమున 27 చరిత్ర ములును అంతుమొత్త చరిత్రములు 180 న్ని ఆంధ్రభాష వచన రూపముగ రచియించినాఁడను. హంసలు పాలతోఁగలసియున్న నీటినినిగ్రహించి పాలనుమాత్రము గ్రహించులాగున బుద్ధిమంతులు ఇందలి దోషములను విడనాడి సారమును సంగ్రహింపఁగలరని వారి ఘనతను అనయంబు వినయంబుతో ప్రార్థించుచున్నాఁడను.

సర్వజనులకు సులభంబుగఁ దెలియుటకై యీ గ్రంథమునందు సంధులు వీడఁదీసి వ్రాయనైనది.

ఇట్లు,

కొ, తులసిదాసుడు.



# పీఠిక

శ్రియఃపతియై, శ్రీవైకుంఠనికేతనుఁడై, నిత్యముక్తానుభావ్యుండై నిరతిశయానందయుక్తుండై, శ్రీ, భూ, నీళాదేవులతో వేంచేసియుండు శ్రీమన్నారాయణుండు చేతనోజ్జీవనైక సంకల్పుండై ఈ లీలావిభూతియందు దశావతారంబులనెత్తి అఘటితఘటనా సామర్థ్యంబు జేసియు చేతనుల రక్షింప వల్లగాక, భగవంతుఁడు శ్రీవైకుంఠమునకు వెడలి చేతనుల విషయంబున పరమకృపతో చింతిల్లి, నారద, వాల్మీక, వ్యాస, శుక, ఉద్ధవాది మహర్షులను పిలిచి నేను పుండరీకుని కొరకై పండరిపురమున పండరినాథుఁడై యవతరింతును అందు మీరలు జయదేవ, నామదేవ, తుకారాం, తులసీదాసాదులనెడి నామాంతరములతో పండరి పురము మొదలగు దివ్యక్షేత్రముల యందు నవతరించి జింకను జూపి జింకలను పట్టునటుల మీరు సజాతీయముగ స్నేహించి ఈలోకమున అజ్ఞానాంధకారమున మునుగు బద్ధచేతనులకు భక్తిమార్గంబు తెలిపి నాతిరువడియందున చేర్చుఁడి ఆసమయమున మీయందు ఆవేశించి మీరు చేయు కార్యములకు నేను వశవర్తినై నిర్విఘ్నముగ నడుచునట్లు కొనసాగించెద నని యాజ్ఞ చేసెను వానిని విని యాభక్తులందరు నత్యానందముఁ జెంది భగవంతుని యాజ్ఞ శిరసావహించి శ్రీపండరి పురి మొదలగు దివ్యస్థలముల యందవతరించి తమ తమ జ్ఞానానుష్ఠానములచే కాలోచితముగ యనేక మహిమలు జూపి భగవద్భజనము నపారముగ జేసి మైమఱచియుండు మార్గములను ఈ జగజ్జనులకు తెలిపి వారల ననుష్ఠింపగ జేసి ఉజ్జీవింపించిన భగవద్భక్తుల చరిత్రములు ఈదిగువ వ్రాయబడియున్నవి.

ఇట్లు,

కొ, తులసిదాసుడు.



శ్రీ



అస్మద్గురుభ్యో నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# భక్తచరితామృతము.

శ్లో॥ శ్రీమద్వధూల కులవారిధి పూర్ణచంద్రం
శ్రీవాసనూరి తనయం శ్రితతత్వదాబ్జం
రామానుజార్య కరుణా పరిపూర్ణబోధం
శ్రీవాససూరి మనఘం శరణం భజేహం॥

శ్లో॥ శ్రీదేవరాజ పరిపూర్ణ కృపైకపాత్రం
శ్రీరంగనాథ మహనీయ గుణార్ణవాభం
శ్రీమత్సమస్త సుగుణాకర మార్యభోగ్యం
శ్రీవేంకటాద్రి గురుపుంగవ మాశ్రయామః॥

శ్లో॥ శ్రీరామచంద్ర పదపంకజ భృంగరాజం
శ్రీహస్తిశైల వరదాంఘ్రి సరోజహంసం
శ్రీవేంకటాద్రిగురువర్య కృపైకపాత్రం
నారాయణాఖ్య గురుపాద యుగంభజామి॥

శ్లో॥ లబ్ధ్వాలక్ష్మీనృసింహాత్సధు మయకవితాం దివ్యసూరీన్ స్తువంతమ్
సంశ్రిత్యాత్రేయరామానుజగురుచరణౌలబ్ధచక్రాంకమంత్రమ్

కౌణ్డిన్య శ్రీనివాసాహ్వయగురుకృపయా లబ్ధమన్త్రార్థబోధమ్
వన్దే శ్రీపార్థసారథ్యభిధ గురువరం ఖ్యాతభూపాలవంశమ్॥

శ్లో॥ శ్రీమాన్ భట్టర్ పిరాన్ పదాబ్జమధుపం శ్రీ శ్రీనివాసార్యసత్
కారుణ్యైక సమస్తబోధహృదయం కామాదివిద్వేషిణం
ఆకారత్రయనిత్య సంపద యుతం ఆచార్య నిష్ఠానిశం
ఆర్తత్రాణపరాయణం ముదలియాండాం దేశికాఖ్యంభజే॥

శ్లో॥ శ్రీశైలతాత గురువర్య దయైకపాత్రం
శ్రీమన్నృసింహ వరదేశిక లబ్ధబోధం
శ్రీమద్యతీంద్ర పదపంకజ భృంగరాజం
శ్రీదేవరాజ గురువర్య మహంభజామి॥

క॥ శ్రీమద్యతీంద్రవరులకు గామితఫలదాయియైన కరుణానిధికిన్
రామానుజాఖ్యధీరు న్నేమారక నాదుమదిని నిరతముగొలుతున్

క॥ శ్రీశఠగోపుని యంఘ్రులు
పాశములను ద్రుంచిభక్తి పరువడినొసఁగున్
శ్రీశుని యంశమె యగుటను
నాశముసేయును భవముల నర్థిలిమనసా॥

క॥ కంజాక్షి యవధరింపుము
యంజలి గావింతునీకు నతివినయముతో
గుంజర వరదునికొమ్మా
మంజుల వాక్యములహరికి మనుపంజెపుమా॥

శ్లో॥ యఃపాండురంగ పదభాజివ సత్యనస్తః
క్షేత్రేద్వయార్థ మఖిలాననుభావయన్నః
విన్యస్యహస్త యుగళం కటిసీమ్ని తస్య
శ్రీవిఠ్ఠలస్య చరణౌ శరణం ప్రపద్యే॥



శ్రీ



శ్రీ పాండురంగ పరబ్రహ్మణే నమః.

# అగ్రదాసు నాభాజీచరిత్రము

కాశీక్షేత్రమునందు శాంతిదాంతి శమ దమాది సద్గుణ గరిష్ఠులగు ఆనందస్వాములని పేర్కొనిన నొక మహాత్ముఁడుండెను. వారి శిష్యుండగు అనంతానంత స్వామియుండెను. అతనిశిష్యుఁడు బోహారి దాసుఁడుండెను. వీరికి అగ్రజి కిలజియను వారిద్దఱు పుత్రులుండిరి. వీరిలో అగ్రజియను వారు ప్రతిదినమును శ్రీవిష్ణుభక్తిసేవారతులై భగవత్కల్యాణగుణముల ననుభవించుచు దానినెడతెగక పరోపదేశము చేయుచు జ్ఞానభక్తి వైరాగ్య శీలురై యుండెను. వీరు ప్రబోధిని పద్మహస్తి మొదలుగాగల యనేక భక్తులకు నవవిధసంబంధ భక్తిమార్గంబుల నుపదేశించుచు శ్రీవిష్ణుపదంబులఁజేరు నుపాయోపేయంబులఁగఱపి ధన్యులనుగాఁ జేసినట్టివారు వీరికి శ్రీలక్ష్మీనాథుఁడైన భగవంతుఁడు తన సగుణరూపముతో నప్పుడప్పుడు సేవసాయించుచుండును. ఇట్లుండ కొన్నాళ్లకు నాప్రదేశంబున వర్షంబులు లేక

కాటకంబు కలిగి ప్రజలకు నాహారాదులు లేక శ్రమపడుచుండు తఱి నాయూరనుండునొక పతివ్రతాతిలకము తనబిడ్డకు నాహారంబుదొరకమింజేసి యాబిడ్డనాకలిచే పరితపింపుచుండుగ గని మిక్కిలి చింతాక్రాంతురాలై యచ్చటనుండు నొకనదియొడ్డున తన బిడ్డను వదలిపెట్టి ఎచ్చటికొ వెడలిపోయెను తర్వాత కొంతసేపునకు నిరాదరుడైయొంటరిగా నుండునీబిడ్డ తనతల్లిని గానక వెతకి వెతకి క్షుద్బాధచేత తపించి నోయని మొఱపెట్టసాగెను. మఱికొంతసేపటికంతయు నచ్చటికి స్నానార్థముగా వచ్చిన అగ్రజిదాసులు ఆబిడ్డనుం జూచి మిగుల దయాళుడై సమీపమునకుంబోయి యేలనేడ్చెదవని యడుగ నేను నాతల్లిని యన్నమడిగితిని నన్ను విడచి యెచ్చటికినేగనో తెలియనైతిని యనినుడువంగా నప్పుడు అగ్రజదాసు కరుణకలిగినవాడై స్నానాది యనుష్ఠానములు తీర్చుకొని యాబిడ్డను దగ్గరకు బిలచి నీవు భయపడవలదని ధైర్యము చెప్పి యాబిడ్డకు నాదినము నాభాజి యని ప్రసిద్ధిజెంద పేరుపెట్టి అతని తమ మఠమునకుం బిలుచుకొనివచ్చి. మఠముననుండు వారిని జూచి ఈదినము మొదలుకొని మనమఠమునకు విచ్చేయు భాగవతులయొక్క యుచ్ఛిష్టాన్నము యీ బిడ్డకు బెట్టుడని నియమించెను వారు యాలాగె పెట్టుచు రాగె భుజియించి పెరుగుచునుండగ అగ్రజదాసులవారు యీ బిడ్డయొక్క జాతి నియతి తెలియనందున తన మఠమునకు యెదటయొక గుడిసెను వేయించి అందునతని బెట్టిపాలింపుచుండెను ఇట్లుండగ ప్రతీ దినమును చేసెడి తిరువారాధన సేవించుట వల్లను మఠమునందు శ్రీరామాయణ భారత భాగవతాది గ్రంధకాలక్షేపములనువినుటచే తను నాభాజియొక్క యాగామిసంచిత ప్రారబ్ధాది కర్మములు నశించి జ్ఞానము దినదినంబు నభివృద్ధినొందుచు నీలోకంబునందు వసించు



నరులు తము తమ హృదయంబులం దలంచినవెల్లందా నెఱుంగుటయునుం నెచ్చనెచ్చట యెట్టియాశ్చర్యంబులు నడచినను తన హృదయాంతరమున ప్రతిఫలించుటయును తనంతట తనకుం తెలియుచుండెను. ఇట్లు త్రికాలవర్తమానముల నెఱింగిన వాడై యుండగా నొక దినము అగ్రజిగంగలో స్నానముచేసి నిత్యానుష్ఠానములం దీర్చుకొని భాగవత్సన్నిధినిం బ్రవేశించి క్రమ ప్రకారము తిరువారాధన సమర్పించి మంగళశ్లోకములతో కర్పూరారతి సమర్పించి దీర్ఘశరణాగతి చేసి నాభాజిని బిలచి యిక్కలోనికి నెవరిని విడువక జాగ్రతగాం జూచుచుండుమని నియమించి కవాటముబంధించి తనపై నొకకంబళిని కప్పుకొనియమ నియమాసన ప్రాణాయామములతో నంతరంగమున భగవధ్యానంబుం జేయుచుండగా శ్రీహరి తన హృదయంబున ప్రతిఫలింపక యుండుటచే మఱిమఱి నిచ్చలబుద్ధి కలిగి పూనికతో ధ్యానించినను గనపడనందున శ్రీహరి యెటుబోయెనో యనిచింతిల్లుచున్నప్పుడు వెలుపల నుండు భక్తాగ్రేసరుండగు నాభాజి యదియెఱింగి ఓ స్వామీ మీరేల ప్రయాసపడుచున్నారు. ఒక వణిజునోడ సాగరంబున మునుగుచుండగని నీకు తన వోడసరకులో అయిదవ భాగము నిచ్చెదనని శ్రీపాండురంగని ప్రార్థించి ముడుపెత్తిగట్టెను గనుక శ్రీపాండురంగడు ఓడనెత్తుటకై వెడలి యున్నాడు. ఆకార్యంబు ముగించుకొని యతి శీఘ్రంబున విచ్చేసి సేవ నొసంగునవెను. అప్పుడాతని మాటలనాకర్ణింపు చుండగా శ్రీపాండురంగనాథుండు సాగరంబున తడిసిన పీతాంబరముతో బ్రహ్మరుద్రాదులకు నలభ్యంబగు శంఖ చక్రగదా ఖడ్గకిరీటాది దివ్యభూషణాలంకృతుండై సేవసాయించెను అంతట నగ్రదాసు బహువిధంబులస్తుతి యింపగా భగవంతుడంతర్ధానుండయ్యెను. పిదపతలుపులు

తెలిసికొనినబయలు వెడలివచ్చి యానాబాజీ నాహృదయగతంబైన
విషయంబులు నీవెట్లుదెలిసికొంటివి యని యడుగఁ గానతఁడో స్వా
మీ మీకృపచేలభించిన సాధువుల యుచ్ఛిష్టాన్నభుక్త మహిమంబని
సమాఖ్యానింప నతని నతిప్రీతితో నాలింగనంబు గావించి నీయట్టి
భక్తునినే నెందునుగని విని యెఱుంగనని సంతసిల్లి శ్రీపాండురంగని
ధ్యానించుట కన్నను వారిదాసులను ధ్యానించుటయును, వారి
చరిత్రంబుల నాకర్ణించుటయును, వారల నారాధించుట యును,
సహస్రగుణాధికంబు గాన నిట్టి భగవద్భక్తుల చారిత్రంబులు గ్రంథ
స్థంబుగా లిఖియించి యీకలియుగంబున చేతనులు తమ్ము తామె
ఱుఁగక బద్ధసంసారులై తిరుగుచుండెడి వారికి నీభక్తచరిత్రంబులను
బోధించి వారలను భక్తిపరులగావించి కడతేర్పుమని నియమిం
చెను. అత్తఱి నాబాజి తన యాచార్యుని నాజ్ఞ శిరసావహించి
గ్వాలియర్ భాషయందు శ్రీజయదేవాదిమహా భక్తుల యొక్క
చారిత్రంబుల రచియించి జగత్ప్రసిద్ధంబుగావించెను. ఇట్టిమహాను
భావుని చరిత్రంబు చదువు వారును వినువారును యిహపరసుఖం
బులం బొందుదురు.

శ్రీపాండురంగాయనమః

# పుండరీకునిచరిత్రము

ఈకలియుగంబున త్రైత్రికసంఘములకు ముఖ్య దర్శనీయంబై
వెలింగెడు లోహదండమునకు శ్రీపండరీక్షేత్రంబని నామాంతరము
కలిగివిలసిల్లుచుండును, అందుజన్వాయను నొకవిప్రుండు సాత్యకి
యను పతివ్రతా శిరోమణింగూడి విలసిల్లు చుండెను. వీరలకు బహు



కాలము పుత్రులు లేనందున "శ్లో॥ అపుత్రస్యగతిర్నాస్తి" అను
ప్రమాణము చొప్పున పుత్రులు లేనిపక్షమున సద్గతి కలుగనేర
దనితలంచి శోకసాగరంబున మునింగి శ్రీహరిని ధ్యానము చేయు
చుండగా శ్రీహరి కృపాకటాక్ష వీక్షణముచే నొకపుత్రుండు పుట్టెను.
అప్పుడా పుత్రునికి పుండరీకుండని నామకర్ణము చేయించిన పిమ్మట
యాబిడ్డ దినదిన ప్రవర్ధమానుండగుచుండ కాలక్రమంబుగా నుపన
యనంబులు సలిపి షోడశాబ్దంబున వైవాహికముజరిపినపిదప కొన్నా
ళ్లకు నాపుండరీకుండు "శ్లో॥ పెండ్లామేతి సదాస్నానం, పెండ్లామేతి
సదాజపం, పెండ్లామేతిసదాధ్యానంస సదా పెండ్లామే కీర్తనం,అనితన
భార్యకువశ్యుఁడై తలిదండ్రులకు శుశ్రూషలు సలుపుటమాని పితృ
ర్జిత ధనంబునుపలు తెఱంగుల వ్రయపఱచుట యేగాక దుష్టుండై
తిరుగు చుండుటంజూచి మాతాపితలు సామదాన భేదదండములను
చతురోపాయంబులచేత సద్వృత్తిని బొనిపినను దానికిని మఱలని
వాఁడై తల్లిదండ్రులను హింసలు గావించుటగని వీఁడు మనపుత్రుండు
గాడు మనకు శత్రుండని మతిరోసి యెచ్చటకైనంజని ప్రాణత్యా
గంబు చేసికొనుటయే యుత్తమంబని తలంచి కాశికివెళ్లి గంగాస్నా
నంబుచేయ నుద్యుక్తులై యిల్లువిడనాడిపోయిన కొన్నాళ్లకు కాశికి
వెడలెడి యాత్రవాసులతో పుండరీకుండును తనభార్యయును గలసి
కొని కాశియాత్ర సేయనుద్యుక్తులై తా నొకగుఱ్ఱమును తనభార్య
నొక గుఱ్ఱమును నెక్కి యొకనాఁడు సుముహూర్తమున కాశియా
త్రకై వెడలి యడవి నదీనద తటాకాదులంగడచి తన తల్లి తండ్రులు
పాదచారులై పోవుచుండగ పుండరీకుడు దారిలో జూచి చూడని
వానివలె పోవుచు గంగా సమీపంబుఁజేరఁగా తనతోడవచ్చిన
యాత్రవాసులు దారితప్పివిడఁబడిపోయిరి. అత్తఱి యచ్చటినుండి

యెటుబోవుటకు దారిఘొందమునగానక నల్లాడుచుండ వాని పూర్వ
జన్మసుకృతంబున సమీపములో కుక్కుటముని యాశ్రమంబొకటి
యుండుటంగని యందుఁజేరి వసియించియుండ కుక్కుటముని వరుండు
తన తల్లితండ్రులకు సకలవిధ కైంకర్యములు జేసి వారలకు పురాణ
శ్రవణంబు జేయించి శయనించుటకు తగుమైన పరుపు వేయించి
పట్టిపై శయనింపంజేసి ఆలవట్ట కైంకర్యము జేసి నిద్దరించిన పిదప
జలస్పర్శకై వెలుపటరాగ నా కుక్కుటమునిని పుండరీకుఁడుజూచి
దీర్ఘ దండ ప్రణామంబులిడిని ఓ మునివర కాశీక్షేత్రమును భాగిరది
నదిన్ని నింకయెంత దూరమున్నదని యడుగ వాటికి ఓ యాత్రవాశి
ఇంత సమీపమునందుండు కాశిన్ని భాగిరతి నదిన్ని ఏ మూలలో
యున్నదో నాకు తెలియదు నాతల్లి తండ్రుల శుశ్రూషలు విడచి
జనుటకు అవకాశము లేనందున నేను చూచి యెరుగననెను. వెనుక
పుండరీకుఁడు అయ్యో మీజన్మము వ్యర్థమైపోయెను కదా యింత సమీ
పముననుండు క్షేత్ర దరిశనము లేకుండుట యెంత దౌర్భాగ్యమో
తెలియదని తనమదిలో తలంచుచుండెను నాదిన మద్ధరాత్రంబున
ముగ్గురుస్త్రీలు మలినదేహంబులు గలవారై కుక్కుటముని యాశ్ర
మంబునుజొచ్చి వారిగృహంబును శుభ్రమంబుగాజిమ్మి యలికి రంగ
వల్లులనిడి యచ్చటగల కార్యంబుల నెల్లఁగావించి మునివరునకు ప్రద
క్షిణ నమస్కారాదు లొనర్చి వారిచే నాజ్ఞఁగైకొని వెడలి వచ్చు
చుండ మునుపటి మలినదేహములు మాని శతకోటి మార్తాండ తేజం
బుగ వెలుంగునటుల సర్వభూషణ భూషితాలంకృతులై వచ్చువా
రిని పుండరీకుండు పొడగని యాశ్చర్యంబు నొంది వారికెదుటం జని
మీరలెవ్వారు మిమ్ముల్లం జూడ జూడ మహదాశ్చర్యంబుగా నుండు
టయేగాక యింతకు పూర్వమీరా యాశ్రమంబునకు వచ్చున



ప్పుడు మలినదేహులై యుండియిప్పుడీ తేజోరూపంబులు దాల్చియుం
డుట మిగుల చోద్యంబై యుండుటచే నాపైవాత్సల్యత నుంచికలస్థితి
నెఱిఁగింపుండని ప్రార్థింపఁగా మేముగంగా యమునా సరస్వతులము.
ఈజగతిని వసించుకుమతులు దుర్మార్గులు దురాచారులు మొదలుగా
గల వారుమమ్ము నాశ్రయించి భక్తిచేసి మాయందుస్నానాదులొనర్చి
వారివారి పాపములను బోఁగొట్టుకొని పోగలరు, ఆపాపంబులను
మేము భరించుచుండుటచే మాదేహంబులు మలినంబు లగుచున్నవి,
ఆపాపంబులం దొలగింపఁజేసి కొనగలందులకై మాతాపితా శుశ్రూ
షా రతుండై విలసిల్లు మహానుభావుండగు నీకుక్కుటముని నాశ్ర
యించి వారికి సకలవిధ శుశ్రూషలు సలిపి వారిచే నాశీర్వాదంబులు
గైకొని మాపాపముల నెల్లఁ బోఁగొట్టుకొన ప్రతిదినంబు నీలాగున
వచ్చిపోవు చున్నారమని చెప్పి వెడలఁగా. పుండరీకుఁడీ విషయంబు
లన్నియు విన్నవాడై తనతల్లిదండ్రులఁకు దాను చేసిన పాపకృత్యంబు
లను స్మృతికిఁదెచ్చుకొన్నవాడై యిక వీరలంగొని మన పాపంబులు
దొలగుమార్గంబు వెదకుకొన వలయునను భావంబు వారల దర్శన
మాత్రంబున గలిగి తక్షణంబె యాగంగా యమునా సరస్వతీ
పాదంబులఁ గట్టిగాఁ బట్టుకొని నాతల్లులారా నేనుమాతృపితృద్రోహిని
తెలియమిచే సకలవిధ పాపంబులకర్హుండనైతిని, తమదర్శనముచే
నేనుపాపాత్ముఁడనని యెఱింగితిని, ఇకనాగతి యేదియుఁ దోఁచక
యున్నది, మఱినా పాపంబులు తొలగిపోవు మార్గంబుదెలుప
మీరుదప్ప నాకెవరును దిక్కులేరు నాయందు కటాక్షంబుంచి కడ
తేర్చుఁడియని దీర్ఘశరణాగతిచేసి నందున విష్ణుపాదగంగకు దయగ
లిగి ఓరిపుండరీకా నీవుకుక్కుటమునివలె నీతలితండ్రులకు శుశ్రూ
షలు మిక్కుటముగ సలిపితివేని కుక్కుటమునివలెనే కృతార్థుండ

పొందుదువు, అంత్యమున శ్రీగోవిందుని పాదారవిందములఁ జేరుదువు, నీకుపూర్వ పుణ్యం బతిశయించి యుండుటచే కుక్కుటముని సేవ యును మాదర్శనంబును గలిగెఁగాన నీవు భగవచ్ఛరణారవిందం బులఁ జేరుదువని యాశీర్వదించి యదృశ్యులైరి. పిమ్మట పుండరీ కుఁడు తనతల్లిదండ్రులను వెదకివెదకి కాశినగరమున కరిగి కని పెట్టి వారలకు సాష్టాంగముగా దండప్రణామంబులు గావించి వారల నాలింగనము చేసికొని నేనజ్ఞానముచే మీశుశ్రూష లనువిడచి మహాపాపినైతినని చింతిల్లఁగానప్పుడు తల్లిదండ్రులు కరుణించి వానిచేతులు గట్టిగాబట్టుకొని నీకిట్టి సుబుద్ధికలుగుటచే నీవుసుపుత్రుండవైతివి, మాకునునీవలన సద్గతిజెందుటకాస్పదంబ య్యెను, ఇప్పుడుగదా మేముకృతార్థుల మైతిమని మంగళాశాస నము చేసి వీడ్కొలుప నదిమొదలు పుండరీకుఁడు తనతలిదం డ్రులకు నతిశ్రద్ధాభక్తితో శుశ్రూషలు సేయుచును మాతా పితల సహితంబుగ దివ్యదేశంబుల నెల్లసేవించి యెప్పటివలె తన యిల్లుచేరి ప్రతిదినంబును తనతల్లిదండ్రులకు శుశ్రూషలు సలుచుం డుటచే నానాటజ్ఞానమధికరించుచుండ, ద్వారకలోరుక్మిణీదేవి శ్రీకృ ష్ణునితో ప్రణయకలహంబొనర్చిన యాకలహము చల్లారనందున యిల్లువిడనాడి వనగిరి నదీనద తటాకాదులు గడచి లోహదండమను పురంబునుజేరి సకలజనములు చూచుచుండ ఘోరమైన తపంబుజే యుచుండెను. అప్పుడు శ్రీకృష్ణుండురుక్మిణీదేవిని గానక పెక్కు దిక్కులందిరిగితిరిగి విసిగి వేసారిలోహదండముచేరెను. అప్పుడక్కడ రుక్మిణీదేవి తపస్సుచేయుచుండుటంగని చింతమాని చెంతఁజేరి యామెకోపంబును జల్లార్చి యిరువురులును నేకీభవించి ద్వారకా పురికి పోవలయునని తలఁచి వెళ్లునపుడు దారియందు శ్రీరుక్మిణితోడ



నిచ్చట నాకత్యంతప్రియభక్తుండున్నాఁడు, వానింజూచి వచ్చెదమని చెప్పగా నట్లచేసెదమని యిరువురుంగూడికొని పుండరీకుఁడు తన తలిదండ్రులకు సకలవిధ యుపచారంబులుచేసి తిరుమణికాపు చేయు సమయమునకు సరిగా శ్రీపాండురంగఁడు వజ్రఖచితకిరీటములతోను కౌస్తుభవనమాల వైజయంతి మౌక్తికహారములతో పూర్ణచంద్ర బింబమువంటి ముఖమున కస్తూరితిలకంబుతోను నవరత్నమయమగు కంకణకటిహస్తంబులతోను పీతవస్త్ర చందనలేపనంబుతోను కోటి సూర్యప్రకాశదేహ కాంతులతోను వారింటిని ప్రవేశించిరి. అపుడు పెద్దలెవరో వేంచేసిరనుచు నొకయిటికరాతిని విసరివేసి దీనిపైనుం డుఁడీ నేను నామాతృపితృశుశ్రూషలు ముగించుకొని వచ్చెదనని విన్నవించుకొని తనకార్యము నెరవేరినవెంటనే శ్రీకృష్ణుని వలగొని దీర్ఘదండప్రణామంబులిడిలేచి చేతులుముకిళించుకొని నిలువంబడి శ్రీరుక్మిణీనాథా నీవండాండ చరాచరంబులకు కారణభూతుండవై వెలసినవాఁడవు, నీయాజ్ఞచేతనే సూర్యచంద్రాదులు వెలుగుచు న్నారు, బ్రహ్మాదులునీయాజ్ఞచేసృష్టిస్థితి సంహారంబులుసలుపుచు న్నారు, నిన్ను సేవించుటనా బ్రహ్మరుద్రాదులకుసహితమసాధ్యంబు అట్టివాఁడవగునీవు నాయందుకరుణించి యిచ్చటికివచ్చినావు, నీవా త్సల్య సౌశీల్యాదిగుణంబులకు నేనేమని నుడువగలనని ప్రార్థించి యూరకుండఁగా జగదీశుండు హేపుండరీకా నీస్తోత్రంబు లపారా వారంబులు, నాహృదయంబున కత్యానందంబుఁగలుగఁజేసితివి, నీవు నీతల్లిదండ్రులకు శుశ్రూషలు మెండుగాఁ జేయుచుండెదవు. నీయం దునాకు విశేషప్రేమగలిగియున్నది. నీకేమివరము కావలయును, అడుగుమనఁగా పుండరీకుఁడా వాక్యములు విన్నమాత్రంబున తన దేహము పులకాంకితంబుజెంది ఓస్వామీ? యీక్షేత్రమునందును నదియందును నాయందును సమభావముంచి యీ మూఁడుదరిశన

ములచేతను దేవరవారు నాచే నొసంగఁబడిన యిటికరాతిపై కటిహస్తంబులతోడ నిలువబడి శ్రీపాండురంగఁడని పేరుపొంది యిచ్చటికి విచ్చేయు వారలకు సేవసాయించి వారిమనోభీష్టంబుల నొసంగుటయే నాప్రార్థనీయంబని వేడుకొనఁగా శ్రీపాండురంగఁడాలాగే నీకు వరంబొసంగితినని చెప్పి యొప్పుకొనియది మొదలిదివరకు శ్రీపండరీపురమున శ్రీపాండురంగఁడు యిటికరాతిపై కటిహస్తంబుల నిడుకొని నిలబడియచ్చటికి వచ్చెడి భాగవతులకందఱికి నతిసులభంబుగా సేవసాయించి రక్షించుచున్నాఁడు.

శ్రీమత్పండరీనాథాయనమః.

# జయదేవచరిత్రము.

శ్రీ జగన్నాథ క్షేత్రంబునకు నతిసమీపంబున తుంది బిల్వమను నామము పొందిన యొక గ్రామంబుగలదు అందు విప్రకులంబున వ్యాస మహాముని యంశంబునందు జయదేవులుద్భవించి యతఁడు చంద్రుని పగిది దినదినంబును వృద్ధినొందుచురాగా నతని తల్లిదండ్రులొక శుభముహూర్తంబున నతనికి చౌలోపనయనాదులను జేయింపనతఁడు శాస్త్రాభ్యాసంబుచేయక యేశ్రుతి స్మృతేతిహాస పురాణాదులు తనంతట తనకు లభించి నిపుణుఁడయ్యె. ఈతఁడు కర్మయోగంబుల జనకాదులవలె సుజ్ఞానయోగంబుల భరతాదులంబోలె భక్తియోగంబులఁ బ్రహ్లాదులవలెను, న్యాసయోగంబుల నాళ్వారాచార్యుల చందంబున బరిశుద్ధాత్ముండై, భగవద్ధ్యాననియతుండై, బ్రాహ్మణగోష్ఠి యందుశ్రేష్ఠుండై సర్వశాస్త్రంబులను అష్టాదశ పురాణంబులను పరిశోధించి వానియందు అంతర్భూతమయిన అర్థనిర్ణయము శ్రీహరి నామసంకీర్తన మహిమలెఱింగి గుణానుభవంబుగానించుచుండుతఱి చిరకాలంబునకు పాద్మపురాణమందు రాధా మాధవ విలాసంబను నితిహాసంబొకటిని గీర్వాణభాషయందు కీర్తనరూపంబుగా రచియించి వానిని గీతగోవిందమని తిరునామంబుంచి సాధుసజ్జనులకుఁ దెలిపి జగమంతయు బ్రబలునటులఁ జేసెను. దానియందు బ్రతిపాదింపఁబడిన శ్రీకృష్ణుని బ్రతిగృహంబునందును సతతము గొనియాడుచుండిరి. పుష్పంబొకచోటనుండినను దానిపరిమళము నలు దిక్కుల యందు వ్యాపించునట్లు యీ గ్రంథము లోకమందు ప్రజ్వరిల్లి యుండెను. పిదప శ్రీజగన్నాథమందు సాత్వికీయను నొకరాజుండెను. అతఁడు జయదేవులు వ్రాసినగీత గోవిందమునకు ప్రతిగ్రంథము వ్రాయించి యద్దాని ననేక ప్రతులు గావించి యాప్రతులను పామర పండితులందఱికి పంపివీనిని పఠించి జయదేవుల గ్రంథంబు వలె ప్రబలపఱచుండని యాజ్ఞాపింప వానిని సర్వజ్ఞులయిన పండితులు గైకొని పృథివీపతి చెంతకేగి యో రాజా నీవు చేసిన గ్రంథము శ్రీజయదేవుల గ్రంథమునకు చాటియగునని యాత్మస్తుతి చేసికొనెదవు, ఇదియుగాక జ్ఞానాధికులనుజూచినీవు వ్రాసినగ్రంథమును పాఠముచేయుఁడని యాజ్ఞాపించితివి వారలీగ్రంథంబును అనాదరింతురేగాని ఆదరింపరు. విద్య, గురువు, మంత్రము, మహారత్నము, కస్తూరి, కన్యక, వీనిని బలాత్కారముగ విక్రయించ బోయినట్లైతే ధర తగ్గిపోవును. ఆలాగే నీమనస్సునందహంభావము నుంచి నీవీగ్రంథంబు వ్రాసితివి. దీనిని భగవద్భక్తులును జగన్నాథ స్వామియు నంగీకరింపరని చెప్పిరి. అప్పుడు రాజు వారలంజూచి జయదేవులు తమగ్రంథము నందు శ్రీహరిగుణముల వర్ణించి యున్నారు. ఆలాగే నేనువ్రాసినగ్రంథమునందుకూడవర్ణించి వ్రాసియున్నాను. గాన మాయిరువురుల గ్రంథములను శ్రీజగన్నాథుని సన్నిధిలో నొకరాత్రియంతయు నుంచెదము. అప్పుడేగ్రంథము

పెరుమాళ్లకు నంగీకారము కానేరదో దానిని భగవంతుఁడు త్యజింప
నిమ్ముమాతమని చెప్పఁగా పండితులు దానికి సమ్మతించి యుభ
యుల గ్రంథములను రప్పించి శ్రీజగన్నాథుని సన్నిధిలో నునిచి
సన్నిధిని తాళము వేయించి మరుదినము ఉదయమున నఖిల జనం
బులు గుమిగూడి తాళమును దీసి కర్పూరారతి చేయఁగా జయ
దేవులవారి గ్రంథము శ్రీపురుషోత్తముని సమీపమందుండెను. రాజు
గ్రంథము దూరముగపార వేయఁబడి యుండెను. వానిని జూచిన,
భగవద్భక్తులందఱు ఆశ్చర్యంబునొందుచు ఆహా యిది యేమి చోద్యం
బు, జల క్షీరంబులను వేరుపఱచు హంస చందంబున జయదేవుల
వారి గ్రంథము నంగీకరించి రాజు గ్రంథం బనాదరీయంబయ్యె
చూడుఁడీ నిష్కామముగ వ్రాసిన జయదేవుల గ్రంథము శ్రవణ
పఠన మననములకు యోగ్యమ్ములైనవి. ఖ్యాతి లాభ పూజ్యతకై
వ్రాసిన రాజుగ్రంథము అనాదరింపఁబడె ననుచు మహానంద భరి
తులై కరతాళము వేయుచు జయజయ శబ్దములు ఘోషింపుచు
హేపృథ్వీపతే, కాకులు కోటికూసినను, కోకిలరవంబగునే మిణు
గురులుకోటి మెఱసినను సూర్యుని తేజంబగునే, శ్వానంబులొకకోటి
వరుసగా నిలచినను సింహమునకు సమమగునే, గార్ధభంబులు కోటి
చేరినను గజతురగంబులగునే, కానేరదు కాబట్టి తమగ్రంథము శ్రీ
జగన్నాథుఁడంగీకరింపడయ్యె. నీగ్రంథమునకు జయదేవులగ్రంథము
నకును హస్తిమశకాంతరంబు, కనుక మేము అంగీకరింపము. అనఁగా
రాజువిని సిగ్గుపడి తలవంచుకొని పురుషోత్తముని సన్నిధి యెదుట
నిలచి యంజలి హస్తుఁడై ఓస్వామీ పతితపావనా పరమదయాళా
భక్తవత్సలా భానుకులాగ్రణీ భాషాపతినుతాభావాతీత సర్వాంత
ర్యామీ మీతిరునామంబులు వ్రాసి మననపఠనలు చేసి కడదేరి నార
నుట నావిషయమున మృషయైనది కాబోలు. నీకు సర్వజనుల



యందు సమభావముండవలసి యుండఁగా నొకరిని యనుగ్రహించి
మరియొకరిని నిగ్రహించుట యుచితంబా ఇట్టివంచనచేత నాగ్రం
థంబును నిరాకరించితివి. తటాకమందు జలము వ్యాఘ్రమునకును
గోవులకును సమముగా నుండలేదా అట్లుండగా జయదేవులవాక్కు-
నందుండి పలికించినవాఁడును నాకంతర్యామివైయుండి పలికించిన
వాఁడును నీవేకదా. నాచేపలుక పడిన గ్రంథమునందు దోషమేమి
యని నిష్ఠూరవార్తలాడుచుండఁగా కరుణానిధియగు జగన్నాథుఁడు
దీనాలాపమైన మొర నాలకించి పెరుమాళ్లు ప్రసన్నుఁడై యిరు
వదినాలుగు శ్లోకములు రాజుగ్రంథమునందుండి యెత్తి జయదేవుల
గ్రంథమున వ్రాసి పెట్టెను. దీనిజూచి పురజనులును రాజును దృప్తి
పొంది యానందించిరి. తర్వాత జగన్నాథక్షేత్రము నందునొక
బ్రాహ్మణుఁడు యజ్ఞ యాగాదిక్రతువులు చేసి శాంతచిత్తుఁడై వాసము
చేయుచుండెను. ఇతనికి నొకకన్యకారత్న ముద్భవించెను. ఆసుతకు
నేత్రద్వయంబులు పద్మమువలెనున్నందున తల్లి తండ్రులు పద్మా
వతియని తిరునామంబుంచిరి. ఆపుత్రికారత్నము అతి సుందరవతియై
యుండుటంజేసి తండ్రి శ్రీజగన్నాథునికి అర్పణముచేసెను ఆపుత్రి
కను తన బంధు వర్గస్థులు అడుగ వచ్చెడువారికి నాసుతను కృష్ణా
ర్పణము చేసి వేసితినని. చెప్పుచువచ్చెను. ఇట్లుండఁగా నాబిడ్డకు
యుక్తవయస్సు వచ్చుచుండు సమయమున శ్రీపురుషోత్తముఁడా బ్రా
హ్మణుని స్వప్నమునందు వెడలివచ్చి నావిషయంబుగ నీసుతను సర్ప
ణముచేసితివి. గాన నేనీకలియుగంబునందు ప్రత్యక్షముగ వివాహం
బుచేసికొని విహరించుట యుక్తంబుగాదు. జయదేవుఁడు నాయం
శభూతుఁడై యవతరించియున్నాఁడు. అతనికి నీసుతను సాలంకృత
కన్యాదానంబు చేసియిచ్చి సత్ఫలంబు పొందుమని నియమించి
యదృశ్యుఁడయ్యెను. పిదప మేల్కొని యానందంబుజెంది జయదే

వులను వెదకిగొని తెచ్చి యావరునికిని తనసుతకును పొంతనాదులు చూడఁగా ముప్పదియాఱు గుణములు పొందియుండుటఁజూచి సంతసిల్లి ముహూర్తము నిశ్చయించుకొని సమస్త సామగ్రులను సిద్ధముచేసి దేవప్రతిష్ఠమొదలై వానినిచేయించి సుముహూర్తమున వైవాహికమునకు యత్నముచేసి క్రియలు జరుపుచుండగా కొందఱు విప్రులును మంగళాష్టకముచే దీవించుచుండగా కొందఱు భక్తులు కేశవా నారాయణా మాధవా గోవిందా గోపాలా దేవదేవా మధుసూదనా కృష్ణా రామా వామనా గోకులవాసా గోవర్ధనోద్ధారా పండరీవాసా పాండురంగ వైకుంఠవాసా వాసుదేవా యీ దంపతులిద్దఱిని రక్షింపవలయునని యాశీర్వదింపుచుండఁగా వాద్యరవమ్ములు పలువిధంబుల జెలగఁగా జయ జయ శబ్దంబులతో పురజనంబులు అక్షతపుష్పాదులు ఆదంపతులపైఁ జల్లుచుండునవుడు జయదేవులు మంగళసూత్ర ధారణముజేసి యచ్చటికివిచ్చేసియుండు పెద్దలను సేవించి వారలచే మంగళాశాసనములు వడసెను. అదిమొదలు నాలుగు దినంబులు సాలంకృత కల్యాణంబు యావిప్రుడుగావించి వధూవరులకు దగినట్టి మర్యాదలుచేసి యానందించెను. అనంతరముజయదేవులవారు సర్వకాలములందును నెడతెగక శ్రీహరిచింతనామృతమునే గ్రోలుచు ఆనంద పరవశులైయుండిరి. ఇట్లుండఁగా నాక్షేత్రమునకు సమీపమునందు నొకగ్రామమునను దారగుణముగలిగిన నొకవర్తకుడుండెను. అతఁడు జయదేవులయొక్క జ్ఞానభక్తి వైరాగ్యములను వారికీర్తిని ననేక పెద్దలచేవిని మహదానందభరితుఁడై యిట్టిమహానుభావునకు సర్వవిధ శుశ్రూషలు నలిపి వారి యనుగ్రహంబునకు పాత్రుఁడై కటతేరుటయే సరి యని తన మనంబునఁ దలఁచి శ్రీ జయదేవులుండు స్థలంబును వెదకి బట్టి వారిని సేవించి వలఁగొని సాష్టాంగ దండప్రణామంబులిడి పడియుం



డఁగా శ్రీజయదేవులు అతని భక్తివైరాగ్యశీలముగని యతని లెమ్మని యాజ్ఞాపించి సన్మానించెను. సాధువులచే నిందింపఁబడువాని, పరధనములను నపహరించువాని, పరదారపరిగ్రహుని అభక్షభక్షకుని, అపేయపానుని, దురాచారుని, మాతృ పితృ ద్రోహిని గురుద్రోహిని, తనకు దెలియకనే సర్వము తెలిసినట్లు నటించువాని ఉత్తములైన పెద్దలు శిష్యునిగా జేర్చుకొనరు. కావునయీ వర్తకునికి నిట్టి గుణంబులులేక త్రికరణ శుద్ధి గలిగిన గురుశుశ్రూషాపరుండని యెఱింగి యతని దగ్గఱచేర్చి హితములు చెప్పుచుండెను. ఇట్లుండఁగా ఒకదినము తన యాచార్యుని చెంత జేరి యతి వినయంబుతోడ ఓ స్వామీ దేవరవారు దాసుని గృహంబునకు వేంచేసి దాసునిఁగృతార్థునిగావింప కర్తలని ప్రార్థింపఁగానుత్తమశిష్యుని ప్రార్థనల నంగీకరించి యప్పుడు యతని ప్రార్థనకునియ్యకొనెను. తర్వాత వర్తకుఁడొక రథంబు రప్పించి తనయాచార్యుని దానిపై నారోహణంబు చేయించి తననివాసస్థానంబునకు బిలుచుకొనివచ్చి సౌకర్యంబైన స్థలంబున యాసనంబు వేయించి పిదప నఖిలవిధ శుశ్రూషలు చేయుచు వారిచేత నఖిల రహస్యార్థంబుల నెఱుంగుచు శ్రీహరిగుణ కీర్తనంబులఁ బాడుచుండఁగా దన మనంబున నిట్లని వితర్కింపుచు నొకటిని నిర్ణయించెను. అది యేమనఁగ తత్వత్రయజ్ఞానము, శ్రీహరిచింతన, క్షమ, శాంతి, దయ, నిష్కామబుద్ధి, ఉదారము మొదలగు సద్గుణంబులు సత్సాంగత్యమువల్ల గలుగవలయునే గాని మఱియే యుపాయంబు లేదని తనమనమున దృఢపఱచి యట్టి సత్సాంగత్యమునకు మన యాచార్యులైన జయదేవులవారే తగినవారని తలంచి వారికి సర్వవిధ కైంకర్యంబులు సలుపుచు సర్వార్థములువారిచే వినుచుండెను. మరికొందరు నచ్చట అజ్ఞానాంధకారంబున మునింగి బదసంసారులై సంచరించు చుండ

గని వాటికి హితోపదేశంబులు చేయుచు వారలను భగవద్భక్తులుగ గావించి జయదేవులు శ్రీహరిచింతనారతులై యొకమాస పర్యంతం బచ్చట వసించెను అటుపిమ్మట యావర్తకునింజూచి శ్రీజగన్నాథంబునకు వెడలి శ్రీజగన్నాథుని సేవింప నపేక్షకలిగి యున్నదిగాన నాకు నుత్తరవిమ్మని యడిగెను. అతఁడాచార్యుని విశ్లేషము సహింపనివాఁడై కొంతచింతించి చిత్తంబు దృఢపఱచుకొని వారి పాదద్వయంబును గట్టిగా బట్టుకొని దండప్రణామంబు జేసెను పిదప స్వామి వానిశిరంబున తమ వామహస్తంబునుంచి యాశీర్వదించెను. మఱి వారిని బహుభంగుల పూజించి యితఁడధిక ధనవంతుఁడుగాన నేదైనా కొన్ని రత్నములను గురుదక్షిణగా నియ్యఁదలఁచి తనయాచార్యుఁడు అతి విరాగుఁడగుటచే నతఁడంగీకరింపఁడని తలచి తనయాచార్యునికిఁ దెలియక వారిభార్యకు నియ్యఁదలంచి నొకరథంబును తయారుచేసి యా రథంబుపై నమూల్యంబులయిన రత్నంబులును తిరువాభరణంబులును దివ్యపీతాంబరంబులును స్వర్ణరజితాదులు మొదలయిన సొత్తులను మూటలుగ గట్టి యా రథంబుపై మరుగుపఱచి యొకయాసనంబు మధ్యనుంచి వానిపై జయదేవులను గూర్చుండబెట్టి వారిని ననేకవిధంబులుగ సన్మానించి చాతుర్యమైన యొక భటునిం బిలచి స్వాములకుఁ దోడుజేర్చి వానితో నతిరహస్యంబుగ నారథంబుపై నునచియున్న సర్వసొత్తుల వివరంబులు చెప్పి, వీని నాచార్యుల దేవులకు నా వందన పూర్వకంబుగా సమర్పించి యతిశీఘ్రంబుగా రావలయునని వానికి నాజ్ఞాపించి జయదేవులను కొంత దూరము దారిపంచి యప్పుడువారి యాజ్ఞ పుచ్చుకొని తనగృహంబు చేరెను. తోడుగా వచ్చినవాఁడు జయదేవులను జూచి ఓ స్వామీ నా గృహంబునందొక యవసరకార్యమున్నదిగాన నాకు సెలవిచ్చిన కొఢల వెడలిపోయి యాకార్యము నెరవేర్పవలయునని యడుగఁగా



నప్పుడు జయదేవులు వానియందుకరుణనుంచి సేవకావృత్తిపరాధీనంబగునని చెప్పి వానిని గృహంబునకుపోయి నీకార్యసాధనము చేసుకొమ్మని పంపి తానొంటరిగా రథంబును పారించుకొనుచు అరణ్యమార్గంబు పోవుచుండఁగా నిద్దరు చోరులువచ్చి యీ వర్తకుఁడు జయదేవులకు నవరత్నఖచితములయిన దివ్యాభరణంబులును స్వర్ణరౌప్యములును పీతాంబరములు మొదలగు వానిని వీరికి గుప్తదానంబుచేసి పంపెననియెఱింగి యాచోరు లిరువరులు యిరుప్రక్కల చుట్టుకొనఁగా జయదేవులవారు వచ్చినవారు చోరులని యెఱింగి ద్రవ్యమూలంబుగ ననర్థంబును, ప్రాణహానియును గలుగునుగదా యనియెంచి రథంబునుడిగ్గి చోరులతోడ నీరథంబునందునమూల్యంబులయిన రత్నభూషణ పీతాంబరంబు లుండునటుల కానఁబడుచున్నది. వానినిమీకు దత్తముచేసితిని. అని చెప్పుచు పాదచారియై ముందు నడవసాగిరి. అత్తఱి తస్కరులు తమలోఁ దా మాలోచించుచు జయదేవుల మూఁదుగజని వీరిని ప్రాణహాత్య చేయక విడిచిపెట్టినపక్షమున యితడు వేరువర్తకునితోఁ జెప్పి మనలను శిక్షచేయించిపెట్టును గాన వీరిని చంపినతర్వాత రథంబును దోలుకొని పోవచ్చునని డెందంబునఁదలఁచుచు నతివేగంబున చెంత జేరి వారిముఖదర్శనంబు చేసినంతనే యిట్టిమహాత్ముని జంపుట తగదని చెప్పి రెండుచేతులను రెండుకాళ్లనుమాత్రము ఛేదించి యచ్చోట నొక పాడుపడిన గుంటలోఁబడవేసి యారథంబునందున్న యమూల్య రత్నాభరణంబులు మొదలగువానిని సంగ్రహించుకొని వారినివాసస్థలంబునకుం జనిరి. తదనంతరము జయదేవులుతమహృదయకమలమునందు శ్రియఃపతిని ధ్యానించుకొని జ్ఞానదృష్టిచేత సేవించుచు దనలోన దేహాత్మవివేకముచేతవిభజించిచూడఁగా దేహమునకంటెనాత్మ వేరై నదనియు నాత్మకుపరమాత్మ అంతర్యామియై యున్నాఁడ

నియు, సుఖ దుఃఖంబుల ననుభవించునది దేహమనియు, నీయాత్మ సుఖ దుఃఖంబులఁ జెందదనియు, దేహముసకలవ్యాధులకు కారణం బగుటయేగాక కామక్రోధాదులకు మూలంబై యుండుననియు దెలిసికొని దేహాభిమానరహితుండై యచ్చటనే నివసించి భగవద్భక్తి చేయుచుండెను. ఇట్టిసమయంబున క్రౌంచ్యదేశాధిపతి వేటాడుటకై అకస్మాత్తుగ నాపదంబుసకువిచ్చేసెను. అప్పుడతి నిశీధవేళగానున్నందున తనయెదుట నొకపాడుగుంటలో ప్రకాశంబకస్మాత్తుగాఁ గనఁబడెను దూరంబునుండిదృష్టించిచూచి యతడు తత్సమీపమునకు డాయ డాయ ప్రకాశంబు మఱి మఱి తగ్గుచువచ్చెను. అదిచూచియిదేమి వింతయని యాగుంటయందు తొంగిచూడగా పరమ తేజస్సు ముఖంబున ప్రజ్వరిల్లుచు విష్ణుభక్తుండై దివ్యమంగళ విగ్రహధారణపరుడై తనవాక్కున శ్రీరామకృష్ణ గోవిందాదినామజపము చేయుచునుండువారిం జూచి వీరెవరో మహా పెద్దలుగ నుండవచ్చునని తలంచి సాష్టాంగ దండప్రణామంబులాచరించి నెలుతురు వెలిగించి చూచునప్పుడుకరచరణముల ఛేదింపఁబడి యుండుటంజూచి భయపడి ఓస్వామీయీలాగెవ్వరు బాధకలుగునట్లు చేసినవారని యడుగగా జయదేవులు వానింజూచి అయ్యా నేజన్మించినదే యీలాగు సర్వేంద్రియంబులు నేనుకాదు నాకన్యములై యున్నవి. భగవంతుఁడు నాకంతర్యామియైయున్నాఁడు. అతండె నాకు ధారక పోషకభోగ్యములై యున్నవాఁడు. అతఁడునాకురక్షకుండు. నేనతనికి భృత్యుండని చెప్పిన మఱియు ననేక విధజ్ఞానవాక్యంబు లారాజువిన్నవాడై యీ విష్ణుభక్తుండు పరిపూర్ణంబైన జ్ఞానాధికుండై యున్నవాఁడు. ఈతని నాశ్రయించియితనికి సర్వవిధశుశ్రూషలుచేసినట్టయితే జననమరణంబులుమాని పునరావృత్తిరహితంబైన మోక్షంబునుబొందవచ్చునని తలంచియొక శిబికను రప్పించి జయదేవస్వామిని దానిపైవేంచేపుచేసి



యతియాదరంబుతోడ దనపట్టణంబునకుఁ గొనిపోయియొకవిడిది గృహంబునందు నొకయాసనంబు పఱచి వానిపై వేంచేపుచేసి పూజ పురస్కారంబులు గావించి వివిధ విధాన్నంబులచే సత్కరించి వలగొని దండప్రణామంబులిడి వారి యనుగ్రహంబువడసి యేపది సేవకుల రప్పించి ఓ సేవకులారా సర్వకాలములయందును జయదేవస్వామి సేవలు చేసికొనియుండుఁడని యాజ్ఞాపించెను. అప్పుడువారలు సాధుసేవ సంకీర్తనము శ్రీహరిపూజ భగవత్సేవ మాభాగ్యంబుచేత గలిగెననియానంద పరవశులై జయదేవులవారికి సర్వవిధశుశ్రూషలు సలుపుచుండిరి. రాజు ప్రతిదినంబు జయదేవులను సేవింపుచుహితములు వినుచుండెను. ఇట్లుండగా నొక దినంబు రాజు జయదేవులం జూచి ఓస్వామి దాసునికి మోక్షోపాయము గలుగుటకు నుపాయంబు చెప్పవలయునని దీర్ఘదండము గావించి నిలువఁబడియుండునపుడు వారి తనింజూచి రాజోత్తమా రాజా నీవు సర్వశాస్త్రార్థఫలప్రదంబగు భాగవత తదియ్యారాధనంబు జేసి వారలకు సర్వవిధశుశ్రూషలు గావించి ముక్తిపదంబును బొందుము. వీనికంటె మోక్షోపాయంబు వేరు లేదు. మరియు నీ గృహంబునకు వేంచేయు జ్ఞానభక్తి వైరాగ్యంబులు గలిగినట్టి సజ్జనులకు కావలసిన వస్త్రభూషణపాత్రాది దానంబులొసగి ఎండకాలమునకు కావలసిన పాదరక్షలు మొదలయిన దానంబులు చేసి వారి మనోభీష్టంబుల నెఱవేర్చి ప్రదక్షిణ నమస్కారంబులుచేసి పంపుటయే మోక్షోపాయము. ఇట్లు భాగవతులకు చేయు కైంకర్యము భగవంతుఁడు సంతోషించును. పురుషకార భూతయగు పిరాట్టికంటె విశేషముగ సాధుసేవలయందు శ్రీహరి ప్రీతికలిగి యుండు. గాన నిట్టి కైంకర్యములను జేయుచు సదా భగవద్ధ్యానపరుండై యుండుమని నియమింపగా రాజు వీని నన్నిటిని విన్నవాడై యిట్లనియెను. ఓస్వామీ దాసుఁడజ్ఞానాంధకారంబున మునిఁగియుండు

టచే జ్ఞానాధికుల నెఱింగి యేలాగు తదీయారాధన శుశ్రూషలు చేయ
గలను. వారిమహిమ లిట్టివని దేవరవారె యుఁగఁ జెప్పవలయు ననియడు
గఁగా శ్రీజయదేవులవారు భాగవతులయొక్క గుఱుతులను జెప్పెద
వినుము. ద్వాదశోర్ధ్వపుండ్రములు తులసీనళినాక్ష మాలలుకం
ఠంబునధరియించి నిష్కాములై శ్రీహరినామ సంకీర్తనంబులుచేయు
చుందురు. మఱియు అహింస, ఇంద్రియనిగ్రహంబు, దయ, శాంతి,
తపస్సు, ధ్యానము, సత్యము, శీలములుగలిగియుందురు. ఇట్టివారలను
జ్ఞానాధికులని చెప్పుదురు. ఇట్టిమహానుభావులకు నీవు శరణాగతిచేసి
సర్వోపచారములచే పూజించి తదీయారాధన చేయుము. అనిచెప్ప
గా రాజువిన్నవాఁడై తన యాచార్యునియాజ్ఞ శిరసావహించి శ్రీహరి
భక్తుల నారాధింపుచువచ్చెను. పంచదారనుజూచి చీమలుఅత్యాసం
దంబుతో పరుగులిడునట్లును మేఘజలంబును జూచి నెమలినృత్యము
చేయునట్లును రాజుయొక్క కీర్తినివిని భగవద్భక్తులు ఆయాదేశంబుల
నుండివీరికైంకర్యంబులు, జ్ఞానభక్తివైరాగ్యంబులు చూడనపేక్షించి
సాధువులు సజ్జనులు సదావచ్చుచుందురు. ఇట్లువచ్చువారలు మొద
టజయదేవులను సేవించి పిదపరాజు దర్శనంబు జేతురు. అప్పుడారాజు
వారలంజూచి దండప్రణామంబులు గావించితనగృహంబునకు బిలు
చుకొనిపోయి వారియిష్టానుసారంబుగ భోజనంబులిడుచు నాలుగు
మాసంబుల పర్యంతంబువారల నక్కడనుంచుకొని యాదరించి వార
లడుగునట్టివస్తువులనిచ్చి పంపించును.

ఇట్లుండఁగా జయదేవస్వామియొక్క కాళ్లు చేతులనునరికిన
చోరులిద్దఱును రాజుసాధువుల విషయంబున గలిగి యున్న ఔదా
ర్య గుణంబును విన్నవారై వీరును సాధువేషంబులందాల్చి పోయి
రాజును కొంత: ధనంబడిగి పుచ్చుకొందమని తలంచి శ్రీజయదేవ
స్వామి యిచ్చటనుండు నది తెలియక వాండ్రు గోపిచందనంబున



ద్వాదశోర్ధ్వ పుండ్రంబులు ధరియించి తులసీ నళినాక్షమాల
లను గంఠంబున ధరియించి కరంబున జపమాలను నిడుకొని జపించు
నటులనటించుచు వైష్ణవతేజస్సుప్రజ్వలించు మునిశ్రేష్ఠులవలె బక
ధ్యాన పరులై వారిరువురును హృదయంబున కపటముగలవారై
వెలుపలికి సాధువుల వలె కనుబడుచు పట్టణ ప్రవేశంబు చేసి కరం
బున జపమాలను ద్రిప్పుకొనుచు మహావిరక్తులవలె రాజు గృహంబు
జొచ్చి యెదుట చూచునపుడు జయదేవుల దగ్గఱ రాజుండుటం
జూచి యాతక్షణంబె యాచోరులు ఖిన్నులై యేమియుందోఁచక
నొకరి నొకరు చూచుకొని తమ తమ ప్రాణమునకు హాని తామే
తెచ్చుకొన్నట్లు మనమున తలచి ఖిన్నులై ఆహా యిదేమి యజ్ఞ
గుండమున పురుగులు తానుగా వచ్చిపడి మడియునట్లు మనకు
మనమే తగులుకొన్నామని కుంది తిరుగ యెవరికాళ్లు చేతులు నఱి
కితిమో యా జయదేవులే యిచ్చటయున్నారు. ఇంక నేమి చేయవ
చ్చును. కిరాతకుఁడు కపోతములను జంపుటకుయత్నించు నపుడు
వాని నొక సర్పము కఱచి చచ్చిన రీతిగా మనకపటంబు మనలం
జెరిచినది. అని తలఁచి యెదుటరాగా జయదేవులు పరస్పరముగా
వీరల ముఖంబునందు గలిగి యుండు గుఱుతులచేత తన్ను నఱికిన
చోరులని తెలిసికొన్నవాఁడై యుండియుసర్వభూత సుహృత్వభావం
బుగలిగి శాంతచిత్తుడై శత్రువులను మిత్రులుగా దలఁచి వారలను
తన యాసనంబు సాయ బిలచి నాలింగనంబు గావించి సేవకుల
రప్పించి సాధువులు వచ్చియున్నారని రాజునకుఁదెలుపుండని
యాజ్ఞాపింపఁగా వారు రాజువద్ద కేగిసంగతి తెలియజేసి నంతట
రాజునతివేగంబున నాచార్యుని వద్దకు వచ్చి దండము సమర్పించి
సాధువులంగని వందనంబులు చేసి వారలునివాసంబు చేయుటకు
స్థలం బేర్పఱచి సర్వవిధపూజ లొనర్చి ప్రసాదంబొసంగి మిక్కిష్ట

ముందు పర్యంతంబిచ్చట వేంచేసి యుండవచ్చునని చెప్పి వేడికొనఁగా నా వేషధారులు ఆలాగే యుందమని ఆమోదించి యుండిరి. అప్పుడు వారు కారాగృహంబున నుండునట్లు యచ్చట వాసంబు చేయుచు వారలచేఁ జేయబడు నుపచారంబులు రుచింపక తురష్కురులు మహాత్మాయి నరుకతలచియుండగ తెలుసుకొని కుందుచుండువారి వలె యనునొక వృష్టి యాపథంబు చేయుటకు కొందఱిని జక్కఁగాపోషించి నాతస్కులునా నాటకుయరోగులై దుర్బలులై వారి శరీరంబులు కృశించుచువచ్చెను. ఇట్లుండునది రాజు చూచి జయదేవుల వద్దకు బోయి ఓ స్వామీ కొన్ని దినంబులకు మునుపు యిద్దఱు సాధువులు దేవరవారి వలన నంపఁబడిన వారల సిద్దఱిని నిది వఱకు మేము చక్కఁగా నారాధింపుచు వచ్చుచుండఁగా వారు నానాటికి చిక్కిపోవు చున్నారు. వారికి మేము చేయు నుపచారంబులు నిష్ప్రయోజనంబులై పోవుచున్నవి. ఇందుకేమిచేయవచ్చునని యడుగఁగా జయదేవులు రాజుం జూచి సజ్జనులైన సాధువులకు విషయభోగంబులందురుచి తప్పివిరక్తులై దేహపోషణ చేసుకొనరు ఇదివరకునిచ్చటికి ననేక సాధువులు వచ్చియుండిరి. వారలకంటె నీ సాధువులతి విరక్తులయిన వారు. ఇట్టి సాధువులు నీభాగ్యవశంబుచే నిచ్చట యిన్ని దినంబులుండిరి. ఇక వారలు వెడలి పోవలయునని యడిగిన యెడల వారల కిష్టంబైన ధనంబుల నిచ్చి పంపుమని చెప్పెను. అప్పుడా లాగె చేసెదనని చెప్పి దండము సమర్పించి వారిచే నాజ్ఞపుచ్చుకొని తన నివాసము చేరెను. తర్వాత రెండుమూడు దినంబులకు వేషధారులు రాజు వద్దకు వెడలి మేము తీర్థవాసులము. గావున నిచ్చటికి వచ్చి బహుదినంబులైనవి. కనుక వెడలి పోవుటకు నుత్తర విమ్మని యడిగిరి. అప్పుడు రాజు వారిని మీ కేమికావలయునని యడుగఁగా



రెండు రథంబుల యందును బూర్ణంబుగ ధనంబుల నిండించియిమ్మని వారడిగినంతట రాజు ఆలాగే వారి యిష్టపూర్తిచేసి కొందఱి సేవకుల బిలచి తోడుచేర్చి వారికి నమస్కరించిపంపెను. తర్వాత జయదేవుల వద్దకు వచ్చి యీ వేషదారులు అతి వినయంబుతో దండము సమర్పించి యాజ్ఞపుచ్చుకొని యరణ్యమార్గంబుపట్టి పోవుచుండ రాజసేవకులు వెడలుటకు రథంబువిడచిదిగి వేషదారులుజూచినమస్కారంబుజేసి యిదివఱకు మారాజు వద్దకు సాధువులనేకులువచ్చిరి. వారలకన్నను జయదేవులకు మీవిషయంబున నధికప్రీతిగలిగి యుండుటకు కారణంబేమియని యడుగఁగా వేషధారులు వారలం జూచిపూర్వమునందు మేమును జయదేవులునునొకదుర్మార్గుఁడైన రాజువద్ద వారుమంత్రిగాను మేముసేవకులుగా నుంటిమి అప్పుడుజయదేవుల వలననేదోయొక యపరాధంబు జరిగినందుచేత వారినిరాజుకోపించి వీరినిదీసికొనిపోయి అరణ్యంబున శిరచ్ఛేదనంబుచేయుఁడని మాకునాజ్ఞచేసెను. అత్తఱిమేమువీరిని నరణ్యంబునకుఁ దీసికొనిపోయి ప్రాణంబు తీయక కాళ్లుఁచేతులు మాత్రము నఱికి పాడుగుంటలో బడవేసి నాదినంబు మొదలుకొనిమాపురంబు చేరక మేమువిరక్తిజెంది విష్ణుభక్తులై తీర్థాటనంబుచేయుచు మీపురంబువచ్చిచేరితిమి. జయదేవులనుజంపక విడచిపెట్టినందు వల్లమాయందు నధికవిశ్వాసముంచి రాజుతో జెప్పిమాకు సర్వదాపూజలు చేయించి మమ్మునుసన్మానించిరి. వారికి ప్రాణదానము ఆకాలంబునందు మేముచేసిన యుపకారంబునకై ప్రత్యుపకారంబుగ నీరెండు రథంబులయందు ధనంబులనింపి సన్మానించిపంపిరి. అనిచెప్పిన యీవేషధారులగు చోరుల యసత్యవచనంబులకు సహింపఁజాలక గడగడవడంకుచు భూదేవి ఇఱువ్రయ్యాలయ్యె నందున యీవంచకులురథంబులతోడదిగఁబడి మాయమైపోయిరి. అప్పుడు సేవకు

లు ఆశ్చర్యంబును జెంది యీయనర్థంబునకు కారణంబు దెలియక చింతింపుచు మఱలి పట్టణంబునకువచ్చి యీవిచిత్రములను జయదేవులతోఁ దెలుపఁగా వారామాటలను విన్నవారై కనులనిండుగ జలంబుత్తళింప చింతాక్రాంతులై భగవంతుని ధ్యానించి ఓ పతితపావనా, భక్తవత్సలా, పరమదయాళా, పాహిమురారే, శ్రీకృష్ణా, రుక్మిణీనాథా, జగద్రక్షకా, జాబాలి వంద్యా, జానకీ రమణా, జనార్దనా, నాకుశత్రువులయిన చోరులను అధోగతి కేల పంపితివి. నీకుశత్రువులయిన రావణకుంభకర్ణులను కరుణించి వారికి సాయుజ్య పదవి నెట్లిచ్చితివి. శిశుపాలదంతవక్త్రులు సదా నిన్ను నిందించుచున్నవారిని నీవుమన్నించి నీసాయుజ్యంబెలాగు నొసంగితివి. కంసచాణూరముష్టికాపూతనాదులు నీదుప్రాణాపహారము చేయుటకు వచ్చినవారిని గృపచేసి యెట్లురక్షించి మోక్షంబునకు బంపితివి. ఇవి యన్నియునిట్లుండగా నన్ను వంచనచేసి నాకు విరోధంబు గావించిన చోరులనుమాత్ర మేలాగుశిక్ష చేయవచ్చును. నీ వీలాగు చేయుట యధర్మంబు. ఓదేవదేవోత్తమా నాశత్రువులను నీమిత్రులుగా గైకొనివారిని రక్షించుటవలన నీకపారకీర్తిగలుగును. హేకృపాజలనిధే నీవుజాగుచేయక యీక్షణంబున నేలి రక్షింపుమనిబహుప్రకారంబులగొని యాడుచుండునపుడు భగవంతుఁడు కరుణించి మేఘశ్యామల సుందరాకృతి నెత్తిచతుర్భుజాకారుఁడై శంఖ చక్రగదాశార్ఙ్గాది దివ్యాయుధంబులను ధరించి రత్నమయంబగు కిరీటకుండల కేయూర కౌస్తుభ వనమాలాది దివ్యభూషణ భూషితాలంకృతుఁడై పీతవస్త్రధారియై గరుడవాహనారూఢుఁడై జయదేవులజ్ఞానభక్తివైరాగ్యశీలాదిసద్గుణంబులకు వశవర్తియై సేవ సాయింపఁగానే భగవంతుని సౌందర్య సౌకుమారలావణ్యతారుణ్యాదిశుభమూర్తి కరమును సేవించినంత నేవీరికిపూర్వపురీతిగా కరచరణంబులు పూర్ణంబుగావచ్చెను.



ఇట్టి సమయంబున వేషధారులగు చోరులను భగవంతుఁడు పుష్పక విమానంబుపై నెక్కించియాకాశవీథిని నిలచి శ్రీజయదేవులంజూచి యోజయదేవా శాంతిదాంతిశమదమాదిసద్గుణ సంపత్తిగలిగిననీవంటి వానిని నిదివఱకెవ్వరినిగనలేదు. ఈ మహాదుర్మార్గులగు చోరులునీయభిమానంబువల్ల సాయుజ్యపదవిం బొందెదరు. నీమహిమలం గొనియాడ బ్రహ్మాదులకైన తరంబుగాదని చెప్పి యా చోరులతోడ నంతర్హితుండయ్యె గాన భక్తుల మహిమంబులు బ్రహ్మరుద్రాదులకును దెలియ శక్యంబుగాదు. జయదేవులకుఁ గరచరణంబులు వచ్చినదాని రాజుజూచి మహదాశ్చర్యంబుతోడ కరములు ముకుళించి జయదేవులతో కరచరణాదులు మఱల వచ్చుటకుఁ గారణం బడుగఁగాఁ ముందుజరిగిన వృత్తాంతములను రాజునకు సాంగోపాంగముగఁ జెప్పెను. వానినన్నిటిని విన్న యారాజు మిగుల నానందంబుజెందుచుండ నప్పు డచ్చట వేంచేసియుండిన భగవద్భక్తులు జయజయ శబ్దంబులచేతను భగన్నామ స్మరణంబులచేత నక్కడ గొప్పశబ్దంబులు గలిగించిరి. ఆ సమయంబున రాజు పతివ్రతాతిలకంబగు జయదేవుల భార్యను బిలుచుకొని రమ్మని యొక పల్లకిచ్చి కొందఱు భటులనుబంపి యామెను రప్పించి యనేక వస్త్ర భూషణంబుల సమర్పించి సాష్టాంగ దండంబులు బెట్టి రాజు యంతఃపురమునకు వెడలి తన భార్యనుంజూచి జయదేవుల భార్యయగు పద్మావతి యమ్మగారికి దండము సమర్పించుమని యా యమ్మ గారి వైభవంబు లన్నియుంజెప్పి నీచేతులార నీయమ్మగారికి సకలవిధ కైంకర్యంబులు చేయుచుండుమని నియమించి తాను తన చేతులార జయదేవులవారికి సర్వవిధ కైంకర్యంబులు సలుపుచుండెను.

ఇట్లుండ నొకదినంబునందు నంతఃపురంబున రాజుభార్య సభగూడి కూర్చుండఁగా సుగంధంబున కస్తూరికలిపి చల్లినట్లు పరిమళించు

చున్న యాసభయందు పద్మావతీదేవి గొప్ప యాసనమందు వేంచేసి యుండెను. అచ్చటికి నకస్మాత్తుగ నొకభటుఁడు వచ్చి రాజుబంధువులో నొకఁడు మరణంబు జెంద వానిపత్ని తనపతిని మనంబునఁదలఁచుకొని సహగమనంబు చేయ నుద్యమించె నని వర్తమానంబును జెప్పెను. అత్తఱి రాజుభార్య మొదలగు వారలా సంగతిని విని యాశ్చర్యంబు జెందిరి అప్పుడు పద్మావతీదేవిమాత్ర మాసంగతికి సంతోషపడలేదు. ఇట్లుండ రాజుభార్య యద్దేవి యొద్దకు వచ్చి కరంబులు ముకుళించి యోతల్లీ మాయామమతలను విడిచి తన భర్తను హృదయకమలమందిడుకొని యేడుజన్మంబులవఱకు నితఁడె పతి కావలయునని ప్రార్థించి సహ గమనంబు చేయ యత్నంబు చేసెను. అనువాక్యంబుల నాకర్ణించి యాచ్చర్యంబు జెందకుండుటకు కారణంబేమియని యడుగఁగా పద్మావతి యామెనుజూచి భర్తముందుగా వెడలి భార్య వెనుక వెళ్లినట్టయితే యెంతకాలంబు వానిఁజేరునో తెలియదు. భర్తమరణంబునొందెనని మాటవిన్నంతలో. సూర్యునివెంటనే నతని కిరణంబులు పోవునట్లు యాతక్షణంబె తనప్రాణంబు పోగొట్టుకొనుట యుత్తమస్త్రీ లక్షణంబు అట్లుగాక తన నిర్బంధరూపముగా ప్రాణంబు విడుచుట యధమస్త్రీ లక్షణంబు గాన నిందుకేల యాశ్చర్యంబు జెందవలెననెను. ఈవాక్యంబులను వినిన రాజుభార్య యత్యాశ్చర్యంబునొంది యీయమ్మగారు యనుభవంబు లేకయే చెప్పుచున్నదని యామె మాటలను విశ్వసింపక యుండె. అనుభవంబు లేని యాత్మజ్ఞానంబు ప్రాణంబు లేని శరీరంబును. నాసిక లేనిముఖంబును, ధనలుబ్ధుని ప్రేమయును, సాధన లేని శుద్ధభావంబును, నిష్ఫలంబులగునట్లు రాజుభార్యకు నీమెపలుకు లసత్యంబుగఁదోచి తనమంత్రిని బిలిపించి యీ సంగతినంతయు విశదంబుగ తెలియపఱచి జయదేవులు మరణము



జెందిరనువాక్యంబును పట్టణమంతయు సమయోచితంబుగ ప్రసిద్ధము చేయవలయునని చెప్పెను. ఇదియిట్లుండఁగా నొకదినంబున రాజు వనవిహారంబు చేయం జనునప్పుడు జయదేవుల తనతోఁగూడ పల్లకిపై నెక్కించుకొని యరణ్యంబునకుంజనెను. అప్పుడు మంత్రి యొక సేవకునింబిలచి నీవురాజుపత్ని జయదేవులపత్నితోడ మాట్లాడుచుండు సమయంబున నామె చెంతకుంజని యామెతో ఓయమ్మా రాజును జయదేవులను నరణ్యంబునకు సవారి వెడలిన చోట నొక వ్యాఘ్రంబుచే హతుడయ్యె ఇదిగో జూడుమతని రక్తమీగుడ్డలో దడిపి తెచ్చితినని చెప్పుమని బోధించి పంపెను. అప్పుడా సేవకుండు యాపట్టణమందు నెల్లజనులకు జయదేవులు మృతి నొందిరని చెప్పుచు రాజుభార్య వద్దకు నేగి పద్మావతీదేవి చూచుచుండఁగా జయదేవులు మృతి నొందిరనియును నిదిగో రక్తవస్త్రముజూడుమని చెప్పెను. ఆమాటనువిని రాజపత్ని కపటంబుతో నేడ్చుచుండునప్పుడు పద్మావతీదేవి యాయమ్మచెంతకు వచ్చి తమ చింతకు కారణంబెద్దియని యడుగఁగా నప్పుడు రాజుభార్య పద్మావతింజూచి యమ్మా యనర్థంబు గలిగెను. నేటిదినంబు జయదేవస్వామి యరణ్యంబున పులిచేత పట్టుపడి దెబ్బతగిలి మృతినొందెనని చెప్పఁగా నత్తఱి పద్మావతి ముమ్మారు సత్యంబాయని యడుగఁగా సత్యంబేయని చెప్పినంతట దీపయుతముగ తేజస్సుపోవునటుల తన ప్రాణంబును విడిచిపెట్టెను: ఇదిజూచి రాజు భార్య మిక్కిలి చింతాక్రాంతురాలై యేలనిట్టి పరీక్ష చేసితిని ఇఁక రాజున కేమియుత్తరవు చెప్పుదును. ఆయమ్మగారి మహాత్మ్యంబు తెలియక పాపినైతినని దుఃఖింపుచుండఁగా నాదిన సాయాహ్నంబునకు సరిగా కాననంబునకు వెడలియుండిన రాజును జయదేవులును పురిజేర వచ్చుచుండఁగా రాజు తన ప్రధాని మూలంబున నడచిన వృత్తాంతంబులన్నియుఁ

జక్కఁగాఁ దెలిసికొని యిది యేమి మనకు గురుద్రోహంబు సిద్ధించెనని దుఃఖాక్రాంతుఁడై తనభార్యను జంపిన షకుంబున స్త్రీహత్యాదోషంబు తనకు సిద్ధించునని తలఁచి దీనికంటె తనప్రాణహత్య చేసికొనుట మేలని యెంచి పట్టణంబునకు వెలుపట గొప్ప యగ్నిగుండంబును గావించి జయదేవుల వారిముందు వచ్చి నిలచి దండము సమర్పించి యో స్వామీ నావలన నీ యనర్థంబు గలిగెనని విన్నవింపగా పరిపూర్ణ జ్ఞానసంపన్నులయిన జయదేవస్వాముల వారు సర్వంబును దెలిసికొన్నవారై రాజునకు సమాధానంబు జెప్పి ప్రాణత్యాగంబు గావింపవలదని వాక్కిచ్చి పద్మావతీదేవి వద్దకు వచ్చి తంబర తాళంబులను గరంబులం బట్టి రాధామాధవవిలాసంబులయిన యిరువది నాలుగు యష్టపతులఁ బాడి నృత్యంబు చేసి తనువు మఱచి కేశవా, నారాయణా, మాధవా, గోవిందా, ముకుందా, మురహరీ, పద్మనాభా, భక్తవత్సలా, గోకులనందనా, గోవర్ధనోద్ధారా గరుడవాహనా, గజేంద్రవరదా, జగదేకరక్షకా, జానకిరమణా, పతితపావనా, పాండవరక్షకా, ప్రహ్లాదవరదా, పరమదయాళా, మనమోహనా, ముకుందజనకా, అనాధనాథా, అనంతరూపా కృష్ణానంతరూపా అతిథీనుడైన నా మొఱనాలించి నామనోభీష్టంబు నొసంగి యీ పద్మావతికి బ్రాణంబిచ్చి యీ రాజు ప్రాణంబునకు హానిం జేయక రక్షింపవే. శ్రీ పురుషోత్తమా యని బహువిధంబుల బ్రార్థింపుచు గీతగోవిందంబును బాడుచుండఁగా భగవంతుఁడీయార్త ధ్వనివిని ప్రసన్నుఁడై జయదేవుల నాలింగనంబు గావించి నీచేతఁ జెప్పఁబడిన యష్టపతులను నెవరు బాడుచుందురో నారియెదుట ప్రసన్నుడనై యుందునని చెప్పి పద్మావతి దేవిని దనకరంబులతో నామె దేహంబును స్పృశించి సజీవగా జేసి రక్షించెను. ఆసమయమున సమస్త జనులును, భక్తులును జయజయ శబ్దంబులు చేసిరి. అప్పుడు దేవతలందఱు



విమానారూఢులై పుష్పవర్షంబులు గురిసి. సర్వజనులు సంతోషంబు జెందిరి. జయదేవులకు పునఃపునః ప్రణామంబులు చేసిరి. ఇట్టి జయదేవుల చరిత్రంబును వ్రాసి చదివి పఠించినవారు జననమరణ తాపంబులు మానికడపట భగవచ్చరణారవిందంబుల జేరుదురు.

శ్రీ పురుషోత్తమాయనమః.

# తులసిదాసుల చరిత్రము.

హస్తినాపురమున విప్రకులమున నవతరించినట్టియు ధర్మశీలము మొదలగు సద్గుణంబులు గలిగినట్టియు అగ్బర్ బాదుషా యొక్క మంత్రియైనట్టి యాత్మారాముడనే భూసురునియొక్క గర్భవాసంబున వాల్మీకు లుద్భవించిరి. అనంతరము యబ్బాలునకు జాతకర్మము జేసి తులసీదాసుడని నామ కరణం బొనరించి తలిదండ్రు లిఱువురు నత్యంతానందమందిరి. పిమ్మట దినదినంబున బాలుడు వృద్ధిబొందగా నుపనయనంబు జేసి ద్వాదశ వర్షపర్యంతము బ్రహ్మచర్యాశ్రమంబునందుండ జేసి సకాలంబున స్నానము సంధ్యావందనము వేదాధ్యయనము విధియుక్తంబుగ నేర్పించి తరువాత వివాహోత్సవముం జేసిరి. తారుణ్యదశయందు దంపతులిఱువురకును నత్యంత ప్రీతికలిగినందున వియోగము లేకయుండెను. నానావిధమైన వస్త్రంబులు భూషణంబులు శ్రేష్ఠరత్నంబులు కేసరి కస్తూరి చందనము ఏలకులు జాపత్రి మొదలగు ద్రవ్యంబులచేత సర్వదా భోగించుచుండిరి. ఈ తులసీదాసుయొక్క భార్యయగు మమతాదేవి యెల్ల పతివ్రతలకు శిరోమణియై యనన్యభావముచేత పతిసేవ జేయుచుండెను. ఇట్లుండగా నొక్క కాలంబున అగ్బర్ బాదుషా తులసీదాసుని కూడనుంచుకొని వనవిహారంబునకుం బోయెను. అప్పు

డు మమతాదేవికి పుట్టింటనుండి తల్లిశరీరంబునకు రుగ్మతకలిగినదని సమాచారమువచ్చెను. అనగా కుమార్తెను వచ్చిచూచి పొమ్మనమని చెప్పిపంపెనట. ఇట్లు వార్త తెలియుటవలన చాలచింతించుచును యంబున నావార్తాహరుండు మీతల్లికి శరీరము నిర్జాడ్యమైయున్నద నియును నేను దబ్బరాడితిననియె. ఎందుకిట్లు చెప్పితివనిన దూత ఇట్లనియె.—నీవు మీతల్లినిజూచి బహుకాలము అయినందున నీతీరుగ చెప్పినయెడల వచ్చెదవని చెప్పితిగాని యదార్థముగ మీతల్లి సౌఖ్యంబుననున్నదనెను. అప్పుడు మమతాదేవి అత్తమామలసాన్నిధ్యంబునకుంబోయి వారితోడనిప్పుడు నాపతి వనవిహారంబునకుంబోయి యున్నారనియును వారువచ్చునంతలోపల మాతలిదండ్రుల చూచివచ్చెదననియుంజెప్పి యాజ్ఞనివ్వుమని యడుగగా, వారుసమ్మతించి యాజ్ఞనొసంగిరి. అంతటమమతాదేవి తల్లిగారింటికింబోయెను. నాటి దినమే సాయంకాలంబునకు తులసీదాసు యింటికివచ్చి తల్లివలన నీ వృత్తాంతంబు సర్వంబు తెలిసికొని, యోప్రియురాలా! నన్నునిచ్చట ఒంటిగావిడిచిపెట్టిపోతివిగదాయని చాలచింతించి కొంతతడవునకు శయనించినంతలో నిదురరాకనుండెను. అప్పుడు తక్షణమే బయలు వెడలి పంచక్రోశ దూరమందునున్న తనశ్వశురగృహంబున కారాత్రికాలంబున చేరవచ్చెను. ఈయన ఆగ్రామంబునకుం బ్రవేశించు కాలము అర్థరాత్రమైనందున కవాటంబులం బిగియించియింటనుండు జనులందఱు నిదురబోవుచుండిరి. అప్పుడు గృహమునకుంబోవ నలవిగాకనింటిచుట్టు తిరుగుచుండెను. అట్టిసమయంబున నానిడుపుసౌధంబుపైనుండి యొక్క ఘటసర్పము వ్రేలాడుచుండంజూచి యీ తులసీదాసు దానింబట్టుకొని పైకిఎక్కి లోపలం బ్రవేశించగా నచ్చటనుండు శేవకజనులు మేల్కాంచి యాతనింజూచు సమయంబున మమతాదేవియును మెలుకవతోడలేచి తనభర్తనుచూచి యాశ్చర్యం



బునొందెను. అప్పుడు తులసీదాసును భార్యనుచూచి యోసుందరీ నన్నువిడిచి నీవిక్కడికేలవచ్చితివి అయిదుక్రోశంబుల దూరము నడచినీనిమిత్తము ఇక్కడికివచ్చితినని చెప్పగామమతాదేవియిట్లనియె ఓపతీ నీవు నిండుప్రవాహంబు గలిగియున్న యమునానది దాటి యేతీరున నీమందిరంబునం బ్రవేశించితివనియడుగగా, తులసీదాసు ఇట్లనియె. ఓ చంద్రవదనే! మనలకన్యోన్యప్రీతి యతిశయంబైనందున నేను వచ్చెదనని నీవుతలంచినదానవైనీవుండు మేడమీదనుంచి యొక్కత్రాడు వ్రేలాడవేసితివి. దానిని నాధారంబుగ బట్టికొని యారోహణంబుజేసిలోపలం బ్రవేశించితిని. యనియనగా, విని మమతాదేవి నేనెన్నడు త్రాడు వ్రేలాడవెయ్యలేదనియు నీవబద్ధంబులాడితవనియుంజెప్పి పిమ్మట నిదర్శనముజూడవలయునని తలంచి శేవకులు దీపంబులు బట్టగా మమతాదేవి యప్పుడు సౌధోపరిభాగంబునకుంబోయి. చూడగా నచ్చట నామహాసర్పము కనుపడెను. దానింజూచి సకలజను లాశ్చర్యమొందిరి. అప్పుడా మమతాదేవి తులసిదాసును ఏకాంతముగ నంతఃపురంబునకుందోడ్కొనిపోయి యోప్రాణనాథా నాదువాక్యంబులవినుము. నీవు చతురత గలవాడననియు బుద్ధిమంతుడననియు తలంచితివేగాని వివేకమే మాత్రములేదుగదా సర్వదా నీయందు అజ్ఞానము నిబిడీకృతమైయున్నదిగదా మాతాపితరులను బంధుజనులను సకల సంపదలనువిడిచి యీ రాత్రికాలంబున నన్నుగురించి యొంటిగ నేలవచ్చితివి ఈమేడపైన వ్రేలాడుచుండు సర్పమొకవేళ నినుంగరచినయెడల ప్రాణహానికలుగును గదా ఇది యనిత్యసంసారంబనిగుఱు తెఱుంగవైతివి నామీదమోహమునుంచి కామాతురుండవై యేతెంచితివి మముబోటి స్త్రీలవలన ననేకులు నాశంబునొందిరిగదా అహల్యాదేవియొక్క సౌందర్యముంజూచి సహస్రనయనుండు నాశనంబునొందెనుగదా

సీతాదేవియందు మోహంబునంజేసి రక్షోధిపతియగు రావణుండం
తంబునొందెనుగదా దీపభ్రమంజేసి పతంగంబులు మృత్యువునొం
దినట్లు స్త్రీలసాంగత్యంబుచే ననేకులు నిధనంబునొందిరి. ఓపతి నీవు
ఆత్మారాముని దెలియజాలక కామప్రవర్తనగలవాడవైతివి శ్రీరా
ములుసకలమైనవారికివిశ్రాంతినిచ్చువారలనిగుఱు తెఱుంగవు దారా
పుత్రసంపదలందు ప్రాణులకెట్లు ప్రియంబుండునో అట్లు శ్రీవైకుంఠని
వాసియగు శ్రీహరియొక్క చరణంబులందుప్రీతియుంచినట్లైతే సార్థక్య
ముగలుగునని మమతాదేవి యానతియ్యగా తులసీదాసుఅనుతాపం
బునొంది యోతల్లీ నీవుచెప్పినది సత్యంబని యామెపాదంబులకు
సాష్టాంగ నమస్కారంబు జేసి యచ్చటనుండి బయలువెడలి పూర్వ
జన్మకారణంబును తెలిసికొని శ్రీరామచరిత్రములను గానంబుజేసి
జనులనుభక్తిమార్గమునందు నటింపంజేయవలెనని తలంచివిషయసు
ఖంబెన్నాళ్లనుభవించినను నాశకరంబ యని నిశ్చయించి అన్నము
ఫలము మొదలగు సుఖరూప భక్షణపదార్థంబుల వర్జించివృక్షంబుల
నుండి గళితంబైన పర్ణంబులభక్షించుచు కాశీపట్టణంబునకుంబోయి
భగీరథీజలంబుల స్నానమాచరించి జానకీజీవనుడైన శ్రీరాములెన్న
డు దర్శనమిచ్చునోయని తదేకధ్యాననిష్ఠుడై యుండి ప్రతిదినంబును
ప్రాతఃకాలమున భైర్భమికి వెడలి శౌచముచేసిన శేష జలంబును
నొక వృక్షమూలమున ద్వాదశాబ్దంబులు వరకు పారబోసి నిత్య
కర్మానుష్ఠానములను ముగించి భగవధ్యాన పరుడై యుండగ నొక
దినము వాడుక చొప్పున శౌచము జేసి మిగిలిన జలమును యా
వృక్ష మూలమున విడువగ భయంకరమైన యొక్క పిశాచము కరం
బులు మోడ్చి తులసిదాసుయొక్క సమీపంబున నిలచి యోమహా
నుభావా నినుగూర్చి ప్రత్యక్షమైతిని వలయు వరంబు గోరుము
ఇచ్చెదనని చెప్పగా నీవెవ్వరవని తులసీదాసు అడిగిన నాభూతం



MADRAS 1913

బిట్లనియె. ఓ భక్తుడా నేను పిశా[illegible]యులనుండి
నీవు పరిహరించుచుండెడి శౌచజలమును పానంబుచేయుచు నుంటిని.
ఓ స్వామీ నాకుదాహమైనప్పుడు కూపతటాకసముద్రంబు నందలి
నీరంబులు పానంబు జేయునట్టి యధికారము లేదు. అట్టి నాకు
పన్రెండు సంవత్సరంబులవరకు ఉదకంబొసంగి రక్షించితివి గాన
నావలన ప్రత్యుపకారంబుగ నయ్యెడు కార్యం బానతీయుము చేసె
దననగ నప్పుడు తులసీదాసుయిట్లని చింతించెను. శ్రీరామదర్శనంబు
నిచ్ఛయించియుండగా నందుకు విరోధంబుగ భూతంబు ప్రసన్నమై
నందున కాశ్చర్యమొందెను. సత్సంగమును కోరుచుండగా నిందకు
నీసహవాసము సిద్ధించినట్లును అధ్యాత్మవిద్య నిచ్ఛయించినదానికి
కొక్కొకశాస్త్రము వినబడినట్లును కల్పవృక్షఛాయను కోరినవానికి
ఈతచెట్టుయొక్క నీడయిచ్చినట్లును స్థిరజ్ఞానమువలయుననియత్నించి
నపుడు యస్థిరపరులబ్బినట్లును మనకును సంభవం బయ్యెనని
వెఱగొందెను.

అప్పుడు భూతంబిట్లనియె ఓస్వామీ నీవుచతురుడవు నీకు కొ
అతలేమైన నున్న యెడల సంకోచమును పొందక చెప్పుము. కార్యసా
ధనముచేసెడి వానియొక్క నెచ్చుతగ్గులెన్న న్యాయవంబుగాదు. ద్వా
రమ్షల్పమైనదని యోచించిన పుష్పహారముచేతికిరాదు. అటువలె
కించనునిగాదలంచక కొఱతలంజెప్పుమనియడిగెను. అప్పుడు తులసీ
దాసుండు భూతంబునకిట్లనియె. ఓభూతమా నీవు ప్రసన్నమైతినం
టివి గాన నాకు రామదర్శనమువినా ఇతరమైన కోఱికయేమిలేదని
చెప్పఁగా నప్పుడు ఆభూతము రామశబ్దమువిన్న మాత్రాన వెనకకు
జరుగుచు నీయక్షరంబులుచ్ఛరించితివా నేను నాశమునుపొందెదను
ఓసజ్జనుఁడా నీవు యెవ్వరినిగూర్చి యిచ్ఛయించుచున్నావో అట్టివారి
సేవకుండగు మారుతియొక్క దర్శనముచేయించెదను. ఇట్లనగావిని

తులసీదాసు ఆంజనేయులెచ్చటనున్నారనియడుగఁగా నీవు ప్రతిదినము
పురాణశ్రవణము చేయుస్థలంబునకు వృద్ధబ్రాహ్మణవేషంబు ధరియించి
శ్రోతలందరికంటె ముందుగవచ్చి సర్వజనులు అచ్చటనుండి వెళ్లిపో
యినపిమ్మట పోవుచు దండంబును కరంబున ధరించి తలకు కుళ్లాయి పెట్టు
కొని జీర్ణవస్త్రంబులు ధరియించినవారే ఆంజనేయులని చెప్పి పిశా
చంబదృశ్యంబయ్యెను. పిమ్మట తులసీదాసు తన యాశ్రమంబునకుం
బోయి మరునాడు స్నానముం జేసి నిత్యకృత్యంబులందీర్చుకొని నామ
స్మరణ జేయుచు పురాణ శ్రవణ స్థలంబునకుం బోయెను. అకస్మాత్తు
గానచ్చటికి నొక వృద్ధబ్రాహ్మణుడు వచ్చి కూర్చుండియుండఁగా పిశా
చము చెప్పియున్న లక్షణంబులం గుఱుతుపట్టి శ్రోతలందఱు పురాణ
శ్రవణము ముగించిపోవుచుండగా వృద్ధబ్రాహ్మణుఁడు బయలు వెడలేవ
రకును కనిపెట్టియుండి ఆయన వెంబడిపోవసాగెను. నగరంబునకు
వెలిగా నొక్క విజనప్రదేశంబున వృద్ధభూసుర వేషము ధరించిన
హనుమంతుని యొక్క పాదకమలంబులం బట్టుకొని స్వామీ నా
యందు కృపచేయుమని ప్రార్థించఁగా నాంజనేయులు తులసీదాసును
చూచి నీ వెవ్వండవు ఎందుకు నన్ను స్పృశించితివి అనాథుండను
అగ్యుండనగు నాదు చరణంబు లెందుకు బట్టితివి అని యిట్లు
డుగగా తులసీదాసు డిట్లనియె. ఓ స్వామీ నీవు రామభక్తుఁడవైన
ఆంజనేయులవని తిరుగ చరణంబులుబట్టుకొనఁగా నాంజనేయుండు
తులసీదాసుయొక్క పూర్వ వృత్తాంతమంతయు నాలోచించి వాల్మీ
కులిట్లవతరించిరని గుఱు తెఱింగి తులసీదాసును గూర్చి యాంజ
నేయులు ప్రసన్నుఁడై యో భక్తవర్యా నీ కేద్ది యభీష్టమని యడు
గగా నో యాంజనేయా నాకు శ్రీరాముల దర్శనము కలుగునట్లు
కృపజేయుమని తులసీదాసుఁ డడిగెను. అట్లగునని చెప్పి యాంజనే
యుం డదృశ్యుండయ్యెను.



అనంతరం డాంజనేయస్వామి శ్రీరాములం బ్రార్థించి యో
స్వామీ తులసీదాసు వాల్మీకిమహామునియొక్క అవతారము గనుక
తాము ప్రసన్నులై మనోరథ పూర్తిం జేయుమని వేడగా నీ సంగ
తినివిని అట్లుచేయుదమని చెప్పి సకల వానరసేనాసమేతుండై తులసీ
దాసుయొక్క ఆశ్రమసమీపముగా పోవుచునుండంజూచి యెవరో
మ్లేచ్ఛుండని తలంచి యూరకుండెను. సమస్తసైన్యము వానరసంఘ
మనియును తురష్కరాజు శ్రీరాములనియు తెలియనందున నమ
స్కారమైన జేయకపోయెను. తరువాత ఆంజనేయులు తులసీదాసు
యొక్క ఆశ్రమంబునకువచ్చి యీ దినంబున నీయిచ్ఛాపూర్తి భగ
వంతుఁడు చేసెనాయని యడుగఁగా నప్పుడు తులసీదాసుఁడు శ్రీరా
ములవారి దర్శనము కాలేదని చెప్పెను. అప్పుడాంజనేయులు ఇప్పు
డు నీయాశ్రమ సమీపంబునకు భగవంతుఁడు వచ్చెను గదా అని
చెప్పఁగా నప్పుడు తులసీదాసుఁ డిట్లనియె. ఓ స్వామీ శ్రీరాములు
రాలేదుగాని యెవరోతురుష్కప్రభువు పోయెననెను. అప్పుడాంజ
నేయుం డిట్లనియె. ఓ తులసీదాసా కామధేనువు గృహంబునకు రాగా
మేకయని తలంచి బయటికి వెడలకొట్టిన యట్లును మహాపర్వతంబు
నందు బ్రాహ్మణుండు గృహంబునకు నేతెంచిన వెఱ్ఱిగొల్లవాడని
తలంచి వెళ్లగొట్టినట్లును భగవంతుఁడు ప్రత్యక్షముగా దర్శనమిచ్చి
నప్పటికిని తెలిసికొనక పోతివని చెప్పఁగా తులసీదాసు డాంజనేయుని
కిట్లనియె. ఓ ఆంజనేయా విశ్వంభరుండైన భగవంతుఁడు సర్వవ్యాపకు
డై యుండియు నెవ్వరికిం దెలియకనుండగా నే నెట్లు తెలుసుకొందును
ఉదకక్షీర మొక్కటిగ నున్నప్పటికిని కలశియు జలమువిడచి పాలును
చాతకపక్షి గ్రహించినట్లు రామోపాసక్తులైన భక్తులు భగవంతుని
గ్రహించుయొక్క స్వరూపము వినా యితరంబు లయిన స్వరూపంబు
లనుమన్నించరు. వాల్మీకులు పూర్వంబు నందున నే తీరుగ వర్ణించిరో

ఆ ప్రకారము నాకు భగవంతుని కనుపరచవలయుననఁగా నావాక్యం
బులాంజనేయులు విని చిరునగు వునగుచు శ్రీరఘునందను డా తీరున
జేయునని యంతర్హితుండయి శ్రీరామమూర్తిని నిట్లుధ్యానించెను.
జయ జయ. అయోధ్యావాస సీతారమణ రావణాంతక ధనుర్ధా
రణ పతితపావనా దీనోద్ధారణ దైత్యమర్ధనా శ్రీరామాయని
యిత్తెఱంగున స్తుతిజేయగా రఘురాముడు ప్రసన్నుఁడై యెందు
నిమిత్తమై స్తవముజేసితివని యడుగఁగా నాంజనేయుండిట్లు చెప్పం
దొడంగె. ఓ భక్తకామ కల్పద్రుమా సగుణస్వరూప మేఘశ్యామా
దయచేసి తులసీదాసునకుదర్శనమివ్వవలయుననగా భగవంతుఁడుకలి
యుగమందు సాక్షాద్దర్శనమెట్లిచ్చుననగా మారుతిట్లని విన్నవించు
చున్నాడు. ఓ స్వామీ తులసీదాసు పూర్వంబున వాల్మీకి మహా
ఋషి వీరిని కలియుగంబునందుండు జనులను భక్తిమార్గమునందు
ప్రవేశింపజేయుమని యాజ్ఞాపించియుంటిరి. అందువలన కలియుగం
బునందవతరించిరి. కాబట్టి దర్శనమిచ్చి రక్షించవలెనని పొగడగా
నట్లుజేసెదనని చెప్పి భగవంతుఁడు సీతాలక్ష్మణసహితుండై సగుణ
స్వరూపముధరియించి హనుమంతునితోడగూడి భక్తునికిదర్శనమి
చ్చెనిమిత్తమై వచ్చుచుండగాముందుగా హనుమంతుఁడుపోయి తులసీ
దాసునుచూచి యీదినంబునందు శ్రీరామమూర్తినే మనోరథ
పూర్తిచేయునని చెప్పఁగా నీపలుకువిని సంతోషచిత్తుఁడై యుండు
నప్పుడు ప్రత్యక్షంబుగ భగవంతుఁడు దర్శనమిచ్చెను. ఆసమయంబున
శ్రీరాములు ఎట్లుండె ననగా దేదీప్యమానంబైన కిరీటముం ధరి
యించి పీతాంబరమును పరివేష్టించుకొని ధనుర్బాణంబుల కరంబుల
నిడుకొని వచ్చిన శ్రీరామమూర్తినింజూచి యపారంబయిన సుఖా
నందమునుపొంది యనన్యభావముచేత నా రాముల పాదంబులకు
సాష్టాంగ నమస్కారము జేయగా భగవంతుఁడు ప్రేమచేత భక్తుని



నాలింగనము చేసుకొనెను. తరువాత నాంజనేయస్వామి తులసీ
దాసును చూచి శ్రీరాముల స్వరూపమును ప్రత్యక్షముగా చూచి
తివిగాన పూర్వమందు నీవువర్ణించినలీలను జనులకందరికిం జెప్ప
వలయును. కలియుగంబున యాగయోగ వేదంబులుసాధ్యంబులు
కావు. కావున భగవన్నామమహిమను ప్రకటనజేసి జనులను భక్తి
తత్పరులగా జేయుమని యానతిచ్చినదియేగాక. శ్రీరామమూర్తిని
చూచి తులసీదాసు హస్తమస్తక సంయోగము జేసి కటాక్షించ
వలయునని ప్రార్థించగా తక్షణమే సీతారాము లభయ మొసంగి
యదృశ్యుం డయ్యెను. పిమ్మట తులసీదాసునకు భగవత్కటా
క్షంబువలన గవిత్వధార గలిగి భగవద్గుణాను వర్ణనముజేయ నుప
క్రమించెను. అదియెట్లంటే

వారణాశీ పట్టణంబునందుండు సకలజనులు తులసీదాసుడొన
రించిన హరికీర్తనలను శ్రవణముజేయుకొఱకు మఠ మేర్పరిపించిరి.
అందుండగా నొకశ్రీమంతుడు తులసీదాసువలన యనుగ్రహమును
పొంది నానావిధపదార్థములను దీసికొనివచ్చి యామఠంబునందున
నుంచుచుండెను. తులసీదాసుయొక్క పత్తిన దీనులు యాచకులు
కేవల అన్నార్థులు మొదలగువారలనేకులు భోజనముచేయుచుం
డురు. జనులు తులసీదాసుయొక్క ప్రశంసనువిని యనేకపాత్రంబులు
పదార్థంబులిచ్చుచుండిరి. కొంతమంది దానమిచ్చెడువారు మరికొం
తమంది పరిగ్రహించువారును మరికొంతమంది భూషించెడువా
రును మఱికొందఱు దూషించెడువారును ఉండినప్పటికిని తానుహ
ర్షశోకంబులంబొందక ఆకాశముపగిది అలిప్తుండైయుండెను. ప్రతిది
నము బ్రాహ్మణభోజనంబైనపిమ్మట హరికీర్తన విస్తారముగఁ జేయుచుం
డును. భగవద్గుణంబులు భజించెడిపెద్దలు అనేకులు వచ్చుచుందురు.
మరియు రాత్రింబగళ్లు కవాటంబులం దెరచియుంచి సర్వకాలసర్వావ

పురుష అత్యుద్ధార నీలగ్రీవ ప్రియంకరా విశ్వోద్ధారా రామ కృష్ణా
ఉపమన్యుడు కించిత్ క్షీరమ్ము కావలయునని యడుగఁగా క్షీరసా
గరం బొసంగితివి. తండ్రితొడలపైనుండి పడద్రోయబడిన బాలుం
డగు ధ్రువునకు ఉన్నతస్థానం బొసంగితివి. ప్రియకరుండైన విభీషణు
నకు సువర్ణపట్టణంబునిచ్చితివి. ఇట్టినీకు ఇక్కడనుండెడి సువర్ణ
పాత్రింబులపై కృపణత్వం బేలగలిగె అని యిట్లు స్తవముచేసి తస్క
రులనుచూచి ఓయి మీరు ఇచ్ఛానుసారముగా ద్రవ్యము ఎత్తుకొని
పొమ్మని చెప్పఁగా వారిట్లనిరి. ఓస్వామీ మేము పతితులము దుర్జను
లము అజ్ఞానావృతులము తమ సాంగత్యమహిమవలన శ్రీరామద
ర్శనము అయినదిపరిశవేదిస్వాభావికముగ యినుమునంటినమాత్రాన
సువర్ణంబైనట్లుమీకు ద్రోహము చేయదలచినమాకు భగవద్దర్శన
మాయెను. సూర్యోదయముకాగానే తిమిరముపోయినట్లుమీదర్శన
మాత్రంబునంజేసి మాయొక్క దుర్గుణంబులుపోయెను. కాబట్టి
మాయందు సంపూర్ణ కృపనుంచి అభయదానమివ్వమని వేడుకొనిరి.
అప్పుడు తులసీదాసుడిట్లనియె. ఓచోరులారా మీభాగ్యమేభాగ్యం
అది దొడ్డది. ఏయాయాసము లేకుండగ శ్రీరామమూర్తి దర్శనమిచ్చి
నారు. అది యెట్లున్నదియనగా తోటలో కూరగాయలవిత్తనములు
వేసినంత నమృతవల్లి యుత్పత్తియైనట్లును ఇంటింటికి గంజి నిమిత్తమై
పోవఁగా నమృతముదొరికినట్లును భగవంతుఁడు అనాయాసముగా
దర్శనమిచ్చినది యట్లున్నది. ఇట్లుతులసీదాసులవారుపలికిన వార్త
లాలించి ఆతస్కరులు నమస్కారంబులుజేసి దుర్బుద్ధులు విడిచి
యచ్చోటనుండిరి. శ్రీభాగవతమునందు శ్రీకృష్ణమూర్తి ఉద్దవులకు
రహస్యంబుగ చెప్పినదేమనగా ననుంజేరవలయునని కోరెడివారు
సత్సాంగత్యము చేయవలెననియును ఆసత్పురుషలే కోరెడివారు
సత్సాంగత్యముచే యవలెనని యునుఆసత్పురుష సహవాసము వలన



భగవద్గుణానుభవము కలుగుననియు నానతిచ్చియున్నారుగాన జార
చోర దుర్జనులఘునప్పటికిని సాధుసాంగత్యమువలన సద్బుద్ధులగుదు
రని చెప్పినది ప్రమాణము.

ఇట్లు కాలక్రమమునజరుగుచునుండగా నొకానొకనాడు తుల
సీదాసుయొక్క ఆశ్రమంబునందు దధిఘృతంబులును షడ్రసోపేతం
బులునగు అన్నంబును భుజించుటకు బ్రాహ్మణులు పఙ్క్తులు తీర్చి
కూర్చుండి బ్రహ్మార్పణంబుగ నొసంగిన యాపోశనంబులంబుచ్చుకొను
చుండగా బహిర్ద్వారంబున నొకబ్రాహ్మణుడు సీతారామయని చెప్పి
నేనువిప్రుండను బ్రహ్మహత్య జేసినవాడను అన్నార్థిని భిక్షంబివ్వమని
యడిగెను. అప్పుడు భూదేవతలందఱు లోపల కూర్చుండియుండగా
తులసీదాసు వెలపలికివచ్చి యావిప్రునియొక్క హస్తములుపట్టుకొని
తీసుకవచ్చి పఙ్క్తియందుగూర్చుండబెట్టి యొకృపామూర్తి తమరు
సీతారామాయని చెప్పినప్పుడే బ్రహ్మహత్య మొదలగు దోషంబులన్ని
యు దగ్ధమైపోయినవి. కాబట్టి స్వస్థముగాగూర్చుండి భోజనము జేయు
మని ప్రార్థించెను. అప్పుడచ్చటనుండిన శాస్త్రనిపుణులు ఓతుల
సీదాసా బ్రహ్మహంతకుని నేయాధారముచేత పఙ్క్తియందుగూర్చుం
డబెట్టితివనియడుగగా శాస్త్రవేత్తల పరిష్కరించి తులసీదాసిట్లని
యె. ఓవిద్యానిపుణులారా రామరామయనిస్మరించగా బ్రహ్మహత్యే
యెట్లుండును. ఇదియునుగాక శ్రీభాగవతంబునందు శ్రీకృష్ణమూర్తి
ఉద్ధవులకు నుపదేశించినదేమనగా కలియుగంబునందు నామ మహిమ
అత్యద్భుతంబైనదనియు స్నానసంధ్యాదిక్రియలను చేయుటకుపూర్వ
ము కేశవ నారాయణాదినామంబులచేత నారంభించబడి ఆకర్మాం
తంబునందు భగవన్నామము స్మరించబడుచున్నదని చెప్పియున్నారు.
ఇదియునుగాక సాకల్యంబుగ శ్రాద్ధాదికర్మంబులు జనార్దనునకర్పించ
బడుచున్నవి. హరినామము వినా యేకర్మముజరగ నేరదు. లగ్నని

శ్చయముచేసి ఘటితార్థంబులు విచారించి వివాహముచేయగా లక్ష్మీ
కాంతునిస్మరించక పూర్తికాదు. ఈకలియుగంబునందు సంస్కారక్రి
యలుచేసినపిదప నామోచ్చారణ చేయుదురు. ఇదియునుంగాక ఒకా
నొక సమయంబున శివునిగూర్చి పార్వతి ఓస్వామీ మీరు రామనా
మము ఏలజపించుచున్నారని యడుగగా పార్వతినిగురించి శివుండి
ట్లనియె. ఓపార్వతి నేను పాతకంబులబారదోలి మోక్షసామ్రాజ్య
మును పొందనిచ్ఛయించి రామనామమును జపము జేయుచున్నానని
యానతిచ్చెను. ఇదియునుంగాక బ్రాహ్మణులలో భ్రష్టుండగు నజా
మేళుడు అంత్యకాలంబునందు నారాయణయని యుచ్చరించగా
సకలపాపంబులు దగ్ధంబులైనవని తులసీదాసు చెప్పునపుడు బ్రాహ్మ
ణులు ఓతులసీదాసా నీవు చెప్పినవార్తలు మాకుసత్యముగాతోచవు
నీవు ప్రత్యక్షదృష్టాంతము నిచ్చినయెడల మాకుసంశయంబు తీరు
ననిచెప్పగా నెట్టిదృష్టాంతము కావలయునో కోరుమనెను. అప్పుడు
బ్రాహ్మణులిట్లనియడిగిరి ఓతులసీదాసా విశ్వేశ్వరునియొక్క సన్ని
ధానంబునందు నందికేశ్వరుడున్నాడు. అతనికి అన్నపాత్రమర్పిం
చుము. ఆపాషాణమూర్తి నీవు పెట్టిన నైవేద్యమును భుజించినట్లైతే
బ్రహ్మహంతకుని పఙ్క్తియందు గూర్చుండబెట్టుకొని భోజనముచే
యుదుమనిరి. మరియును నానావిధంబులగు దృష్టాంతంబులనిచ్చి
నామ మహిమనువిశేషముగవర్ణించుచున్నాడవు. ప్రత్యక్షదృష్టాంత
ము పైనచెప్పినట్లు చేసినయెడల నీవు చెప్పెడివార్తలన్నియు సత్య
ముగా నమ్ముదుమనిరి.

ఇట్లు బ్రాహ్మణులు కోరగా తులసీదాసు సంతోషచిత్తుడై అన్న
ముపాత్రమునందుంచుకొని విశ్వేశ్వరు సాన్నిధ్యంబునకుం బోయి
యావన్నంది చూచుచునుండగా నాపాత్రంబు నందీశ్వరుని ముం
దరనుంచి యిరుకరంబులు మొగిడ్చి సాష్టాంగ నమస్కార బర్పిం



చి జయ జయ చంద్రమౌళి నీలకంఠ ఖట్వాంగధర పార్వతీవర
త్రిపురారి దీనునియొక్కవచనంబు లాలించుమీ. ఓ సాంబ అత్యం
తదారుణంబయిన విషమును మీరుమ్రింగెడి సమయంబున సర్వాం
గము దహనమునొందగా రామయనెడి రెండక్షరములు స్మరించిన
మాత్రంబున నీవుశీతత్వమును పొందితివిగదా అదిసత్యమైన యెడల
నీ నందీశ్వరుడు నైవేద్యమును భక్షించుగాకయని ప్రార్థించిన మా
త్రంబున నా నంది దిగ్గునలేచి ఉచ్ఛ్వాస నిశ్వాసంబుల న్విడుచుచు
నా తులసీదాసుడు తెచ్చినపదార్థంబుల నందరు కౌతూహలంబుతో
డం జూచుచుండగ భక్షించి యెప్పటియట్లు కూర్చుండెను. భక్తి
మహిమ అత్యద్భుతంబైనదై శ్రుతిస్మృతులకు గమ్యమైయున్న
ది. అప్పుడు వైష్ణవ వీరులందరు జయ జయ శబ్దంబులతోడ నామ
స్మరణంబుసేయుచు తులసీదాసునకు సాష్టాంగ నమస్కారంబులు
జేసి యో స్వామీ మీరుధన్యులు సిద్ధాంతజ్ఞానులు తారాగణంబు
లలోనుండు చంద్రునిపగిదియును పక్షి సంఘంబులలో గరుత్మంతుడు
వలెను తాపసులలో చంద్రశేఖరుని వలెను పండితులలో వేదాంత
వేత్తయువలెను విష్ణుభక్తులలో నీవు బహుశ్రేష్ఠుండవని తృప్తులై
స్తుతియించి బ్రాహ్మణులందరు ఆశ్రమంబునకు వచ్చియున్న బ్రహ్మ
హంతకుని పఙ్క్తియందు గూర్చుండబెట్టుకొని భోజనంబులు జేసిరి.
అదిమొదలు వారణాశియందుండు జనులందరు నామస్మరణ జేయ
నారంభించిరి. దేహాభిమానంబుల వదలి హరిలీలను శ్రవణము
జేయుచుండిరి.

ఇత్తెఱంగున బహుదినంబులు గడచుచుండగా నక్కాశీ పట్ట
ణంబునందుండు జైతపాలుండను నొక్క షాహుకారు దేహాంతము
నొందెను. అప్పుడాతని భార్యయగు పతివ్రత మాయామమతలవిడిచి
మనంబునందు పతిని మననంబుసేయుచు సహగమనంబు జేయవల

యునని నిశ్చయించినదై గంగాతీరంబునందు మహాగ్నిం బ్రజ్వలింపజేసి యచ్చటికిం బోవుచు నచ్చటనుండెడి మఠంబునకుంబోయి తులసీదాసుయొక్క దర్శనముజేసి నమస్కారం బొనరించి పోదమని తలంచి యామె యొంటిగా నచ్చటికింబోయి తులసీదాసు నామస్మరణంబు సేయుచుండ జూచి సాష్టాంగ నమస్కారంబు చేసెను. అప్పుడు ఆమెనుచూచి అష్టపుత్ర బహుధనమస్తు అని యాశీర్వాదించగా ఆమె ఈయనచేసిన యాశీర్వచనంబు విని యో స్వామీ నాయొక్క భర్త పరలోకంబునొందినందున నేను సహగమనార్థమై పోవుచున్నాను ఇట్లున్నందున మీ యాశీర్వచనము ఫలించుట కనుకూలత లేదనెడి సంశయ ముత్పన్నమైనదని చెప్పఁగా తులసీదాసామానినికి నిట్లనియె. ఓ సతి నేను ఇట్లాలోచించక వచియించిన వాక్యంబును రఘునందనుడు యథార్థంబు జేయుగాకయని వాక్రువ్వఁగా నా యిల్లాలు తిరిగిసాష్టాంగ ప్రణామంబు లాచరించి బయలువెడలి యాప్రేతంబును జూడఁగానే యప్పుడుతనభర్తసజీవుడై కూర్చుండఁగ జూచి యత్యంత సంతోషంబుగలదై యచ్చటనుండెడి జనులందరు జయజయ శబ్దంబులు పలుకుచుండ తనభర్తను వెంటబెట్టుకొని తులసీదాసుయొక్క ఆశ్రమంబునకువచ్చి సాష్టాంగవందనంబు లాచరించి తనగృహంబునకుంజనియె.

ఇట్లు జరుగునపుడు వారణాశీనివాసులందఱు తులసీదాసును గూర్చి నుతులుచేయుచు భగవద్భక్తులగు ధన్యులు జడులగువాండ్ర నుద్ధరింపజేసెడివారు ఈ మహానుభావుడు శిలానందిచేత నన్నము భుజింపజేసెను. తనయాశీర్వచ ప్రభావముచేత ప్రేతమును జీవయుక్తంబుగా జేసెను అని భాషించుచుండిరి. ఈప్రకారంబుగ నిచ్చట జరగబడిన వృత్తాంతమంతయు నెఱింగినయొకపురుషుండు హస్తినాపురంబునకుంబోయి అగ్బర్ బాదుషాయొక్క సభయందు నీవార్తలు జెప్పగా



నారాజు తులసీదాసుమహిమనువిని ఆశ్చర్యమునొంది చతురుండగు తన ప్రధాని నొక్కనింబిలచి బ్రహ్మజ్ఞానియు నతినిపుణుండునగు తులసీదాసును ప్రార్థనచేసి వెంటబెట్టుకొని రమ్మని యాజ్ఞాపించి యొక్కనాణ్యమైన శిబికయు దివ్యంబగు నొకరథంబును సైన్యము మొదలగు పరికరంబుల నెల్ల నిచ్చి కాశీపట్టణంబునకనిపెను. ఆప్రధాని బాదుషాయొక్క యాజ్ఞాప్రకారము తులసీదాసుని యాశ్రమంబునకుంబోయి ఓస్వామీ అద్భుతంబగు భవద్యశంబున్విని బాదుషా తమదర్శనముచేయవలయునని యిచ్ఛయించి యీ సంగతి తమకు విజ్ఞాపనముచేసి వెంటబెట్టుకొనిరమ్మనినన్నంపెను. గాన తమరు హస్తినాపురంబునకుందయచేయవలయునని ప్రార్థించఁగా ఆప్రధాని పలికినవాక్యంబులవిని తులసీదాసు తనమనంబున నిట్లని యోచించెను. అదేమనగా దేశాంతరంబునకుంబోయి యచ్చటనుండు మానవులంగూడ భగవన్నామమునందు ప్రీతిగలవారినిగ జేయదలంచి యచ్చటనుండి బయలువెడలెను. ఆశారహితులయిన వైష్ణవవీరులు దేశాటనము చేయుటయు లోకోపకారంబే అని భగవన్నామస్తుతి జేయుచు గొన్ని దినంబులకు హస్తినాపురంబునకుం జేరిరి. తులసీదాసువచ్చిన వార్తనువిని బాదుషాయెదుర్కొని సాష్టాంగప్రణామంబు లాచరించి తనయంతఃపురంబునకుం దోడ్కొనిపోయి నానారత్న ఖచితంబగు సింహాసనంబునం గూర్చుండబెట్టి తననిజభృత్యులనుపిలచిరహస్యముగా చెప్పినది. యేమనఁగా భటులారా తులసీదాసును యిచ్చటనుండిపోనివ్వవద్దని యాజ్ఞాపించి స్వయముగా నమ్మహానుభావునకు నర్ఘ్యపాద్యాదిషోడశోపచారంబుల బూజజేసి ఓసత్పురుషా నీయొక్కమహిమలను బహుదినంబులనుండి వినుచుంటిని. రెండవ ఈశ్వరావతారంబని లోకులుచెప్పియుండిరి. పాషాణనిర్మితమైన నందిచేత నన్నము భక్షింపజేసినారనియును మృతినొందినవాని సజీవునిగా జేసినారని

యును నివిమొదలగునట్టి యఘటితంబులగు మహిమంబులనాకర్ణించి యత్యంతసంతోషమును బొందితిననగా తులసీదాసు బాదుషాతోడ నిట్లనియె. ఓరాజా ఆచరిత్రంబులన్నియు శ్రీరాములుచేసెను. అనాథుండగు నేనుచేయ నెంతవాడను నేనా శ్రీరాములచరణంబులందు చిత్తమునుంచినవాడనుగాని యిట్టి సిద్ధులు నావద్ద లేవని చెప్పగా బాదుషా యీవాక్యంబులాకర్ణించి యోమహానుభావా శ్రీరాములు నాకుం బ్రసన్నమగునట్లు సేయుము లేనియెడల మిమ్మిక్కడనుండి పోనివ్వనని చెప్పి తన యంతఃపురంబునకుబోయి యితడు వైష్ణవవీరుడు అయినందుకు ప్రత్యక్షదృష్టాంతము చూడవలెనని బాదుషా అభిప్రాయముగలవాడై యుండెను. ఇట్లుండగా నచ్చటనుండు సేవకులు తులసీదాసునుచూచి బాదుషాగారికి శ్రీరాములదర్శనము చేయించకుండగా మిమ్ము నిచ్చటనుండి పోనివ్వమని చెప్పిరి. తులసీదాసు సంకటము తటస్థంబయ్యెనుగదాయని హనుమంతునిగూర్చి స్తవము జేసి విన్నపంబుచేయునపు డాంజనేయుండు ప్రసన్నుడై మహావీరులగు వానరులనుపిల్వగా వారందరును గగనమార్గంబున నేతెంచి ఆకసంబునందుజీమూతంబులు కమ్మికున్నటుల నాంజనేయులచుట్టును ననేక సహస్రంబులుచేరి సాష్టాంగదండ ప్రణామంబులాచరించి స్వామీ మమ్మునుపిలచిన కార్యం బేమియనియడిగిరి. అప్పుడు మారుతనందనుండు వానరులంజూచి తులసీదాసు నిమిత్తమై మిమ్ముబిలచితిని. హస్తినాపురంబుననుండు బాదుషాకు మీయొక్క స్వభావగుణంబుల కనుపరచవలెను అని యాజ్ఞనివ్వగా వారలందరు నాఆంజనేయుల వాక్యంబులు శిరసావహించి యద్భుతంబులగు చేష్టలుచేయనారంభించిరి. ఆపట్టణంబునందుండు గొప్పవియగు గృహంబులపై నెక్కి ఒకగృహంబుపైనుండి మరియొక్కగృహంబుమీద నుఱుకుచుగంతులు వేయుచు నిండ్లుపడిపోవునట్లుచేయుచు పెద్దవృక్షంబుల బెఱికి మను



జులపై వేచుచు కొంతమంది యొక్క నాసికంబులును మఱికొందరి శ్రోత్రంబులును కొఱుకుచుకొందఱివస్త్రంబులనపహరించి నగ్నపాలుగా జేయుచు మఱికొందఱి పాదంబులంబట్టి జరజరనీడ్చుచు రాముని భజించుటకు విముఖులైనవాండ్ర నెత్తి కూపంబులం ద్రోయుచు లుబ్ధులయొక్క భండారకవాటంబులం దెఱచి ద్రవ్యంబులందీసికొనిపోవుచు లోపల సౌధంబులం బ్రవేశించి నాట్యశాలలందు స్త్రీలందఱు వినోదార్థమై కూర్చుండియుండంగా నచ్చట పురీషోత్సర్జనాదికార్యంబులు సేయుచు జారచోర దుర్జనుల న్వెదికిపట్టి రాజమందిరమునందు బడవేయుచు వస్త్రాలంకారంబులం గ్రహించి యాకాశమార్గంబునంబోయి దీనులుండునిండ్ల ముందర వేయుచు నిట్లువిపరీతకృత్యంబులం జేయునపుడు రాజసేవకులు బాదుషావద్దికివచ్చి యోప్రభో వానరసైన్యము బహుగావచ్చి ప్రళయంబుపగిది పట్టణంబంతయు నుల్లోలకల్లోలంబు చేయుచుండెనని కొందరుచెప్పిరి. మఱికొందరు సుజ్ఞానులు రాజునుచూచి యోమహారాజా తులసీదాసు మహాభక్తుడు ఆయనను మీరు కుచేష్టచేసి పంపించినందున వానరులందఱు క్షోభించి పట్టణము తికమకచేయుచున్నారనియనిరి. అప్పుడు రాజు ఆశ్చర్యంబునొంది యంబరీషుని నవమానముచేసినందున దూర్వాసమహామునికి అవమానము తటస్థమైనట్లు నాకును అపాయము తటస్థమాయెనుగదా యని చింతించి తులసీదాసుయొక్క సన్నిధానంబునకువచ్చి యంజలిజేసి నిలచి యోవిష్ణుభక్తా ఇపుడు ఈవానరసైన్యమునునివారించుము. నేను అజ్ఞానముచేత మీమహిమ తెలియక కుచేష్టచేసితి. ద్రౌపదినవమానించిన దుర్యోధనునకు నాశముకలిగినట్లు నాకును సంభవమయ్యె నిట్లుపలుకుచున్న బాదుషానుచూచి తులసీదాసుడిట్లనియె. ఓరాజా నీవు శ్రీరాముల దర్శనమిచ్ఛయించితివి రామునియొక్క సైన్యము సూర్యోదయంబునకు మున్ను అరుణోదయ మయినట్లు

ముందుగవచ్చెను. పిమ్మట శ్రీరాములవారు వచ్చెదరు. ఇంక పదునెని
మిది పద్మంబులసంఖ్యగల సైన్యమువచ్చిన పిదప శ్రీరఘునందనుడు
ఏతెంచి అద్భుతమైన నీభాగ్యోదయంబున దర్శనమివ్వగలరు. అని
ఇట్లానతియ్యగ రాజు శ్రీరాములవారి దర్శనము ప్రాప్తంబయ్యెనని
ఆత్మారాముండగు తులసీదాసుయొక్క చరణంబులుబట్టుకొని మీ
మహిమను తెలియనైతిని. దశసహస్రసంఖ్యగలవానరసైన్యము పట్ట
ణము నుల్లోలంబుసేసెను. ఇకను పదునెనిమిది పద్మంబుల సైన్యమువ
చ్చిన యెడల ప్రళయంబగునోయని చెప్పగా రాజుయొక్క దీనాలా
పంబులువిని వానరసైన్యమంతయు నదృశ్యంబగునటుల జేసెను.
పిదప తులసీదాసుయొక్క చరణంబులకందరు నమస్కరించిరి. హస్తి
నాపురంబున ఒక సంవత్సరపర్యంతముండి యచ్చటనుండెడి యనేక
జనుల నజ్ఞానాంధకారమును బారదోలి హరిభక్తిమార్గ తత్పరు
లుగా నొనరించెను.

పిమ్మట తులసీదాసు అగ్బర్ బాదుషాయొక్క యాజ్ఞతీసుకొని
మధురావాసియైయున్న శ్రీకృష్ణమూర్తిని చూడవలెననితలంచి బయ
లువెడలి ముందుగా గోకులంబునకువచ్చియమునాజలంబుల స్నానం
బాచరించి శ్రీకృష్ణుని దర్శించెను అనంతరము బృందావనంబునకు
నేతెంచి యచ్చట శ్రీరాధారమణునింజూచి నృత్యగీతాదికంబులం
జేయుచు నొక్కమాసంబుపర్యంత మచ్చటనుండెను. తరువాత మ
థురా పట్టణము ప్రవేశించి శమనస్వస జలంబుల స్నానంబుజేసి
భగవంతుని దర్శనముజేసి యహర్నిశంబులు భగవన్నామ స్మరణం
బుసేయుచు భగవద్గుణానువాదమ్ము నొనర్చుచు సాధులగూడి నివ
సించియుండెను. అచ్చట నొకవిష్ణుభక్తుడు ప్రియదాసుఅనెడి నా
మముగలవాడై కలియుగంబునం దవతరించిన సద్భక్తులయొక్క
చరిత్రంబులన్నియు సంస్కృతభాషచే వ్రాయుచుండెను. ఈవార్త



REGISTRAR ... 1913 MADRAS

తులసీదాసునకు తెలిసి ఆభక్తునివద్దకుంబోయి తన్నుసేతు తెలియనీ
యక ఓ మహానుభావా నీవు భక్తచరిత్రంబులను వ్రాయుచున్నా
నని వింటిని ఆ చరిత్రంబులంజదివి జూపమని యడుగఁగా ప్రియదాసు
డిట్లనియె. చాతుర్వర్ణంబులయందవతరించిన భక్తుల చరిత్రంబుల
యందు వ్రాసితిని తులసీదాసుయొక్క దివ్యచరిత్రము వ్రాయ
లేదనియు ఆయనయీ కలియుగంబునందు భక్తశిఖామణియని విని
యున్నాననియు ఆయనయొక్క మహిమంబులను వర్ణించలేదని
చింతాక్రాంతుడనై యున్నాననియు బలుకునపుడు భగవంతుడు సక
లభక్తుల ప్రియకరుఁడు కావున ప్రియదాసునకు తెలియకనే శ్రీరా
మమూర్తి తనహస్తంబులచే తులసీదాసుయొక్క చరిత్రమును వ్రాసి
ఆగ్రంథమందుంచెను. ఆ సమయంబున గ్రంథము శ్రవణము చేయుట
కై యఖిలవైష్ణవులును పండితులును గూడియుండఁగ ప్రియదాసుఁడు
భక్తచరిత్రంబుల వినిపించుచు గ్రంథాంతమందు తులసీదాసు చరిత్రం
బుండజూచి యాశ్చర్యమునొంది శ్రీరాములవారు ఈ చరిత్రమును
స్వయముగా వ్రాసినారనిచూపించగా వారందఱు విస్మయతనొంది
భగవన్మహిమలను వర్ణించ నలవిగాక విభ్రమంబునొంది యూఱ
కుండిరి. వేద శాస్త్రంబులే వర్ణించచాలక మౌనించగా మనుష్య
మాత్రు లెంతవారలు. ఇట్టి తులసీదాసుయొక్క చరిత్రము భగ
వంతుని వలననే వర్ణించబడియున్నది. కావున సద్భావంబుతోడ
శ్రవణంబుసేయగా శ్రీరాముని పాదారవిందంబు నొందుదురు.

శ్రీరామచంద్రాయనమః.

# నామదేవు చరిత్రము.

శ్రీపండరీ క్షేత్రంబున దామాజియను నొక కుట్రపువాడుం
డెను. అతఁడు వైష్ణవుండై జ్ఞానభక్తి వైరాగ్య శీలతగలిగి యెడతె
గక హరినామ చింతాపరుఁడై యుండెను. అతనిపత్ని కోణాబాయి

యను నొక పతివ్రతాతిలకముండె. ఆమె పతిని దేవునిగా భావించి వారియాజ్ఞానుసారిణియైయుండెను వీర లిరువురును. సదా పాండురంగని భజన జేయుచుండఁగ వార్ధకావస్థను పొందువఱకు నొక పుత్రసంతాన మైన లేనందున (అపుత్రస్యగతిర్నాస్తి) యను ప్రమాణముచొప్పున మనకు మంచిగతికలుగుటకు నొకపుత్రుఁడుండవలయునని తనపతితో నోస్వామీ తాము శ్రీపాండురంగనివద్ద జేరి మనకు నొకపుత్రుఁడు వలయునని ప్రార్థించితిరేని భగవంతుఁడు కృపచేయునని విన్నవించి మఱిన్ని మనకు వయస్సుమీఱినదని యెంచవలదు. ఈశ్వరుని సామర్థ్యము అపరిమితము. అతఁ డెట్లుచేసినను చేయవచ్చును. పూర్వము రామావతారమెత్తి సముద్రమునకు వారధిగట్టించెను. కృష్ణావతారమున బ్రహ్మదేవుఁడు గోపాలకులను గోవత్సములను దాచిపెట్టినపుడు తాను గోపాలకులుగానున్న గోవత్సములుగానున్న అవతారము జెంది వారి వారి గృహంబులయందుండలేదా ఇట్టి యఘటిత ఘటనా సామర్థ్యముగలిగిన సర్వేశ్వరుఁడు మనకొక పుత్రునిగల్గించుట వారి కొక కష్టమగునె దేవరవారలు వారివద్దకు వేంచేసి యడిగిన యెడల మాకు దయఁ జేయుదురు. అని యొక్కపట్టుగా జెప్పెను. దామాజి సమ్మతించి శ్రీపాండురంగని సన్నిధికేతెంచి భగవంతుని. దర్శించి దండ ప్రణామంబులాచరించి యోస్వామీ నాసతి పుత్రసంతానము కావలయునని యపేక్షించి దేవరవారివద్ద విన్నవించమని చెప్పెను. దేవరవారు మాయందు ప్రసన్నుండై యొకసత్పుత్రుని నొసంగవలయునని బహువిధంబులుగా అచటకూర్చుండి చింతింపుచుండెను. కొంతసేపటికి తనకు నిద్రకలిగినట్లు తనదేహము మఱచియుండగా నా సమయమందు శ్రీపాండురంగడు దామాజి స్వప్నంబున ప్రసన్నుండై భీమనదికి రేపుదయము నీవు వెడలి స్నానము సేయు సమయమున నానదీ ప్రవాహమందు ముత్యపుచిప్పలో నొకశిశువు తేలుచు



వచ్చుచుండును. ఆశిశువు విఠలనామము నుచ్చరించుచుండును. ఆశిశువేనీకు పుత్రుండగును. కావున యాశిశువును గైకొని నీవును నీపత్నియు పుత్రభ్రాంతిని తీర్చుకొనుఁడని యదృశ్యుండయ్యె. పిమ్మట దామాజిమేల్కొని తన స్వప్నవృత్తాంతము చింతిల్లుచు దన గృహంబు జేరి స్వపత్నితో నడిచిన వృత్తాంతమును దెలిపి యిరువురును మహదానందంబు జెందిరి. మరునాడుదయమున దామాజి స్నానార్థము భీమనదికి వెడలి స్నానసంధ్యాద్యనుష్ఠానములు దీర్చుకొని యానదీ గట్టున భగవద్ధ్యానము చేయుచుండుతఱి అకస్మికముగా యాభీమనది యందొక ముత్యపుచిప్ప బహు తేజోరూపముగా జ్వలింపుచు వచ్చుచుండఁగఁ జూచి తనస్వప్నంబున శ్రీపాండురంగఁడు సాయించిన రీతిగనున్నట్టి ముత్యపు చిప్ప యిదేకాబోలు ననితలంచి నదియందు కొంత దూరము వెడలి ముత్యపు చిప్పనుగైకొనిగట్టుచేరి యాచిప్పను తెరచి చూడగానుద్ధవాంశజుఁడైనయొకశిశువప్పుడెతల్లిగర్భమునందుండిజన్మించినట్లు అతి సౌందర్యముతో తన నేత్రములకు కానబడుచుండ జూచి యిట్టి సుందరమైన బిడ్డకు స్తన్యపానం బిచ్చి పోషించెడి వారెవరని తన మనంబునఁదలఁచి నొక వస్త్రంబున నా శిశువును యుంచుకొని గృహంబున కేతెంచి తన భార్యను బిలిచి ఓ వనితా నీయభీష్టము నెఱవేరునట్లు శ్రీపాండురంగనాథుఁడు ఒకపుత్రుని యొసఁగెను. ఇదిగో తీసికొనుమని యామె హస్తమందుంచెను. ఇంతలో కోణాబాయికి స్తన్యములయందుండి పాలునవారిగా చేపుకొని వచ్చుచుండుట యాదంపతు లిరువురుగని మహదానందంబుజెంది యీ వార్ధకదశయందు మనయందు భగవంతుఁడు విశేషకటాక్షుముంచి ఈ పుత్రుని నొసఁగి స్తన్యములయందు పాలు కలుగఁజేసెనని యాశిశువునకు పాలిచ్చి పోషించుచుండె శ్రీపాండురంగని నామోచ్ఛారణ విడువక చేయునట్టి యీ శిశువును తన పుత్రునిగాఁ గొనుటకు దన బంధు వర్గములను

రావించి నామదేవుండని సుప్రసిద్ధముగా తిరునామమిడిరి. పిదప యాశిశువును నా తలిదండ్రాదులు యతిలాలనతో పోషింపుచు రాగ దినదిన ప్రవృద్ధమానుండై వృద్ధిచంద్రునివలె బెలుగుచుండగ దామాజి నొకదివసంబున వేరొక గ్రామంబున సామానులకై సంతకు బోయెను. ఆదినంబున కోణాబాయి తనపుత్రునిగాంచి యోరినామదేవా నీతండ్రి గృహంబునలేనందున నీవు పూజాద్రవ్యంబును భగవతారాధనకై ప్రసాదమును నొక తట్టలోనుంచుకొని భగవంతునికి తిరువారాధన జేసి రమ్మని నియమించెను. వెనుక నామదేవుండా ప్రకారంబుననే యా పూజాద్రవ్యంబుల విధిప్రోక్తముగా తిరువారాధన జేసి ముగించి యా ప్రసాదమును పాండురంగని యెదుటనుంచి ఆరగించుమని వేడుకొనగా జగదీశుండు ఆరగించకయుండుటను జూచి ఓ స్వామీ యీ దినము తిరువారాధనను కాలాతీతమైనందున తాము కోపము చేయవలదు. నీ నిజభక్తుండైన దామాజియును నా తండ్రి కార్యార్థముగా వేరొక గ్రామములో సంతకు పోయినందుచే నా తల్లి యీ ప్రసాదంబును నీ కారగింపు సేయుమని నియమించినన్ను పంపెను. నీవు ఆరగించకున్న నా తల్లి కోణాబాయి నన్ను కోపించి దండించును గాన ఓ జగన్నాథా నాయందు కృపజేసి యారగించ వలయును. అని వేడుకొనిన్ని ఆరగించక యుండగా ఓ దేవదేవా! ఓ దేవదేవోత్తమా! యీ వంచన నీకేమిటికి నా తండ్రి నీకు ప్రసాదంబిడునప్పుడెల్ల నారగించి యిప్పుడు నేనిడు ప్రసాదంబులనేల యారగింపవు. ఇదేమన్యాయమని పలుమారు చెప్పుచున్నానేగాని యీ దివ్యమంగళ విగ్రహుండైన భగవంతుడు ఏవిధంబున స్వీకరించుననే జ్ఞానములేక భగవంతునిలో నారగించ వలయునని పోరాడుచుండు నప్పుడు భగవంతుడంగీకరింపడయ్యె. పిదప అయ్యో భగవంతుడు ప్రసాదం బారగింపడయ్యెనే నా తల్లి దండించునే యని



యెలుంగెత్తి యేడ్చుచుండ శ్రీపండరినాథుండు ఆ నామదేవునియొక్క భావశుద్ధి నెఱింగి ప్రసన్నుండై ఓ వత్సా నీవు యేడువవలదు. నేనారగించెదనని సమాధానపఱచి తోడనే యా ప్రసాదంబు నారగించి నేనారగించినట్లు యెచటను ప్రస్తాపించబోకుమని నుడివి యెప్పటివలెనే యుండెను. పిమ్మట నామదేవుండు భగవంతునికి దండము సమర్పించి తనగృహమునకు వచ్చుచుండగ తనతల్లి గని ఓరివత్సా భగవతారాధనమైన ప్రసాదము యెక్కడయని యడుగగ పాండురంగడు నిశ్శేషముగా నారగించెనన కోణాబాయి మహదాశ్చర్యమునొంది యీ విశేషంబును మఱునాడు తనపతి దామాజిరాగ వారితో నామదేవునికి భగవంతుండు చేసిన మాయా విశేషంబుల దెఱంగెఱంగింప మహదాశ్చర్యమునొంది నామదేవుని బిలిచి భగవంతుండు నీవద్దనెట్లారగించెనో ఆదిచూపుము ఈ దినమున్ను నీవే తిరువారాధనము చేయుమని పూజాద్రవ్యములను ప్రసాదములను నొకతట్టయందమర్చి యిద్దరుగ జేరి భగవత్సన్నిధిలో జొచ్చి దండముసమర్పించి నామదేవుండు శ్రీపాండురంగనికి షోడశోపచారములచే తిరువారాధన జేసి ప్రసాదమును భగవంతుని కెదుటనుంచి హేజగదీశ ఆరగింపవలయు ననన ప్పుడు భగవంతుండు నామదేవునిజూచి నీతండ్రియగు దామాజి నీతోను వచ్చియుండుటచేత నే నారగించను. నీవుమాత్రముండిన యెవల భుజించెదను. బ్రహ్మరుద్రాదులకు నలభ్యుండగు నేను నీభక్తి భావమునకై ప్రసన్నుండయితిని నీవలె నితరులకు నా సేవను పొడజూపను. అనగ భగవంతునిదాజూచి యోభక్తవత్సలా నీవు కపటవేషధారిగానున్నావు. నిన్నెట్లు నమ్మవచ్చును. నీవు నాకు ప్రసన్నుండై నా తండ్రికేల నీసేవను పొడజూపవు. కృపాజలధే దాసునియందు కరుణించి నా తండ్రి సేవించునటుల నారగించవలయునని పలు తెఱంగుల కొనియాడ భగవంతుండు చిరునగవుతో దామాజియు నామదేవు

డున్న జూచునటుల నారగించెను. అపుడు దామాజి నామదేవుని జూచి యోనామదేవా నీవునాకు సుపుత్రుండగుటచే భగవంతుఁడు ప్రసన్నుండయ్యె. లేనియెడల నాకెట్లు గలుగునని నుడివి యిరువు రున్న జగదీశుని పలువిధములుగా స్తుతించి తమ గృహంబు జేరిరి. దామాజి తనభార్యను జూచి కోణాబాయి ప్రమాణపూర్వముగ మే మొసంగిన ప్రసాదము శ్రీపాండురంగఁడు భుజించెను. మనసుపుత్రుఁ డైన నామదేవుఁడు నిజభక్తుఁడని నుడువఁగ కోణాబాయి యీబిడ్డ అయోనిసంభవుఁడే భగవత్కృపచేమనకు సుపుత్రుఁడై యవతరించెనని సంతోషింపుచుండిరి. కొంతకాలమునకు నామదేవునికి యుక్తవయసు వచ్చినందున యావత్బంధువులు జేరి రాజాబాయియను కన్యకను వివాహము చేయించి పెట్టిరి. ఆమెకు స్వల్పకాలమున యొకసుపు త్రుడు దయించెను. ఆపుత్రునకు నామకర్ణము చేయుటకు శ్రీపాండు రంగఁడు తానొక బంధువునలెను రూపంబు ధరించి కావలసిన కానిక లనుచేకొనినామదేవునిగృహమునకువచ్చెడిబంధువర్గములతో రాగా కోణాబాయి వందనములతో చేయవలసినటువంటి మర్యాదలను జేసి వారలతో నామనుమునికి యేమితిరునామ ముంచవచ్చునని యడుగగ బంధురూపుఁడై వచ్చిన భగవంతుండు నారాయణుడను నామముంచు మని విన్నవించి విప్రులరావించి పుణ్యాహవచనాది సర్వక్రియలను జ రిపించి రాజాబాయికిని ఆబిడ్డకును పట్టుపీతాంబర దివ్యాభరణముల నొసఁగి (విప్రవాక్యోజనార్దనః) అనునట్లు విప్రులవాచా ఆబిడ్డకు నారాయణుఁడని తిరునామముంచి పిలువ ఆ తల్లిని బిడ్డను నాశీర్వ దించి శ్రీపాండురంగ డంతర్ధానుండయ్యె. పిదప కొంతకాలమునకు నామదేవుని తలిదండ్రులు నానాట వృద్ధులై వచ్చుటచే నే కార్యము న్ను జేయక వదలిపెట్టి నెమ్మతిగాయుండిరి. నామదేవులు తనతండ్రి చేసిన కుట్రపుపనిని జేయక తనపిత్రార్జితధనమును వ్యయపఱచిదేహ



యాత్ర జరుపుటయెగాక భగవద్భక్తులైనవారికి పంచభక్ష్యాన్నం బులనిడి వారికి మనోల్లాసంబు గలుగునటులఁజేసి యతిబీదలైన వారికి సకలవిధ యుపకారంబులు జేయుచు ప్రతిదినంబును భగవత్స న్నిధికి నెడలి శ్రీపాండురంగని పాదపద్మంబులకు ప్రణమిల్లి పలు తెఱఁగుల ధ్యానించుచు భగవద్భక్తులతోఁగూడుకొని శ్రీహరినామ సంకీర్తనములు బాడుచు నాడుచు నానందాబ్ధిని మగ్నుఁడై తనువుం మఱచియుండును. ఇట్లుండియు తనపిత్రార్జిత మెల్ల సెలవుజేసి రిక్తహ స్తుడై కుటుంబరక్షణకు కష్టపడుచుండు తఱి తన తల్లి యొకదినము నామదేవునిజూచి ఓరివత్సా నీదు హృదయకమలమందు సదా వేంచేసి యుండు శ్రీహరి ధ్యానపరవశుఁడై తనువు మఱచి భగవద్భజనము చేయుచుంటే నీ సంసార కృత్యములెట్లు జరుగును. శ్రీపాండురంగని భక్తుల గూడుకొని భజనచేయువారలతో కేకలువేయుచు నీపిత్రా ర్జితధనమెల్ల పోగొట్టుకొని నీభార్యబిడ్డలు అన్నవస్త్రములు లేక కష్టపడుచుండఁగా వారియందు దృష్టిలేకయుండిన వారెట్లుజీవింతురు. నేనెట్లు యీ సంసారమును భరింతును. ఇకమీదట నీ సంసారము నకు కావలయు వస్తువులు నీవేసంపాదించి కుటుంబపోషణముచేసు కొనవలయునేగాని నాకు నిమిత్తములేదని నుడివిన మాటలను నామ దేవులువిని అనుతాపముతో శ్రీపాండురంగని వద్దఁజని ఓ పండరీనా థా „తృష్ణాతోయే'' యను రీతిని నన్ను యీ దుఃఖరూపమైన సంసార సాగరమందు ద్రోసినీవిట్లు వేడుకజూచుట దగునాయని యెలుగెత్తి యేడ్చుచుండెను. అప్పుడు కరుణా సముద్రుండై శ్రీపాండురంగఁడు ని న్నెవ్వరిట్లు కష్టపఱచిరని తనపీతాంబరముతో వారికన్నీరు తుడవగా నామదేవులు ఓస్వామీ దాసుఁడు దేవరవారి పాదభజన జేయుచు దేహము మఱచి సంసారమును చూడలేదని నాతల్లి నాయందు విశే ష కోపము జేసుకొనె ననగ శ్రీపాండురంగడు యికమీఁద నీవు నావ

ద్దనే యుండవలయును. అట్లుండినయెడల నావల్ల కలిగిన మాయా సంబంధమెల్ల నిన్నంటవు. నీవు నాయంశ సంభూతుండని తెలియుము ఎట్లనఁగ సూర్యునివిడిచి ప్రభయున్ను. దీపమునువిడిచి ప్రకాశమున్ను పుష్పమును విడిచి గంధమున్ను యెట్లు వేరుకానేరదో ఆలాగే నీకు నాకుఁగలిగియుండు ప్రీతి వేరుచేయ కానేరదు. అని యిట్లనేక దృష్టాంతముల తెలిపి నామదేవునికి చెప్పగా నాతఁడు ఓస్వామీ దేవర వారుసన్నేల విశేషపఱచి చెప్పెదరు. దేవరవారి శ్రీపాద తామరల యందు దాసునికి భక్తికలిగి తమ నామోచ్చారణ సదా నాలుకతో చెప్పునట్లు కృపచేసితిరేని యాయమృత పానఁబు జేసి యానందంబు జెందియుందును. ఇదిగాక తాముస్వామియనిన్ని దాసుడుసాత్త్వియనిన్ని తాము సర్వకల్యాణ గుణోపేతుఁడనిన్ని దాసుఁడు హేయ గుణుఁడనిన్ని తాము సర్వశక్తుఁడనిన్ని దాసుఁడశక్తుఁడనిన్ని తాము సర్వరక్షకుఁడనిన్ని దాసుఁడు రక్ష్యవస్తువనిన్ని యిట్టి విశిష్టాద్వైత జ్ఞానము దాసునికిఁ గృపఁజేసి రక్షింపవే ఓజనార్దనా ఓపుండరీకాక్షా "రక్షమాంశరణాగతా" యని పలువిధంబుల స్తోత్రంబులు జేయుచు భగవంతుని కెదుట నిలిచియుండఁగా శ్రీపాండురంగ నాథుఁడు పక్కున నవ్వి హితవచనంబుల కొన్నిటి చెప్పుచుండఁగా అసమయంబున నామదేవుని గృహంబున తనభార్య తనతల్లినిగని ఓ అత్తమ్మా నా మెడలో నొకనల్లపూస యుండనైనను లేదు. కట్టువస్త్రములెల్ల జీర్ణమై పోయినది భుక్తమునకు పిడికెడన్నమైనను లేదు. ఇట్టి దారిద్ర్య మనుభవించుటకై నీపుత్రునికినన్ను భార్యగాజేసితివి. అని మహాకష్టముతో నిష్ఠూరములాడఁగావిని గోణాబాయి యతిదుఃఖముతో భగవంతుని స్మరించుచు గృహంబు విడిచి బయిటికివచ్చెను. ఆసమయంబున శ్రీపాండురంగఁడు కేశవుఁడనె తిరునామమువహించి యొక నర్తక వేషధారియై యొక గోనెనిండు మోహరీలు నింపించి భుజముపై



మోసుకొని నామదేవుని గృహంబునకువచ్చి కవాటమును తట్టుచుండెను. అప్పుడు నామదేవుని భార్య లోనుండుకొని నీవెవరని యడుగ మిమ్ముఁజూచుటకు నపేక్షించి వచ్చితినని యీ వేషధారి చెప్పెను. రాజాబాయి దారిద్ర్యదశచే చింతించుచుండు యామెయిట్టి దశలో వచ్చినవారెట్టివారో యిట్టివారిని చూచుటకు సంప్రాప్తమైనది యని నాయజమానులు యింటిలోలేరు మీరుతిరిగి పోవచ్చునని చెప్పి ఇరుగు పొరుగు యాడంగులతో నాపతిని జూడవచ్చువారు నా ప్రాణమును దీయుచున్నారు. వారో తాళ వీణలను ధరించి దామోదరుని నాశ్రయించి పాండురంగని సన్నిధిలో నామమును బాడుచు నృత్యము చేయుచున్నారని నుడువుచుండఁగా వేషధారియైన భగవంతుండు వీటిని విని తిరుగా కవాటము తెరువుండని తట్టుచూ నామదేవులకున్ను నాకున్ను ప్రాచీనస్నేహము ఇట్టివారు శెలవులకు లేక సంకటపడుచున్నారని తెలిసి యొకగోనె సవరములు తెచ్చియున్నాను. మీరు చూచుటకు కవాటము తీయుండని చెప్పగా ధనమని చెప్పిన నుడువుల విన్నంత రాజాబాయి కవాటమును తీసివచ్చినవారిని లోపలికి రమ్మని మర్యాద జేసి కూర్చుండుటకు నాసనమిచ్చి నాపతి నొక త్రుటిలోగా వచ్చును యంతవఱకు తాము యిచ్చట వేంచేసియుండు మనగా భగవంతుండు యాధనమును జూచిన పిమ్మట కదా నీవు ప్రియవచనం బాడితివని నవ్వి యిది మొదలు నీభర్తను కష్టపెట్ట పనిలేదు వారు వచ్చిన పిమ్మట నేనువచ్చి పోయినట్టుగ చెప్పుమనిచెప్పి యా మొహరీల మూటను నచ్చోట పడవేసి యంతర్ధానుఁడయ్యె. అటు పిమ్మట రాజాబాయి సంతోషమొంది గోనెను విప్పి చేతినిండుగా సవరనుల నెత్తుకొని యంగటికి వెడలి అముధుపడి పప్పు మొదలగు సామగ్రులను వస్త్ర భూషణములను తీసుక రమ్మని. చెప్పి ఒకరికి సెలవిచ్చి రప్పించుకొని తళిగ చేయుట కుపక్రమించెను ఆసమ

యంబున వెలుపటికి వెడలియుండిన కోణాబాయి యచ్చటనో నేగి
కొంత ధాన్యమును సంపాదించుకొని నామదేవుఁడు కోపించుకొని
వెడలియున్నాఁడు గాన వానిని సమాధానపఱచి పిలుచుకొని వచ్చె
దమని శ్రీపాండురంగని సన్నిధిఁ జేరి నామదేవుని వెదుకు చుండఁగా
యా నామదేవుఁడు తన తల్లినిజూచి సన్నిధివెనుక ప్రక్క ప్రవేశిం
చెను. కోణాబాయి శ్రీపండరినాథుని జూచి దీర్ఘదండంబులిడి ఓ
స్వామీ మమ్ములను కటాక్షించి మామనసుకు ప్రీతికలిగించక తాము
నామదేవునిపై మాత్రము ప్రీతియుంచియున్నారు. దీనివల్ల మాసం
సారమునకు హానికరమైనది దేహమునం దపేక్ష వదలి నీనామమాత్రము
తమును గ్రోలి అందువల్ల కలుగు నానందముచేత సహస్రనామంబు
లను తనవాచాయుచ్చరింపుచు నాడుచు జొక్కుచు సోలుచు నానం
దాబ్ధి మగ్నుఁడై నామదేవుఁడు నీవద్దనేయుంటె తల్లి తండ్రి భార్య
పుత్రులు యేగతిపోదురు బహుకష్టపడి యిదివఱకు నాసుతుని పెంచి
తిని కడకు నాసుతుండు నీవశవర్తి యయ్యెను. ఇట్టియన్యాయ మెచ్చ
టకలదు నీవు ప్రాణనాథుఁడై భక్తవరదుఁడై యుండునటుల జగత్ప్ర
సిద్ధంబేగాని నీకట్టిగుణంబులు లేవు ఇదిగో చూడుము నీవాడి పట్టు
కొని విడువనని చెప్పఁగా భగవంతుండు యీమెవచనముల విని యిట్ల
నెను నామదేవుఁడు నాచరణంబుల నమ్మినందుకు నీకు విశేషమైన
కష్టముకలిగినది. దానికి నేనేమిచేయగలను నీకుపుత్రవాత్సల్యమును
నామదేవుని యందుంచి నన్ను వేరుపఱచితివి అట్లేల నీవు నీపుత్రుని
నాటంకములేక పిలుచుకొని పోవచ్చును నాపై నేల నీవపవాదము
చెప్పెదవు. నీవ్వాయనేక జన్మములుగా సుకృతములు చేసినదానిచేత
రాక్షసకులమందు ప్రహ్లాదుఁ డుద్భవించినట్లు నీకు నామదేవుఁడు
కలిగెను. అతఁడు సుశీలుఁడు ప్రియభక్తుఁడు నీకు నిజపుత్రుఁడౌనని
చెప్పఁగా కోణాబాయి భగవంతునితో నేమిమాటయని పురుషకార



భూతయగు శ్రీరుక్మిణీ పిరాట్టిఁ జేరి భక్తిపురస్సరంబుగా ప్రణమిల్లి
యోతల్లీ నీభర్తయగు శ్రీపాండురంగఁడు నాసుతుండైన నామదేవుని
పిచ్చివానిగాచేసెను. అట్లుండిన నతనికి సంసారమందు దృష్టిలేక
పోయినందుచేత మాకిట్టి కష్టములభించెను. జగతిలో పెద్దలువక్కా
ణింతురు భగవంతుని నాశ్రయించిన వారలకు మహదాపత్తులు నివ
ర్తియై సుఖింతురు. ఇట్లుండ శ్రీపాండురంగని కులదేవుఁనిగా విశ్వ
సించి కొనియాడుచు వచ్చితిమి అతఁడు మాకిట్టి కష్టంబు గలుగఁ జేసి
వేడుకఁజూచుచున్నాఁడు. ఇది యేమి చోద్యంబో నీవే యెఱుగుదువు.
నాకు ఏకపుత్రుండైన నామదేవుని భగవంతుండు తన స్వాధీనముగా
చేసుకొనెను. మాగతి యేమయ్యెది ఓ తల్లీ ఇవియంతయు తమకు
తెలిసిన విషయమేను ఇఁకవారికి దాసురాలయొక్క విన్నపముల
విన్నవించి నాయందనుగ్రహ ముంచవలయునని యనేకవిధములు
గా ప్రార్థించి సెలవు పుచ్చుకొని యాసన్నిధికి మరలి పోవుచుండ
నచ్చట నామదేవునిజూచి ఓరివత్సా నేనిప్పుడు నీపాండురంగఁడు
చూచుచుండ నిన్నునింటికి పిలుచుకొని పోయెదను చూడుమని పెరు
మాళ్లుసన్నిధిని తిరిగివచ్చి వారి ముందునిలిచి యిట్లనినుడివెను. ఓ
స్వామీ! సంసారిగానుండి జగన్మోహనుండై యిటుకరాతిమీఁద నిలుచు
కొని నీవద్దకు విచ్చేయు భక్తులను ప్రపంచాతీతులుగా జేసి నాటక
ముఁ జేయుచుండెదవు నాసుతుని దేవరవారు ముచ్చిలించు కొంటిరి
అతని నీవివ్వ కుంటివా నేనిచ్చోటు విడిచి వెడలను అని పలువిధ
భాషలచే నుడువుచుండు శ్రీపాండురంగఁడు మారు పలుకకుండఁగా
యోస్వామీ మీరిట్లు మౌనము వహించి నాగృహమును తలయెత్త
నీక ముంచితిరి ఓముకుందా ఓజనార్దనా కేశవా కృష్ణా మాధవా
యని నతి ప్రీతితో వారి తిరునామంబుల వర్ణింపుచుండఁగా శ్రీపాండు
రంగఁడు కోణబాయినిజూచి నీసుతుని నీవుపిలుచుకొని పొమ్ము నన్నేల

యిట్లు నిందించెదవని నుడువుచు నామదేవుని కరముబట్టుకొని కోణా
బాయి హస్తంబున నొప్పగించెను. భగవంతుండు మాయాతీతుఁడు
గాన మమతలను విడిచి మనపైనింద యేలయని నామదేవునిపంపెను.
కోణాబాయి కుమారుని పిలుచుకొని గృహంబునకు పోవుతఱి ఓరి
వత్సా శ్రీహరిపాదంబులను పొందినావాయని యడుగఁగా నామదేవుఁ
డు కనులయందు జలంబు జారగ మౌనముగాయుండెను. పిమ్మట
వారిరువురును గృహములో ప్రవేశించిచూడగా నూతనమైన వస్త్ర
ములున్ను ధనరాసులున్ను మిక్కుటముగా నుండుటఁజూచి నామ
దేవులు అనుతాపముతో వలలో తగిలిన మృగచందంబున సంకట ప
డుచు తల్లినిగని ఓయమ్మా యీసంపత్తు మనకెచ్చటనుండి వచ్చినద
ని యడుగగ నాకు తెలియదని తల్లి చెప్పెను. అప్పుడు తనభార్య పురు
షునివద్దకువచ్చి ఓ స్వామీ కాలాతీతమైనది స్నానానుష్ఠానములఁ
దీర్చుకొని ఆరగించుటకు విచ్చేయుఁడనఁగా నామదేవులు తన భార్య
పలుకు చల్లని మాటలనువిని యీ చిన్నది ధనకనక సంపత్తులను
జూచి చక్కని మాటలచే నలంకరింపుచున్నదని తన మనంబునఁద
లఁచి తన భార్యను యీ ధన ధాన్యంబు లెచ్చటనుండి వచ్చెనని
యడుగఁగా తన పురుషుండీ యైశ్వర్యంబులను భగవత్భాగతాచార్య
విని యోగంబుచేసి వేయునని తాను మారుపలుకక యుండెను. ఆస
మయంబున దమయింటి పనికత్తెయగు జనాబాయి నామదేవునికి
దండము సమర్పించి మనరాజాబాయి కష్టముచేతఁ దనమవంబున
కుందుచుండు సమయంబున కృపాజలధియైన పాండురంగఁడేఁగి
కేశవ శెట్టియను తిరునామము వహించి యొక గోనెనిండు సవరనులు
నొసఁగి తమకున్ను వారికిన్ని పురాతనస్నేహమనిన్ని అన్న వస్త్ర
ములకై యీ సవరనుల ననుకూలపరుచుకొనుమనిన్ని తమకే కష్ట
మైన నివ్వఁగూడదనిన్ని చెప్పి వెడలెను. అనగా నీవార్తలను విని



నంతటనే నామదేవులయొక్క నేత్రంబులయందానందభాష్పంబులు
వెల్లువలై పారగా, భగవంతుని తలఁచుకొని బ్రహ్మరుద్రాదులకైన
నలభ్యమగు నీవు దాసునియందత్యంత కృపానిధివై నానిమిత్త
ముగా బహు ప్రయాసపడి యిట్టికార్యముచేసితివి. ఓ పాండురంగా
కృష్ణా పతితపావనా భక్తవత్సలా భక్తభూషణా కరుణాసింధో కమ
లనయన గజేంద్రవరదా అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా ఆది
మధ్యాంతరహితా అనంతావతారా మాయాతీతా కల్యాణగుణ
విశిష్టా హేయగుణరహితా నిత్యానంద స్వరూపా నిన్ను యీ జగ
తినందరు నఖిల సంపదల నిమ్మని బహు విధములుగాఁ గొనియాడు
చుందురు. అట్టివారికీ సంపదలనియ్యవు. ఇట్లుండ దాసుఁడు దేవరవా
రిని యొకదినమైన నిట్టిసంపదల నిమ్మని ప్రార్థించలేదే ఎటుల నీసంపదల
నొసఁగితివి సముద్రమునందు మేఘము వర్షించినట్లైతే యేమిప్రయో
జనము అటువలె నీధనమును నాకొసంగుట నెంతమాత్రమును సమ్మ
తములేదు. దేవరవారి తిరునామముల నెడి ధనముచేత తృప్తిపొంది
యుండెదను. అని నుడువుచు నచ్చట విచ్చేసియుండు బ్రాహ్మణులను
సాధువులను రప్పించి ధన కనక వస్త్రములను వారల కొసంగి వల
గొని ప్రణమిల్లి పురుషోత్తముని భజింపుచుండెను.

శ్రీకృష్ణాయనమః.

# నామదేవులు యాత్ర వెళ్ళిన చరిత్రము.

జ్ఞానభక్తి వైరాగ్యశీలుఁడై శాంతి దాంత్యాది గుణసంపన్నుడై
జతద్ధితంబై వెలుఁగుచుండు జ్ఞానదేవులనువారు నామదేవులను సేవిం
చుటకు విచ్చేసిరి. నామదేవునిజూచి యాతక్షణంబె సాష్టాంగ దండ
ము సమర్పించి విశేషప్రేమతో విధ్యుక్తముగ పూజించి పూర్వము
దాసుఁడుజేసిన భాగ్యవిశేషముచేత దేవరవారి సేవలభించెను. ఈ
జగంబున కొందరు తమ్ముఁదామెఱుఁగగ బద్ధ సంసారులై తిరుగుచుండు

వారినిగని వారలకు జ్ఞానోపదేశముచేసి ముక్తులుగాఁజేయుటకు దేవర వారవతరించినవారని విన్నవించుచు మరలదండము సమర్పించి ఓ నామదేవా వినుండు దేవరవారి భాగ్యవిశేషంబును చెప్పుటకు నలవికాదు సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు నీపండరిక్షేత్రంబున శ్రీపాండురంగని సేవించుచు నచ్చటికి విచ్చేయు భాగవతులను పూజించుచు నాశాపాశంబుల విడనాడి అనవరతము హరిచింతఁజేయఁగలిగెను. వీటిచేత తమకులంబున నవతరించిన యిరువది యొక్క సంతతివారును భగవచ్చరణారవిందములను జేరుదురు. ఓనామదేవస్వామీ దాసుఁడొకయుద్దేశముతో తమవద్దకువచ్చితిని. అదియేమనఁగ నొకఁడు జీవన్ముక్తుఁడైనను గురుదేవ తీర్థభగవద్భజనములను విడువక ననుష్ఠింపవలయునని పెద్దలు వక్కాణింతురు గాన దాసుఁడు తమతోఁచేరి అఖిల దివ్యదేశములకునరిగి అచ్చట వేంచేసియుండు పెరుమాళ్లను సేవించి అచ్చటచ్చట నుండు పుణ్యతీర్థంబుల యందు స్నానము చేయవలయునని యపేక్షఁగొని తమవద్దకు వచ్చితిని గాన నామనోరథంబును పూర్తిచేయవలయునని యడుగఁగా పండరిక్షేత్రవాసమున్ను శ్రీపాండురంగని సేవయు విడిచి యచ్చటచ్చట తీర్థములగ్రుంకులాడుట అధిక వెలగల కస్తూరిని పారవైచి పోయి బూడిదను ధరించినట్లున్నది యని వారి వెంబడిపోవుటకు మనసులేక జ్ఞానదేవులనుజూచి దాసుఁడు సర్వప్రకారముల చేత శ్రీపండరినాథునికి ప్రియుఁడై యతఁడు సర్వవిధ బంధువని నమ్మియున్నాను గనుక నతనియాజ్ఞ తీసుకొంటి రేని దాసుఁడు తమ వెంటవచ్చుటకు యే ఆక్షేపణ లేదనఁగ జ్ఞానదేవులు యద్దాని విని దేవరవారి అంతరంగమును నెఱిఁగితిసి దేవరవారు జ్ఞానభక్తి వైరాగ్య శీలులగుదురని మంగళా శాసనముచేసి నామదేవులను పిలుచుకొని శ్రీపాండురంగని సన్నిధిలోఁజొచ్చి భగవంతునిగని అతివినయ పూర్వకముగ వందనంబాచరించి తనమనస్సునందుండు విషయంబులఁ దెలుపఁగ శ్రీపాండురంగఁడు జ్ఞానదేవులఁజూచి సర్వశాస్త్రార్థ ఫలప్రదంబైన నన్ను సర్వవిధంబుల ననుభవించి స్వచ్ఛమైన స్ఫటికము వంటి జ్ఞానము నీకు కలిగియుండియు నీవిట్లు తీర్థయాత్ర పోవలయునని యిచ్ఛించుట యాశ్చర్యముగా యున్నది నీయభిప్రాయమునకు కారణమేమని యడుగఁగ జ్ఞానదేవులు సత్పురుషుఁడైన నామదేవుల సాంగత్యముచేత నాదేహము సార్థకముచేసుకొనుట కెంచి దేవరవారితో నామదేవుని దాసునివెంట పంపుమని యాచించెదనని తిరుగా దండము సమర్పించి నిలిచెను. వీరినిజూచి శ్రీపాండురంగఁడు నవ్వి నామదేవునిజూచి నాప్రియభక్తుండా స్వరూపోపాయ పురుషార్థ లక్షణంబుల నెఱిఁగిన జ్ఞానదేవుఁడు నీసాంగత్యము కావలయునని యిచ్ఛించుచున్నాఁడుగాన వారియొక్క మనోరథంబును దీర్చి మరలనతి శీఘ్రంబుగ రాఁగలవని వారికరముబట్టి జ్ఞానదేవులచేత నొప్పగించి యీ నామదేవుఁడు నాయందతిప్రేమగలవాఁడు ఇది వఱకు నన్ను విడిచి యుండలేదు. ఇట్టివాని నీమాటతోయక నీ వెంటనంపెద వానిసర్వవిధములచే గాపాడుచు నీకార్యసాధనంబు నెఱవేర్చుకొని అతిశీఘ్రముగ రాగలవని మంగళా శాసనముచేసి వీడ్కొలుప వీరిరువురును శ్రీపాండురంగని ననేక స్తోత్రంబులచే కొనియాడి దండప్రణామంబాచరించి యాజ్ఞపుచ్చుకొని చంద్రభాగను దాటివచ్చుచుండఁగ నామదేవులకు శ్రీపాండురంగని యందుండు ప్రీతిచేత నానుకాళ్లాడక శ్రీపండరి క్షేత్రంబును తిరిగి తిరిగి చూచుచు జ్ఞానదేవులతో నడిచిపోవుచు నిట్లనుచున్నాఁడు ఓస్వామీ తాము ప్రాణపదంబైన పండరినాథునితో చెప్పి నన్నేల పిలుచుకొని పోయెదరు నావల్ల మీకేమిప్రయోజన మనుచు వత్సమునందు ధేనువునకుఁగలుఁగు ప్రీతివలె పండరిక్షేత్రంబునుతిరిగి చూచుచు ఓపండరీనాథా మఱల నిన్నెప్పుడు సేవించఁగలను దేవరవారులేని యీచోటుదండ

కారణ్యముగా తోఁచుచున్న దేవదైవశిఖామణీ స్వామీ నాకు తలితండ్రిగురు
దైవముగా నీవు నాహృదయ కమలమందు సర్వదా నిలిచినన్ను
రక్షించవలయునని యపారశ్రద్ధమతో కనుల నానంద భాష్పంబులు
రాలఁగ పలువిధ ప్రియవచనంబు లాడుచు జ్ఞానదేవులఁజూచి యో
స్వామీ యోభక్తాగ్రగణ్యా అతిప్రియముగా శ్రీహరి తమ హృదయ
కమల మందుండలేదా అట్టివారిని సేవించి యానందించు చున్న
చోట్ల నుండక నిట్లు యాత్ర చేసి కష్టపడు టేల అయ్యోతాము తత్వహి
తపురుషార్థలక్షణంబుల నెఱిఁగితి రేని బాగాయుండును మనకు హిత
పరుఁడైన భగవంతుఁడు (అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ
స్థితః) అని సర్వవస్తువులయం దంతర్యామియై యుండఁగ తమహృద
యంబున లేకున్నాఁడ అట్టివాని నున్న చోటుననే సేవించవచ్చునే
యాత్రలో నేమి ప్రయోజనమనిన నామదేవులనుజూచి హృదయ
కమలమందు సదా ధ్యానించునట్టి శ్రీపాండురంగని ప్రత్యక్షముగ
నీవు చూపించుఁడనఁగ దాసుడు దివ్యమంగళ విగ్రహుండైన భగవ
ద్రూపమును సేవించువాఁడను గాని నిర్గుణ ధ్యానపరుఁడను గాను
దాసునికి భగవంతుని ప్రత్యక్షముగ సేవించుటయం దపేక్షఁగొని
యుండుననిన నామదేవునుజూచి జ్ఞానదేవు డద్వయుడనిన్ని అక్షరు
డనిన్ని యెఱుగునట్టి సర్వజ్ఞుఁడు తమ హృదయమందు సాక్షాత్క
రించియున్నాడు. ఇతఁడఖిల చరాచరంబులయం దంతర్యామియై
యున్నాఁడు. వాడువినా యేవస్తువున్ను లేదు అనియెఱిఁగి తాము
దివ్యమంగళ విగ్రహ వ్యాప్తియందు ప్రియులై యున్నారనఁగ నామ
దేవులు మీరుచెప్పినదేసరి దాసుఁడుసార్వదా పండరినాథుని దివ్య
మంగళ విగ్రహమందు మనసు నిలిపి వారిస్వరూప రూపగుణ విభూ
తులనుజూచి చింతిల్లుచు వారినామ సంకీర్తనలఁ బాడుచు నాడు
చు జొక్కుచు సోలుచు నుండుటయం దీడుపడుచున్నాను. ఇవి తప్ప



మఱియు నెట్టి విషయంబు లందును నా మనసుచవదు అనుచు
నిట్లనేక సద్విషయంబులైన వార్తలాడుచు జనిచని పోవుచుండఁగ
నొకదినము జ్ఞానదేవులు నామదేవునిజూచి యో భక్తాగ్రగణ్యా తా
ము యేవిధ వుపాయముచేత భక్తిమార్గంబుఁ దెలిసి భజనజేసి శ్రీ
పాండురంగని స్వాధీనము చేసుకొన్నారో ఆ విధంబును శ్రవణ మనన
నిది ధ్యాసనలు అను వీనియనుభవమున్ను దాసుఁడు తమ యొద్ద
తెలుసుకొనవలయునని బహుకాలముగా తలఁచుచుంటిదను. తమ
కుఅనుభవములైన సాధనమును తెలుపుమని వేడికొనఁగా నామ
దేవులు వారి పాదారవిందంబులను పట్టుకొని త్రికరణశుద్ధిగా చె
ప్పెదను దాసుడజ్ఞాని తాముసర్వము నెఱిగిన మహాత్ములు తాము
దాసుని యనుభవమడుగుట “కల్పవృక్షము లోభిని నాశ్రయించి
దానమడుగు చందమైయున్నదని” నుడువుచు మఱల పాదములను
బట్టుకొనఁగ జ్ఞానదేవులు వారినిజూచి నా విషయమునందు తమకు
శంకవలదు తమయనుభవముల నెడి జ్ఞానదృష్టిని దాసునిపై వర్షింప
వలయును తాము విశ్రాంతిఁబొంది శ్రీపాండురంగని కంతరంగ భక్తులై
వారిని తమస్వాధీనము చేసుకొంటిరి. ఇట్లుగాక భక్తిలేని జ్ఞానముం
డి యేల తమజ్ఞానము సహస్రగుణాధికంబై యున్నది. ఇట్టిజ్ఞానానుభ
ములఁ దమవాక్కున వినఁకోరెదను గనుక తాము మౌనమును విడిచి
నా యభీష్టమును పూర్తిచేయవలయునని బహువిధముల వేడుకొ
నఁగా నామదేవులుచెప్ప నుపక్రమించెను. ఓ స్వామీ దాసునియను
భవము చెప్పెద వినుము జ్ఞానభక్తి వైరాగ్యములను వహించి (ఆత్మ
వత్సర్వభూతాని) యనునట్లు సర్వ భూతములను దనవలె దలఁచి
భేదబుద్ధిమాని రాజసతామసములను అరిషడ్వర్గంబులను జ్ఞానమ
నెడి ఖడ్గముచేత నరికి పారవైచి శాంతిదాంతి శమదమాదుల గై
కొని (అహింసాప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహం).

అనునట్లు అష్టవిధ పుష్పంబులచే భగవంతుని నారాధింపవల
యు నిట్లు చేయుటయే శుద్ధభజనఁ మనబడును. నిట్టి యనుష్ఠానము
లేని సాధనములు నిష్ప్రయోజకములు అవియెట్లనఁగ లోపలబహు
దోషంబుల నుంచుకొని ఉపచారమునకై ప్రణమిల్లువాని భగవంతు
డెట్లంగీకరించును గాన పరిశుద్ధుడవై యుండవలయును ఇదిగాక
ఉత్తముఁడు మధ్యముఁడు అధముడనిన్ని ఇతఁడుజ్ఞాని అజ్ఞానియు
ఇతడుపుణ్యాత్ముఁడు యితడు పాపాత్ముఁడు ఇతడు బాలుఁడు ఇతఁడు
వృద్ధుఁడు అని తలచక యందరియందు సమభావముతో చుట నఖండ
జ్ఞానము సర్వాత్మలయందు సర్వేశ్వరుండు వ్యాపించి సాక్షిభూ
తుఁడై యున్నాఁడని బ్రహ్మజ్ఞాని తలఁచియుండును. పైచెప్పిన వాటి
నెల్ల నేపురుషుఁడు అనుష్ఠాన పర్యంతముఁ దెచ్చుకొని స్థిరబుద్ధితో
యుండునో అతఁడక్షయమైన జ్ఞానియగును ఇదిగాక భగవంతుని
భజనచేయుటెట్లనఁగ సుస్వరముగా వాయించు వీణాగానమును విను
చుండు ధేనువు సర్పము లోభులు ద్రవ్యము నార్జించు నప్పుడు
వ్యాపారముల యందెట్లుచిత్తము నుంచుదురో అట్లును జారస్త్రీ
పరపురుషుని యందు మనసునుంచి లౌకికములైన గృహకార్యముల
నెఱవేర్చునట్లును చాతకపక్షి భూమండలమందు సంచరించుచుండియు
వాటిలక్ష్యము మేఘమండలమందున్నట్లున్ను. భక్తుండు శ్రీహరి
నియందు మనసులయపఱచి సర్వప్రకారముచేతనున్ను ధ్యానించి
సర్వభూతముల చూచినప్పుడు భగవంతుడు వీట్లయందు అంతర్యా
మియై యున్నాఁడని తలఁచి యుండుట జ్ఞానిలక్షణము మఱియు॥ "ఏ
కాంతశీలస్య దృఢవ్రతస్య" యనునట్లు ఏకాంతశీలుఁడై దృఢవ్రతుఁ
డై పంచేంద్రియంబుల జయించి శ్రీహరిని సదా ధ్యానించువాఁడు జ్ఞాని
యనఁబడును ఓ స్వామి నాదు త్రికరణశుద్ధిగా శ్రీపాండురంగని విష
యంబున దాసుఁడనుష్ఠించినవఱకు చెప్పితిననఁగా జ్ఞానదేవులు విని



యాశ్చర్యపడి నీకు సమమైన విష్ణుభక్తుఁడు దొరుకుట దుర్లభంబు
ఈదినము నాపైనమృతవృష్టి కురిపించితిరని బహుప్రకారముల శ్లాఘిం
చిరి ఇట్లొకరి కొకరు భగవత్కల్యాణ గుణములను ధ్యానించుచు
నానందాబ్ధిమగ్నులై యాత్రచేయుచుండిరి.

ఇట్లు సంచరింపుచు హస్తినాపురంబు దర్శించి ఆపురంబున విల
సిల్లుభాగవతులందరు మేళవాద్యఘోషముతో తంబుర మృదంగాదు
లను జతచేర్చుకొని భజనచేయుచు నెదుర్కొని వచ్చి నామదేవ జ్ఞాన
దేవులకు దండము సమర్పించి మర్యాదలతో భగవద్భజన జేయుచు
నానందాబ్ధిమగ్నులై ఆడుచుఁ బాడుచు నందరు నేకకంఠముగ జయ
జయ శబ్దములతో కోలాహలముగ నాపట్టణము ప్రవేశింపఁగ నాపు
రిని నేలుచుండు రాజు తురకవాఁడు గనుక నీశబ్దంబువిని కారణమును
విచారింపఁగ నచటనుండిన వారు నామదేవుడను భక్తులు శ్రీపండరి
పురంబుననుండి తీర్థయాత్రఁ జేయుచు నిచ్చటికి వచ్చుచున్నారు వారి
తోఁ గొందరు సాధువులు జేరి భజనజేయుచు వచ్చెడి శబ్దముగా
నున్నదని చెప్పఁగ విని మహాకోపాగ్ర చిత్తుఁడై మంచి యౌవనదశ
లో వ్యాధి కలుగునటుల భగవన్నామము జేయుచువచ్చెడి నామదే
వుల వద్దకువచ్చి సహించక నొకగోవును నచ్చటికి తీసుకొనివచ్చి
దాని శిరంబును రెండుగ్గానరికి నామదేవులను జూచి యీ గోవును
తాము ప్రాణమిచ్చి లేపినయెడల తమపురాణ వాక్యములనెల్ల సత్య
మని నమ్ముదును లేనియెడల తమ్మును ప్రాణహత్యజేతును దీనిని
నెన్నిదినములలో లేపగలవని యడుగఁగ నప్పుడందఱున్ను భగవ
త్సంకీర్తనము నిలిపి నిర్భయులైయుండిరి నామదేవులప్పుడు రాజును
జూచి నాలుగుదినములలో లేపెద ననెను అందుకురాజుసమ్మతించి
తగుమైన కావలినుంచి తన గృహమునకు వెడలెను పిమ్మట నామ
దేవులు హేజగదీశ దాసునికిట్టి యాపదకలుగుట కేమిహేతువో

దాసునికి తెలియదు ఓదీనదయళో పతితపావనా భక్తవత్సలా పర
మదయాళా కరుణాకర కామిత వరదా కోదండరామ భక్తభూషణా
గోవిందా ముకుందా పుండరీక వరదా పండరినాథా పక్షివాహనా
భక్తపోషణా యీక్షణంబున రక్షణసేయ నతివేగంబున రమ్ము
ఆలస్యమేలయని పలుతెఱంగుల భగవంతుని స్తుతిజేసి యానందా
బ్ధిని మగ్నుఁడై కనుల నీరుగారఁగ ధ్యానించి మైమరచి తిరుగాలేచి
తేరి తెప్పరిల్లుచుండును. వీరుచేయు గుణానుభవములను వినుటకు
వచ్చినవారందఱు నానందంబుజెందుచు నాదినమంత నచటనుండి
మరుదిన ముదయమునందున వారివారి గృహముల కేతెంచిరి నామ
దేవులు మాత్రము యాగోవు శిరంబును కరంబున బట్టుకొని యేలనిది
వఱకిటురావు అచ్చటచ్చట యోగులు వారివారి హృదయ కమల
ములయందు ధ్యానరూపమున తమ్ముకట్టి వేసినారా లేక పండరి
పురమున భక్తజనంబులు నిన్ను భజించుచుండఁగ వాటిని వినుచు
నన్ను మఱచితివా లేక శ్రీమానులగు మహాభక్తులు మిమ్ము పూజిం
చుచుండ వారికి కట్టుపడి నన్ను మరచితివో యిట్లు నాలుగు దినము
లుగా రాత్రిపగలు నేకకంఠముగ పిలుచుచు కనుల బాష్పంబులు
భూమిపైఁబడి తడుచుచుండఁగ ననేకప్రకారములుగా ప్రార్థింప భగ
వంతుఁడు రానందున జలమును వదలిన మత్స్యము తడనూడునట్లు
నామదేవులు సంకటపడుకొని హేజగదీశ దాసునికి కాలము సమీ
పించినట్లు కనబడుచున్నది లేనియెడల నీతురక రాజుచేత చిక్కుపడఁ
జాలనని ప్రలాపించుచు స్మరణతప్పి భూమిపైపడెను. ఆసమయమున
భగవంతుఁడు నామదేవుని హృదయమున ప్రసన్నుఁడై గోవును లేపి
నామదేవులకు స్మరణగలిగించెను ఆతక్షణమున లేచి భగవంతుని
పాదతామరలను గట్టిగాఁబట్టుకొని ఓస్వామీ తామింత ఆలస్య
మేల చేసితిరనియడుగఁగ భగవంతుఁడుఓనామదేవా నాలుగు దినము



లు కావలయునని ఏలనడిగితివి లేకుంటె నప్పుడే లేపియుందును గదా
నీసంకల్పమునకు విరోధములేక వచ్చితిని నాయందు తప్పువుంచవద్దని
నుడువుచు నంతర్ధానుండయ్యె. పిమ్మటనామదేవులు మృతిఁజెందిన
ధేనువునకు ప్రాణముఁగలిగించిన సర్వేశ్వరుని మహిమలకు నాశ్చ
ర్యపడి శ్రీహరి కల్యాణ గుణంబులఁబాడుచుండఁగ నట్టియాశ్చర్యము
ను జూచి రాజునకు భటులు వెడలి చెప్పిరి రాజు నాతక్షణంబె విచ్చేసి
యీ మాహాత్మ్యమును జూచినామదేవులను వలగొని ప్రణమిల్లెను.
ఇదిజూచిన జనులెల్ల మహదాశ్చర్యము నొంది నామదేవులను బహు
ప్రకారములఁగొనియాడిరి కొన్నిదినములు. హస్తినాపురమున నామ
దేవులు గానరూపముగా పండరీనాథుని భజించఁగా విని విని కొందఱు
భగవద్భక్తులైరి ఆసమీప వర్తియైయుండు తీర్థములయందు గ్రుంకు
లిడుచు నచ్చటివిశేషంబుల సేవించుచు కాశీపట్టణం బేతెంచిరి. అ
చ్చట కబీదాసుని జూచి భగవన్నామ సంకీర్తనములను విని యచ్చో
టు విడిచి మథుర బృందావనము గోకులము గోవర్ధనగిరి సేవించి య
చ్చోటు విడిచి ద్వారకకు వెడలి యచ్చటివిశేషంబుల సేవించి తిరిగి
వచ్చునపుడు మారువాడిదేశంబు ప్రవేశించి రాగ దారిన దాహము
దొఱకక పరితపించుచుండఁగ నచ్చట నొకకూపమును జూచి వాటి
లో జలము లోతున నుండఁగని జ్ఞానదేవు దాహశాంతి చేసుకొనెను
నామదేవులు బావియందు దిగుటకు తెలియక గట్టుననుండి భగవం
తుని స్తుతిచేయ నుపక్రమించెను. ఓపరమపురుషా పండరీనాథా నిగమ
గోచరా నీలవర్ణా జగజ్జనావన జానకీరమణా దాసుఁడు దాహముచేత
నుపద్రవము పడుచున్నాఁడను భక్తజనరక్షణోపేత కరుణాకటాక్ష
ముంచి యతిత్వరగావచ్చి నాయాపదనుదీర్చి కాపాడవలయునని అనే
క విధములుగాఁ గొనియాడుచుండఁగ దయాసింధువైన భగవంతుఁడు
నాకూపజలంబును పైకివచ్చునటుల జేసెను యపుడు నామదేవు

డాతీర్థము పానముజేసి తనదాహాము తీర్చుకొని మహదానంద భరి
తుఁడై శ్రీపాండురంగనాథుని మననము చేయుచుండెను. అప్పుడు
జ్ఞానదేవులు నామదేవుని జూచి నీయందు భగవంతునికి విశేష కటా
క్షముగలిగి యీ బావియందున జలమును పూరింపజేసి నీదాహము
దీర్చెను. ఇట్టి మహిమం బెట్టివారికిని జూపినదిలేదు నీవు మహాపు
ణ్యంబు జేసినవాడవు భక్తాగ్రగణ్యుండని ప్రియవచనము లాడుచు
మఱిన్ని యొక దివ్యస్థలమును యాత్రచేయ నుపక్రమించిరి. ఇప్పటి
వరకున్ను నాస్థలమందు ప్రతి వత్సరము మార్గశిరమాసమున నతి
ప్రభలమైన యుత్సవము జరుగు చున్నవి.

పిదప నుత్తరదేశముతో చేరిన బదరికాశ్రమము మొదలుగా
గల యఖిల దివ్యదేశమంతయు సేవించి తృప్తినొంది దక్షిణదివ్యదేశం
బుల సేవించ నిచ్ఛగొనినవారై దక్షిణపార్శ్వము వెడలి మొదట
సేతువును రామేశ్వరమును దర్శించి దర్భశయనుని సేవించి యది విడి
చి శ్రీరంగముజేరి కావేరినిగ్రుంకి శ్రీరంగనాథుని సేవించి శ్రీకాంచీనగ
రంబు వెడలి వేగవతిని స్నానంబుజేసి శ్రీవరదరాజ పెరుమాళ్లను
శ్రీపెరుందేవి తాయారులను సేవించి యచ్చోటు విడిచి శేషాద్రీశుని
సేవింప మదిసెంచి భగవద్గుణంబుల బాడుచు నాడుచు నానందాబ్ధిని
మగ్నులై కొండపై వెడలి అనంతాళ్వార్ల సరస్సునను సామిపుష్కరణి
నింగ్రుంకి శ్రీవేంకటేశ్వరుల సేవించి కొన్నాళ్లుండి కొండదిగి శ్రీగోవిం
దరాజులు శ్రీరామమూర్తిని సేవించి అలమేల్మంగమ్మను సేవించి య
చ్చోటు విడిచి నడచి నడచి భగవద్గుణానుభవము చేయుచు అవుం
డానాదమను పుణ్యక్షేత్రముజేరిరి. ఆదినము మహాశివరాత్రి పర్వ
కాలమగుటచేత నాక్షేత్రము రెండవకైలాసమని భక్తులు పొగడుట
చే నచ్చటగల పుణ్యతీర్థంబులయందు స్నాన సంధ్యా ద్యనుష్ఠానముల
తీర్చి నిత్యనైమిత్యములను ముగించి లింగాకారమైనటువంటి నాగ



నాథస్వామిని సేవించి నమస్కరించి ఓ పార్వతీపతే కైలాసపతే శూల
పాణి వ్యాఘ్రచేల శంభో విశ్వేశ్వర యని స్తోత్రంబుజేసి చందనకు
సుమ నారికేళ కదలి తాంబూలాది సర్వవస్తువులు సమర్పింపఁగ
వాటినిఁగని చంద్రమౌళి సంతోషచిత్తుఁడై యుండెను. పిదప నామదే
వులు కాలగజ్జకట్టి కరముల తాళము తంబూరబట్టి ఆర్తితో భగవ
న్నామ సంకీర్తనల పాడుట కారంభించె నదియెట్లనిన నొక పాత్రలో
తైలముంచుకొని మరియొక పాత్రలో పోయునపుడు ఈ పాత్రకున్ను
యాపాత్రకున్ను ధారపడినట్లు కనుపడు చందము తన హృత్కమ
లమందు శ్రీపాండురంగని దివ్యచరణారవిందంబులనిడి ఉభయ నేత్రం
బుల మూసి వాని సౌందర్య సౌకుమార్య లావణ్యాదులను సేవిం
చుచు వారిగుణంబుల వర్ణింపుచు నై మఱచి మానావమానములను
లాభలోభములను ఫలాఫలములను శీతోష్ణములను సుఖదుఃఖములు
సమముగానెంచి డాంభీకమైన లోక దురాచారమువిడిచి వాసనారు
చుల వర్జించి ఆశాపాశముల నడుగంటం దెగగోసి భేదాభేదములు
డిగి అత్యంతప్రీతితో భగవత్కల్యాణ గుణంబుల బాడుచు నాడుచు
సొక్కుచు సోలుచుండెను. అప్పుడు నసంఖ్యేయజనంబులు యీ
గుణానుభవంబుల శ్రవణంబు జేయుచు కూర్చుకొనియుండిరి. పౌర్ణ
మి దినంబున చంద్రుడు పూర్ణకళలతో రాఁగ సముద్రరాజు సం
తోషించునట్లు వినవచ్చినవారలు భగవద్గుణానుభవ రసంబుల పాన
ము జేసి పులకిత గాత్రులై నుభయ నేత్రంబు లందానంద భాష్పం
బులు రాలఁగ తటస్థులై వినుచుండిరి. మనసునకు విషయముల
యందు ప్రీతి తగ్గితే సహజముగా మఱపుకలుగును అటువలెను
నామదేవులు భగవద్ధ్యానమున తన దేహము మఱచియుండుటచే విను
టకు వచ్చినవారుకూడ యిదేస్థితిని పొందియుండిరి. ఆసమయమున
నాసన్నిధి పూజాపరులు స్నానసంధ్యా ద్యనుష్ఠానంబులు ముగించి

వారి వారి సర్వాంగములయందు బస్మధారణము జేసి రుద్రాక్ష మాలలను కంఠమునధరించి మడివస్త్రధారులై లఘ్యోదకమనెడి శివ పూజార్హ్యముగా బ్రాహ్మణులు తీసుకొనిపోవు తీర్థము నొక కరము నిడి పూజాద్రవ్యముల మఱియొక హస్తమందుంచుకొని శ్రీకైలాసపతి యగు సాంబశివమూర్తికి అభిషేకము చేయుటకై సన్నిధిద్వారమున వచ్చుచుండఁగా నచ్చట భాగవతాగ్రగణ్యుండగు నామదేవులు జేసె డి భగవన్నామ సంకీర్తన కుతూహలంబును వినుచుండెడి మహాజ నంబులు ఆహాయని మైమఱచి చిత్రప్రతిమలవలె నాద్వారమున మరు గుబడి యుండుటయును గని విప్రులు తెచ్చినపూజా ద్రవ్యములు తీర్థము లోగొనిజనుటకు దారిలేకయుండెను బైటికిమాత్రము స్నాన సంధ్యాద్యనుష్ఠానంబులుముగించి తులసి రుద్రాక్ష నళినాక్ష మాల లనుధరించి శైవ వైష్ణవ వేషముల చక్కగాదిద్ది తమతమ హృద యాల యంబుల రాజసతామస అరిషడ్వర్గాదులనే దుర్మార్గుల పొందు విడనాడక మనసుపొమ్మోడి పోకనపోవుచు క్షణికెములో మహత్తైన పాపంబుల నార్జింపు చుండెడి యా బ్రాహ్మణులు యాజ నసమూహామునుజూచి మేముమడిగాయున్నాము ఈశ్వరుని పరిచా రకులము మమ్ముతాకవలదు తాకవలదు అని మసువుచు యెదపడి నిల చియుండిరి. ఎప్పుడున్ను శ్రీహరికీర్తనంబు జేయువారికశిద్ధములేదు అలాగే బ్రాహ్మణులు సభజేరుస్థలములు శ్రీవిష్ణుదరిశన స్థలంబులు యెప్పుడున్ను అశుద్ధము లేదు. అని అనేకప్రమాణములు ఘోషించు విషయముల నెఱుఁగక యాబ్రాహ్మణులు మహాకోపాగ్రచిత్తులై ఓ నామదేవా నీవేల నీటుగా పెద్దకూతచే కేకవేయుచు గొప్పభక్తుని వలె జగమెల్ల నెల్లడిజేయ యేడ్చుచుండెదవు దీనిచే యీపూరివాండ్లు భ్రమసి నీమహిమలకు మోసబోవరు నీకూతలు నీయాటలు పాటలు పండరీపురమున ప్రయోజనపడునేతప్ప యిచ్చట నాగనాథేశ్వరుడు



మన్నించి మెచ్చ లేదని చెప్పిరి. అచ్చట వినుచుండిన భక్తులందరు యావిప్రులజూచి మీరలు శ్రీహరి హరుల భిన్నభావముచే దూ షించి వేరుజేయుట మాకెంతమాత్రము సరిపడలేదు. అది యెట్లంటె బెల్లమున్ను దానిమధురమున్ను పుష్పమున్ను దానిసుగంధమున్ను దీపమున్ను దానిప్రభన్ను వేరుచేయకూడనట్లు శ్రీహరిహరుల స్వరూ పంబుల వేరుచేయఁగానేరదు. ఇద్దరి స్వరూపంబొకటిగాన యీ నాగనాథుండు వీరుజేయునట్టి శ్రీహరినామసంకీర్తనల కానంద పర వశ గాత్రుండై నిమీలితనేత్రుండై శబ్దార్థములయందు చొక్కి వినుచున్నాడు చూడుండని చెప్పఁగా బ్రాహ్మలు యామాటలవిని సహింపజాలక పామరులైన మీరలు మాకు జ్ఞానోపదేశము చేసెదరో అట్లు మీవద్ద మేము వినవలసిన పనిలేదు. మేము శాస్త్రాధికారు లము సర్వజ్ఞులము కాబట్టి యీ నామదేవుని సిద్ధాంతమిచ్చట సరి పడదు. ఇచ్చోటు విడచిలేచి యిక యెచ్చోటుకైనపొండు. అట్లు పోనియెడల మర్దించి పంపుదుమనిరి. ఆపలుకులకు మరుత్తరము లే కుండుటఁగని శివపూజకు ఘడియ లతిశయించిన దనిన్ని సన్నిధిలో జొరబడ మార్గములేదనిన్ని ఆబ్రాహ్మలు నామదేవుల వద్దకొచ్చి మహాకోపముతో వీవుపైకొట్టి కీర్తనపాడక జేసి నామదేవుని జూచి వృధాగా యిచ్చోటున నీవేల వాళరుచుండెదవు. శివదరిశనమునే కును శివపూజచేయుటకును మేముపోవుటకు దారిలేక అవస్థపడు చుండఁగ నీవు దేహాభిమానమును లజ్జను విడచి నీయొక్కసిద్ధాంత జ్ఞానమునుజెప్పి కర్మాచారములను ముణుగగొట్టెదవు. సన్నిధి వెనుక ప్రక్కస్థలమున్నది. కాబట్టి నీవక్కడికి వెడలి పాడుకొనియుండుమని చెప్పిరి. నామదేవులు యామాటలనువిని దండముసమర్పించి అలాగే చేసెదనని వినయపూర్వకముగా అచ్చోటువిడచి వెనుకప్రక్క గాజనె ను. గంగతీర్థమునందుమధువునొకచుక్కపడినట్లును దివ్యపరిమళములు

చేర్చిన గంధమున తెల్ల పాయరసంబు జేరినట్లును భగవద్గాన కథారసంబును వినుచుండిన ప్రజలు మతివిసికి చిత్తముత్తరపడి. యిలసత్తులైన నిత్యముక్తులు గైకొన్న శ్రీహరి వ్యత్యస్థపాదమును తమ మస్తకంబుననిడి స్తుతింపుచుండుతఱి మన భాగ్యము యీ విప్రుల రూపముగవచ్చి చెప్పిపోయెనని చింతిల్లుచుండిరి. పిదప నామదేవులు వెనక పార్శ్వమున నే నిలచిభగవన్నామ సంకీర్తనము జేయుచు యాడుచు పాడుచు ఓపతితపావన పరమదయాళా అనాధనాథ ఆనందరూప పుండరీకాక్ష పండరీరక్ష పూతనశిక్ష పాండవపక్ష నిన్ను ధ్యానము చేయఁగ చేయఁగ నీసేవను మరపించి విదేహదేశమున గొనిజని తల్లితండ్రులు లేనిబిడ్డ వొంటరిగా కారడవిన తిరుగు చందంబు విడచి అల్లాడునట్లుచేసితివి. ఇట్టి అవిగ్రహధ్యానంబు నాకిష్టము లేదు. నీ వెప్పటికిన్ని విగ్రహరూపుఁడై సేవసాదింపుచుండవలయును. ఓ పండరీపురినాధ పుండరీకవరద కుండలీసనాథ అండజవాహ శ్రీహరి నన్నేలాగున మఱచి నన్నొంటిగా విడచి నీవు యెచ్చోటున మచ్చికతో సచ్చరితులు నిచ్చలముగా భక్తిచేయువారలజేరి ముచ్చటలాడుచుండెదవు. ఇట్లుండిన యెడల నిన్ను నమ్మిన బాలుండు యేతెఱంగున పొయ్యేది. ఇట్టి విదేహధ్యానము నాకెంతమాత్రంబు తృప్తిలేదు. నీయొక్క స్వరూప రూపగుణ విభూతులయందు అపేక్ష కలిగించి నిన్ను ధ్యానము చేసేటట్లు కటాక్షింపుమని పలువిధంబుల కొనియాడి ఓస్వామీ నీసన్నిధి ప్రాకార గోపుర మంటపములు నాకన్నులారా సేవించువరకు యింద్రియచేష్టలు నన్ను వీడిజనదు. వేగముగా నాకట్టిజ్ఞానము కృపజేయుమని వేడుకొనుచుండఁగ యప్పుడు జగదీశుని మహిమాతిశయములచే స్వర్గమునందుండి నవవిధ భక్తులు నవలక్ష పతాకములుగా దివినుండి భూమండలమున నాగనాథుని సన్నిధిలోపల వెలపల దిగెను. ఆయద్భుతమును ఆశివరాత్రి ఉత్సవ



మునకువచ్చిన ప్రజలెల్లరు సేవించి యానందించుచు విఠలనామమును గట్టిగ నుచ్చరించుచు కరతాళంబులు వేయుచు నృత్యముచేయనారంభించిరి. అప్పుడు యాపతాకములయొక్క కాంతులు నలుప్రక్కల కమ్ముకొని ప్రకాశింపుచుండెను. ఆతఱి నామదేవులు దివినుండి వచ్చుచుండెడి పతాకంబుల సేవించి అద్భుతమొంది శ్రీపాండురంగనాథుని కృపావిశేషంబులందలచి బహువిధముల స్తుతిబూని నాగనాథుఁడు మాత్రము మనకేల సులభంబుగా సేవనొసఁగక విముఖుఁడై యున్నాడని కరంబులముకుళించి ఓనాగనాధస్వామి నేజేసిన యపరాధంబేమి నాయందు కరుణలేదా నిర్దయాపరుఁడవై యున్నావని చింతించి భగవంతుండు సకలసాంబ్రాజ్యముల కొరతలేక మనకిచ్చి నాగనాథుని మాత్రము విముఖునిగా జేసియున్నాడు. దాసునివల్లనేమపరాధము కలిగియున్నదో తెలియదని తనహృదయమున తలచి ఓక్షీరసాగరశయనా లక్ష్మీపతే కరుణాకటాక్ష యమునావిహారా యాదవరాయా నీవు నాపైతొల్లి హస్తినాపురమున తురస్కులు ధేనువును జంపినప్పుడు నాలుగుదినములోపల యా ధేనువునకు ప్రాణంబిచ్చి కాపాడితివి. ఆరణ్యములోన దాహముచే యల్లాడుచుండు నాకై బావినీళ్లను పైకిరప్పించి దాహముతీర్చి కాపాడితివి. అట్టివాడు నీవిపుడు నామొఱ వినకుండుట కేమికారణము నాప్రక్క వీపుజూపి స్వస్తముగా గూర్చున్న నాగనాధస్వామిని నాయందుకరుణ గలుగునటుల జేయింపుమని ప్రార్థింప తూర్పుజూచిన దేవాలయము పడమట దిక్కుగ తిరిగిపోయినది. వీటినిజూచిన ప్రజలు భక్తులు యీదినంబు శుభదినంబని తాళమృదంగవాద్య ఘోషతో కరతాళములు వేయుచు భగవన్నామోచ్చారణజేసి అత్యానందంబును జెందిరి. అప్పుడు ఉమాపతి నామదేవునియొక్క భగవన్నామ సంకీర్తనలను వినుచుండెను. ఇంతలో సూర్యోదయమైనందున బ్రాహ్మణులు పూజప్ప

నస్కారంబులు ముగించి స్నానార్థమై బయిటికిరాగ సముఖమున నామదేవుల భజనయుండుటజూచి ఈదేవాలయమున్ను నాగనాథ స్వామియున్ను పడమటముఖముగా తిరిగియున్నదని తెలుసుకొని ఆహా యిదేమి యాశ్చర్యము. ఈ మహాభక్తునియొక్క మహిమాతిశయముల తెలియక తలక్రిందైపడి నామదేవులను దూషించి కర్మచండాళులైతిమని తమ్ముతామే నిందించుకొని యీ పాపంబులు పోగొట్టుగొనుట కేయుపాయంబని చింతిల్లి వారి చరణారవిందంబులే ఆశ్రయించుట మేలనిదలచి అనుతాపముతో నామదేవులవద్దజేరి ఓస్వామి నీవుధన్యుడవైతివి. నీయట్టిభక్తాగ్రగణ్యుని కసివిని యెఱుగము. ఎన్నడుచూడనిది విననిదియైన సైగను యీదినము నీవుచేసితివి. మిమ్ముగన్న తలితండ్రులు యెంతటిఘనులో యెంతటి మహానుభావులో యని ననేకవిధములుగా స్తోత్రముజేసి దీర్ఘదండప్రణామంబులిడిరి. నామదేవులు ప్రతివందనముతో భగవంతుని కృపారసంబు యిటువంటిదని జెప్పుటకు నోరాడక పండరీనాథునికి హారతి నొసంగి దండముసమర్పించి భగవత్ప్రసాదములు అచ్చట వచ్చియుండు వారందరికిన్ని పంచిపెట్టుచున్నప్పుడు అందరుచూచుచుండ స్వర్గమందుండివచ్చిన పతాకములంతయు దివిమార్గంబుగ పోవుచు మరిగెను. ఇప్పుడున్ను నా యాలయంబు పడమట ముఖముగా తిరిగియున్న ఆనవాలు కనబడుచున్నది.

పిమ్మట నామదేవుజ్ఞానదేవులిద్దరున్ను శ్రీకైలాసపతిని నమస్కరించి అచ్చోటువిడచి భగవన్నామస్మరణజేయుచు శ్రీపండరీపురమునకు వచ్చుచుండిరి. స్వశ్రుగృహమున వాసముజేసెడి కోడలు తన తల్లిగారింటికి చనునపుడు సంతోషించునట్లు యతి యుల్లాసముగా భగవద్గుణానుభవముజేయుచు నడచి నడచి వచ్చుచుండఁగ దారిలో విమాన గోపురమంటపంబులు దరిశనంబు కాగానే నామదేవులు శ్రీ



పండరీనాథాయని భూమిపైబడి సాష్టాంగదండప్రణామంబులిడి లేచి బహువినయముతో భగవన్నామము జపించుచు సన్నిధిలో ప్రవేశించి. దీర్ఘదండంబిడి కాష్ఠమువలె భూమిపైబడియుండెను. జ్ఞానదేవులు వారిని లేపి కరముపట్టుకొని మంటపమునకుచనగా నామదేవులు మఱిన్ని ప్రణామంబిడి గర్భగృహముజేరి భగవంతుని చరణకమలములయందు తనమస్తకమునిడి ఉభయపాదంబుల నుభయకరంబుల బట్టుకొని నేత్రంబులనొత్తుకొని లేచినిలచి కనులానంద భాష్పముఁరాలఁగ గద్గదస్వరముతో ఓస్వామి మిమ్ము విడచిన తరువాత దాసుడుదూడను విడచిన ధేనువు చందము నల్లాడుచు బహుతొందరల ననుభవించితిని. ఓపండరీనాథా నాతాపంబు తీరునటుల నీకృపాదృష్టిచే దాసుని కటాక్షింపవలెను. అనేక దేశంబులు పట్టణంబులు పురంబులు పల్లెలను చుట్టిజూచితిని. ఈపండరి క్షేత్రమునకు సమానముగా కానబడలేదు. అనేక దివ్యక్షేత్రములయందు గొప్ప గొప్పసన్నిధులను భగవత్స్వరూపంబులను సేవించితి. నీసన్నిధివలె నీరూపునీగుణంబులవలె మెచ్చుటను నాకుకనపడలేదు. అనేకపుణ్యతీర్థంబులదర్శించి గృంకితి అయితే మనచంద్రభాగనదిని సేవించి స్నానముజేసినట్లు ఆనందముకలుగలేదు. ఎచ్చటికిపోయినను యీపండరీక్షేత్రమనితలచితినియేభగవంతుని సేవించినను కన్నులుమూసి నీరూపంబును తలచితిని. ఏనది యందు స్నానముచేసినను చంద్రభాగ నదియని స్నానముజేసితి ఎచ్చటయుండినను పండరిక్షేత్రమందుండినట్లు భావించితిని. కాబట్టి నీవునాకు ప్రియమిత్రుడవు బంధువు ఆప్తుఁడు నాకులదైవము నిన్నువినా నాకు గత్యంత్రము లేదని నుడివి మౌనముగా నుండెను. వాటికి భగవంతుఁడిట్లనియె కృపాకటాక్షముతో నిన్ను క్షణమైన నేను మఱచియుండలేదు. నాదేహము యిచ్చటయుండెనుగాని నాయాత్మాత్మీకములు నీయందు లోలలాడుచునుండెను. నిన్నుగాంచిన తరు

వాత నామనంబు తృప్తింజెంది యున్నదని తన కంఠమునయుండిన తులసీహారమును నామదేవుని గొంతులో వేసెను. అప్పుడచ్చట అనేక భగవద్భక్తులు ప్రజలు గుమిగూడియుండిరి. వారందఱున్ను కరతాళములతో జయజయ శబ్దంబుల ఘోషింపుచు సంతోషచిత్తులై భగవంతునికిని యీభక్తునికిని హారతులనెత్తి మంగళాశాసనములు జేసిరి.

వెనుక భగవంతుఁడు నామదేవుని కటాక్షించి నీవు సమస్త తీర్థయాత్రలను జేసి జన్మసాఫల్యముచేసుకొంటివి. అయితే అది పూర్తి యగుటకు వుద్యాపనమును తదియారాధనము చేయవలయును. ఒకడు పురాణశ్రవణము జేసితే వాటియందు గమకమైన అర్థవిశేషంబుల మననము చేయవలయును. అట్లు చేయనట్లైతే బూడిదయందు విడిచిన ఘృతచందము వ్యర్థమగును సప్తపురి మొదలైన దివ్యదేశముల సేవించి వచ్చితివిగాన వాటికి శాంతి చేయవలయునని జెప్పి రుక్మిణీదేవివద్దకు వెడలి నామదేవునకును నాకును ప్రీతియతిశయించి యుండుటచేత వీని యాత్రనుపూర్తిచేయించిపెట్టుటకు నీవున్ను సహాయమైయుండవలయు ననఁగ రుక్మిణీపిరాట్టి ఓస్వామి నామదేవుడు యావత్తున్ను విడచి మిమ్ము ఉపాయోపేయముగా నీతిరువడి బట్టియుండ మిమ్ము వినాహా యతనికి యీ కార్యమును ముగించిపెట్టుటకు యెవరు సమర్థులైయున్నారు. అష్టసిద్ధులున్ను అణిమాద్యైశ్వర్యములున్ను తమ కనుకూలమైయుండఁగ యేమికొదవ యిచ్చట యుండును. గనుక నీవె నామదేవునితోచని తధియారాధనకు రమ్మని బ్రాహ్మణుల పిలచిరండు. ఇచ్ఛామాత్రమున భగవంతుడు యేమికార్యము చేయజాలడు. గనుక పండరీనాథుండు యొక బ్రాహ్మణ వేషధారియై తన భక్తులను కూడబిలుచుకొని పండరీపురమును వలగొనుచు అగ్రహారముజేరి బ్రాహ్మలకు దండమునమర్పించ వారలు యితని తేజోవిశేషంబులజూచి యితడు సామాన్యబ్రాహ్మణుడుగాడు ఇతడెవడో



మహాత్ముండని తెలుసుకొని సంతోషపడి మిమ్ముదర్శించినంతనే త్రివిధ పాపంబులు పరుగులిడెను. అదిపోని మీపూరేది పేరేమి మీరు చేసెడి వ్యాపారంబులేవి ఎచ్చోటున దిగియున్నారని యడుగఁగ భగవంతుఁడు వారలనుజూచి నాపూరు నాపేరు నావృత్తి యీభక్తులెఱుగుదురు. నేను అసంగతుఁడై యుండినను వారలకు నన్యుడుగాను నామదేవుని హృదయమునకు ప్రియుండు. నేను సన్నిధిలో నుండువాడను నాపేరు అనంతుడనియందురు. రేపటిదినము స్నానసంధ్యాద్యనుష్ఠానములు ముగించి శంకవీడి భోజనమునకు రావలయునని ప్రార్థించి మఱిన్ని యీలాగే బ్రాహ్మణ వీధియంతయు తిరిగి తిరిగి గృహాగృహంబు ప్రవేశించి చెప్పుచు సన్నిధిలోజొచ్చి రుక్మిణీ పిరాట్టినిగని నడచిన వృత్తాంతమెల్ల చెప్పి మరుదినము రుక్మిణీ పిరాట్టి తళిగె చేయుట కెత్నించెను. ఇచ్ఛామాత్రంబున అష్టసిద్ధులును దాసీజనములవలెవచ్చి పిరాట్టి హృదయంబెఱిఁగి సర్వవిధ భక్ష్యభోజ్యాన్నంబుల సిద్ధపఱచిరి. కొందరు గృహద్వారములయందు అలికి రంగవల్లులచే అలంకరించి వీథులు మొదలైన స్థలంబులయందు నతినూతనమగు తోరణధ్వజములచే నలంకరించిరి. అప్పుడుపుణ్యాహవాచనము చేయుటకు రుక్మిణీ సత్యభామ యిరువురున్ను నామదేవునికి మంగళస్నానము చేయించిరి. శ్రీపాండురంగనాథుఁడు నామదేవునికి విశేషముగా వస్త్రభూషణాదుల ధరింపజేసి అలంకారాసనమున కూర్చుండబెట్టెను. అచ్చట విచ్చేసియుండు బ్రాహ్మణోత్తములందరు ఈ నామదేవుఁడు యెంతటి పుణ్యాత్ముండో పూర్వజన్మమందు వీడెంతటినోము నోచెనో యనికొనియాడుచుండిరి. ఇంతలోపల సర్వవిధ ఫలహారములతో అన్నముపప్పుకాయకూరలు పలహారములు సిద్ధముగా యుండుటచేత గృహస్థు వేషధారియైన శ్రీపాండురంగడు బ్రాహ్మలబిలచి యాసనంబులపై కూర్చుండజెట్టి వారి తిరువడిఘుళును తీర్థముచే శుద్ధి

జేసి పీతాంబరముచే తుడిచివారి పాదాబ్జముల తనకన్నుల నొత్తు
కొని శ్రీపాదతీర్థము స్వీకరించి బంతి బంతిగా కూర్చుండబెట్టి తులసి
నళినాక్ష మాలలను వారి వారి కంఠములయందు ధరింపజేసి కస్తూరి
తిలకము వారి వారి నొసటనుంచిరత్నదీప జ్యోతిని ప్రకాశింపజేసి దీప
ధూపాదులచేత పూజించి రుక్మిణీదేవి గృహస్థురాలువలె మారువే
షముధరించి స్వర్ణపు అరటియాకులు లోకరి కొకరిముందుగా సమ
ర్పించి సర్వవిధ భక్ష్యభోజ్యాన్నంబుల వడ్డింపఁగ భగవంతుఁడు నామ
దేవుని పిలుచుకొని వారికరములచే సంకల్పముచేయించి భక్తులందరు
జయజయ శబ్దంబులుజేయఁగ భోక్త రుక్మిణీపతియని ఆపోసనముచే
సిరి. ఎచ్చోటున భగవంతుఁడు కర్త భోక్తగాయుండునో అచ్చో
టున యేపదార్థమున్ను తక్కువపడదు. బ్రాహ్మలందరున్ను కవ
ళకవళమునకు అచ్యుతనామంబుజెప్పుకొనుచు సుఖముగ భుజించి
యానందమొందిరి. పిదప భగవంతుఁడు వారల కరచరణంబులు
శుద్ధిజేసుకొనుటకు జలమునొసఁగి రత్నజమకాళము పఱచి వాటి
పైకూర్చుండబెట్టి చందనతాంబూల కుసుమంబుల నొసఁగి ఉభయ
కరముల ముకుళించి మీరందఱున్ను చూచుచుండఁగ మేము భుజిం
పవలయును గాన స్వస్థచిత్తులై కొంత తడవు వేంచేసియుంటిరేని
మేము భుజించిన తరువాత వచ్చి దక్షిణలొసెగదము. అనివేడుకొ
నెను. అందుకు వారలుసమ్మతించి భగవంతునిజూచి అయ్యామీ
రు అతివ్యాపకులై కార్యసాధనమును చక్కగా చేసితిరి. కొరతలే
మిలేక అన్నముంచి అతి యాదరమున యాదరించితివి. మీయొ
క్క అణుకువ గౌరవము మిమ్ముపొందియున్నది. మీరుసర్వకాల
మున్ను జయముపొందినవారై మావంటివారిని పరిపాలనముజేయఁగ
లరు. ఆకల్పపర్యంతము జీవించియుందురుగాకయని ఆశీర్వదించి అక్ష
తలొసఁగిరి. భగవంతుఁడు తన పీతాంబరమున తీసుకొని కొంగు



నముడివేసెను, పిదప బ్రాహ్మలు భగవంతుని భోజనమునకుపొ
మ్మని సెలవిచ్చిరి. రుక్మిణీపిరాట్టి సకలపదార్థములను దెచ్చెను
భగవంతుఁడు తనభక్తజనులతో కూర్చుండెను. అప్పుడు నామదే
వుడుమాత్రము రానందున తానేలేచి వారిని వెతకుచు సన్నిధి
లో జొచ్చి జూడఁగా స్మరణతప్పి నొకమూలయందు పడియుం
డెను. వారికరంబులబట్టి వారిని జాగ్రతావస్థ పొందునటులజేసి.
దోడుతెచ్చి భోజనమునకు ముందుకూర్చుండబెట్టెను. మఱిన్ని
యతడు భగవన్నామానంద బోధలోజొరబడి దేహమునుమఱచియుం
డెను. ఈస్థితిని భగవంతుఁడుజూచి నీవు నాకన్యుడుగావు. కన్నుల
తెఱచిచూడుము. ఇప్పుడిచ్చట అనేకభక్తులు భోజమునకై కూర్చుం
డియున్నారు నీవునోరుతెరచి అమృతవచనంబులకొన్నిటిని వచి
యింపుమని చేతులనుబట్టగా నామదేవుఁడు వారితిరువడిఘళులయందు
తనశిరంబును పడవైచి ఓ శ్రీపాండురంగనాథ జన్మజన్మములయందు
యిట్టిప్రీతినాకుండునటులనున్న నాయందు యిట్టివాత్సల్యతకలిగి
యుండునటులను కృపజేసి రక్షింపుమనెను. భగవంతుఁడు ప్రీతివిశేష
మున నామదేవునకు తనకరములచే అన్నముతినిపించుచు అధర
మునం దంటుకొనునటువంటి అన్నమునుతుడుచుచు ప్రీతితో తల్లిబిడ్డ
లకు తినిపించునట్లు అత్యంతప్రీతితో మాటలాడుచు కరుణారసము
జారఁగ నామదేవును భుజింపజేయింపుచు బహుప్రీత్యాతిశయముచే
యా యుచ్ఛిష్టప్రసాదమును భగవంతుఁడు అతిభోగ్యముగా భుజిం
చెను. ఆ విశేషంబుల బ్రాహ్మలందరుజూచి అధోముఖులైనట్టి
వారై యిక యేమిచేయవచ్చును. ఈయెజమానునియొక్క స్వపత్ని
మనకు అన్నమువడ్డించెను. ఇది యేమిజాతియో తెలియకపోయెను
వాడు నామదేవునియొక్క యెంగిలి అన్నమును భుజించెను కాబట్టి
వానికి తండ్రిగానుండవచ్చును. వానియందధిక ప్రీతిజూపి ధర్మము

నకు విరోధముగా నడచినాడు. మనయొక్క కులాచారధర్మమునకు విరుద్ధము కలిగినది. అయితే వీరిసంగతులు స్పష్టముగా మనము తెలుసుకోక వీరింటగుడిచితిమి గనుక యీదోషము ప్రాయశ్చిత్త మూలముగా నివర్తిచేసుకోవలయును. పిమ్మట బ్రాహ్మణగృహస్థు నికి జాతికట్టు చేయవలయుననియెంచి వారువారు మౌనముగా తమ తమ గృహములకు వెడలుటకెత్నము చేయఁగ భగవంతుఁడు 'వార లనుపిలిచి తిరుతుళాయి దళములలో స్వర్ణములనుంచి దానమొసఁగి నామదేవుని వారివారిపాదములపై పడవేసి ఓబ్రాహ్మణోత్తము లారా యీనామదేవునిపై కృపయుంచి రక్షించవలయునని పలువిధ ముల వేడుకొనగ యాబ్రాహ్మలు భగవంతునిజూచి ఓ అయ్యా యీ నామదేవుడు క్షుద్రపుజాతివాడు నీవు అటువంటివానిని కూడ బెట్టుకొని సాపిడినదిగాక వాడియెంగిలి అన్నముకూడ నీవు తిన్నావు. నిన్నుజూడఁగ శుద్ధవేషధారివలె కనపడుచున్నావు. నీవు వర్ణాశ్రమ ధర్మముల చక్కగా యనుష్ఠించిన వాడవని తోచబడలేదు. నీవు సర్వ వేదవేదాంగముల నెఱిఁగిన వానివలె కొంగ నటింపులు నటింపుచు న్నావు లోకమందు ఒకొక్క బ్రాహ్మలున్ను శృతిస్మృతీతిహాసాదు లయందు జెప్పబడియుండు వర్ణాశ్రమధర్మములను తాముతాము యను ష్ఠించియితరులను యనుష్ఠింపచేయుట స్వధర్మంబు యిట్టికార్యములను వదలబెట్టి నామదేవునిపై ప్రీతికలిగి చేయరాని పనిజేసి దురభిమాన ముచే మమ్ముల భ్రష్ఠులగునటుల జేసితివని బహునిష్ఠూరపుమాటలచే నందరున్ను యేక కంఠముగా జెప్పిరి. భగవంతుఁడు యీవచనంబుల విని ఓబ్రాహ్మణోత్తములారా నామదేవునితో కలిసి భుజించితివని వాని యెంగిలి అన్నము తుడిచితివని మీరలు నిందించెదరు. అట్టి నిందలు నన్నేమియుజెందవు. అదేమనఁగా “జన్మనాజాయతే శూద్ర కర్మణా జాయతేద్విజః, వేదపాఠంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు



బ్రాహ్మణః” అనునట్లు యీ నామదేవుండు బ్రహ్మజ్ఞాని గనుక వీరితోకలిసి యెట్టిబ్రహ్మవేత్తలును భుజింపతగును. అట్లుగాక బ్రహ్మ కులమునందుమాత్రముపుట్టి నిత్యకర్మానుష్ఠానముల చక్కగాజేసెడి వాడైనను బ్రహ్మజ్ఞానములేనియెడల వాడు ఛండాళుడగును. అట్టి వానితోకలిసి భుజించినవారలు నరకము బొందుదురు. ఈ నామ దేవుని క్షుద్రపువాడని కేవలముగా చెప్పుచున్నారు. అందరిదేహము వలెనే అతనిదేహమున్ను పంచభూతములతోచేరియున్నవి. గాన అతని అవయవములయందు దేనికి నామదేవుఁడని పేరుపెట్టుదురు. పృథివిమొదలైన భూతములలో దేనికి దోషముల కల్పింతురు. మీరలు వేదములను చదువనివారైనను బ్రహ్మనిష్ఠా లక్షణములనైన చూడ లేదు. భేదాభేదములనెడు లోకభ్రాంతి మీకు యింకాపోలేదు యుండని మీరాపోశనము చేయుటకుమునుపు నామదేవుడు సంకల్ప ముచేయఁగ అప్పుడు మీరలు యీనామదేవుఁడు సంకల్పముజేయు టకు అధికారికాడని యేలమీరు ఆక్షేపనచేయకూడదు నామదే వుఁడు బ్రహ్మజ్ఞానిగనుక యతఁడు బ్రాహ్మణుడని చెప్పబడుచున్నాడు ఇవిగాక శ్రీపాండురంగనాథునికి ప్రియభక్తుడుగనుక అతనివిషయ మున శంక చేయుట అవశ్యములేదు వాచామగోచరుఁడైన పరబ్రహ్మ మును యెఱుఁగునటువంటివారు బ్రాహ్మలని వేదముచెప్పుచున్నది అట్లుండ ఈ నామదేవుని కులమునుపట్టి విచారించుట అధర్మము. అజ్ఞానాంధకారమునమునిగెడి బద్ధసంసారులు దేహమునకు బ్రాహ్మ ణత్వమనిజెప్పుదురు. భగవంతుని పాదభక్తులచరణరజస్సుచే జగ మంతయు పావనమౌచున్నదని సకలశాస్త్రంబులును పురాణంబు లును మొఱబెట్టుచున్నది పెద్దలుగూడ యేతత్ పర్యంతము వక్కా ణింపుచున్నారు. మేలైనజ్ఞానము మహత్తైన వైరాగ్యము విశేష మైన భక్తిగలిగి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యముల

పీడద్రొక్కి తన హృదయమున భగవద్దివ్యమంగళ విగ్రహమును స్థాపించి సర్వదాచింతింపుచు తానుసంచరించు చోట్లెల్ల పవిత్రముగాజేసి సర్వకాల సర్వదేశములయందు శ్రీమన్నారాయణుని దివ్యచరణారవింద మరందపానానంద మత్తచిత్తులైనట్టి మహాభాగవతుల ప్రసాదము యీ దినము నాకు భాగ్యవిశేషముచే అమృతతుల్యముగా లభించెను. పైచెప్పినటువంటి భక్తులలో శ్రేష్ఠుడైన నామదేవుని జ్ఞానభక్తివైరాగ్యములు నేనెఱిగియుండుటచే అట్టివారి ప్రసాదమును స్వీకరించితిని నాకు లేశమైన దోషములేదు. ఇక నడవవలసిన కార్యములను తెలియచెప్పుండని బ్రాహ్మలను యీ వేషధారి యడిగెను. అందుకు బ్రాహ్మలందరు భగవంతునిజూచి నీవు సద్గుణ సంపూర్ణుండవు శాస్త్రార్థములను చక్కగా తెలుసుకొన్నవాడవు. బ్రాహ్మలకు ఆచారము ప్రథమధర్మము. ఆయాచారము యేమియనఁగ ఒకరిని హింసచేయకుండుట పంచేంద్రియ నివర్తకుఁడై యుండుట సర్వభూతములయందు దయయుంచుట తనకు అపకారము చేసెడి వారితప్పుల క్షమించుట రాజసతామసముల వర్జించి శాంతుఁడై యుండుట నీమపరుఁడై యుండుట కాలము వృథాపుచ్చక భగవధ్యానపరుఁడై యుండుట అబద్ధమాడకుండుట సత్యమందుదృష్టి దేవార్చన జపము హోమము శాస్త్రాధ్యయనము అతిథిపూజ పురాణశ్రవణము కులాచారధర్మము యదాలాభ సంతుష్టి యివియావత్తున్ను బ్రాహ్మణధర్మముగా వేదములయందు చెప్పబడియుండుటచేత అట్టిధర్మంబులవిడచి అపమత్తుఁడై అధర్మమైన అనాచారమనుష్ఠించుట తగని కార్యముగాన నీవు అనుతాపముచేత జగమెల్ల నెఱుఁగునటుల దేహాభిమానమునువిడిచి ప్రాయశ్చిత్తముచేసుకొనవలయును. దానికి మొదట పండరీక్షేత్రమును వలగొని భక్తితో భీమానదియందు స్నానముజేసి అనేక బ్రాహ్మ



లకు దక్షిణతాంబూలాదులొసఁగి ప్రదక్షిణంబుజేసి దండముసమర్పించినట్టయితే, చేసిన పాపంబులు నశించుననిరి. వీటినివినిన బ్రాహ్మణవేషధారియైన శ్రీపాండురంగడు యీ బ్రాహ్మలనుజూచి యిట్లనుచున్నాడు. శ్రీహరికథవినుటయు ఆత్మనునెఱుఁగుటయు జగమంతయు శ్రీహరిమయమని యుండుటయు ఆశాపాశముల అణుగంటగోయుటయు యివియన్నియు పరిశుద్ధస్థానములని చెప్పబడుచున్నది ఇట్లుండ కేవలజలస్నానముచే పాపక్షయముకానేరదు. శ్రీహరినామంబును సాధుసేవయును సదాచేయుచుండువాఁడు పుణ్యమూర్తియగునని నుడువుచు భక్తజనములతో నదీగట్టుఁజేరి స్నానముజేయుచుండఁగ బ్రాహ్మణజనులందరుగూడి ప్రాయశ్చిత్తవిధులను చేసి ముగించిరి. శ్రీహరియొక్క సౌలభ్యగుణములకు దేవతలందరు జూచి సంతోషచిత్తులై గగనమునందుండి పుష్పవృష్టి గురిపించిరి. పెదవుల్లో చిరునవ్వుగల ముఖముతో యిటువంటినటనముల నటింపుచు నతివైభవముతో భక్తులందరు తనవెనుకరాగ భగవంతుఁడు మన్మథ మన్మథాకారుఁడై వీరలకు సేవనొసఁగుచు సన్నిధిలో ప్రవేశించెను. మరుదినవుదయము విప్రవరులకు భోజనము పెట్టుటకు వుద్దేశించి. గృహస్థుని రూపముగా వారందరిని బిలిపించి రుక్మిణీ పిరాట్టి వద్దకువచ్చి ఓప్రాణసఖి నీవతిశీఘ్రుంబుగా పంచభక్ష్యాన్నంబులి సంస్కరింపుమని యాజ్ఞాపించెను. అప్పుడు రుక్మిణీదేవి సర్వపదార్థములు సిద్ధమైయున్నదని వక్కాణించెను. బ్రాహ్మణజనులు యీమాటలవిని అతిశీఘ్రుంబుగా స్నానసంధ్యాద్యనుష్ఠానంబుల ముగించి వచ్చిరి భగవంతుఁడు విధియుక్తముగా వారలపూజించి తనకరంబులచే కస్తూరి తిలకములను వారినొసటదిద్ది పుష్పహారముల వారికంఠంబున ధరింపజేసి వారిపాదజలంబులు తనశిరంబున ప్రోక్షించుకొనియె. రుక్మిణీదేవి ఆసమయంబున ఆకులువేసి అందున సర్వపదా

ర్థంబులు ఫలహారంబులు అన్నము వడ్డింప ఆవిప్రోత్తములందరు
హరినామోచ్చారణచే. ఆపోశనముజేసి, శ్రీహరియే భోక్తయని
స్తుతించి భుజించుట కుపక్రమించిరి. అప్పుడు బంతివిచారణ శ్రీపాండు
రంగడు విచారింపఁగ బ్రాహ్మలందరుతృప్తిగా భుజించి లేచిరి. తరు
వాత కరచరణములు గడుగుటకు జలమునొసఁగి నొకరత్నజమకాళ
ము పఱచి అందుపై కూర్చుండబెట్టి చందన కుసుమ తాంబూలాదు
లొసంగి వారలను సంతోషపఱచి వారి యనుమతింబడసి తా మార
గించుటకు వెడలునపుడు నివృత్తిదేవు నామదేవు సోపానదేవు నరహరి
విశోభాకేసు రాకాకుంభార్ గోరాకుంభార్ చోకామేళు మొద
లగు తనప్రియభక్తులకు మంగళస్నానంబులు జేయించి పీటలు వేసి
కూర్చుండబెట్టి వారితో సమబంతిగా దానుఁగూర్చుండి శ్రీరుక్మిణిం
జూచి వడ్డింపుమనఁగా శ్రీరుక్మిణిదేవి సత్యభామ రాధ వీరుముగ్గురు
జేరి అరటియాకులు వేసి సర్వవిధ పదార్థంబులును భక్షణంబులును
వడపాయసాన్నంబులును వడ్డింపఁగా అప్పుడు వీరందరు సద్రసోపే
తంబుగా నారగించి కరచరణాదులు ప్రక్షాళనంబు జేసుకొనిరి. పిదప
భగవంతుఁడు యాభాగవతులారగించిన శేషప్రసాదరసంబుల మహ
దానందభరితుఁడై తన్నుమఱచి భుజింపుచు మిగతప్రసాదము వుభ
యకరంబుల నిడుకొనియుండిన బ్రహ్మప్రసాదమని భక్తులందరు
నైకొని స్వీకరించి ఆనందభరితులై గానంబుచేయుచుండిరి. ఇది
యా బ్రాహ్మణులు చూడఁగా వారికి కనుపడక మఱిగిభుజించిరి.
ఇట్లు భక్తులందరు నారగించిన తరువాత శ్రీపాండురంగనాథుఁడు
తనపీతాంబరముచేత వారలనోళ్లనుదుడిచి వీరలకు ననేకవిధంబుల
యిన యుపచారంబులు చేయుచుండఁగా యిట్టివాత్సల్య సౌశీల్యా
దిగుణంబులచే ప్రకాశింపుచుండెడి భగవంతునిజూచి బ్రహ్మరుద్రాది
యఖిలదేవతలు దివినుండి సేవించి ఆహాహా యిదేమి యాశ్చర్యంబు



యిట్లుభగవంతునిగూడి మనమేకాలమందైనా ననుభవించియుండమే
వీరలభాగ్యవిశేషం బెట్టిదని మహదానందంబునొంది పుష్పవృష్టిగురి
పించిరి. ఇట్టి కోలాహలసమయమునందచ్చటవిచ్చేసియుండు బ్రాహ్మ
ణులకు నొకగొప్ప ఆనందము నిష్కారణముగా కలిగెను. వీటి
కేమి హేతువని విచారింపుచుండఁగ వారికెదుట నుండెడి బ్రాహ్మణ
వేషధారినిజూచి యీతడు గృహమునకు నిర్వాహకుండని యెఱిచ
యుంటిమి శ్రీపాండురంగనాథుఁడే యీరూపంబున వచ్చియున్నాడని
యెఱిఁగి యిదివరకు యితని మహిమ తెలియఁగక మానుష ప్రతిభక్తి
చేసి వీణుగా అపచారపడితిమి మఱెన్ని యితనికి ప్రాయశ్చిత్తము
చేయించితిమి. అయ్యో యని తపించుచుండిరి. అట్టి సమయంబున
భగవంతుండు చతుర్భుజాకారుండై కిరీటమకరకుండల హారకేయూర
కౌస్తుభ వనమాల వైజయంతీ పీతవస్త్రధారియై శంఖచక్రగదా
ఖడ్గధరుండై నవరత్నఖచిత మణిమయ భూషణ భూషితుండై కోటి
సూర్యప్రజ్వలిత మన్మథమన్మథాకారుఁడై యతి మనోహరుండై
సేవనొసంగె. యీవైభవమంతయు బ్రాహ్మణోత్తములు సేవించి వల
గొని దీర్ఘదండప్రణామంబులిడి యిదివఱకు నారలకు గలిగియుండిన
యీర్ష్యాదులుమాని సేవించిరి. పిదప ఓస్వామి మాయందుండు
దేహాభిమానతత్వంబును అహంకార మమకారాదులగు యీషణత్ర
యాదులను పోగొట్టి జ్ఞానభక్తి వైరాగ్యంబులొసంగి దేవరవారి
పాదపద్మంబులయందు నిశ్చలమైన భక్తిగలిగించి తమ తిరువడిని
యాశ్రయించినట్టి భగవద్భక్తులయందు మాకు విశేషప్రతిభక్తికలగ
జేసి రక్షించవే ఓపాండురంగ పండరినాథ పుండరీకాక్ష పూతనశిక్ష
అండజవాహ ఆశ్రితమోహ కుండలిశయనా కువలయనయనా శ్రీ
హరి కృష్ణ నరహరి విష్ణో నారాయణాయని బహుప్రకారంబుల స్తుతి
జేసిరి. భగవంతుడా ప్రార్థనలనామోదించి ఓ బ్రాహ్మణోత్తము

లారా స్థలాభిమానము కులాభిమానము దేహాభిమానంబుల విడిచి నాభక్తులయందు జాతినీతులెంచక వారలను కులదేవులుగా భావించి పూజించి మోక్షము జెందవలెనేగాని వేరేసదుపాయంబు లేవు. గాన యీ నామాటలను గట్టిగా నమ్మిడీ ముకుందుని నామామృతంబు సదాగ్రోలుచు భాగవతులసదా ఆరాధింపుచు కాలంబును గడిపితిరేని యీసంసార సాగరమునుదాటి పునరావృత్తిరహితమైన మోక్షంబుమీకు తప్పకసిద్ధించును. ఇది యేమీకు నతిసులభంబైనమార్గంబు కాబట్టి మీకునిప్పుడు నిజంబును జెప్పితిని మరియు మీకు కావలసిన అంశంబులు నామదేవునివద్ద తెలుసుకొనవచ్చును. వారు మీకు జెప్పుదురని చెప్పి అంతర్హితుండయ్యెను. తర్వాత జ్ఞానదేవులు వారలకు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించి వారలంగూర్చికొని యేకకంఠంబుతో జయజయశబ్దంబులు ఘోషింపుచు శ్రీపాండురంగని సౌందర్య సౌకుమార్య సౌలభ్యంబుల వర్ణింపుచు భాగవతచారిత్రంబుల సదా కాలక్షేపంబు జేయుచుండిరి. ఇవ్విధంబున శ్రీపాండురంగని యద్భుత మహిమలను నామదేవునియొక్క మహిమలను సదాపాడియాడి ఆనందింపుచుండిరి.

శ్రీపాండురంగాయనమః.

## పీశోబాకేశు చరిత్రము.

జ్ఞానభక్తివైరాగ్యశీలుండగు గోరాకుంబారు అను నామంబువడసి యొక కుమ్మరివాఁడుండెను. అతఁడు తన యధికభక్తిచేత శ్రీగోవిందుని తనకు వశవర్తిగా జేసికొనియుండెను. అట్టివాఁడు పండరిపురంబున నామదేవులు జ్ఞానదేవులు మొదలైన భక్తులం గని వారలకు భక్ష్యభోజ్యాన్నంబుల నిడందలచి వారలసమీపంబునకువచ్చి దండములు సమర్పించి ఓస్వాములారా మీరలు దేహసంబంధములైనవానిని వదలి ముకుందుని పాదారవిందములను ప్రత్యక్షంబుగా



సేవించి మహాశ్రేయస్సును బొందినవారలు. మీరలందరు తమదాసానుదాసుండైన యీ బీదవాని గృహంబునకు గృపచేసి యొకపూటారగించుటకు సమ్మతించి విచ్చేసియుండి దాసుని కృతార్థునిగా జేసి రక్షింపవలయునని ప్రార్థింపఁగా వారలు ప్రియంబుజెంది సంతోషముతోడ నాతడుండు చోటుం జేరిరి. అప్పుడు గోరాకుంబారు మిక్కిలి మక్కువయగు భక్తితోడ నా భాగవతుల తిరువడీఘుళుకు నర్ఘ్యపాద్యాదిపూజలచే నర్చించి యాతీర్థంబును తన శిరంబున ప్రోక్షించుకొనెను. పిదప వారు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులం దీర్చుకొన్నదే వారికాసనంబులిడి వానిపైగూర్చుండబెట్టి వారలారగించుటకు అరటియాకుల సర్వపదార్థంబులనునిచి వివిధాన్నంబులు పరిమారి యారగింపుఁడని వేడుకొని వారందఱు భుజించిన పిదప కరచరణాదులు కడిగికొనుటకు జలంబు దెచ్చియిచ్చి శుద్ధి చేసికొన్నపిమ్మట రత్నజమకాళంబులు పఱచి కూర్చుండబెట్టి చందన కుసుమ తాంబూలాదు లొసంగిన వాటిని వారు ధరించి ఆనందముజెంది నచ్చోటున వేంచేసియున్నప్పుడు వారితో వినోదకరంబులైనకొన్నిసల్లాపంబులు నుల్లాసంబుగ మాటలాడి జ్ఞానదేవులు గోరాకుంబారునిం జూచి అయ్యా నీవు భాండంబులవలె నున్న మమ్మును నీవిచ్చట నుండఁజేసితివి. నీవన్ననో చాతుర్యంబైన కుమ్మరీడుగా నుండి గోవిందునిఁ జూచితివి. ఇచ్చట కాలినకుండ యేది కాలని కుండ యేదియో దానిం బరీక్షించి చెప్పవలయుననఁగా నాలాగే జూపెదనని భాండములను దట్టెడి పలకను చేతనెత్తికొని యచ్చట కూర్చుండిన భక్తులతలలపై తట్టి చూపుచురాగా నందఱును మౌనముగానుండిరి. నామదేవుల శిరఁబును తట్టబోవునపుడు యేల కొట్టవచ్చెదవని యడిగిరి. అప్పుడు గోరాకుంబారు యిదియే కాలని కుండయని నుడివెను. అచ్చట విచ్చేసియుండు భక్తులందరు నవ్వుటకా

రంభించిరి. అప్పుడు నామదేవులతిలజ్జతో తలవంచుకొని చిత్తభ్రిమ కలిగి చింతిల్లుచు నాతక్షణంబె యచ్చోటువిడిచి లేచి వేరుగతిలేదని శ్రీపాండురంగని ప్రక్కజేరి చింతతోడ నేత్రద్వయంబుల భాష్పంబులు ధారలై స్రవింప దుఃఖించుచు పాదద్వయంబుల గట్టిగా బట్టుకొన్నప్పుడు శ్రీపండరినాథుఁడు నీవు మోదంబుమాని ఖేదంబు నొందుటకు గారణంబెద్ది నిన్నెవ్వరేమన్నారని యడుగఁగా ఓ స్వామీ గోరాకుంబారుని గృహంబునందు జరిగిన వృత్తాంతంబులన్నియుం జెప్పెద సావధానంబుగా నాలకింపుమని అచ్చట తనకుగల్గిన యవమానంబులన్నిటిని విశదపఱచెను. అత్తఱి భగవంతుఁడు నవ్వుకొనుచు గోరాకుంబారునియొక్క జ్ఞాన భక్తి వైరాగ్యశీలంబుల కానందంబుజెంది లోకంబునందు ఆచార్యు నాశ్రయించి యనుగ్రహంబునొందకనుండువాడు పరిపక్వంబుగానివాడని పెద్దలు వక్కాణింపుచుందురని చెప్పఁగా, నామదేవులు పెరుమాళ్లను జూచి ఓ స్వామీ దుఃఖనివర్తికై దాసుఁడు దేవరవారి సన్నిధిజేరి వేడుకొన్నయెడల కృపాకటాక్షంబు చేయక మనోదుఃఖంబు పురికొల్పుచున్నారు. నిన్ను కొనియాడుటయు తపస్సుచేయుటయు నిన్ను పొందుటకేకదా. ఈజగతియందందరు నీప్రకారమే తల్లడిల్లుచున్నారు. అలాగే దాసుఁడుగూడ దేవరవారిని బొందినపిదప నాచార్యునివల్ల కావలసినపని యేమున్నదని పల్కగా భగవంతుఁడు చెప్పదొడంగెను. నన్నొకడు ప్రత్యక్షముగాగనుటయు ఆచార్యునియొక్క కృపలేక ఆత్మజ్ఞానము సిద్ధించుటయు మిగుల దుర్లభంబులు. కాబట్టి నేను చెప్పినట్లువినుము. మల్లికార్జున దేవాలయంబున వీశోబాకేశుఁడనువాడొకఁడు వాసంబుచేయుచున్నాడు. అతఁడీలోకమాయను జయించి చిత్తశుద్ధిగలిగి భగవధ్యానపరుండై ఆనందాబ్ధిని మునింగియున్నట్టివాఁడు. నీవట్టివారి నాచార్యునిగా వరియింపవలయునని



చెప్పఁగా నామదేవులు ఓస్వామీ దేవరవారే నాకాచార్యులై యుండవచ్చునేయని చెప్పిరి. దానికి వారు సమ్మతించక యవశ్యంబుపదేశంబుపొందవలయునని నియమించిరి. ఆమాటలనువిని మహాదుఃఖాక్రాంతుఁడై భగవంతుని విశ్లేషము సహింపజాలక నేత్రంబులయందు కన్నీరు వెల్లువలై పార నచ్చోటువిడిచి భగవంతుని యాజ్ఞచొప్పున వారి నామోచ్చారణంబు జేయుచు వారు దెలిపిన యానవాలిచొప్పున నాదేవాలయంబు చేరెను. అప్పుడచ్చట వీశోబాకేశుఁడనువాడు శివలింగంబుపై తనకాళ్లనుంచి కన్నులుమూసికొని నిద్రపోవురీతిగా నాయాలయంబునందు నటింపుచుండెను. అచ్చటికి వచ్చిన నామదేవులు వారింజూచి శంకజెంది యిదేమాశ్చర్యంబు, ఈలాగున శివలింగంబుపై తనకాళ్లను బెట్టుకొని నిద్రించువానినాచార్యునిగా వరించుమని శ్రీపాండురంగడు చెప్పిపంపెను. అయినను జూతమని ఓస్వామీ దేవరవారు సాధుపురుషులైయున్నారు. ఇట్టియన్యాయంబుకలదా. సాంబమూర్తిపై మీపాదంబులనుంచి యిట్లు నిద్రించుటతగునా యనిచెప్పఁగా వీశోబాకేశుఁడు ఓరయ్యా నాదేహంబు మఱచి తెలియక నాకాళ్లను శివలింగంబుపై నుంచితిని, ఇదికాక వార్ధికదశచేత శక్తిలేనివాడనైయున్నాను, ఇప్పుడు నీవు నాయందు కరుణనుంచి శివలింగము లేనిచోట నాకాళ్లనెత్తియుంచుమని చెప్పెను. ఆపల్కులువిని నామదేవుఁడు వారికాళ్లనెత్తి యొకప్రక్కగానుంచెను. అప్పుడచ్చట నొకశివలింగంబుండుట జూచెను. ఇదేమి యిట్లున్నదని మఱల పాదంబులనెత్తి మరియొకచోటనుంచఁగా నచ్చటకూడ మరియొకలింగంబుండెను. కాళ్లెచ్చట నుంచిన నచ్చటచ్చట లింగమయముగా నుండెను. ఈచిత్రమును జూచి ఆశ్చర్యంబుజెంది నాయాచార్యుని వలగొని వారిచరణారవిందములకు సాష్టాంగదండప్రణామంబులిడి యోసుజ్ఞానజలధే సద్భక్తా

గ్రేసరా దేవరవారి పాదసేవ చేయుటకై వచ్చిన నాకు సర్వంబు శివ
మయంబుగా ప్రకాశించుచున్నదనిపలికి మరల గురుచరణంబులకు
నమస్కారంబులు జేసెను. అప్పుడీశోభాకేశుఁడు నామదేవును తన
ప్రక్కన గూర్చుండబెట్టుకొని జ్ఞానమార్గంబు లుపదేశించి సమస్త
వేదశాస్త్రరహస్యమైన మంత్రార్థమును బోధించి వారికానందంబు
గలిగించి వారికి గలిగియుండు సంశయంబులను విశదపఱచి రెండు
చేతులు ముకుళించుకొని దాసుఁడు జ్ఞానదేవుల శిష్యుండను. వారి
పాదారవిందధ్యానంబులను నిలుకడగా వహించి వర్తించుచున్నవా
డను. అనిచెప్పగానే నామదేవుని మనంబు మహోల్లాసంబుజెంది
తన్మయంబునొంది ఓ యాచార్యవర్యా నాకు మహాగుహ్యంబైన
యర్థవిశేషంబులం దెలిపి కృతార్థునిగావించుట దేవరతిరువడిబలంబే
కదా, అట్టి తిరువడిఘునకు సదా సేవచేయుటయే స్వరూపప్రాప్తం
బని తెలియవచ్చెను. ఇదికాక భగవంతుఁడైన శ్రీపాండురంగమూ
ర్తిని నాహృదయకమలంబునందు మీకటాక్షంబువలన గనుంగొంటి
నని చెప్పి బ్రహ్మానందంబు జెంది సాష్టాంగనమస్కారంబులాచరించి
యాచార్యుని సన్నిధియందనుమతినిబొంది తిరుగ శ్రీపండరీక్షేత్రంబు
నకు వచ్చెను. అదిమొదలు పూర్వంబువలె సన్నిధికి బోకయుం
డెను. ఇట్లుండ నొకదినంబున పాండురంగడు నామదేవునియొక్క
చిత్తంబును శోధించుటకొరకు నుత్సవకాలంబునందొక ద్వాదశి
దినంబున శ్వానరూపుఁడై యచ్చటచ్చటం దిరుగుచు పెక్కండ్రు
భుజించుటకై నుంచియున్న పదార్థంబులయందును అన్నము రొట్టె
మొదలగువానిం దననోటితో స్పృశించుచుండుటనుచూచి వారలా
కుక్కను తరుమఁగొట్టుమనువారును కొందఱన్నంబుభుజించుచుండు
నపుడా శ్వానస్పర్శంబునుం గనుంగొన్నవారు దానింజంపుడు జంపు
డని కేకలు వేయువారును, వారు భుజించునపుడాశునకంబు వారి



యన్నంబును భుజించుటకుపోగా వారందరు గోపించి కఱ్ఱలనెత్తి
కొట్టుడు కొట్టుండనువారును, ఆశునకము వారి యన్నమును తాకి
నట్లయితే నాబ్రాహ్మణులు మనంబున క్లేశమును జెంది భోజనమును
త్యజించి పోదురుగదా యనుచు మరికొందఱిది కపటశ్వానంబుగా
నున్నది దీనిని కఱ్ఱలచేత గొట్టిచంపుడనువారును, కొందరు గృహ
స్థులు అన్నంబు భుజించుచుండునపుడా శ్వానము వేగంబుగా నేగి
వారు భుజించెడు పళ్లెరములమీదను విస్తళ్లమధ్యను నడువగా
దానిందఱిమివేసి వానియందున్న యన్నంబును భుజింతురు. ఇవ్వి
ధంబుగా నాశునకము యాత్రాపరులై వచ్చినవారలను వ్యథలనొం
దించి ఆగడంబులుచేయుచు నామదేవుని గృహంబునకు రాగా నచట
అనేకవిధభక్షణంబులు చేసియుంచబడెను. అత్తఱి యాశునకము
వాటిని నోటితో కవ్వకొనియున్నపుడు దానిని నామదేవులుజూచి
అయ్యో యీశ్వానము నెయ్యిచక్కెరయేమియులేక వుత్తరొట్టెను
మాత్రము భక్షించుచున్నదేయని యనుతాపముతోడ నాభక్ష్యం
బులకు నెయ్యిచరిమి చక్కెరనుంచి భక్షింపజేసెను. ఈవింతలను
జూచిన పామరజనులు ఓ నామదేవా నీవు పిచ్చివాఁడవని నవ్వుట
కారంభించిరి. అట్టితఱి శ్రీపాండురంగడు ప్రసన్నుండై ఓనామదేవా
నీవు నన్నెట్లు తెలిసికొంటివనఁగా నామదేవులు భగవంతుని నమ
స్కరించి స్వామీ దేవరవారి గురుతుల నాచార్యుఁడు తెలిపించి
యున్నాడనఁగా నప్పుడు భగవంతుఁడు వారింజూచి ఓనామదేవా
నీవిప్పుడు కాలిన భాండమైతివి, ఇఁక భక్తజనులగోష్ఠియందు నీవు
శ్లాఘనీయుఁడవై యుండువుగాక యని నుడివి యంతర్ధానంబునొం
దెను. అప్పుడీచిత్రమునుచూచిన యాత్రవాసులును పురజనులును
అత్యాశ్చర్యంబు నొంది నామదేవుల ననేకవిధంబులుగా గొనియా
డిరి. అనంతరము నామదేవులు ప్రతి యేకాదశి వ్రతంబును తప్పక

నాచరింపుచుండును. ఆకాలమునందు భగవంతుఁ డితని వ్రతంబును
బరీక్షించుటకు నొక యేకాదశిదినంబున వృద్ధబ్రాహ్మణ వేషధా
రియై వణుకువానివలె నటింపుచు కుచేలంబులు ధరియించి శిరంబు
నందొక టోప్పీ వేసికొని కాళ్లు తడబడ నామదేవుని గృహంబునకు
వచ్చి నిలిచి అయ్యా వృద్ధత్వదశయందు క్షుద్బాధయను రోగంబు
చేత తల్లడిల్లుచున్నవాఁడను, నీవు హరిదాసుండవని విని నీవద్దికి వచ్చి
తిని, ఇప్పుడు నాకన్నంబు పెట్టవలయునని వేడుకొనఁగా నామదే
వులు వారింజూచి నమస్కరించి స్వామీ యీదినం బేకాదశియైనం
దున గృహంబున నిసుమంతయైన యన్నంబు లేదు, గాన ఫలంబుల
నిచ్చెదను భుజియింపుడనఁగా నా బ్రాహ్మణుండు ఫలంబులు నాకు
వలదు, అన్నంబె కావలయు వేఱుపదార్థంబు లేవియు నాకు సరిప
డవు, అత్యాయాసంబుతోడ నీగృహంబునకు వచ్చితిని, ఇప్పుడు
నేను క్షుత్పిపాసాపీడితుఁడనై యున్నవాఁడను, అని పలుమాఱు
చెప్పుచు నుస్సురనికూర్చున్నవారై అయ్యా యీదినము మీరన్నం
బుంచనియెడల నాప్రాణంబు నిలువనేరదు బ్రహ్మహత్యాదోషంబు నీకు
సిద్ధించునని చెప్పగా నప్పుడు నామదేవు లిట్లని చెప్పెను ఓస్వామీ
శ్రీపాండురంగనియొక్క పాదస్మరణ నాహృదయంబున స్థిరంబుగా
నిలిపినపక్షంబున పాపదోషంబులు దాసుని జెందనేరవు, ఆశాపా
శంబులన్నియు విడిచి ఆచార్యుని కృపాకటాక్షంబు పొందినట్టి దాసు
నికి నేదోషంబులు సిద్ధింపవు, సకలసొత్తులను దానంబుచేసి చెయి
తట్టుకొని వెడలిన పురుషునికి చోరభయంబు యేలకలుగును, అట్టి
పుణ్యపాపంబుల నెడి బంధంబులు దాసునివదలి వెడలెనని చెప్పఁగా
వేషధారియగు బ్రాహ్మణుఁడు సర్వాత్మలయందు సమభావంబునుంచి
వాటిని గరుణింపక ఆత్మజ్ఞానం బధికంబుగానుండినను నిరర్థకంబని
చెప్పెను. ఆకలిచేత నలసటపడుచు వచ్చియున్నవానిం జూచియు



నాకింత యన్నంబిడనియెడల నాయాత్మ వెడలిపోవునని పలువిధం
బుల హీనస్వరంబుతో జెప్పఁగా, నామదేవులాలాగే దాసునికిసహి
తము కలుగవలయునని చెప్పగా నప్పుడు అతిథిగవచ్చిన బ్రాహ్మణ
వేషధారి కనులను గిరగిర ద్రిప్పి ప్రాణంబు విడిచెను. పిమ్మట నామ
దేవుఁడా ప్రేతంబును భీమానదిగట్టునకు గొనిపోయి భగవన్నామ
స్మరణంబు జేయుచు కాష్ఠంబుపై ప్రేతంబునుంచి నామదేవుడును
శ్రీమన్నారాయణుని మనస్సునందు స్మరించుచు నా శవంబుతో
గూడ తానుం బడుకొని యగ్నినుంచ జేసెను. అప్పుడా నిప్పు దగు
లుచుండఁగా భగవంతుడాస్థానంబు వదలి లేచి చతుర్భుజంబులతో
శంఖచక్రాద్యాయుధంబులతో గరుడారూఢుఁడై ప్రసన్నుండగుచు
నామదేవుని లేపి ఓభక్తుఁడా నీయొక్క దృఢాధ్యవసాయంబును బరీ
క్షించుటకై యీరూపముతో వచ్చితిని. పూర్వకాలంబున రుక్మాం
గదుఁడు మొదలగు భక్తులంబోలె నాచార్యకటాక్షంబువలన నీవును
దృఢచిత్తుండవై యున్నవాఁడవని వాక్రుచ్చి యదృశ్యుండయ్యెను.

శ్రీరాధాకృష్ణాయనమః.

# భాగవతుని చరిత్రము.

పండరీపురంబునందు బ్రాహ్మణ కులంబున నవతరించి భాగవ
తుండను పేరొంది యొక బ్రాహ్మణబాలుఁడు వాసముజేయుచుం
డెను. అతండనయంబు రుక్మిణీదేవిని నారాధించి బహుకాలంబుగా
నామెకు సేవలుసేయుచుండి యీతల్లి దాసుని దరిద్రదశను తొల
గించి ధన్యునిగా జేసి రక్షింపవలయునని పెక్కుదినంబులు ప్రార్థన
జేయుచుండెను. అప్పుడు రుక్మిణీదేవి కృపానిధియై తన నిజస్వరూప
ముతోడ ప్రసన్నురాలై అతిప్రియంబున నతనికొక స్పర్శవేదినిచ్చి
దీనిమీద యినుమును రుద్దినయెడల నాయినుము పదివన్నె బంగా

రంబగును. దాసింగొని నీకు కావలసిన ధనంబును సేకరించుకొని
జీవింపుము. ఈస్పర్శవేదిని భద్రంబుగానుంచుకొనుమని నుడువుచు
నామె యంతర్ధానమాయెను. ఆపల్కులువిని భాగవతుడు మిక్కిలి
సంతోషమును జెంది పిరాట్టిని బహుప్రకారంబులుగా స్తుతించి యా
స్పర్శవేదిం జేకొని నాబ్రాహ్మణపుత్రుండు తనభార్యయగు కమలజ
చేతికిచ్చి రహస్యంబుగా యినుమును బంగారంబుచేసికొని విశేష
సంపత్కరుండై బ్రాహ్మణుల కప్పుడప్పుడు భోజనంబులిడుచు పండరీ
పురంబున ప్రబలుండైన భక్తుండనిపించుకొని ప్రకాశించుచుండెను.
ఇట్లుండగా నొకదినంబున కమలజ ఘటంబెత్తుకొని జలంబుకొరకు
భీమానదికిం బోయెను. అప్పుడు నామదేవులభార్య తీర్థంబుకొరకు
నచ్చోటికి వచ్చెను. అంత వీరిద్దరును జలపూరితంబైన కుంభంబులు
జంకలనిడుకొని గృహంబులకు వచ్చుతతి కమలజయనుసాధ్వి నామ
దేవుల భార్యనుంజూచి ఓతల్లీ మిమ్ములంజూడగా నధిక దరిద్రదశ
ననుభవించునట్లు కానబడుచున్నది. ఇందునకేమికారణమని యడు
గగా నప్పుడు రాజాభాయి చెప్పుచున్నది. ఓతల్లీ నాభర్తయగు
వారు శ్రీపాండురంగని కల్యాణగుణంబులం బాడుచు నాడుచు వారి
మూర్తిత్వంబును సేవించి లయంబుజెంది వారి లీలావినోదంబులఁ
గానంబుసేయుచు కాలంబుగడుపుచున్నారు. వారు దారాపుత్రా
దులక్షేమంబు లెఱుంగకుండుటచేత నిట్టి దారిద్ర్యదశ ననుభవించు
చున్నామని వచింపగా కమలజయనుసాధ్వి ఓరాజాభాయీ మీరు
పరిశుద్ధచిత్తంబుతో పాండురంగని సేవించియు వారు మీకు ద్రవ్యం
బును నియ్యకుండుటచేత నట్టివారి సేవను వదలిపెట్టుట సుఖకరం
బగును. మీకొఱతలందీర్చి రక్షింపని భగవంతుని భజించియు నేమి
ప్రయోజనంబు. నాభర్తయగువారు రుక్మిణీదేవిని భజించుచుండినం
దున నాతల్లికి మాయందుకరుణగలిగి మాకొక స్పర్శవేదినిచ్చెను.



దానిచే మేమనేక సౌఖ్యంబులు బొందుచు బ్రాహ్మణ జనంబులకు
సహితము భోజనంబిడుచున్నారము. అనివచింపఁగా నామాటలను
విన్న రాజాభాయి యాశ్చర్యంబును జెంది ఆస్పర్శవేదిని నాకుం
జూపుమని ప్రార్థింపగా కమలజయనువనిత నీవు మాగృహంబునకు
వచ్చితివేని దానిం జూపెదనని చెప్పెను. తర్వాత ఆస్త్రీలిద్దఱును
దమతమ గృహంబులకు బోయిరి. కొన్నిదినంబులు గడచినపిమ్మట
రాజాభాయియనుసాధ్వి కమలజగృహంబునకుంబోయి స్పర్శవేదినిం
జూచి యినుమును బంగారము చేయువిధంబును దెలిసికొని ఓకమ
లజా నాయింట కొన్నియినుములున్నవి, వానినన్నిటిని బంగారము
చేసికొన్నపిదప నీకు నీస్పర్శవేదినిచ్చెదనని యడుగ అందునకామె
సమ్మతించి యీమర్మమును నీభర్తకును నితరులకును తెలిపించక
మీరు సుఖించుటకెంతకనకంబు కావలెనో యంతవరకు సేఖరించు
కొని శీఘ్రంబుగా నాచేతికి దెచ్చియివ్వవలయునని కమలజయను
సాధ్వి రాజాభాయి కరంబున నొసంగెను. అప్పుడు రాజాభాయి
దానిం దీసికొని తనగృహంబునకువచ్చి యినుపపాత్రలను బంగార
ముగా జేసికొని దాని నంగటికియెత్తుకొనిపోయి యమ్మి ధాన్యము
మొదలుగాగల వస్తువులందెచ్చి తళిగచేసిపెట్టుకొని తనభర్తరాక
కెదురుచూచుచుండెను. అట్టిసమయంబున నామదేవులు శ్రీపండరీ
నాథుని సన్నిధియందు నృత్యముతో భజనచేసి మూడుజాములపైన
తనగృహంబునకువచ్చి చూచినప్పుడు యినుములన్నిటిని బంగారము
చేసివుంచియుండుటయు నచ్చటచ్చట ధాన్యంబులు రాసులురాసు
లుగా పోసియుండుటయు నూతనవస్త్రంబులుమెండుగానుండుటయు
జూచి యొకప్పుడును నాతో మంచిమాటలాడనట్టి గృహిణి యీ
దినంబతిప్రీతితో భుజింపుమని వేడుకొనుటనుగని నామదేవులామెను
జూచి యీ సంపత్తు మనకెక్కడినుండి వచ్చెనని యడుగగా నప్పు

డామె తనపురుషునింజూచి యిక మీరు గృహకృత్యంబులకై విచార
పడనక్కరలేదు, ఇకమీద తాము నెమ్మదిగా శ్రీహరిభజన చేసికొని
యుండుడు, భగవంతుడు మనలను రక్షించగలఁడని చెప్పగా విని
నామదేవులప్పుడీ ధనంబు మనకు వచ్చినమార్గంబును దెలిసికొనక
భోజనంబుచేయ నేరననెను. అంత నాసాధ్వి సంపత్తువచ్చినకారణం
బును దెలిపి స్పర్శవేదిని జూపగా నామదేవులు దానిని బలాత్కారం
బుగా దీసికొని చంద్రభాగానది సమీపంబునకువచ్చి లోతుగలజలం
బునందా స్పర్శవేదిని బారవేసి స్నానంబుచేసి గట్టుమీద కూర్చుండి
భగవద్గుణానుభవంబు చేయుచుండెను అప్పుడింటియందు నధికదుః
ఖముచే రాజాభాయి పరితపించుచుండెను. ఇట్లుండగా భాగవతుఁడు
తనసతినిం బిలిచి స్పర్శవేదినిం దెమ్మని యడుగగా నామె దిగులు
జెంది యిదో తెచ్చెదనని రాజాభాయివద్దకు నేగి స్పర్శవేదినిమ్మని
యడుగగా నామెతొందరఁజూచి రాజాభాయి భయంబుజెంది భర్త
వద్దకుబోయి స్పర్శవేది నిమ్మని యడిగినంతట వారు దాని నదిలో
బడవేసితిననిరి. ఈమాటనువిన్న రాజాభాయియును కమలజయును
దిగ్భ్రమజెంది యెలుగెత్తి యేడువసాగిరి. అప్పుడీధ్వనివిని వారిం
జూచుటకై ప్రజలనేకులు యేటిగట్టునకు వచ్చిరి. భాగవతుఁడా సవి
స్తారమును భార్యవలనదెలిసికొని పరితాపముతో దుఃఖించుచు నామ
దేవులం జూచి ఓ మహానుభావా మీరు హరిదాసులై యుండియు
బ్రాహ్మణసొత్తు నపహరించితిరి, వైష్ణవాగ్రేసరులై యుండియు
యిట్టికార్యంబు చేయవచ్చునా కలనయినం దలఁచవచ్చునా లేశంబై
నను పాపమని యెంచక తృణీకరించి మాసొత్తు నపహరించితిరి, అని
వచింపుచున్న మాటలను నామదేవులు విని ప్రత్యుత్తరంబు చెప్పదొ
డంగిరి. అయ్యా దానినేనపహరించలేదు తపస్సినైవుండు నాకీధనంబు
దుఃఖంబుపుట్టించునని యెంచి దానిని యేటిలో పారవైచితిని, ఇది



యబద్ధంబని మీకుతోఁచినయెడల యీనదియందుదిగి చూచుకొనుఁ
డనిచెప్పెను. ఆమాటలనువిని నచ్చటనున్న జనులందరు నవ్వి ఆనది
లోనుండునది యెట్లు కండ్లకుకనబడుననిచెప్పిరి. ఆవచనములను విన్న
నామదేవులు లేచి నదియందుదుమికి నీటిలోమునిగి పిడికెడు స్పర్శ
వేదుల నెత్తుకొనివచ్చి గట్టుపైవేసి పరీక్షించుకొనుఁడని చెప్పిరి.
వెంటనే కొందరు యినుపగరిటలుదెచ్చి పరీక్షించిచూడ నవి ప్రత్య
క్షంబుగ స్వర్ణంబులగుచుండెను. ఆవింతనుగని భాగవతుఁడనుతాపం
బుజెంది శ్రీహరి కృపను బొందిన భక్తాగ్రేసరునియొక్క యద్భుతం
బిదియని తలఁచి యీస్పర్శవేదులిక ప్రయోజనపడజాలవని వాటిని
మరల యీనదిలోనే పారవేసెను. అనంతరమాతఁడు నామదేవుల
యొక్క శిష్యుఁడై భగవద్భక్తిని వహించి నిత్యసుఖంబును బొం
దెను. తదనంతరము నామదేవు లత్యానందంబుజెంది శ్రీ నరహరిని
సదా భజించుచు భగవద్భక్తులతో గూడి నానందింపుచుండెను.

ఇట్లుండఁగా నొకనాడు నామదేవులతల్లి తనకొమారునింబిలిచి
వత్సా నీవెల్లప్పుడును శ్రీపాండురంగనియొక్క దాస్యవర్గంబున నీడు
పడి దారాపుత్రులదాక్షిణ్యంబును వదలితివి, స్వధర్మమార్గంబును
గాపాడి నన్ను దయచేతజూడవలయు నాకు వార్ధికదశవచ్చినది నా
శరీరంబున లేశంబయిన శక్తిలేదయ్యో దగ్గుకలిగి రాత్రింబగళ్లును
నన్ను బాధించుచున్నది. ఈవ్యాధినివర్తికై వనంబునకేగి మూలి
కను తీసికొనిరావలయునని చెప్పఁగా నాలాగే చేసెదనని కొడవలిని
జేతిలోబట్టుకొని వనంబునకువెడలి యామూలికను కనిపెట్టి కొడ
వలిచేత నాచెట్టును నఱుకఁగా దానియందుండి రక్తంబు వచ్చుటం
జూచి చేతియందుండినకొడవలిని భూమిమీద బారవేసి సర్వయోను
లయందు నిండినజంతువులు నారాయణాంశంబనియెంచి మహాపాత
కంబని యెంచక మీరిచేసితిని, అకటకటాయని యనుతాపంబుతో

నధికంబుగా వ్యసనపడుచు ఓహరీ విఠలా ఆదినారాయణా అనంతావతారా అమరవినుతా అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా గోవిందా మాధవా ముకుందా నరహరీ మురహరీ జనార్దనా కరుణించివచ్చి కావవేయని పలువిధంబులఁ బిలిచినను శ్రీపాండురంగఁడు రాకయుండుటంజూచి తాఁజేసిన పాపంబులం దలఁచుకొని చింతిల్లుచు కొడవలిచేత తనకాళ్లను తెగనఱికికొని వానిలో నుండిన మాంసంబునెత్తి మూలికపై నంటించియు రక్తము నిలువనందుచేత ఓయచ్యుతా అనంతా పద్మాక్షా పరమపురుషాయని బహుప్రకారంబుల స్తోత్రంబులు చేయుచుండఁగా శ్రీపండరీనాథుఁడచ్చోటికి విచ్చేసి చిఱునగవుతో గటాక్షింపఁగా నాచెట్టునకు గలిగిన రక్తంబు నిమిషంబులో నిలిచిపోయెను, అదియునుగాక నామదేవులు పశ్చాత్తాపమునొంది తన కాళ్లను దెగగొట్టుకొన్న రణంబుగూడ కనబడకపోయెను. తక్షణమే పెరుమాళ్లున్ను మరిగిపోయిరి. తరువాత నామదేవులు తన గృహంబునకు మరలి వచ్చుచుండఁగా తన తల్లికి గలిగిన దగ్గుసహితము తీరి స్వస్థముగాయున్నదని విని వారి కరుణారసంబునకు ఆనందముజెంది శ్రీపాండురంగని లీలావినోదంబులను గొనియాడి పరవశత్వము జెందియుండెను.

శ్రీగోవిందాయనమః.

## బిదర్ బ్రాహ్మణుని చరిత్రము.

శ్రీపండరీపురంబున నామదేవులయొక్క యధికకీర్తి నలుదిక్కులయందు ప్రకాశింపుచుండుతఱి దూరదేశంబులనుండు జనులందరు వీరిం దర్శనంబుచేయుటకు వచ్చుచుందురు. ఇట్లుండఁగా బిదరను పట్టణంబున నొకధనవంతుఁడగు బ్రాహ్మణుఁడు వాసముచేయుచుండి కామ్యార్థంబుగా పండరీనాథునివిషయంబున ప్రార్థనయొకటి చేసు



కొనెను. అతడు కోరినకోరిక గొప్పదిగానుండియు అది సఫలమైనందున నాప్రార్థన చెల్లించుటకై పండరీపురమునకువచ్చి ప్రార్థన చెల్లించి శ్రీపాండురంగని సేవించి అప్పుడచట జరుగుచుండు వుత్సవంబును సేవించి ఆనందముజెంది అట్టి వుత్సవమును పాండురంగనికి తనగృహంబున జరిపించి కృతార్థుఁడుగావలయునని యెంచి నామదేవులవద్దికి నేగి ఆవుత్సవంబును జరిపించుటకొఱకు రమ్మని వేడుకొనెను. ఆవేడికోలువిన్న నామదేవుఁడు ఓబ్రాహ్మణోత్తమా వైకుంఠమునకంటె నిది శ్రేష్ఠంబనితలఁచి యీపండరీక్షేత్రంబునందు నివసించుచున్నవాఁడను. దీనివిడిచి మరియొకచోటికి రానేరనని వచించెను. ఆమాటలనువిన్న బ్రాహ్మణుఁడు చింతాక్రాంతుఁడై శ్రీపాండురంగనియొక్క సభామంటపంబునకుం జని యిరువదిదినంబులచ్చోటున నుపవసించి స్థిరచిత్తుఁడై ధ్యానించుచుండెను. అప్పుడు భగవంతుఁడాతని వైరాగ్యశీలంబులుగని వానిమనోభీష్టంబును నెరవేర్పఁదలఁచి వెంటనే నామదేవునివద్దికివచ్చి ఓనామదేవా మీరు బిదరుపట్టణమునకువెడలి అచట నతని మనోరథంబును నెరవేర్చి రావలయునని వారికాజ్ఞాపించిరి. వెంటనే నామదేవుడు ప్రయాణమై భగవంతుని నాజ్ఞచొప్పున బ్రాహ్మణులును భాగవతులును మరియు నితర ప్రజలును గుమిగూడి వాసుదేవా జనార్దనా కృష్ణా ముకుందా మురహరీ అచ్యుతా అనంతాయని భగవన్నామంబులుచ్చరించుచు నాబ్రాహ్మణునితోడ బిదరను పట్టణంబు ప్రవేశించెను. అప్పుడాపురంబునకు నధిపతియగువాఁడీశబ్దంబునువిని తనమేడపై నెక్కి వచ్చెడిపరివారంబులను చూచి విస్మయముజెంది తక్షణమే తనమంత్రినింబిలిపించి యిదేమినినదంబనియడుగగా నపుడు మంత్రి సేవకులకొందఱిం బంపి వారలసవిస్తారమునంతయు నెఱింగిరండని వీడుకొలుప నాసేవకులు హరిదాసులవద్దికివచ్చి వాద్యధ్వనులను నిలుపుడనఁగా గోష్ఠి

తోఁగూడి వచ్చిన బ్రాహ్మణులును భాగవతులును భయంబుజెంది దవ్వులకుం జనిరి. నామదేవుమాత్రము వారియెదుటనిలిచి అయ్యా మేము యాత్రాపరులమై యిచ్చటికి వచ్చినారము. నేను పాండురంగనికి సకలవిధ కైంకర్యములు చేయువాడను, భాగవతగోష్ఠితో శ్రీపాండురంగని గొనియాడుచు వారికల్యాణగుణములను పాడుచు నాడుచు పోగలవారముగాని చెడుకార్యము లెవ్వియు మేము చేయువారముకామని చెప్పఁగా విని నాభటులు మంత్రివద్దకువచ్చి ప్రభో నామదేవులను హరిదాసు పండరీపురముననుండి బయలుదేరి భజన జన సమూహముతో భగవన్నామోచ్చారణంబు చేయుచు యేతెంచుచున్నారని నుడివిరి. ఆక్షణమే యీసవిస్తారమును మంత్రి రాజుగారికి తెలియజేసెను. అప్పుడారాజు తురుష్కుడుగనుక తుచ్ఛగుణముగలవాడై పరమభాగవతోత్తములని యెఱుఁగక తనపరిజనంబులనువదలి వారలం బట్టిగట్టి గొనిరండని సెలవొసంగెను. అట్లు కఠినముగా నుత్తరవొసంగుటనుగని మంత్రి భయముజెంది ఓరాజా యిట్టికార్యముచేయుటవలన మనకు మంచిపేరురానేరదు, చెడుపేరు మాత్రముకలుగునని చెప్పినమాటను రాజు వినియు విననివానివలె అలక్ష్యముగానుండెను. తత్క్షణమే సేవకులుజని వారలం బట్టిగట్టి గొట్టుచు రాజునెదుటికిం దెచ్చినిలిపిరి. అప్పుడా నబాబు ఒకగోవును దెప్పించి నఱికిచంపి నామదేవుం జూచి యీగోవునకు ప్రాణంబిచ్చి బ్రతికించితివేని నిన్ను ప్రాణముతో విడుతును లేనియెడల నిన్ను భ్రష్టునిగా జేసెదనని చెప్పెను. ఆసమయంబున హరిదాసులందరు హా హా యనుచు ఆర్తధ్వనులతో హరిహరీయని యుచ్చారణంబు చేయుచు మితిలేని ఖేదమును జెందియుండిరి. అట్టితఱి నామదేవులు శ్రీనరహరిని తనమనంబున ధ్యానించి యాగోవు మస్తకముపై తన హస్తంబునిడికొని ఓ శంఖచక్రగదాధరా గోవిందా పుండరీకాక్షా



పద్మనాభా పరంధామా పరవాసుదేవా పాండురంగా పండరీనాథా హేజగదీశా యిట్టి యాపత్కాలంబున దాసుని రక్షింపవలయు. ఓ దయానిధే దాశరథే దానవమర్దనా ఇత్తఱి నతివేగంబునవచ్చి నన్ను రక్షింపుము. పద్మనాభా భక్తవత్సలా అతిశీఘ్రంబున నాయందున మీరు కృపాకటాక్షంబుంచి రక్షించనిపక్షంబున దాసునిప్రాణంబీక్షణమే నాదేహమును విడిచిపోవుట సిద్ధంబు. అని పలువిధముల భగవంతుని ప్రార్థింపుచు నార్తధ్వనితోడ కేకలిడుచు నొడలుమఱచి శరీరంబుపై స్మారకంబులేక సొక్కియుండెను. అట్టితఱి భగవంతుఁడు నామదేవునివద్దికి యేతెంచి ఆగోవును దనకరంబుచే స్పర్శించినమాత్రంబున నాతక్షణంబే యా ధేనువునకు ప్రాణమువచ్చి లేచి నిలిచెను. అట్టితరుణమున ఆపట్టణమునందు అనేకసర్పము లుద్భవించి ప్రజలను గరచుచుండ బెక్కండ్రు మరణముజెందిరి. అప్పుడాశవంబులన్నిటిని నాక్షితిపతి యెదుటం దెచ్చివేసి జనులందరు యేడ్చుచుండగా రాజు మంత్రినింజూచి మనస్సంకటమునొంది దీనాననుఁడై పరితపించుచు అయ్యో హరిదాసులమహిమ లెఱుఁగక నేనపచారపరుండైతినని వారి ననేకప్రకారంబులఁ బ్రార్థించి ఓ భాగవతాగ్రేసరా నాతప్పులను క్షమించి నాయందు కరుణనుంచి మాకు సంభవించిన యీయరిష్టమును నివర్తింపఁజేయుఁడని వేడుకొనెను. ఆసమయంబున నామదేవులు శ్రీహరియొక్క రూపలావణ్యసద్గుణ సౌందర్యాదులయందు నీడుపడి నానందాబ్ధినిమగ్నుఁడైయుండి కన్నులు తెఱచి చూడఁగా తన యెదుట మహీపతియున్ను మంత్రియున్ను దన్ను బహువిధంబుల బ్రార్థింపుచుండుటను జూచి కరుణగలిగి భగవంతుని పలుదెఱఁగులఁ బ్రార్థించి నా రాజునకు కలిగిన కష్టంబు పరిహారంబగునట్లు గావింపవలయునని వేడుకొనెను. ఆక్షణమే భగవంతుఁడు చచ్చినప్రేతంబులకు బ్రాణంబులిచ్చి రక్షించెను. అప్పు

డచ్చటనున్న సర్పములు మాయమైపోయెను. పిమ్మట నామదేవుఁడు రాజువద్ద సెలవుపొంది తన్ను దోడ్కొనివచ్చిన బ్రాహ్మణునియొక్క సంకల్పమును నెరవేర్చి శ్రీమత్పండరీనాథుని నుత్సవము ప్రతిసంవత్సరంబు జరుగునట్లు నూర్జితపరచి యచ్చటివారలకు జ్ఞానభక్తి వైరాగ్యంబుగలుగజేసి హరినామసంకీర్తనలను బాడుచుండునటుల నుపదేశించి, సదా ఆనందముతో పాండురంగని భజింపుచుండుడని నియమించి బ్రాహ్మణుని ప్రార్థనమును చెల్లింపఁజేసి యఖిలజనులు గొనియాడ నామదేవులు పండరీపురమునకు మఱల నేతెంచిరి.

శ్రీవాసుదేవాయనమః.

# కమలాకరుని చరిత్రము.

శ్రీపండరీక్షేత్రంబున కమలాకరుడను నొకవిప్రుఁడు భిక్షాటనముచేయుచు వాసముచేయుచుండెను. ఆతనిసతి సుమతియను పతివ్రతాతిలకము తనపతినింగూడి కాపురముచేయుచుండెను. అప్పడతి తన భర్తమాటలకు నూరాడక అతిప్రీతితో శిశ్రూషలు సలుపుచు అతిసుగుణశాలియై ప్రవర్తించుచుండెను. ఆయువతి పెద్దలం బొడగన్న మిక్కిలిప్రియముతో వారల నారాధించుచు ఆకలితోనున్న బీదలంగని కరుణనుంచి యన్నంబిడుచు నాసతి యీరీతిగా యిహపరసుఖంబులకు హితంబు వెదకుచుండెను. ఇట్లుండగా యీసతికి నొక సత్పుత్రు డుదయించి దినదినప్రవర్ధమానుండై వృద్ధిబొందుచుండునట్టి తరుణమునందు కొందఱు పెద్దలు పండరీక్షేత్రమునకు వేంచేసిరి. అత్తఱి వారు పరమభాగవతోత్తములుగాను పుణ్యశీలురుగాను గానఁబడినందున కమలాకరుడు వారిని దన గృహంబునకు వేంచేయుఁడని ప్రార్థించెను. అంత వారు నాబ్రాహ్మణుని చిత్తశుద్ధి నెఱింగి వాని ప్రార్థనల నంగీకరించి వానిగృహంబునకు విచ్చేసిరి



అంత కమలాకరుఁడు వారలనుసన్మానించి అర్ఘ్యపాద్యాదులనొసంగి ఆసనాసీనులంజేసి వారియొక్క శ్రీపాదతీర్థంబును తన శిరంబుపై ప్రోక్షించుకొని పరిశుద్ధుఁడై వారింజూచి ఓస్వాములారా దాసుని గృహంబునందు నొకపూట వసించి ప్రసాదము నారగించి నన్ను కృతార్థునిగాజేసి రక్షించుఁడీయని ప్రార్థించెను. ఆవచనంబులను విని భాగవతాగ్రేసరులు కమలాకరునిం గాంచి అయ్యా మాకు ప్రసాదంబు నుంచవలయునను వాంఛ తమకుండుటను నెఱింగి మిక్కిలి తృప్తిబొందినారము, మీరింక విశేషప్రయాసంబెత్తుకోవలసినపని లేదనిరి. దానికాబ్రాహ్మణుఁడో మహాత్ములారా దేరవారలు పుణ్యమూర్తులును మహాపెద్దలుంగావున దానునిగృహంబున నినుమంత ప్రసాదంబు స్వీకరించితిరేని శ్రీవిష్ణుమూర్తికి దాసునియందు కరుణగలుగునని ప్రార్థించెను. వారు వీని సద్గుణంబులకు సంతసించి ఆరగించుటకు సమ్మతించి స్నానాద్యనుష్ఠానంబులు గావింప నుద్యమించిరి. తదనంతరంబాకమలాకరుఁడు తనకాంతచెంతకునేతెంచి మన గృహంబునకు సత్పురుషులువచ్చియున్నారు వారిం దృప్తిపరచి పంపవలయునని నామెతోజెప్పెను. అంత నావనిత పతిమాటలాలకించి పాండురంగడును రుక్మిణీదేవియు మనకు రక్షకులైయుండఁగా మనకేమిభయంబున్నది, ఆర్యులకన్నంబిడుట ఆవశ్యకంబేగాన సాధువుల సాంగత్యము సర్వార్థసాధనంబని పెద్దలు పలుకుదురు. గాన మీరుఅందున్కై చింతించవలసినది లేదని యుల్లంబున నుల్లాసంబు గలిగిచెప్పఁగా కమలాకరుఁడు మిక్కిలి సంతసించి స్నానంబుచేయ బోయెను. అనంతరము సుమతియను కన్యారత్నము గృహంబులోనికి బోయి దొంతికుండలు దెఱచిచూడఁగా నొకపదార్థంబయినను వానియందు లేకయుండుటనుజూచి భగవద్ధ్యానంబు జేయుచు నిరుగు పొరుగిండ్లకుబోయి బియ్యము మొదలగుసామగ్రులనడిగి తెచ్చుకొని

చతుర్విధపదార్థములు ఫలహారంబులతోడ పచనముచేసి ముగించి పాయసంబు చేయుటకు యత్నింపఁగా వంటచెఱుకులు లేనందున వీధియందాడుకొనుచున్న తనకొమారునిం బిలిచి కొన్ని కట్టెపుల్లలను దెచ్చియిమ్మని చెప్ప నతఁడాలాగే దెచ్చెదనని వెడలిపోయి యచ్చటనున్న కట్టెలనుతాకగానే దానియందొకసర్పముండి వాని చేతినిఁ గఱచెను. అంత నాబాలుఁ డమ్మాయనియఱచి ప్రాణంబును విడిచెను. సుమతి ఆధ్వని విని యచ్చటికివచ్చి తనపుత్రునింజూచి మిక్కిలిదుఃఖముతో అయ్యో ఏకపుత్రుఁడై యుండినవానికి యిట్టి గతి వచ్చెనుగదాయని శోకంబుజెంది సాధువులీసంగతి నెఱింగిరేని మనయింట భుజించరు అందువలన మనకు మేలుగలుగదని మనంబునఁదలంచి ఆబిడ్డను మఱుఁగునఁదాచిపెట్టి తాను మఱల స్నానంబుచేసికొనివచ్చి కట్టెలందెచ్చుకొని అతివేగంబున పాయసంబును పచనముచేసి యుంచెను. అట్టిసమయంబున సాధువులందరు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులుదీర్చుకొని దేవపూజలొనర్చి కమలాకరునితోఁగూడ వేంచేయఁగా సుమతియనుసాధ్వి వారికిఆసనంబులొనరించి అందు వారలఁగూర్చుండబెట్టించి అరటియాకులువేసి సమస్తపదార్థంబులును ఫలహారంబులును బెట్టి అన్నము పప్పు నెయ్యిమొదలగువానివడ్డింపగా నాసాధువు లతిప్రియంబుతోడ హరిస్మరణులై ఆపోశనంబు చేయుసమయంబున నాగోష్ఠియందుండిన నామదేవులు పాండురంగా హరీ విఠలా ఆరగించుటకు వేంచేయుమని తనమనంబునఁ దలఁచుచుండునపుడు పాండురంగడు తనతలంపునకు లోఁబడక యుండుటంజూచి యిచ్చట యేదో విఘ్నంబొకటిగలిగియుండునని యోచించి ప్రాతఃకాలంబున యొకబాలుఁడీయింటనుండుటను జూచితిని. ఆబాలుఁ డిచట కనబడలేదుగాన వానిఁ బిలిపింపుడని వాని తల్లిదండ్రులతో చెప్పఁగా సుమతియనుసాధ్వి వారిం జూచి



స్వామీ బాలుఁడు భుజించి డోలలో నిద్రించుచున్నాఁడని చెప్పగా నామదేవులు సుమతినిఁ జూచి అమ్మా నీ కొమారుని మెల్లన లేపి యిచ్చటికి దెమ్మని చెప్పుటను విని ఆ సాధ్వి స్వామీ ప్రయాసంబేల దేవరవారు ఆరగింపుడని ప్రార్థింపగా నామదేవులు అచ్చట జరిగిన వింతలను సుమతిదృఢచిత్తమును దెలిసికొని విస్తరినివిడిచి లేచి తాళము తంబుర చేతికెత్తికొని ఓకృష్ణా కృపాజలధే భక్తవత్సలా దీనదయాళా మీరుతప్ప నాకు రక్షకులెవరున్నారు. కమలనయనా కాంచనచేలా కామితవరదాయని కనుల నానందభాష్పంబులురాల ఆర్తితోఁ బ్రార్థించియు భగవంతుఁడు ప్రత్యక్షముకానందున మనంబున చింతనొంది ఓపాండురంగా ఆర్తశరణ్యా అచ్యుతా అనంతా శ్రీహరీ, నీవు సర్పశరీరముదాల్చి బాలుని బాధించి చంపితివి, నీభక్తులకు యిట్టి కష్టంబులు దెచ్చిపెట్టుట యుచితంబుగాదు మిమ్ము శరణాగతిపొందిన మాకు దేవరవారే రక్షకంబుగాక యితర రక్షకులుగలరా, సద్భక్తితో మిమ్మాశ్రయించి యుండువారికి నిట్టి యిడుములు దెచ్చిపెట్టితివేని తమదాసు లేమిచేయగలరు, దాసునియందు కృపయుంచి వేగంబునవచ్చి బాలునికి ప్రాణంబిచ్చి రక్షింపవలయును, ఓ పాండురంగా నీవే నాకాధారభూతుండవు నీవీసమయంబునవచ్చి రక్షించకుంటివేని నేను ప్రాణత్యాగంబుచేసికొనుట సిద్ధంబని మొఱపెట్టఁగా ఆక్షణమే భగవంతుఁడు ప్రత్యక్షమై నామదేవుల చింతనుదీర్చి నుల్లాసంబుగా సల్లాపంబులుసలుపుచుండిరి. అట్టిసమయంబున బాలుఁ డమ్మాయని పిలుచుటను సుమతివిని ఆనందముజెంది అచటికివచ్చి తనయా నీకేమికావలెననియడుగ నాబాలుఁడు తల్లీ నాకు దాహముకావలసియున్నది జలంబుదెమ్మని చెప్పఁగా నాపలుకులనువిని సుమతి సంతోషంబుతో తనయుని చంకలోనెత్తుకొని వచ్చి పెద్దలయొక్క పాదపద్మంబులపైఁబడవేసెను. అప్పుడందఱు

నేకకంఠంబుతోడ జ్ఞాన భక్తి వైరాగ్యంబులు గలవాడవై యుండు మని మంగళాశాసనంబుచేసి వానిలేవనెత్తిరి. అట్టితఱి అచ్యుతుం డదృశ్యుండయ్యెను. అంత నామదేవులు సుమతినింజూచి అమ్మా జరిగినసవిస్తారమును దాచక చెప్పుమనియడుగ నాసతి భాగవతులకు వందనములొనరించి జరిగిన వృత్తాంతంబును సాంగముగా దెలియ జేసెను. అత్తఱి ఆర్యులందఱు ఆనందముజెంది జయజయశబ్దంబులు గావించి నామదేవుల మహిమను గొనియాడి యబ్బాలునిగూడ సహపఙ్క్తియందు గూర్చుండబెట్టుకొని శ్రీపాండురంగని స్మరించుచు అందఱు నేకీభవించి భుజించి చందన కుసుమ తాంబూలాదులను ధరించి సంతోషంబునొంది శ్రీహరినిభజించుచు వెడలిపోయిరి.

శ్రీరామకృష్ణాయనమః.

## దాదాసహుకారి చరిత్రము.

ఒకనాడు తల్లియగు కోణాభాయి తనకొమారుడైన నామదేవునిం దనసమీపమున గూర్చుండబెట్టుకొని వత్సా నీవు శ్రీహరిని సదా మనంబున ధ్యానించుచు సంసారంబును కన్నెత్తిచూడకయున్నావు. శ్రీకృష్ణుని యెల్లప్పుడు ధ్యానించుచుండినట్టయితే కుక్షిబాధకేమిచేయవచ్చును నీభార్యాబిడ్డలగతియేమి నిన్నునమ్మియున్న నాగతియేమని యడుగగా నామదేవుడు తనతల్లినిం జూచి ఓమాతా నేననేకజన్మములయందు చేసిన సుకృతంబులన్నియు శ్రీహరికి సమర్పణంబులయ్యె ఇప్పుడు నాకరంబున కాంచనంబులేదు కనకంబులేనందున నేదైన నొక వ్యాపారంబుజేయుటకు యుక్తంబుగానుండలేదు. హస్తంబున విత్తంబున్నపక్షంబున యేదైన నొక కృషిచేసి దానివల్ల ధనంబార్జించి జీవింపవచ్చును. అప్పుడు దారాపుత్రాదులందఱు సుఖింతురని కుమారుడు చెప్పగా తల్లి విన్నదై



దాదాయను నొక బ్రాహ్మణసాహుకారువద్దకుబోయి తన కొమారుడగు నామదేవుడు వర్తకముచేయుటకు బూనుకొనెను. అందులకై వానికి వెయ్యివరహాలు కావలయునని కోణాభాయి అప్పడిగెను. ఆ సాహుకారు ధనలోభియై తన కడుపునకు దగిన ఆహారమును భుజింపక ధనంబును జేర్చిపెట్టి వడ్డికి నిచ్చుచుండును. అట్టివాడు ఆమెవిషయమందు గరుణించి వేయివరహాలెంచియిచ్చెను. అప్పుడామె నావరహాలను పుచ్చుకొని మనవద్ద అయివేజులేకయే సాహుకారు మనకు అప్పిచ్చినాడుగదాయని సంతోషమునుబొంది యిది పాండురంగని కృపాకటాక్షంబని తన మనంబున యోచించి ఆధనం బాఱునెలలకులోగా జెల్లించెదనని నతనికి పత్రము వ్రాసియిచ్చి నాధనంబును దెచ్చి కొమారుడగు నామదేవునివద్దనిచ్చి వత్సా ఈధనంబునుగొని క్రమంబుగ వర్తకంబుచేసి నీబుద్ధికుశలతచేతను యుక్తిచేతను యూహచేతను చాతుర్యముచేతను లోభంబులేక లాభంబు సంపాదించి నీవును నీపుత్రమిత్రకళత్రాదులును జీవనంబుచేయుచు ఆఱునెలలలోన సాహుకారిరుణంబు దీర్చవలయును. కాబట్టి జాగ్రతగా వర్తకంబుచేయుమని తల్లిచెప్పినంతట ఆలాగే చేసెదనని చెప్పి తనతల్లికి దండముసమర్పించెను. అటుతర్వాత యే వ్యాపారంబు చేయవచ్చునని తనలోతాను యోచింపుచు పుడమియందు పురుషుడు పుట్టి పుత్రులు కావలయునని తపస్సుచేసి భగవంతునికృపచేత పుత్రభాగ్యంబువడసి సంతోషంబునుజెంది తదనంతరమాపుత్రులను కాలుడువచ్చి కొనిపోవుటను తండ్రియగువాడు చూచి కష్టపడుచుండును. కావున ఒకపురుషుడు తపస్సుచేసి దేవజన్మంబెత్తును. ఆయజ్ఞంబు భంగమైనయెడల వాడు మరల భూమియందుద్భవించును. ఒకడు తపస్సుచేసి రాజగృహంబున జన్మించి రాజ్యభారంబువహించి మదోన్మత్తుడై నరకానుభవంబునకు బా

అది చూచి దాదాసాహుకారు మిక్కిలి కోపంబుజెంది కర్ణకఠోర ములయినమాటలు చెప్పగా నామదేవుడామాటలను విని వేదాధ్య యనంబు చేయుచుండు విప్రులం గాంచి అయ్యా బ్రాహ్మణోత్తము లారా యీయుత్సవంబునకు వీరేకర్తయయినవారు, వీరిహస్తంబు చేత నుదకంబును సంకల్పపూర్వకంబుగా దత్తంబు చేయించుకొని యారగించుడీ, సమయోచితంబుగా నీప్రభు విచ్చటికి విచ్చేసినని చెప్పెను. ఆవచనములను బ్రాహ్మణులు విని ఆసాహుకారిని దన చేతితో నుదకంబువిడువుమని ప్రార్థింపగా నతఁడు భ్రమజెంది తన మదిలోఁ దలఁచినదియేమనఁగా వీండ్రు ధారాపూర్వకంబుగా సంక ల్పంబుజేయుమని జలంబు విడిచిరేని ధనంబంతయు దత్తంబై పోవు నని యెంచి సాహుకారు భయంబునుజెంది వెనుకజిక్కినవాఁడై వారలతో నిట్లని వచింపుచున్నాడు. ఆర్యులారా నేను వృద్ధిపొంది నది మొదలుకొని పితృశ్రార్థంబు చేసినదేలేదు. ఈరీతిగా సేఖరిం చిన ద్రవ్యమును నిస్సారము చేయఁజాలను. నన్ను బాధపరచవల దని వివాదంబుచేయుచుండునపుడు బ్రాహ్మణులు ఆపోశనంబునకు కాలాతీతంబగుటనుగని దాదాసాహుకారిం జూచి నిష్ఠురవాక్యంబు లాడి నీవు ప్రమత్తుండవు మూర్ఖుండవు నీహస్తంబుచేత నీయుదకం బును విడువుము మావార్తలను తృణీకరించి వినకుంటివేని నీవతి శీఘ్రంబున చెడిపోదువని చెప్పగా దాదాసాహుకారువిని ఖిన్నుడై లేచి వారలంజూచి యిది నామదేవుఁడు చేసిన సంతర్పణయని తన హస్తంబునుండి జలంబును జారవిడువగా శ్రీపాండురంగడు భోక్త యని ఆపోశనంబుచేసి వారందఱు తృప్తిగా నారగించిరి. తరువాత నామదేవుడు చందనకుసుమంబులు నాబ్రాహ్మణులకు నొసంగి తాం బూలములందు నొక వరహానుంచి దక్షిణయిచ్చిపంపెను. అప్పుడా సాహుకారు దానింజూచి యకటా ధనంబంతయు నీలాగున దత్తంబై



పోయినదేయని తత్తరపడి చింతించుచుండెను. తదనంతరము నామ దేవుఁడు దాదాసాహుకారిని భోజనంబునకు విచ్చేయుమనిపిలువగా నతఁడయ్యయ్యో నావిత్తంబంతయు నీమూలంబున నష్టంబైపోయి నదని దుఃఖించి చెప్పఁగా నామదేవులు అయ్యా యీ క్షేత్రంబున నైదుదినంబులు బ్రాహ్మణులారగించిరి, నీకు మిక్కిలి సుకృతంబు సిద్ధించె, నీవిప్పుడు సుఖంబుగనారగింపుము, అనఁగా నాసాహుకారు ఓనామదేవా ఆసుకృతంబువలన నీకమీఁద వచ్చు సుఖము నాకు వలదు, నీవిప్పుడు నాకు వడ్డియును అసలును సంపూర్ణంబుగా నా చేతికి నొసంగినయెడల నేనన్నంబును భుజింతును, లేనిపక్షమున నాప్రాణంబును నిచ్చటనే విడుతుననిన నామదేవుఁడీనిర్బంధమును జూచి శ్రీపాండురంగని ధ్యానించి హరీ నారాయణా అచ్యుతా కేశవా ముకుందా మురహరీ జనార్దనా శ్రీధరా శ్యామసుందరా పండరీనాథా పాండురంగా నష్టంబుగాని వ్యాపారంబును జేసితిని. దానియొక్క క్రియాఫలంబీతండెఱుంగక మోదంబుమాని ఖేదంబు జెందుచున్నాఁడు, మీరాప్తులై యుండుటంజేసి యిత్తఱి దాసుని నాదరించి రక్షింపవలయును, ఓ దామోదరా దాసుని ప్రాప్తం బెట్లున్నదోయని ప్రార్థింపుచుండగా శ్రీపాండురంగడు ప్రత్యక్షంబై నామదేవులం జూచి యిట్లనియె. నీవా సాహుకారితో నేమియుం జెప్పక నాతని జలంబులోనికిం బిలుచుకొనిపోయి స్నానంబు చేయిం చితివేని నతఁడా నీటియందున నాశ్చర్యంబులైన వింతలను జూచు నని చెప్పి మరిగిపోయిరి. అట్టితఱి సాహుకారి నామదేవులనుగనుం గొని మిక్కిలి నిందితములయిన మాటలాడి జగడముచేయుచుండు టను నామదేవులుజూచి ఓమహాత్మా నీధనంబును పదిభాగంబులధి కంబుగా బెంచిపెట్టితిని, ఇఁక నాలుగునెలలుతాళుకొంటివేని నీకా ధనంబును జూపించెదను, అప్పుడే నీవు దానిం బుచ్చుకోవచ్చును.

అనఁగా నతఁడా ధనంబీతక్షణం బియ్యనియెడల నాప్రాణంబుపోవు
నని యతని చేతినిం బట్టుకొనెను. అప్పుడు నామదేవు లతనింజూచి
అయ్యా నీవు మొలపాడుగు జలములోనికి వచ్చితివేని నీధనంబును
నీకిచ్చివేయుచున్నానని చెప్పి వానిచేతిని బట్టుకొనిపోయి యేటిలో
దిగి జలంబున బిలుచుకొనిపోవుచుండఁగా ఆసాహుకారు ఓరీ నామ
దేవా నన్ను లోఁతుజలంబునకుం గొనిపోయి ముంచుటకొఱకు
యోచించియున్నావు కాఁబోలు అని చెప్పుచుండునప్పుడు నామదేవు
లతని చేతులంబట్టుకొని అయ్యా యీయేటిజలంబునందు స్నానంబు
చేయుము తమకు నొకతక్కువయు రానేరదని చెప్పి తలను గట్టిగా
బట్టుకొని జలంబునందుముంచఁగా ఆనీటియందతఁడు అతివిచిత్రంబు
లను జూచెను. అదేమనిన తాను పాతాళలోకంబునకుంబోయినట్లు
గాను నచ్చట తేజోమయంబయిన తేజస్సొకటి ప్రకాశించుచుండు
నట్లుగాను అతి సుందరంబయిన గృహంబొకటి తేజరిల్లుచుండునట్లు
గాను బొడగనెను. ఆగృహారామంబున దేవలోకంబునందుండు కల్ప
వృక్షంబులు విశేషముగానుండెను. ఇదికాక కామధేనువు చింతా
మణిమొదలగు నవనిధులు నచ్చోటున చేరియుండెను. అట్టి సుందరం
బైన స్థలంబునుచూచి సాహుకారి ఆనందింపుచుండగా, అతిసుంద
రాకారులైన తురుష్కులిద్దరు సాహుకారుదాపునకువచ్చి అయ్యా
రాజుగారు నగరిలోపల ఆస్థానమంతపంబునందు క్షేంచేసియున్నారు
తమ్మును నచ్చటికి బిలుచుకరమ్మని సెలవిచ్చియున్నారని చెప్పఁగా
సాహుకారు విని భ్రాంతినొందినవాఁడై వారితోఁగూడ లోపలికి
జొచ్చెను. అప్పుడచ్చట నున్నతంబయిన సింహాసనంబుపై రాజు
గూర్చుండియుండుటనుజూచెను. అప్పుడా రాజసభయందుండు పరి
జనంబులలో తురుష్కులు మెండుగానుండిరి. సాహుకారు వారిం
జూచి భయంబుజెంది నామదేవుడిప్పుడీసంకటంబును నాకు నివర్తింప



జేసెనేని అతఁడు నాకియ్యవలసిన ఋణంబును నేనడుగడములేదని
తనమనంబునదల్చెను. ఆతలంపును నామదేవులు తెలిసికొని యిది
తనకొక యాధారంబని తలంచుచుండెను. ఇట్లుండ రాజుగా రతని
భోజనంబునకుఁ బిలుచుకొని రమ్మని నామదేవున కాజ్ఞాపించఁగా
నతఁడు సాహుకారి సమీపంబునకు వచ్చి అయ్యా భోజనార్థంబు
బంతిలో గూర్చుండుమనగా సాహుకారి చింతాక్రాంతుఁడై యిట్లని
చెప్పెను. అయ్యా తురుష్కులతోఁ గూడి భుజించుట నిందితముల
గును, కాఁబట్టి నాకీభోజనంబు వలదని చెప్పెను. అప్పుడు నామదే
వులు పండరీనాథుఁడే ప్రభువై మిమ్ము భక్షించుటకు బిలుచుకరమ్మ
నిరని చెప్పగానే సాహుకారు ఓరీ నామదేవా నీవు సన్మార్గుఁడవై
యుండియు నన్ను భ్రష్టునిఁగా జేయఁదగునా, ఇప్పుడిట్టిభీతిలోనుండి
నన్ను నివర్తింపఁజేసితివేని నీవు నాకియ్యవలసిన ధనంబును నేనడు
గడములేదు నన్నీయాపదనుండి తొలగింపుము, ఇప్పుడు నీవుచేయు
మేలును నేనెన్నటికి మరవనని చెప్పెను. ఆపల్కులను నామదేవులు
విని అయ్యా నీవు భీతిజెందకుము, సంశయించక వచ్చి యన్నంబును
భుజింపుమని చెప్పెను. ఆమాటలనువిని సాహుకారు అయ్యా నేనీ
బంతిలోగూర్చుండి భుజించను, నాచేతులార వంటచేసికొని యిచట
భుజింతుననఁగా నామదేవులామాటలువిని వెడలిపోయి రాజుగారికి
యీసంగతినంతయు దెలియఁజేసెను. అంత నారాజుగారు సాహు
కారియొక్క సంచితపాపంబిదియని చెప్పి వంటకు సామగ్రులు యిమ్మ
నిరి. నామదేవులు వాటిందీసికొనివచ్చి సాహుకారి చేతికి నిచ్చెను.
అప్పుడాతండదితీసికొని తురుష్కులు లేనట్టిస్థలంబును జూపినయెడల
వంటచేసి భుజించెదనని చెప్పి అయ్యా యిప్పుడిట్టి యుపకారంబును
నీవు చేసినట్లయితే నీవియ్యవలసిన పైకంబును నేనడుగక విడిచిపె
ట్టెదనని చెప్పెను. అప్పుడీశ్వరుని మాయచేత వాని కన్నులకు

యేదిన్ని కనఁబడక యుండెను. అంత జలంబునందుండి నాబ్రాహ్మ
సాహుకారి బైటికివచ్చి కన్నులు తెరచిచూచి తాను పండరీపుర
మునందుండుటగని యిదేమాశ్చర్యంబని మనస్సునఁదలఁచుకొని తన
గృహంబునకువచ్చి తనచేతిలోనున్న మూటను విచ్చిచూచి అంద
నేకవరహాలుండుటను గని మిక్కిలి సంతోషమునొంది యిది యీ
శ్వరమహిమంబనియెంచి కొనియాడుచు నామదేవులగృహంబునకు
వచ్చి వారికి దండము సమర్పించి అయ్యా తమకు పండరీనాథుఁడు
సర్వవిధంబుల స్వాధీనుఁడైయున్నాఁడు మీప్రభావమును గొనియాడ
బ్రహ్మాదులకు సహితము నలవి కాదని పొగడుచు వారివద్ద సెలవుపొంది
తనగృహంబునకుఁబోయెను.

శ్రీజానకీనాథాయనమః.

# జ్ఞానదేవుల చరిత్రము.

గోదావరీతీరమున ఆపేగామను గ్రామమునందు గోవిందభట్టు
డను నొక బ్రాహ్మణశ్రేష్ఠుడుండెను. అతనికి నీరాభాయను సుశీలా
తిలకము భార్యయై యుండెను. ఆయమ్మగారు "కార్యేషు దాసీ
కరణేషు మంత్రీ" యను ప్రమాణమురీతిగా తనపతికి సకలశుశ్రూ
షలు చేయుచు పతిని దైవముగా భావించియుండును. ఇట్లుండగా
గోవిందభట్టు సంసారమునకు తగునైనభార్యను భగవంతుఁడు కృప
చేసెనని తనలోఁదాను సంతోషపడుచు గృహధర్మములను విడువక
నడిపించుకొనుచుండెను. ఇట్లాసతీపతులు అతిథియభ్యాగతుల నారా
ధించుచు శ్రీపాండురంగని భజింపుచుందురు, ఇట్లుండఁగా గొంతకా
లమునకు భగవత్కృపచే నొక సత్పుత్రుఁ డవతరించెను. అతనికి
విఠలుఁడని తిరునామంబుంచి అతిగారాబముతోఁ బెనుచుచుండఁగా
నాబాలునికి బాల్యమునందే శ్రీహరిమీఁదిభక్తి మిక్కుటముగా గలిగి



యుండెను. ఎనిమిదవవయస్సున యాత్రచేయవలెననే అపేక్షతో
తండ్రివద్దికివచ్చిదండముసమర్పించి తీర్థయాత్ర చేయుటకు సెలవిమ్మని
యడుగఁగా నతఁడు తనపుత్రునకిట్టి జ్ఞానము కలిగినదేయని సంతో
షించి ఆజ్ఞ యిచ్చెను. అనంతరము విఠలుడు తన తల్లిదండ్రులకు
దండప్రణామంబులిడి అనుజ్ఞ పుచ్చుకొని వెడలి సకలతీర్థయాత్రలు
చేయుచు కుచేలపురము గోవర్ధనము వెంకటాచలము శ్రీకాంచి
శ్రీరంగము మొదలైన దివ్యదేశముల సేవించి దివ్యతీర్థంబుల గ్రుంకి
నచ్చటచ్చట విచ్చేసియుండు భగవద్భక్తులను సేవించి అళకాపురిం
జేరి చక్రతీర్థమున స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు దీర్చుకొనుచుండ
సర్వసద్గుణోపేతుండగు సిద్ధోపండితుఁడను నొకవిప్రుఁడు తన సమీ
పంబునకు వచ్చి నాతని మృదుమధురాలాపంబులచే నాదరించి ఓ
భాగవతాగ్రేసరా నీ ముఖారవిందమునందు బ్రహ్మవర్చస్సు గానం
బడుచున్నది. తాము నాగృహంబునకు విచ్చేసి అతిథివై నాచే
నొసఁగబడు ప్రసాదంబును స్వీకరించి నన్ను ధన్యునిఁగా జేయవల
యునని ప్రార్థించి యతనిం దనగృహంబునకు వెంటబెట్టుకొనిపోయి
దివ్యాన్నంబులిడి చందన కుసుమ తాంబూలాదులొసంగి ఆదినము
రాత్రి తన గృహంబున నామహాత్ముని శయనింపఁజేసి తాను నొక
ప్రక్కన నిద్రించుచుండఁగా నతని స్వప్నమున శ్రీహరి సేవనొసఁగి
ఓ సిద్ధోపండితుఁడా నీయొక్క సుపుత్రికయగు కన్యకామణిని యీ
విఠలునికిచ్చి వివాహము చేయింపుమని నియమించి యదృశ్యుండ
య్యెను. అంత నాపండితుఁడీ స్వప్నమును విఠలపంతునకు తెలిపిం
పఁగా నతఁడువిని నేనెన్నఁడును నామనస్సున తలచనటువంటికార్య
మును మీరు వచింపుచున్నారు. నాకెంతమాత్రము యిష్టములేదని
మిక్కిలివిరక్తిగా చెప్పుచుండుటను విని నాసిద్ధోపండితుఁడు అయ్యా
యిది శ్రీపండరీనాథుని అనుజ్ఞయేగాని నేనుగా చెప్పునట్టి వచనము

లుకాదు, శ్రీహరియాజ్ఞను శిరసావహించి నీవు నాపుత్రికను వివాహముచేసుకొనుట వుత్తమమనిచెప్పఁగా, అయితే శ్రీపండరీనాథుడు నాకు నేరుగా నియమించినయెడల వివాహమాడెదనని చెప్పెను. ఆవచనములనువిని సిద్ధోపండితుఁడు తామీదినము యశకాపురియందుండినట్లయితే శ్రీపాండురంగడు మీకు నియమించుననని విన్నవించఁగా విని విఠలుఁడు మహాదుఃఖాక్రాంతుఁడై యచ్చటనే యుండి భగవధ్యానముచేయుచుండెను. శ్రీపాండురంగడు విఠలపంతుస్వప్నమునందు సేవనొసఁగి నీవీకన్యకను వివాహముచేసుకొమ్మని యాజ్ఞాపించి యదృశ్యుఁడయ్యెను. విఠలపంతుఁడీ స్వప్నమును గని ఆనందింపుచు మేల్కొని సిద్ధోపండితునికీ స్వప్నవృత్తాంతమును జెప్పెను. ఈవచనములను పండితుఁడు విని ఆనందపరవశుఁడై దంపతులకు పొంతనములువిచారించి అన్నిపొంతనములు సరిగానున్నందున వివాహముహూర్తము నిశ్చయించి సర్వసామగ్రులను సేకరించి పచ్చని పందిలిని వేయించి బంధుమిత్రాదులను రావించి సకలవాద్యములు భోరుమనిమ్రోయఁగా కొందరుబ్రాహ్మణులు అష్టకములుబాడగా కొందరు విధిపూర్వకముగ నవగ్రహశాంతిచేయఁగా నచ్చట విచ్చేసియుండు సర్వజనులు గుమిగూడి అక్షతలు పుష్పములు గోవింద గోవిందయని వధూవరులపైచల్లి యాశీర్వదించు సమయమునందు పెండ్లికొమారుఁడు మాంగల్యధారణము చేసెను. అనంతరము వధూవరులకు శేషబియ్యము పెట్టి వజ్రమణిమయాది యాభరణములును పట్టుపీతాంబరములును ఆశీర్వాదపూర్వకముగా నొసంగి వచ్చిన బంధువర్గాదిసర్వజనులకు భక్ష్యభోజ్యాన్నంబులిడి చందన కుసుమ తాంబూలాదులొసఁగి తృప్తిపరచి, ఆరీతిగానే నాలుగుదినములు పెండ్లిగావించి అయిదవదినమున కంకణవిసర్జనము జేసి మహా కుతూహలము జెందిరి. ఈవిధముగా విఠలపంతు వివాహముచేసు



కొని కొంతకాలమచ్చటవసించి జననమరణాంబుధికి తరుణోపాయమైన పండరీపురమును సేవించవలెననుయాశగొని తనమామగారిని శ్రీపండరీపురి యాత్రచేయుట కనుజ్ఞయిమ్మని యడుగగా వారదివిని ఆహా పండరీపురమతిశ్రేష్ఠమైనది, అట్టి క్షేత్రమునకు మనముకూడ పోయి సేవించిరావచ్చునని తలచి ఆనందభరితుఁడై నేనున్ను నీతో కలిసివచ్చెదనని చెప్పి తన బంధుమిత్రాలను వెంటబెట్టుకొని వెడలి పండరీపురముజేరిరి. ఆక్షేత్రమహిమను పొగడ బ్రహ్మరుద్రాదులకు నలవికాదు. పండరీపురమును సేవించినమాత్రమున పంచమహాపాతకములు పగుగులిడును. చంద్రభాగానదియందు స్నానముచేసినమాత్రమున సంచితాగమ ప్రారబ్ధమయిన పాప కర్మములు నశించును. ఆ పురంబున నడుగుపెట్టినమాత్రంబున జ్ఞాన భక్తి వైరాగ్యములు తనంతటనేసిద్ధించును. సన్నిధిని ప్రదక్షిణముచేసి శ్రీపాండురంగని నాలింగనముచేసుకొని వారిని చక్కగా కనులార సేవించిన జనన మరణ తాపంబులు మాని పునరావృత్తిరహితమైన మోక్షంబును పొందుదురు. ఇట్లు మహావైభవముగా ప్రకాశించెడు చంద్రభాగా భీమనదులనుఁ గన్ని దీర్ఘదండప్రణామంబులను జేసి విధియుక్తముగా స్నానముచేసి యనుష్ఠానంబులు ముగించుకొని అందరుగూడి కరతాళంబులువేయుచు శ్రీపండరీనాథుని నిశ్చింతగా స్మరణచేయుచు సన్నిధి ప్రదక్షిణంబుచేసి గోపురమంటపప్రాకారంబులను సేవించి వాటిని నిత్యసూరులని భావించి దేహముమరచి క్రిందపడిపొర్లుచు పండరీనాథా పాండురంగా పుండరీకవరదా పురుషోత్తమా ధరాధర ధరణీనాథా దాసరక్షకా దానవశిక్షా మధుసూదనా మన్మథజనకా యని పరిపరివిధముల స్తోత్రములు చేయుచు తమపాపంబుల నెంచి మిక్కిలిచింతించుచు భాగవతులందరు కరతాళములువేయుచు పలువిధములనాడుచు మహామంటపముజొచ్చి నచ్చటనున్న విచిత్రము

లనుగాంచి యంతరాళముఁజొచ్చి నచట అర్చకపరివారములనుగని
ముచ్చటించుచు గర్భగృహముఁజొచ్చి కమలనాభుని కనులార సేవించి
ఆలింగనముచేసి ముద్దులిడి వుభయతిరువడిఘళులందు తమశిరమును
నునిచి యెలుఁగెత్తియేడ్చుచు ఓపండరీనాథా నాయందున యిన్నా
ళ్లకు నీకరుణాకటాక్షముకలిగెనా ఇఁక నీయందలిభక్తి నాకు సదా
యుండునట్లు కృపచేసి రక్షించవలయుని పలువిధముల వేడుకొనుచు
పురప్రదక్షిణంబుచేసి నొకనిలవరమున జేరి నచ్చట వసించియున్న
భాగవతులతోను తన బంధువర్గములతోను ప్రతిదినము శ్రీపాండు
రంగని ధ్యానించుచు అతివిరక్తచిత్తుఁడై కొంతకాలమచ్చటవసించి
యుండెను. అనంతరము తనతో కూడివచ్చిన బంధుమిత్రాలతో
నచ్చటినుండి వెడలి తన మామగారింటికివచ్చి కొంతకాలమచ్చట
వసించియుండి తనతల్లిదండ్రులను సేవించవలయునను యాశగలిగి
తన మామగారితో విన్నవించి అనుజ్ఞయిమ్మని యడుగఁగా సిద్ధో
పండితుడు తన కొమార్తెనున్న యల్లునిన్ని పిలుచుకొని యపేగా
మను గ్రామమునకు వచ్చిచేరెను. అప్పుడు విఠలపంతు తనభార్య
సహితముగ జననీజనకులకు దండప్రణామంబులిడి భక్తివినయము
తో నిలుచుండఁగా సిద్ధోపండితుడు తనకొమార్తెకు వివాహము జరి
గిన సంగతులను వింతగాచెప్పఁగ విని యత్యానందభరితుఁడై సిద్ధో
పండితుని తగుమైన మర్యాదలతో నాదరించి పంపివేసిరి. తరువాత
విఠలపంతు తనభార్యతోఁగూడి తన తల్లిదండ్రులకు సదా శుశ్రూ
షలుచేయుచు శ్రీపండరీనాథుని సదా చింతించుచు మిక్కిలి విరక్తి
గలవారై కాలము గడుపుచుండఁగా కొంతకాలమునకు వయోవృ
ద్ధులుగానుండినతల్లిదండ్రులు పరమపదముజెందిరి. వెనుక విఠలపంతు
వారికి చేయవలసిన చరమక్రియలు మొదలగునవి సాంగముగాజరిపి
గృహస్థధర్మంబునం దిచ్ఛలేక విరక్తిజెందినవాడై తనభార్య రూప



లావణ్యగుణములు గలిగి మోహనాకారముతో నుండినన్ని భార్య
యందలి ఆశాపాశములను బొత్తిగావిడనాడి గృహస్థధర్మమునుచూ
డక శ్రీకృష్ణ చరణకమలములయం దధికభక్తిశ్రద్ధలతో ప్రీతినుంచి
ఇహలోకసుఖములు మనకు కష్టమునిచ్చునని వాటియం దిచ్ఛలేక
యుండుట శ్రేష్ఠమనితలంచి సదా భగవధ్ధ్యానముచేయుచుండెను.
ఈసంగతులను పరస్పరముగ వీరిమామగారు వినివచ్చి తన కొమా
ర్తెను యల్లుని వెంటబెట్టుకొని తన నివాసస్థానమగు యళకాపురికి
వచ్చిచేరెను. అదియు క్షేత్రవాసముగ నుండుటవలన విఠలపంతు
సదా సాధుసమాగమముచేయుచు స్థిరచిత్తముతో శ్రీహరిని ధ్యాన
ముచేయుచుండెను. ఇట్లుండఁగా తనకు విరక్తి యతిశయించి సంసా
రము విడనాడి సన్యసించుటకు వుపాయము వెదకుచు తనభార్యతో
అప్పుడప్పుడు ఓసతీ నేను సన్యసించవలయుననే యభిలాష జెందియు
న్నానుగనుక నీవు నా యభిప్రాయమును వృథపరచక నాకోరికను
సాఫల్యముచేయవలయునని ఆమెను పలుమారడుగుచుండును. ఆమె
వారి వచనములను విని మరుమాటచెప్పక మిక్కిలి చింతాక్రాంతు
రాలై తల్లిదండ్రులతో తనపురుషుఁడు సన్యాసాశ్రమమునం దిచ్ఛ
గలిగి అప్పుడప్పుడు తనతోవచించుచున్న సవిస్తారమును చెప్పెను.
ఆమాటలనువిని వారదరిపడి ఓతల్లీ మీకు సంతతిలేనందున సన్య
సించుట తగదుగాన నీవు సమ్మతించవలదని చెప్పిరి. ఆమాటలనువిని
ఆసతి మిక్కిలి జాగరూకతగలిగియుండెను. ఇట్లు కొంతకాలము గడ
చినపిదప విఠలపంతు గంగాయాత్రచేసివచ్చెదనని తనభార్యను నడు
గఁగా నాసమయమందామె గృహకృత్యములను నిర్వహించి యల
సటచే దేహస్వాధీనము తప్పియుండినందున తనపతి యడిగినవచన
ము లిట్టివని యెఱుఁగక యే. యట్లు చేయుండని మరుత్తరమియ్యఁగా
విఠలపంతు పరమానందముజెంది గృహమువిడచి వెడలి ఘోరసంసా

రమందు మునిగిన నాకు విమోచనకాలము నేడు కలిగెనుగదాయని ఆనందాబ్ధిని దేలుచు శ్రీహరి గుణంబులు బాడుచు నాడుచు చని చని వారణాశినిజేరి భగవద్గీతాపారాయణముచేయుచు వాటియర్థ విశేషములను పెద్దలచేవినుచు తరుణోపాయమునకు తీర్థపాదుడను యాచార్యుని నాశ్రయించి శుశ్రూషాపరుఁడై యుండి యొకదినము వారి పాదకమలములకు దండప్రణామంబులిడి స్వామీ దాసునికి సన్యాసాశ్రమమునందు మిక్కిలి యపేక్షగలిగి యుంటున్నది గాన దేవర్లు దాసునియందు కృపాకటాక్షమునుంచి కాషాయం బనుగ్రహించి నన్ను ధన్యునిగాజేయవలయునని మిగుల నార్తితో వేడుకొనఁగా జ్ఞానానుష్ఠానసంపన్నుఁడగు నాయాచార్యుండు వానియం దధికకరుణతో లెమ్మనియాజ్ఞాపించి నీకు దారాపుత్రాదులున్నారా యనియడుగ విఠలుఁడు సన్యాసాశ్రమమునం దిచ్ఛకలిగినవాడవుట చేత తనకు భార్యయుండిన్ని స్వామీ నాకెవరున్ను లేరనిచెప్పెను. ఆమాటలను తీర్థపాదులు విని సంతోషమునొంది సన్యాసాశ్రమమును యొసఁగి యతనికి చైతన్యుఁడని తిరునామమునుంచి వానియం దధిక ప్రీతి విశ్వాసములతో యుండెను. ఇట్లుండగా యీసంగతులను అళకాపురియందుండు యితనిభార్యవిని చింతాసాగరంబున మునిఁగి యేడువసాగెను. అప్పుడు సిద్ధోపండితుడు తనకొమార్తెకు సమాధానములుచెప్పుచు యిదో చూడుము యీరాగిచెట్టునందు శ్రీవిష్ణుమూర్తియున్నాఁడు. అతడుండు చోటునం దఖిల దేవతలు నున్నారు. గావున నీవు స్నానానుష్ఠానములు దీర్చుకొని ప్రతిదిన మీవృక్షమునకు ప్రదక్షిణ నమస్కారములు చేయుచుంటివేని నా యశ్వత్థవృక్షమున వేంచేసియుండు భగవంతుఁడు కరుణించి నీపతిని నీకొసంగునని నియమించెను. ఆసతి జనకుని వాక్యములయందు విశ్వాసమునుంచి నాలాగే ప్రతిదినమున్ను చేయుచుండెను. ఇట్లుం



డఁగా కాశీపట్టణమందున్న తీర్థపాదస్వామి సేతుయాత్ర చేయవలెనను తలంపుకలిగి నాక్షేత్రమునువిడిచి ప్రయాణమై అచ్చటచ్చట నుండు నదులయందు స్నానముచేసి భగవద్దరిశనము చేసికొనుచు గోదావరీ స్నానార్థము అళకాపురికి వచ్చి మార్గాయాసముచేత నచ్చట నొకయశ్వత్థవృక్షముక్రింద కూర్చుండగా విఠలపంతుభార్య ప్రదక్షిణముచేయుచుండి అచట విశ్రమించియున్న తీర్థపాదస్వామిని గాంచి భయ భక్తి విశ్వాసములతో వారిని చుట్టివచ్చి దండప్రణామంబులిడఁగ జూచి యతఁడు పుత్రవతివై పుణ్యవతిగా నుండుమని యాశీర్వదించెను. ఆసతి వారాశీర్వాదముచేసినదిజూచి ఓస్వామీ తామాశీర్వాదము జేసినది వేరువిధముగానున్నదని నవ్వెను. వారది విని ఓయమ్మా నీవిట్లు నవ్వుటకు కారణమేమో వివరించిచెప్పుమని యడిగిరి. ఆసాధ్వి వారిమృదుమధురవచనములనువిని స్వామీ నా భర్త కాశీక్షేత్రమునకుపోయి అచటవాసముచేయుచు సంసారమం దభిరుచిలేక సన్యాసాశ్రమము వహించియున్నారని కొందరిచే విని యున్నాను, గనుక భర్తలేక నేనెట్లు పుత్రుల గాంతును, అయితే తాము పెద్దలుగానున్నందున తమవాక్య మబద్ధముగా నుండదని తలచెదనని నుడువగా, ఆసన్యాసి తల్లీ నీభర్తకు సన్యాసాశ్రమమిచ్చిన వారెవరో తెలియలేదు, ఇట్టి పుత్తమసతీరత్నమును విడిచి సన్యాసము పుచ్చుకొనుట శాస్త్రవిరోధము, అట్టివానికి సన్యాసమిచ్చిన వారు ముందుగా ప్రాయశ్చిత్తముచేసుకొంకగాని అతఁడు పరిశుద్ధుఁడుగాడనిచెప్పి అయ్యో యింతటి పతివ్రతాయముగల సతిని విడచి సన్యాసముతీసుకొనుట తగదుతగదని నుడువుచు ఓ తల్లీ నీదుభర్త యొక్క పేరును వానిగురుతులను చెప్పినయెడల నేను తెలుసుకొందును. ఏలనంటే నేనాక్షేత్రంబునందు వాసంబుచేయుచున్నవాఁడనుగాన ఆమహానుభావుని కనిపట్టుదుననివచింపఁగా నావనిత తన

భర్తయొక్క రూపలావణ్యములను గుణాతిశయములను వివరము
గాచెప్పిన వాటినివిని ఓహో యిదేమాశ్చర్యము తప్పు మనవద్దనే
యున్నదని తలఁచి మిక్కిలిచింతనొందినవారై, ఓసుశీలా నీతండ్రిని
యీక్షణమే పిలుచుకొని నాతోఁగూడ వారణాశికి వచ్చినయెడల
నీపురుషుఁడు నీతోడఁగలసివచ్చుననఁగా నాసతి మిక్కిలిసంతోషము
నొంది వెంటనే తనతండ్రివద్దకు పోయి నాతీర్థపాదస్వాములచే నడి
చిన వృత్తాంతములనుచెప్పఁగా నతం డానందభరితుఁడై తనకొమా
ర్తెతోఁకూడవచ్చి తీర్థపాదస్వాములను సేవించి సాష్టాంగదండప్రణా
మంబులిడి విధిపూర్వకముగా పూజించి నిలువఁబడియుండఁగా తీర్థ
పాదులు తాను తెలియకచేసిన కార్యములను తెలిపించి యీయప
చారము నాతపస్సును చెరిపి నన్నపరాధినిగా జేసునుగాన తాము
తమ కొమార్తెను వెంటబెట్టుకొని నావెంబడి కాశీక్షేత్రమునకు
వచ్చినయెడల చైతన్యుడగు నీయల్లుని నీకొమార్తెతోడఁచేర్చిపంపె
దనని చెప్పి సిద్ధోపంతుని వారి కొమార్తెను పిలుచుకొని కాశీపట్ట
ణముచేరి తన శిష్యుఁడగు చైతన్యుని పిలిచి యింతలేతవయసుగల
నీభార్యను విడిచి నాతో మృషాభాషణలాడి సన్యాసము తీసుకొం
టివి, నేను నీకు సన్యాసమియ్యకమునుపు నీకు దారాపుత్రాదు
లున్నారాయని యడిగినప్పుడు నీవేలయబద్ధము చెప్పితివి, ఈచిన్నది
నీభార్యకాదా నిజమును చెప్పుమనఁగా చైతన్యుఁడు దిగులుజెందిన
వాడై గడగడవణకుచు యేదియుపలుకక నిశ్చేష్టితుఁడై యుండుటను
చూచి ఓరీశిష్యా నీవేలభయపడెదవు నిజమును చెప్పుమనుటను విని
చైతన్యుడు స్వామీ యీచిన్నది నాయొక్క భార్యయే, ఇందు కేసంది
యములేదు, అయితె నాభార్యకు బిడ్డలులేకుండుటచేత నిర్బంధము
లేదని భార్యనువిడిచి యిచ్చటికివచ్చి మిమ్మాశ్రయించునపుడు తా
మడిగిన ప్రశ్నకు సన్యసించవలయుననే యపేక్షచేత నబద్ధమాడితి



నిగాన నాతప్పులను మన్నింపవలయునని శరణాగతిచేసి భయభక్తి
విశ్వాసములతో నిలచియుండు శిష్యునిజూచి నీవు నీభార్యతోఁచేరి
సంసారసహితముగానుండి భగవద్భజనము చేయుచుండుము, నీకు
దీనివల్ల శ్రేయస్సుగలుగును, గురువాక్యముతప్పనివాడవని నిన్ను
పెద్దలు సన్మానింతురు. నీవు నావద్ద నబద్ధమాడి కాషాయముతీసు
కొన్నపాపమునకై నేను ప్రాయశ్చిత్తమును చేసుకొనెదను. నీవు
నీభార్యను తీసికొని వెడలుమని వచించిన గురువాక్యమును శిరసా
వహించి తనభార్యను పిలుచుకొని యళకాపురికి వచ్చిచేరి నాదంప
తులు సదా భగవద్భక్తిచేయుచు కాలమునుగడుపుచుండిరి. ఇట్లుం
డఁగా నా గ్రామమున వసించు బ్రాహ్మణులలో కొందరు వీరలను
జూచి పూర్వము గృహస్థుగానుండి అటుపిమ్మట సన్యసించి కాశీక్షే
త్రమునందు వాసముజేసి చాపల్యము విడువక మరల గృహస్థధర్మ
మును యవలంబించి యుండుట శాస్త్రవిరోధమని జాతికట్టుపాటు
చేసిరి. ఇట్లితరులు తమ్ముదూషించి పలువిధకష్టములు చేయుచుండు
టనుగని ఆదంపతులా గ్రామమును విడిచిపెట్టి సమీపమునయుండు
అడవికిజని నచట వాసముచేయుచు భగవంతుని కల్యాణగుణముల
యందు చిత్తమునుంచి అహోరాత్రములు భగవన్నామోచ్చార
ణముచేయుచు నాయడవికి సమీపగ్రామములందు వసించు బ్రాహ్మ
ణుల గృహంబులకునేగి వారలను యాచించి దేహయాత్ర జరుపు
కొనుచుండిరి. ఇట్లు కాలము గడుపుచుండఁగా కొన్నాళ్లకు చైత
న్యుని భార్య గర్భవతియై బ్రహ్మరుద్ర విష్ణుహాంశముల ముగ్గురు
సుపుత్రులను యోగమాయాంశమున నొక సుపుత్రికను బడసెను.
ద్వాదశదినంబున రుద్రాంశమున పుట్టిన మొదటిబిడ్డకు నివృత్తిదేవు
డనియు విష్ణుహాంశమున నవతరించిన రెండవబిడ్డకు జ్ఞానదేవనియు
బ్రహ్మాంశమున వుద్భవించిన మూడవబిడ్డకు సోపానదేవుడనియు

యోగమాయాంశమున పుట్టిన నాల్గవబిడ్డకు ముక్తాభాయియనియు నామకరణము చేసి మిక్కిలి గారాబముతో బెనుచుచురాగా నా బిడ్డలు నానాటవృద్ధినొంది బాల్యచేష్టలతో వేడుకగా నాటలాడు చుండుటను గని జననీజనకు లానందింపుచు కాలమును గడపుచుందురు. కొంతకాలము శ్రీమన్నారాయణుని దివ్యపాదారవిందముల యందు చిత్తమునునిలిపి వారినామోచ్చారణములుచేయుచుందురు. కొంతతడవు తమ జననమరణదుఃఖములను తలఁచి వీటిని యేలాగు జయింప భగవంతుఁడు కృపచేయునోయని చింతింపుచుందురు. ఇట్లు దంపతు లొకరొకరు కలిసిమెలిసి అత్యానందభరితులై నావనంబున వాసముచేయుచుండఁగా నాసమీపగ్రామవాసులైన బ్రాహ్మణులు కొందరు యీసుపుత్రులయొక్క ముఖములను చూడకూడదని అతి నిందితమైన దుర్భాషలచేదూషింపుచుండుటను వీరువిని నాదూషణములుభూషణములని తలఁచి మిక్కిలి సంతోషముతో భగవద్గుణానుభవములుచేయుచు తృప్తిజెందియుందురు. ఈపుత్రులు ముగ్గురు మిక్కిలి గారాబముతో పెరుగుచురాగా నీపుత్రులతల్లి తనపతితో మనబిడ్డలకు వుపనయనము చేయించవలయునని నిర్బంధముచేయఁగ చైతన్యుఁడువిని నాలాగేచేయించెదనని తనభార్యను సమాధానపరచి అతఁడు సమీప గ్రామమునందు వసించుచున్న బ్రాహ్మణుల వద్దకుపోయి వారలకు వందనములొనర్చి ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా తాము సకలశాస్త్రములను యెఱిఁగిన మహాపెద్దలు మేము చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తము చేయించి మమ్ముల నొకపద్ధతిని నిలిపి మీవానిగ యంగీకరించి రక్షించవలయునని మిక్కిలి వినయముతో ప్రార్థించిరి. ఆమాటలు విని బ్రాహ్మణులలో కొందరు ధర్మశాస్త్రములను పరిశోధించి మీకు ప్రాయశ్చిత్తముచేయుటకన్న మీదేహములు విడుచుటయే మీకు తగుమైనప్రాయశ్చిత్తమనియు, సన్యా



సికి పుట్టిన బిడ్డలకు కర్మముచేయవలయుననే నిర్బంధములేదనియు చెప్పి విడిచిరి. ఆమాటలువిని చైతన్యుఁడు మిక్కిలి విచారమునొంది పరిపరివిధముల నాలోచించి యేదిన్నితోచక తనభార్యవద్దకువచ్చి నడచిన వృత్తాంతమును తెలిపించి యికమీద మన ప్రాణములుండి ప్రయోజనమేమి ఆ బ్రాహ్మణులు చెప్పినప్రకారము మన ప్రాణంబులు వదలుకొనుటయే వుచితంబనియెంచి ఆసతీపతులు తమ బిడ్డలకు తెలుపక నిర్మానుష్యమైన యడవికిజని ధ్యానాసక్తులై భగవన్నామములను స్తుతిజేసి యింగితయోగముచే భగవంతుని ధ్యానించుచు బ్రహ్మకపాలమును భేదించుకొని నాద్వారముఖముగా తమ దేహమును విడిచి పరమపదంబుజేరిరి. అనంతరము తమ జననీజనకులు తమ్మును విడిచిపోయినసంగతులు పుత్రులు మువ్వురు తెలిసికొని ఆ బ్రాహ్మణులవద్దకుఁ జని వారికి దండప్రణామంబులిడి తమ జననీజనకులు దేహములను పరిత్యజించిన సంగతులను తెలిపి మాకు ప్రాయశ్చిత్తమును విధించి మమ్ము రక్షించుటకుపాయము తెలియపరచవలయునని యడుగ వారలు ప్రతిష్ఠానమను పట్టణమం దనేక పండితులు వసింపుచున్నారు, అచ్చటికి బోయి విచారించినయెడల వారు శాస్త్రవిధిపద్ధతిని మీకు ప్రాయశ్చిత్తమునుచేసి యంగీకరింతురు, మీరచ్చోటికిపోనియెడల కార్యసాఫల్యముగానేరదని చెప్పఁగా విని నివృత్తిదేవుఁడా బ్రాహ్మణులను చూచి యిట్లని వచింపుచున్నాఁడు. నేను జ్ఞానస్వరూపుడనుగాన కరచరణములు లేనివాఁడనని నుడివెను. జ్ఞానదేవులు నేను కర్మవికర్మములకు వేరుపడినవాడనెను. సోపానదేవులు సర్వశాస్త్రార్థఫలప్రదంబగు భగవన్నామసంకీర్తనలే ప్రధానములు గావున జ్ఞానాధికులకు వర్ణాశ్రమధర్మము లెందుకని పల్కెను. ఆమాటలనువిని నా బ్రాహ్మణోత్తములలో కొంద రొక పత్రికను వ్రాసి నారిచేతికిచ్చి వీటిని ప్రతిష్ఠానపట్టణమునకు తీసు

కొనిపోయి యచ్చటనున్న బ్రాహ్మణుల కియ్యుడనిరి. వారావచనములనువిని నాపత్రికను చేకొని భగవన్నామము లుచ్చరించుచు అతిశీఘ్రముగా పోవుచు దారిలో గోదావరినిం గని స్నానముచేసి ప్రతిష్ఠానపట్టణము జేరి అచటనున్న బ్రాహ్మణగోష్ఠిని చేర్పించి నా బ్రాహ్మణోత్తములకెల్ల దండప్రణామంబులిడి తాము దెచ్చిన పత్రికను వారలచేతికిచ్చి యెదుటనిలిచిరి. వారాపత్రికను చదివి సకల శాస్త్రములు పరిశోధించి సన్యాసియొక్క సంగమమునకు జాతిగోత్రములు వారు చేయవలసిన క్రియలేవిన్ని శాస్త్రములందు చెప్పియుండలేదు. అయితే మీరు సర్వకాలములయందు శ్రీహరి చరణారవిందములను మనంబున నిల్పుకొని ధ్యానించుచుంటిరేని సర్వకర్మములు చేయకయే చేసినవారివలె ఫలమునుపొంది కృతార్థులగుదురని చెప్పిరి. ఆమాటలనువిని నాచిన్నవాండ్లు చెప్పుచున్నారు, మాకు కలిగియుండు యోచనయు యీలాగేను, వాటికి సరిగా మీరున్ను వచించితిరిగాన మేమతి సంతోషమును పొందితిమనిరి. అప్పుడా గోష్ఠియందున్న బ్రాహ్మణుడొకడు నాచిన్నవాండ్లను జూచి మీతిరునామములేమి వాటినిచెప్పుడని యడుగఁగా వారు తమ తిరునామములను వేరువేరుగా చెప్పిరి. ఆమాటలనువిని మరియొక బ్రాహ్మణుఁడు జ్ఞానశాస్త్రములోకమైన యెఱుఁగకనే జ్ఞానదేవుడని పేరువహించుట సరికాదని చెప్పుచుండునట్టిసమయమునం దొకమహిషము బరువును మోసుకొనిపోవుటనుచూచి యీమహిషమునకు కూడ జ్ఞానదేవుఁడని పేరువుంచినట్లు నీతల్లిదండ్రులు నీకు జ్ఞానదేవుడని తిరునామముంచినది సరికాదు. యోగ్యతలేక వట్టిపేరుమాత్రముండి ప్రయోజనమేమని అసూయచే చెప్పిన మాటలను జ్ఞానదేవుడు విని అంజలీహస్తుఁడై చెప్పదొడఁగెను. స్వామీ మీరు చూపిన మహిషమునకున్ను నాకున్ను భేదములేదు. చైతన్యము యెచ్చ



టను యేకరీతిగానేయున్నది, అన్నిటియందును శ్రీహరి అంతర్యామియై విశ్వమంతయునిండి నిబిడీకృతమైయున్నాఁడనఁగా విని బ్రాహ్మణులు నీవుచెప్పుట బైటిమాటనేగాని నీయంతరంగమందున కించిత్తైన నిజములేదని చెప్పుచు ఆమహిషము వీపుపై మోది యొకదెబ్బ కొట్టెను. వెంటనే ఆదెబ్బవల్ల లేచినదద్దు జ్ఞానదేవుల దేహము మీదనున్ను లేచెను. వాటిని నా బ్రాహ్మణులుజూచి యిదేమాశ్చర్యముగానున్నది, ఈజ్ఞానదేవుడు మంత్రతంత్రములు యెఱిఁగినవాఁడేమో తెలియదు, లేకుంటే యెనుపగొడ్డువీపుపైన లేచినదద్దు వీనియొక్క వీపున లేచుటకేమికారణమని బ్రాహ్మణులొకరికొకరు చెప్పుకొనుచు ఓజ్ఞానదేవా నీవున్ను యీమహిషమున్ను సమమంటివిగదా నీమాటలు నిజమైతే యీమహిషమునోట వేదమును పలికించుమాయని చెప్పఁగా, జ్ఞానదేవులు ఆలాగేపలికించెద చూడుమని తన హస్తంబును మహిషముయొక్క శిరస్సుపైనుంచి ఓ మహిషమా నీనోటితో ఋగ్వేదమును వచింపుమని యాజ్ఞాపించెను. ఆక్షణమే మహిషము ఋగ్వేదమును తననోటిచే నందరికి వినిపించెను. అచటనున్న బ్రాహ్మణులు వాటిని జూచి అత్యాశ్చర్యమునొంది వేదశాస్త్రములను చక్కగా చదివిన మాకు యిట్టి మహిమ గలిగినది లేదు, ఇది యద్భుతమైన విషయమని చెప్పఁగా జ్ఞానదేవుఁడు ఓస్వామీ నాకు లేశమైన జ్ఞానభక్తివైరాగ్యములు లేదు, నాకెట్లు యీమహిమ కలుగును, మీబోటి మహాత్ముల యాశీర్వచనముచే గలిగినదిగాని దాసుడు వీటికి కారణభూతుడు కాడు, సాక్షాత్ శ్రీపాండురంగనాథుడే వీటికి కారణభూతుఁడౌనుగాని తమ దాసుఁడనగు నాకు యేమియోగ్యతయున్నది, దాసునికి మీబోటి భాగవతుల పాదధూళిగతియని నమ్మియున్నాడనుగాని వేరులేదనెను. ఆవచనములను విని నచ్చటనున్న బ్రాహ్మణులందఱు భ్రమజెంది జ్ఞానదేవులు మొదలగువారిని

తగుమన్ననలతో నాదరించి అనంతరము శ్రీహరికల్యాణగుణముల
యందు భక్తిశ్రద్ధలు గలిగి వారి నామములను సదా భజించుచుం
డిరి. అంత యీనలుగురున్ను నొకబ్రాహ్మణునిగృహంబున వసించు
చుండునప్పుడు ఆవిప్రునింట పితృశ్రార్ధమువచ్చెను. అప్పుడాగృహా
ధిపతి అచ్చటిబ్రాహ్మణులను భోజనమునకురమ్మనిపిలువగా వారు
ఓబ్రాహ్మణా సన్యాసిసంతతివారిని నీగృహంబున నుంచుకొనియుం
డుటచే మీగృహంబునందు జరిగెడు కార్యమునకు మేము రానేర
మని చెప్పుటనువిని నాబ్రాహ్మణుఁడు దిగులుపడి శ్రార్ధమెట్లుజరు
గునని మిక్కిలిచింతించుచుండఁగా వారిని జ్ఞానదేవులుచూచి నీవేల
చింతించెదవు, పితృదేవతలకొఱకై వారికిబదులుగా బ్రాహ్మణులను
కూర్చుండబెట్టి పితృదేవతలని భావింతురు, ఇప్పుడు ప్రత్యక్షముగా
పితృదేవతలు నీగృహంబునకు వేంచేసి నీచేనిడబడిన ప్రసాదమును
భుజించి తృప్తిజెందిపోదురుగాన నీవుచింతించవలసినది లేదని ధైర్య
ముచెప్పి శీఘ్రముగా దివ్యమగు భక్ష్యభోజ్యాన్నంబులను జేయింపు
మనిచెప్పఁగా విని సంతోషముజెంది ప్రసాదమునుతయారుచేయించి
జ్ఞానదేవులను యెదురుచూచుచుండునప్పుడు జ్ఞానదేవులు పాండురం
గనిధ్యానించి అక్షతలుచేకొని పితృదేవతలనుద్దేశించి ధ్యానించగా
నాక్షణంబుననే పితృదేవతలు గగనమార్గముగా విచ్చేసిరి. అంత
నా బ్రాహ్మణుఁడు పితృదేవతలను సర్వోపచారములచేత పూజించి
అరటియాకుల సర్వపదార్థములను పరిమారి భక్తిశ్రద్ధలతో వేడు
కొనఁగా వారు వీనియుపచారములకు సంతసించి సర్వపదార్థములను
చక్కఁగా నారగించిరి. అనంతరమా బ్రాహ్మణుఁడు వారిని కూర్చుం
డబెట్టించి చందన కుసుమ తాంబూలాదులనలంకరింపజేసి వారలకు
యథేష్టముగా దక్షిణలొసఁగి ప్రదక్షిణాదివందనములొనరించి య
థాస్థానమునకు వేంచేయుఁడని ప్రార్థించఁగా వారలు తృప్తినొంది



ఆశీర్వాదములుచేసి గగనమార్గముగా వెడలిపోయిరి. ఆగ్రామవా
సులు పితృదేవతలు వచ్చినదిన్ని తిరుగా వారు అంతర్ధానముగా
పోయినదిన్ని బయటనుండి చూచుచుండియు వీరికన్నుల కేమియు
కనపడనందున భ్రమజెంది అత్యాశ్చర్యమునుబొందినవారై ఈనలు
గురున్ను సామాన్యులుగారు వీరు అవతారపురుషులుగానుండవచ్చు
ననితలచి వీరీజగతియందలి సకలదోషములను నివర్తించుటకొరకు
అవతరించినవారనియు వీరికి ప్రాయశ్చిత్తముచేయించుట వుచితము
గాదనియు నొకపత్రికను వ్రాసి వారివద్దయిచ్చిరి. వారాపత్రికను
భద్రపరచుకొని తిరిగి అళకాపురికి వచ్చుచుండఁగా వేదాధ్యయ
నముచేసిన మహిషమున్ను వీరితోఁగూడ వెంబడించి పోవుచుండు
టనుగని ఆగ్రామవాసులు యీమహాత్ములను కొంతదూరము దారి
సాగనంపి వీరివద్ద సెలవుపొంది మరలిపోయిరి. ఆలాగే దారియం
దలి గ్రామవాసులున్ను వీరికి తగినమర్యాదలుజేసి దారి సాగింపు
చుండిరి. ఇట్లు చనిచని మహాలయమను పట్టణమునకుపోయిచేరిరి.
ఆపురమునకధిపతియగు మోహానుఁడనురాజు యీనలుగురిని భక్తి
విశ్వాసములతో తోడుకొనివచ్చి మిక్కిలిగౌరవముతో తగువిడుదు
లొసంగి పోషింపుచు కొంతకాలము తన పట్టణమునందు యుంచు
కొనియుండగా వీరా పట్టణమునందుండు బద్ధసంసారులకు జ్ఞానమా
ర్గంబులుపదేశించి సకలపామరులను కడతేర్చుచుండిరి. ఇట్లుండఁగా
గోరకనాథుని గురుపరంపరలో నొకరైన కోణీనాథుఁడనువారు యీ
జ్ఞానదేవాది భక్తులనుజూచి వీరిసద్గుణములకు సంతసించి నివర్తినా
థునికి తారకమంత్రమును వుపదేశించెను. అతఁడామంత్రమును జ్ఞాన
దేవులకుపదేశించిరి. పిమ్మట జ్ఞానదేవులు తన యాచార్యునికిని పర
మాచార్యులకును సమయానుగుణముగా సర్వోపచారములుచేయు
చుండి ఈజగతియందలిజనులు బద్ధసంసారులై తమ్ముతామెఱుఁగక తిరి

గెడి కలిజనుల యనర్థములనుజూచి సహింపక వీరిదుర్గతిని నివర్తింప
జేయుటకు మార్గంబేదియని చింతిల్లి సంతతమునందుండిన భగవద్గీ
తను మహారాష్ట్రభాషయందు సర్వజనులకు తెలియునట్ల సులభ
శైలినివ్రాసి తనయాచార్యుని సన్నిధియందుంచి దండముసమర్పిం
చఁగా ఆచార్యులవారా గ్రంథము సాంగోపాంగముగా కటాక్షించి
సంతోషముజెంది జ్ఞానదేవులనుజూచి ఓభాగవతోత్తమా నీయొక్క
స్వాంతయనుభవమెల్ల చేర్చి మరియొక గ్రంథమువ్రాసి వెల్లడించు
మనఁగా వారివాక్యమును శిరసావహించి యాభక్తాగ్రేసరుఁడు తన
కుగలిగియుండు భగవదనుభవమును జేర్చి యేను "భవామృతమని"
యొకగ్రంథమువ్రాసి తనయాచార్యునిసన్నియందుంచఁగా వారు
వాటియం దణఁగియున్న యర్థవిశేషంబు లీజగతియందలి జనులకు
ముఖ్యముగా కావలసిన ప్రవృత్తిలక్షణములును నివృత్తిలక్షణము
లును అహంకార మమకారపరులై తిరిగెడివారిని చక్కఁగా ఖండించి
వారికి భయమును కలుగచేయించుటయును కర్మజ్ఞానప్రపత్తులను
తెలిపియుండుటయును జూచి మిక్కిలి యానందమునుజెంది ఈగ్రంథ
ము జగత్తునందున్న పామరులకు ముఖ్యముగా కావలసినగ్రంథమని
సంతోషించుచుండెను. ఇట్లు కొంతకాలమా పట్టణమునందు సుఖ
ముగానుండి యొకనాఁడా రాజువద్దికేతెంచి ఓరాజా తమవద్ద మేము
బహుకాలముగా నుంటున్నాము యికమాకు సెలవొసంగవలయునని
యడుగగా రాజట్టి సుగుణవంతుల విశ్లేషముసహింపనివాఁడై కొంత
సేపు చింతించి సెలవొసంగెను. వెంటనే ఆనలుగురు భగవన్నామ
ముల నుచ్చరింపుచు పోవుచుండఁగా తమతోకూఁడా వచ్చుచుండిన
మహిషము వాళంబియను ఆరణ్యాహం దాతను విడిచెను. ఆమహి
షమును జూచి దాని జ్ఞానపరిపాకమునకు వారందరు కొంతతడవు
చింతించి ఒక గొప్పపల్లము త్రొవ్వి దానినిమరుగుపరచి వాటికిచేయ



వలసిన క్రియలు యథావత్తున్ను క్రమముగాజేసి అచట నొక శిలా
విగ్రహమును వాటివలె స్థాపించి ఆవిగ్రహముపై సిందూరమును
పూసి పశీబాయని తిరునామముంచి అచ్చటివారిని జూచి మీరీ
విగ్రహము నారాధించి కడతేరుఁడని యాజ్ఞాపించి అచ్చోటువదలి
భగవద్ధ్యానముచేయుచు అళకాపురిసమీపమునకురాగా నాగ్రామ
వాసులు వీరిరాక కెదురుచూచుచుండినవారగుటచేత అనేక భాగ
వతులున్ను పురజనులున్ను యెదుర్కొని భగవన్నామోచ్చారణ
ములుచేయుచు మిక్కిలివుల్లాసముగా పాడుచు నాడుచు వీరచ్చట
చ్చట జేసిన మాహాత్మ్యములను తెలిసి మిక్కిలి కొనియాడుచు
దమతమ గృహములకు వెంటబెట్టుకొనిపోయి సకలోపచారముల
తో పూజింపుచుండఁగా కొన్నాళ్లకు జ్ఞానదేవులు ప్రతిష్ఠానపట్టణ
మునందలి బ్రాహ్మణులొసఁగిన పత్రికను వారలకు చూపించఁగా
వారలుచూచి మిక్కిలిసంతోషముజెందినవారై జ్ఞానదేవాది మహా
భక్తులకు వలగొని దీర్ఘదండప్రణామంబులిడి వారిమహిమలను కొని
యాడి స్వామీ మాకందరికి జ్ఞానభక్తివైరాగ్యములు కలుగునట్లు
కృపజేసి రక్షించుడీయని గుమిగూడి ప్రార్థింపుచు భగవద్గుణాను
భవములుచేయుచు వీరలయందతి ప్రేమగలవారలై పూజించుచుం
డిరి. ఇట్లుండ జ్ఞానదేవు లొకదినంబున భగవంతుని జూచి స్వామీ
మీరుతప్ప దాసునికి రక్షకోపాయము వేరులేదుగాన తాము నాకు
సమాధినియ్యుఁడని విన్నవించుకొనఁగా నాలాగేకలుగునుగాకయని
భగవంతుడు పలికెను. అంత జ్ఞానదేవులు అళందియను తన నివాస
స్థానమునకు వచ్చిచేరెను. అనంతరము శ్రీపాండురంగడు అచ్చటికి
వేంచేసి యింద్రాదిదేవతలును సాధువులందరును చేరి సేవింపుచుం
డఁగా మహావైభవముతో జ్ఞానదేవులకు సమాధిసాయించెను. జ్ఞాన
దేవులు సమాధిపొందిరని నామదేవులు విన్నవారై మిక్కిలిదుఃఖా

క్రాంతుఁడై శ్రీపాండురంగని చెంతఁజేరి ఓ పండరీనాథా పాండురంగా పరమపురుషా పరంధామా పాపవినాశా పరాత్పరా యనుచు పలువిధములుగా ప్రలాపించుచు జ్ఞానదేవులును నేనును అంతరంగస్నేహితులుగా నుండినవారము. ఇప్పుడు నన్ను వేరుపరచి వారిని మాత్రము పరమపదమునకు పంపించినావు. వారిని సేవించవలయునని మిగుల భ్రాంతికలవాడనై యున్నాడను. మీరిప్పుడు వారిని నాకు జూపింపవలయును. మీరు దాసునికి వారిని చూపనిపక్షమున నాప్రాణంబు నిలువదని మిగుల నార్తితో వేడుకొనుటను భగవంతుఁడు గని వానియందు కరుణాకటాక్షముంచి నాక్షణమే పెరియతిరువడిని బిలిచి నీవు పరమపదంబునకుబోయి జ్ఞానదేవులను నీవీపుపై వేంచేపుచేసుకొని అతిశీఘ్రంబున దీసికొని రమ్మని యాజ్ఞాపించేఁగా గరుత్మంతుఁడా తత్క్షణంబె పరమపదంబునకు పోయి పుండరీకుని సమీపంబుననుండు జ్ఞానదేవులనుజూచి ఓభక్తాగ్రగణ్యా శ్రీమత్పండరీనాథుఁడు మిమ్ము నావీపుపై నెక్కించుకొనిరమ్మని యాజ్ఞాపించెను. గాన మీరిప్పుడు నాపైనెక్కుకొనుడు పోదమనఁగా నామాటలనువిని శిరసావహించి నాప్రకారంబె శ్రీపాండురంగనివద్దకు వచ్చుచుండఁగా నామదేవును పెరుమాళ్లు పిలిచి యిదిగోజూడుము గగనమార్గంబున గరుడునిపై నెక్కి జ్ఞానదేవులు వచ్చుచున్నాఁడని చెప్పుచున్నప్పుడు పెరియతిరువడి పుడమిపైనాలెను. అత్తఱి నామదేవుఁడు మిగుల భక్తితో జ్ఞానదేవులకు సాష్టాంగదండప్రణామంబులిడి యేకాంతగోష్ఠియం దిద్దఱును గొంతసేపు వార్తలాడుచుండిరి. అప్పుడు రుక్మిణీపిరాట్టి ఆభక్తాగ్రేసరులకు భుక్తంబిడఁగా వారారగించి సంతుష్టులై తృప్తిజెంది వారివారి నిలవరంబులకు జనిరి. ఇట్టి అంతరంగభక్తుఁడైన నామదేవునివిషయంబున శ్రీపాండురంగనాథుఁ డొనరించిన అద్భుతచరిత్రములను అనురక్తితోడం జదివి విని వ్రా



సినవారందరు పరమపురుషార్థలక్షణ మోక్ష సామ్రాజ్యంబునకుఁ బాత్రులగుదురు. మరియు లక్ష్మీకటాక్షంబును బొందుదురు.

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః.

# వీసోబాసాటి చరిత్రము

ఆపూరియందు నొక విసోబాసాటియను నొక బ్రాహ్మణుండు వాసముచేయుచుండెను. అతఁడు నేకాలమందున్న జ్ఞానదేవులు మొదలైనవారికి మిక్కిలివిరోధములుచేయుచుండెను. ఇట్లుండఁగా నాసంవత్సరమునందు దీపావళిపండుగ వచ్చెను ఆపండుగ దినమునివర్తిదేవులు ముక్తాభాయిని జూచి యీదినమునందు నీవు భగవదారాధనకు పిట్టుచేసిపెట్టుమని యాజ్ఞాపించేఁగా ఆమె నవీనమైన భాండము కావలయునని కుమ్మరవానియింటికి బోయెను. అప్పుడచ్చటనుండిన వీసోబాసాటియనువాడు ముక్తాభాయినిజూచి నీవిచటికేమికార్యార్థముగా వచ్చితివని యడిగెను. అందుకు ముక్తాభాయి నేడు దీపావళిపండుగగానున్నందున భగవంతునికి పిట్టుచేసిసమర్పించను నవీనభాండము కావలసియున్నందువలన భాండమునిమిత్తమై యిచటికి వచ్చినానని చెప్పెను. ఆమాటలను విసోబాసాటి విని మిక్కిలి కోపముజెందినవాఁడై ఓ ముక్తాభాయీ మీరలు సన్యాసికి పుట్టినవారలుగావున కులభ్రష్టులైపోతిరి. మీకు పండుగలేల భగవదారాధన యేలయని చేతితోమోది యొకదెబ్బవేసి కుమ్మరవానిం జూచి ఓరీ కుమ్మరీ యీముక్తాభాయికి యిదిమొదలు కుండలియ్యవద్దు, ఒకవేళ నామాటలను తిరస్కారముచేసి కుండనిచ్చితివేని నీవు నాకియ్యవలసిన పైకము ఖండితముగా యిప్పుడే పైసలు చేయవలయునని చెప్పుచు తనయింటికి వెళ్లిపోయెను. అటుపిమ్మట ముక్తాభాయి కుమ్మరవాని నొక కుండ యిమ్మని యెంతగా వేడుకొని

నను అతఁడు నావద్దనుండలేదుగాన నీవిక్కడ నుండవద్దు తక్షణమే వెళ్లిపొమ్మని ఖండితముగా చెప్పివేసెను. ఆకఠినమైనమాటలను విని ముక్తాభాయి యేడ్చుచు తన గృహంబునకు వచ్చి మిక్కిలి చింతాక్రాంతురాలై యుండ జ్ఞానదేవులు తన సహోదరిని చూచి ఓతల్లీ నీవు శోకాకులితచిత్తవై దుఃఖించుచుండుటకు కారణమేమనియడుగగా ఆమె కుమ్మరవానియింటివద్ద నడిచినవృత్తాంతంబంతయు చెప్పి వీసోబాసాటి తనవీపుపై కొట్టినదెబ్బను చూపి దుఃఖించుచుండగా జ్ఞానదేవులామెను సమ్మతిపరచి నీకు భాండము యేల నావీపునందు పెట్టి కాల్చుమని నియమించి తాను బోర్లపడుకొని యోగమును చేయఁగా యోగాగ్ని యతిశయించి నవద్వారములయందగ్నిజ్వాలలు ప్రవహించఁగా వీపతివేడిమికలిగినదై పొగలులేయుచుండెను. అప్పుడు ముక్తాభాయి తానుకాల్చవలసిన పిట్టును కాల్చియెత్తుకొనఁగానే జ్ఞానదేవులు యోగమును చాలించి లేచిరి. అనంతరము నివృత్తిదేవులు బయిటనుండివచ్చి అనుష్ఠానములు తీర్చుకొని భగవంతునికి తిరువారాధన సమర్పించి భుజించుచుండఁగా వీసోబాసాటి యనువాడు ముక్తాభాయివెంటనేవచ్చి మరుగున దాగియుండి అచట జరిగినవింతలనుగని ఆశ్చర్యమునొంది హరిహరీ యిట్టిమహానుభావుల ప్రభావంబెఱుంగక అపచారపడితిమని భయ భక్తి విశ్వాసములతో లోపల ప్రవేసించి జ్ఞానదేవులను చూచి ఓస్వామీ మీమహిమ తెలియక అపరాధపడితినని ప్రదక్షిణనమస్కారములుచేసి వారు భుజించిన శేషప్రసాదమునుయాచించెను. ఆవచనములను జ్ఞానదేవులువిని మిక్కిలికోపముతో ఓరీ వీసోబాసాటీనీ వేనా దుర్బుద్ధివైననీవు ముక్తాభాయిని యేలకొట్టితివి యిప్పుడు శేషప్రసాదమునడుగుచున్నావు నీకివ్వడములేదని చెప్పుచుండఁగానే వాఁడు బలవంతముగా వారి భుక్తశేషములనెత్తి భుజించుచు స్వామీ శరణాగతియని క్షేమెంచిన దాసుని దోషములను క్షమించి కృపతో రక్షించవలయునని వేడుకొనుచు యిక మీపాదారవిందములుతప్ప నాకు వేరురక్షకోపాయములేదని వారిపాదములను గట్టిగాపట్టుకొనెను. అప్పుడు జ్ఞానదేవులకు వానియందు కరుణగలిగి తన కృపాదృష్టిచే కటాక్షించగా వీసోబాసాటి కృతార్థుఁడై అపారజ్ఞానముగలవాఁడయ్యెను. అనంతరము వీసోబాసాటియను నామమును విడిచి వీసోబాకేశను నామమునువహించి పరిశుద్ధుఁడయ్యెను. పిమ్మట జ్ఞానదేవులయొక్క మహిమావిశేషములు జగమంతయు వ్యాపించినందున అనేకులు యిట్టి జ్ఞానాధికారిని సేవించి కడతేరవలయునని దేశదేశములయందలి ప్రజలనేకులేతెంచి వీరిని సేవించిపోవుచుండిరి. ఇట్లుండఁగా జ్ఞానదేవులు ప్రపంచమందలి జనులు దేహమే ఆత్మయని భ్రమసి సంసారబద్ధులై తిరుగుచుండెడి జనులయందు విశేషకటాక్షముగలిగి వారలకు జ్ఞానోపదేశముచేసి వారలను హరిభక్తులుగా భావింపుచు కొంతకాలము దేశాటనముచేయుచు కొంతకాలమునకు శ్రీపండరిక్షేత్రమునకుజని శ్రీపాండురంగనిసేవించి అచట వసించియున్న నామదేవులతో కలిసి తీర్థయాత్రాపరులై వెడలి అచటచటనుండు తీర్థములందు గ్రుంకుచు దివ్యదేశములను సేవించి భగవద్గుణానుభవములను చేయుచు యీ జగత్తును వుద్ధరించి ప్రకాశింపుచుండెను. ఇట్టి మహాత్ముని చరిత్రమును చదివి విని వ్రాసి మననముచేయునట్టి సత్పురుషులు అంతమున యిహపరసౌఖ్యములను బొందుదురు.



శ్రీనారాయణాయనమః.

# కూర్మదాసు చరిత్రము

ఈభరతఖండమున ప్రతిష్ఠానమను పట్టణమునందు శాంతశమదమాది సద్గుణములు గలిగిన బ్రాహ్మణుడొకఁడు వాసముచేయుచుం

డెను. అతనికి సద్గుణరాశియగు పతివ్రతాతిలకము భార్యగానుండెను. ఈదంపతులకు భగవత్కటాక్షముచేత నొక సుపుత్రుఁడు కరచరణములులేక ప్రుద్భవించెను. తల్లిదండ్రులు దరిద్రదశచే అన్నపానాదులకు శ్రమనొందుచు ఆ శిశువు కరచరణములు లేక కూర్మమువలె ప్రాకుచుండుటచే కూర్మదాసుడని తిరునామముంచి పెనుచుచురాగ ఆశిశువు చంద్రునిపగిది వృద్ధినొందుచు వయస్సధికరించుచురాఁగా భగవద్భక్తి నానాటహెచ్చుచుండెను. ఇతనికి బాల్యమునందే వుపనయనము జేసి మిక్కిలిగారాబముతో పోషించుచుండిరి. ఇట్లుండగా యీకూర్మదాసు కరచరణములు లేనివాఁడైయుండిన్ని అతండెల్లప్పుడు శ్రీహరిభక్తిచేయుచుండుటనుగని ఆపురవాసులు వీరికి కావలసినవాటినొసఁగి దేహయాత్ర జరుపుతూవచ్చిరి. ఇట్లు కొంతకాలము గడచినవెనుక శ్రీహరిభక్తులు కొందరు గుమిగూడి శ్రీపండరీపురయాత్రచేయుటకు వెడలివచ్చి దారిలో యీకూర్మదాసుగృహమునకు ప్రక్కగాదిగి వంటచేసి భుజించి అచట భగవద్భజనచేయుచుండగా కొందరు శ్రీపాండురంగనిమహిమలను వుపన్యాసము చేయుచుండిరి. కూర్మదాసులాభక్తులకు శిరసా దండముసమర్పించి భగవన్నామసంకీర్తనలను వినుచుండి దేహపరవశమునుజెంది యీ భాగవతులతోజేరి శ్రీపండరీపురమునకు జని శ్రీపాండురంగని సేవించవలయుననే యాశపుట్టి ఓ భాగవతాగ్రేసరులారా మీతోకూడ నేనున్ను శ్రీపండరీపురమునుజేరి శ్రీపాండురంగని సేవించిరావలయునని చెప్పెను. వాటినివిని భాగవతులు ఓదాసుఁడా నీకు కరచరణములు లేవు ధనమున్ను లేదు, ధనముండినయెడల ఒకశకటమునెక్కిపోయి భగవంతుని సేవించిరావచ్చును. నీవు ద్రవ్యహీనుఁడుగానున్నందున శ్రీపాండురంగని సేవించుట దుర్లభమని చెప్పి వెడలిపోయిరి. వారి వచనములను కూర్మదాసులాలకించి దుఃఖాక్రాంతులై తనలో వితర్కించుచుండెను,



ఎట్లనఁగా నేనీమాయాప్రపంచమందనేక యోనిద్వారములందు పుట్టుచు గిట్టుచు కడపట నాకీ నరజన్మము సంప్రాప్తమాయెను. ఈజన్మముతప్పితే మరల యేజన్మమువచ్చునో గాన యిట్టి జన్మము దొరుకుట మిక్కిలి దుర్లభము. నేనీ జన్మమునందు శ్రీపాండురంగని సేవించనిపక్షమున నాజన్మము సాఫల్యము కానేరదు. ఈతరుణోపాయముతప్పినయెడల కడతేరుటదుర్లభమని నిశ్చయించి తాను తాబేలువలె ప్రాకుచు సాయంకాలమువర కొకకోసు దూరముపోయెను. అంతవరకుపోయి తనకు మిక్కిలి బడలికకలిగి ప్రాకుటకు శక్తిలేక ఆకలిదప్పులచేత బాధపడుచు ఓపాండురంగా పండరీనాథా పరమదయాళా పరంధామా పావననామా భక్తవత్సలా ముకుందా మురహరీ గోవిందా గోపాలా శ్రీకృష్ణా కేశవా నరహరీ శ్రీహరీ దామోదరా దానవభంజనా దాసుఁడు ప్రారబ్ధకర్మానుభవముచే చాలాకాలము కష్టపడి పాపవశాత్తుగా కర చరణములులేక యీయరుదగు జన్మమునెత్తి మిమ్ము సేవించవలయుననే యపేక్షతో యిట్లు కష్టపడి నడిచివచ్చుచుండుటనుజూచి కరుణగలుగలేదా యని బహువిధముల ప్రార్థించుచుండునప్పుడు అచ్చట నొక ఆంజనేయుల దేవాలయము కనుపడెను. అనంతరము కూర్మదాసులు ఓపాండురంగా దాసునికి మీపాదపద్మములుతప్ప వేరుగత్యంతరములేదే పరిపూర్ణకటాక్షము గల ఓస్వామీ నాకు తల్లి దండ్రి గురు దైవములునీవేయని పలువిధముల ప్రార్థింపుచుండఁగా శ్రీపాండురంగడు బ్రాహ్మణవేషమునుధరించి వ్యాపారముచేయువానివలె కూర్మదాసునివద్దకువచ్చి అయ్యా నీవెచ్చటికి పోవుచున్నావు, నీవూరేది నీపేరేమనియడుగగా భక్తుఁడు వారి ప్రశ్నలకు ప్రత్యుత్తరముచెప్పగానే ఆవేషధారి బాగాయెను, నాకుకూడ తోడులేదని కష్టపడుచుంటిని, నీవు నాకు తోడైతివని సంతోషించుచుండఁగా కూర్మ

దాసుడుగని ఓమహానుభావా కరచరణములు చక్కగాయుండెడు మీకును అంగహీనుడుగానున్న నాకును దారినడుచుట కెట్లుపొసగును, నాయందభిమానముంచితి రేని నేను కడతేరుదును, తమతిరునామ మేమని యడిగెను. అయ్యా నేజేయువృత్తియెట్టిదనగా ధనమివ్వడము తియ్యడమైన వ్యాపారము, ఈవ్యాపారముచే నేనమితద్రవ్యమును సంపాదించి ప్రతిగ్రామమునందొకదినము వసించుచు ఒక కోసుదూరమునడుచుచు పరులప్రయోజనముగా బీదలగు బాటసారులయొక్క ఆకలి దప్పులను నెరిగి అన్నపానాదులొసంగి వారి నాదరించుచు దారి తెలియనివారికి దారిచూపుచు పండరీక్షేత్రమున నొకగొప్పయంగడియుంచి వ్యాపారముచేయుచు తిన్నగ నడుచుచు పండరీపురమునకు అప్పుడప్పుడు వచ్చుచు పోవుచుందును. నాపేరు శ్రేష్ఠి విఠోబాయని లోకులు వాడుకొందురు. నీసహవాసము నాకు చిక్కినందున నేనతిసంతోషమునుబొందినాడను. పండరీపురమునందనేకభక్తులు పాండురంగని తిరునామముల నుచ్చరించి కొనియాడుచు నృత్యముచేయుచుందురు. నీవు మిక్కిలి ప్రీతిగలిగి వారిసన్నిధికి పోవుచున్నందున నిన్ను వారు కృపాకటాక్షముతో రక్షింతురని మంచిమాటలుపల్కుచు శీఘ్రంబున వంటచేసి దాసునికి కడుపు నిండునటుల అన్నమునుంచి వారుతృప్తిగా నారగించిన వెనుక మిగిలినవాటిని తాను భుజించి వారిద్దరు నిద్రించిరి. మరునాడరుణోదయమున లేచి కూర్మదాసునకు మార్గమునుచూపి తానదృశ్యుడయ్యెను, ఈరీతిగా కూర్మదాసు ప్రతిదినమొకకోసుదూరము నడుచుచు పోవుచుండగా పెరుమాళ్లు వర్తకునివలెవచ్చి ప్రీతితో నతనికి వంటచేసి పెట్టి రాత్రియందచట నిద్రింపజేసి వుదయమున లేచి కూర్మదాసుకు దారినిజూపి అదృశ్యుడగుచుండును. ఒకకోసుదూరములోపల గ్రామములేకుండిన అడవులయందుగూడ తనమాయచేత గ్రామమును



కలుగజేసి భగవంతుడు తన భక్తుని పోషింపుచు లహుళయనెడు గ్రామమువరకు బోయిరి. ఆగ్రామము శ్రీపండరీపురమునకు యేడు కోసులదూరమున్నది. ఆదారిగా నలుదిక్కులయందుండు భాగవతులనేకులు గుంపులుగుంపులుగాచేరి పండరీపురమునకు బోవుచుండిరి. వారిం జూచి కూర్మదాసు మీరందరు యెచటికి బోవుచున్నారని విచారింపగా వారు శ్రీపండరీపురమునకు మేము బోవుచున్నామని చెప్పిరి. అచట యీదినంబేమి విశేషంబని యడిగెను. వారలు రేపు దినము కార్తీక శుద్ధయేకాదశి వుత్సవము, ఆదినంబున శ్రీపాండురంగని సేవించినటువంటి ప్రాణికోట్లు పరమపదంబుజెందుదురనిరి. ఈ వచనములను కూర్మదాసుడు విని యేమిచేతును యీదినముదయమునకు మునుపు పండరీక్షేత్రమునకు పోవుటకెట్లు సాధ్యమగును. ఓపండరీనాథా కరచరణములు లేనివాడైన నేను యెట్లు ప్రాకుచు రాగలను. ఈ వుత్సవమున్ను గడచిపోవుచున్నదే మిమ్మేవిధంబున సేవింపగలనని మిక్కిలి యార్తితో భగవద్గుణానుభవము చేయుచు మైమరచి కనుల నానందభాష్పములుజారగా శ్రీహరీ పాండురంగనాథా చేతులు కాళ్లు లేక నడుచుటకుసాధ్యపడని నాయందు కరుణించి యీయేకాదశియందిచటికి వేంచేసి సేవనొసంగుమా యని పలువిధంబుల వేడుకొనుచు నాదారియందు బోవుచున్న భక్తులతో యిట్లని నుడివెను. అయ్యా మీరు శ్రీపాండురంగనితో నడువ శక్తి లేని నాయందు కరుణనుంచి యిచ్చటికివచ్చి సేవనొసగి పొమ్మని వచింపుడని చెప్పిపంపెను. వారలు వెడలినవెనుక ఓపరంధామా పాండురంగా పండరీనాథా నేను బహుదూరమునందుండు బైదర్ పురమునందుండి లహుళయను గ్రామమునకు మిక్కిలిప్రయాసతో కష్టపడివచ్చినాను. కరచరణములు లేక పుట్టినవాడనుగనుక దేవరవారిని సేవించుటకు ప్రాకుచూవచ్చినయెడల యేడుదినములుపట్టు

నుగాన రేపు యేకాదశిగానున్నందున మిమ్ము సేవించవలయుననే యపేక్షను జెందియున్నవాఁడను ఓ కరుణాసముద్ర కామితవరద మీరిచ్చటికి వేంచేసి సేవయొసగి నాకనులకానందముగలిగించి రక్షింపవలయునని కొందరు భాగవతులతో చెప్పిపంపితిని. వారు మీసేవయందీడుపడి నాపరితాపమును చెప్పరైరో యేమోయని చింతిల్లుచుండగా పండరీపురమునకు వెడలిన భక్తులు చంద్రభాగానదియందు స్నానానుష్ఠానములుతీర్చుకొని పాండురంగని సన్నిధిజేరి శ్రీహరీ గోవిందా మాధవా ముకుందా శ్రీరామా శ్రీకృష్ణా శ్రీపాండురంగా యని కరతాళములువేయుచు సన్నిధివలగొని ప్రదక్షిణముచేయుచు వచ్చుచుండఁగా మహామంటపమున నామదేవులు శ్రీ పాండురంగని మాహాత్మ్యములు చెప్పుచు మాధవ కృష్ణా మదనజనకా మురహరీ ముకుందా అచ్యుతా కేశవా నరహరీ శ్రీహరీయని వారితిరునామములను భజింపుచు అందరున్ను గుమిగూడి యేకఘోషముతో కరతాళములువేయుచు నృత్యముచేయుచుండఁగా భగవంతుఁడు భక్తులను కరుణతో కటాక్షింపుచుండునట్టి తరుణమునందు కూర్మదాసు పంపినభక్తులు భగవంతుని చరణారవిందములయందు తమతమశిరంబులనుంచి సేవించి లేచి యాలింగనముచేసికొని వారితిరుముఖమండలమును దర్శించి అత్యానందభరితులై ఓస్వామీ దేవరవారి తిరుముఖమును సేవించినమాత్రంబున మాయొక్క జననమరణ తాపంబులుదీరి మనోవాక్కులకందని బ్రహ్మానందసుఖమును జెందినారము. మీదర్శనముచేత మాపాపంబులు నశించినవని భక్తులు స్తుతిజేసి కూర్మదాసుల మొరను విన్నవించిరి. వారివచనములనువిని శ్రీపాండురంగ డతివేగంబున లేచి నామదేవులను జ్ఞానదేవులను వెంటబెట్టుకొని వారికి తనమనోరథమును వచింపుచు తనభక్తుడైన కూర్మదాసును చూచుటకొరకు పాదచారులై ముగ్గురు నడిచిపోవుచుండిరి

# సావతమాళి చరిత్రము.

శ్రీపాండురంగనితోగూడ నామదేవులు జ్ఞానదేవులు నడుచుచు మార్గమందొక రమణీయమైన వనంబునుజూచి పెరుమాళ్లు దాహశాంతి చేసుకొనివచ్చెదననిచెప్పి వారిద్దరిని బైటనిలిపి తానొక్కడే తోటలోప్రవేసించి అచ్చటనుండు సావతమాళి శ్రీ పాండురంగనాథుని పాదారవిందంబులను తనమనంబున నిలిపి తదేకధ్యానముతో నిశ్చలత్వమునువహించి పరవశత్వము జెందియుండుటను శ్రీపాండురంగడు వీక్షించి తనహస్తముచే వానిశిరంబును స్పర్శించగా ధ్యానము వదలి కన్నులు తెరచిచూచి శతకోటిభాస్కర తేజోస్వరూపుఁడై శ్రీ పాండురంగఁడు తిరుత్తుళాయిమాలెనుధరించి నవరత్నఖచిత మకుట కేయూరాది దివ్యాభరణ భూషితుఁడై యెదుట ప్రసన్నుఁడై నిలుచుండ సావతమాళి వారి తిరుముఖమును సేవించి బ్రహ్మానందము జెంది భగవంతుని చరణాంబుజములకు ప్రణమిల్లి స్తుతింపుచుండగ కరుణాసముద్రుఁడు వచించినదేమన్నను నీవొనర్చు పూజాది స్తుతులంగీకరించుటకు యిదిసమయముగాదు. ఇద్దరుదొంగలు నావెంబడి వచ్చియున్నారు, నన్ను చితమైనస్థలమున దాచిపెట్టుమని చెప్పెను. సావతమాళి భగవంతుని వాక్యములను విని ఓస్వామీ దేవరవారు సర్వవ్యాపకులైయుండ మిమ్ము నావద్ద దాచిపెట్టుటకు తగుమైన చోటులేదే, దేవరువారు సాయించినది విచిత్రముగా నున్న దెట్లనగా మహాబలపరాక్రమసంపన్నుఁడగు వాయువును పంజరమునం దణచిపెట్టుమన్న తెరంగున నున్నదనఁగా వాటిని విని శ్రీపాండురంగడు సావతమాళీ నీవువచించు బ్రహ్మజ్ఞానమేమియు యిపుడు సరిపడదు. నీవతిశీఘ్రింబున నన్ను చితస్థలంబునందు దాచిపెట్టుమని చెప్పెను. సావతమాళి భగవంతుని వచనములను విని నొకఖడ్గమును తనకరమునందిడి తనగర్భమునుచీల్చి ఓస్వామీ నాహృదయగుహాయందు దాగియుండుఁడని ప్రార్థింపఁగా సర్వరక్షకుం డత్యంతప్రీతితో వాని

కుక్షియందు ప్రవేశించెను, అంత నాభక్తుడు తనకడుపుమీద నొక వస్త్రమును చుట్టుకొని మిక్కిలి సంతోషముతో తనగర్భమునందు వేంచేసియుండు అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుని సేవించి ఓవిఠల నాథా మిమ్మెంతకాలమునకైనను యిక నేవిడువజాలను యెంతోకాలము వృథాపరచి యిప్పుడు నాయందుకరుణగలిగి హృదయకమలమందు చిక్కియున్నావు, నాపుణ్యావశము యేమందును, పూర్వము నేనెట్టిపుణ్యముచేసితినో అందుచే మీరు నాయందువాత్సల్యతకలిగి నాగర్భగృహమునందు వేంచేసియున్నారని పలువిధములవిన్నవించుచుండుటను దీనదయాళుండాకర్ణించి ఓభక్తాగ్రేసరా నీవు నాయందలి ప్రేమచే నీగర్భమును భేదించి నేను దాగియుండుటకు చోటిచ్చియున్నాడవు, నీవొనరించిన మహోపకారమునకు నేనేమిప్రత్యుపకారము చేయగలను, ఇపుడిచ్చట నేనేమిచేయుటకువల్లకాదు, ఇది నిజమనినమ్ముమని చెప్పగా భక్తుడాలకించి పరమానందముతో వారి. కృపకు సంతసించుచుండెను. ఇందుకు సాదృశ్యముగా గోకులంబునందొకగోపిక దధికుంభమును తలనిడికొని పెరుగోపెరుగని యమ్ముచు శ్రీకృష్ణనామస్మరణచే పరవశురాలై గోవిందా దామోదరా యని యెలుగెత్తిచెప్పుచు దారిని బోవుచుండ నాదధిని కొనుటకై యొకవనిత యామెనుబిలిచి కృష్ణునిచూపించుమనగా ఆమె గంపనుదింపి భాండమును తెరచినమాత్రంబున నందుండి సర్వలోకశరణ్యుండు బైటికివచ్చెను, అప్పుడచట నున్న గోపికలందరు యాశ్చర్యపడిరి. ఇట్టి లీలావినోదములుచేయు సర్వేశ్వరుండు భక్తునిగర్భమున ప్రవేశించియుండుట యాశ్చర్యమా, వీరిట్లు పరమానందముజెందియుండ తోటకువెలుపలనుండిన నామదేవులు భగవంతుడు పోయి నిండాసేపైనదే యింతతడవు మసలుటకు కారణంబేమని మిక్కిలిదుఃఖముతో భగవంతునకీతోటయందేదో కష్టముసంభవించినట్లున్నదని క్లేశ



ముజెంది కలవరముగలవాడై వనమాద్యంతము వెతకిచూచి వారిజాడ కనుపడనందున మిక్కిలి చింతాక్రాంతుడై తిరిగివచ్చుచుండ అచట సావతమాళి నిష్ఠాగరిష్ఠుడై కూర్చుండియుండుటనుగని వారి పాదకమలములకు దండప్రణామంబులిడి స్వామీ నాప్రాణపదంబైన శ్రీపాండురంగడు నన్ను వెలుపలయుండుమనట్లు నియమించి యీతోటయందు ప్రవేశించెను. మేము వారిరాకను నిరీక్షించుచుండి యింతవరకు రాక మసలుటకు కారణంబేమని నేనీ తోటయందు జొచ్చి వెదకి వేసారివచ్చినాడను, తాము వారిని జూపించి నాప్రాణంబుద్ధరింపజేయుమని ప్రార్థనచేయుచుండెను. అప్పుడు సావతమాళి భగవదనుభవమందు యీడుపడి పరవశత్వముజెంది మరుమాట వచింపక నిశ్చింతతో నుండగా నామదేవులు వారితిరుముఖమండలకాంతియున్న వారినిష్ఠను గమనించి శ్రీపాండురంగడు యీమహానుభావుని జ్ఞానయోగమునం దీడుపడి అతని హృదయమందు వసించియున్నాడని నిర్ధారణచేసికొని శ్రీపాండురంగనాథుని విశ్లేషముసహింపజాలక పరితపింపుచు ఓ పండరీనాథా పరమపురుషా పతితపావనా శ్రీపాండురంగా పరాత్పరా నాయందు కృపయుంచి రక్షించుటకు శీఘ్రంబున నీరూపంబును జూపి నన్ను తృప్తినొందింపుమా, నన్ను విడిచి యీ సావతమాళి హృదయకమలమునందుండుటకు నీకెట్లు మనస్సువచ్చినది, ఈసావతమాళి నిన్ను గర్భమునందుంచుకొనుటకుగాను పూర్వమందెట్టిపుణ్యము జేసియున్నాడో ఓకృష్ణా ద్వారకావాసా సద్గుణస్వరూపా మీసుందరవదనారవిందమునుజూపి నాతో మాట్లాడి నన్ను కృతార్థుని గావింపవలయునని పలువిధముల వేడుకొనెను. ఆదీనాలాపములను భగవంతుడువిని సావతమాళి గర్భమునందుండి యిట్లని వచింపుచున్నాడు. ఓసావతమాళీ నాయందధిక ప్రీతివిశ్వాసములు గలిగియున్న నామదేవు మిక్కిలి దుఃఖముకలిగి

విలపించుచున్నాఁడు, నేను బైటికేతెంచి వానికి దర్శనమొసంగవల యునుగనుక నీగర్భమునకు చుట్టుకొనియున్న కట్టును విడదీయుమని నచించెను. సావతమాళి భగవంతుఁడు వచించిన పల్కులను విని నామదేవులను వీక్షించి శ్రీపాండురంగఁడు నీయందపారమైన కృపా కటాక్షం బుంచియున్నారు, వారీక్షణమునందే నీ మనోభీష్టమును సఫలముచేతురు, అయితే నీవు పూర్వజన్మమునందు విశేషముగా పుణ్యములను చేసినవాఁడగుటచేత నీకీజన్మమునందు ఆఫలమబ్బియున్నదని తనగర్భమువిూద చుట్టుకొనియున్న వస్త్రమును విడదీసెను. ఆక్షణమే పాండురంగఁడు బైటికివచ్చి నామదేవులకు సేవయొసగెను. నామదేవులు దీర్ఘదండము సమర్పించి వారి పాదారవిందములను పట్టుకొనగా శ్రీపాండురంగఁడు నామదేవుని లేవనెత్తి తనపీతాంబరముతో వారినేత్రములయందుఁగారుచున్న జలమును తుడిచి ఓవత్సా నీవేల యింతటివ్యసనమును జెందియున్నావని యడుగఁగా నామదేవులు స్వామీ నేనేమిచేయుదును, దాసునికి దేవరవారి తిరుముఖమండలసేవ గోచరముకానందున విూవిశ్లేషముసహింపజాలక యిట్టి మోహభ్రాంతిగలిగి పరితపించుచుంటిని, దేవరవారిని యెడబాసినప్పుడు నాకు నిమిష మొకయుగముగాఁ దోఁచుచున్నది, విూవిశ్లేషము సహింపజాలక పిచ్చివానివలె ప్రలాపించుచుందును, ఓపాండురంగా నీవే నాకు తల్లి దండ్రి గురుదైవములుగా యున్నాఁడవు, విూపాదాంబుజములే దాసునికి గత్యంతరమని యెంచియున్నాఁడను, విూరు నాకాపద్బాంధవులై సర్వరక్షకులై వాత్సల్యసౌశీల్యాదిగుణాకరులై యుండఁగా దాసునికి భయమేమియులేదు, అయితే మిమ్మొకనిమిషంబైనను విడనాడియుండుటకు సహింపజాలననివిన్నవించుచున్న నామదేవుల వచనములను శ్రీపాండురంగఁడు విని నవ్వుచు జ్ఞానదేవులను చూచి మనము ముగ్గురున్ను కూర్మదాసులవద్దకు పోదమనుచు ప్ర



యాణమై వచ్చుచుండిరి. అచట కూర్మదాసులకు శుభసూచకములగుపడుచుండెనవి. అట్టితరుణమందు శ్రీపాండురంగ డచటికివేంచేసి శంఖచక్రపీతాంబరధరుఁడై కిరీటాది దివ్యభూషణాలంకృతుఁడై సేవయొసఁగెను. అప్పుడు కూర్మదాసుఁడు పెన్నిధి గాంచిన తెరంగున వారిదివ్యస్వరూపమును సేవించి శ్రీహరి చరణారవిందంబులయందు తనశిరంబునుంచి యసత్తువలె పడియుండఁగా కరుణానిధియగు భగవంతుఁడు తనకరములచే నతనిలేవనెత్తి మందహాసవదనారవిందముతో నతనికి కావలసిన వరముల నడుగుమని వచింపగా కూర్మదాసులత్యానందభరితులై స్వామీ దేవరవారు యెప్పుడు నన్నువిడిచిపోక యుండునటుల వరం బనుగ్రహించి దాసుని రక్షించవలయుననఁగా భగవంతుఁ డతని మనోభీష్టమునకు సంతసించి ఆలాగే కలుగునుగాక యని కోరినవరముల నొసంగి యాహులయను గ్రామమునందు తనస్వరూపమువలె అచట నొక భగవద్బింబమును స్థాపించి ఆషాడశుద్ధమేకాదశియందును కార్తీకశుద్ధ యేకాదశియందును అచట వుత్సవములు జరిపించునటుల నియమించిరి. వారి యాజ్ఞానుసారముగా నే యేతత్కాలపర్యంతము జరుగుచున్నది. అచ్చటికి దేశదేశములలో నుండు భక్తులనేకులు వచ్చుచుందురు. ఇట్టి పరమపావనమైన కూర్మదాసు చరిత్రమును చదివివిని వ్రాయువారు యిహపరసౌఖ్యములను జెంది అంత్యమున పరమపదమును పొందుదురు.

శ్రీపాండురంగాయనమః.

# రాకాకుమ్మరి చరిత్రము

యాత్రార్థులకు ముఖ్యమై పండరీక్షేత్రంబని ప్రసిద్ధివహించిన పండరీపురంబున కుమ్మరవారివంశంబున జన్మించి రాకాయను భక్తాగ్రగణ్యుండు వాసముచేయుచుండెను. అతనికి భంగాయను పతివ్రతా

తిలకము భార్యగానుండెను ఇట్లుండగా యీదంపతుల కొక సత్పు
త్రిక ఉద్భవించి వంకాయను నామమును ధరించియుండెను. వీరు
ముగ్గురున్ను తమకులవృత్తిచేత సుఖముగా వుదరపోషణచేసికొను
చు కాలముగడుపుచు శ్రీపాండురంగనియందపారమైన భక్తివిశ్వాస
ములుగలవారై భగవన్నామస్మరణచేయుచు తమకులవృత్తియందు
ధర్మముతప్పక భాండములనుచేసి విక్రయించుచు వాటిచేత జీవనో
పాయమునడుపుకొనుచు ఒకసమయమందు పచ్చికుండ లమితముగ
జేసి తమగృహంబున నొకప్రక్క గుంపుగా పెట్టియుంచియుండగా
అందొకకుండయం దొకపిల్లి కూనలనీనియుండెను. ఒకనాడా తల్లి
పిల్లి మేతకై పోయియుండుతరిణమందున సతీపతులా పచ్చికుండ
లను తమ పెరటియందున ఆవముగా పేర్చి యింగల మంటించిరి.
అంత తల్లిపిల్లి మేతనుదెచ్చి బిడ్డలనుగానక కూతవేయుచు మిక్కిలి
దుఃఖముతో అటుయిటు తిరుగుచుండెను. పిల్లలనుగానక యేడ్చు
చుండు తల్లిపిల్లిని రాకాకుమ్మరి వీక్షించి అయ్యో యీపిల్లికింతదుఃఖ
ము సంభవించుటకు కారణభూతుడు నేనుగాయున్నానే యని చిం
తింపుచు చిత్తభ్రమకలిగి దేహముమరచి భూమిపైబడి పొరలుచు
తనభార్యను బిలచి యిట్లువచించెను. ఓపడతీ నేను భాండమునందు
పిల్లికూనలుండునది తెలియక ఆవమునందుంచి యగ్నియుంచినాడను
మహత్తైన కష్టము సంప్రాప్తమైనది యేమిచేయవచ్చును యిట్టియప
చారము సంభవించినదేయని దుఃఖింపసాగెను. ఆవనిత వారివార్తలు
విని హాయని భూమిపైబడి పొర్లుచు ఆసతీపతులు శ్రీహరిని తమహృద
యములందు ధ్యానించుచు ఓపతితపావనా పాండురంగ భక్తవత్సల
పరమదయాళా అప్రమేయ ఆనందరూప హరే మురారే దేవరవాగు
పూర్వము పాండవులను లెక్కకోటలో ప్రవేశింపజేసి కాల్చుటకు
ప్రయత్నించిన దుర్యోధనుని దుర్మంత్రము విఫలముగాచేసి పాండవు



లను రక్షించలేదా, అదియునుంగాక బాలుడగు ప్రహ్లాదుని అగ్ని
యందు పడద్రోయగా బాలుని ఆయగ్నియందుండి గాపాడితివి ఆరీ
తిగా యీపిల్లికూనలకు అపాయము రానీయక కాపాడి రక్షింపవే
ఓపరమదయాళా పరమపురుషా యని బహువిధములు ప్రార్థించుచు
శ్రీపాండురంగనాథా యీపిల్లికూనలను కాపాడియిచ్చుట మీకసా
ధ్యముగాదు మీరొ అఘటితఘటనాసామర్థ్యంబులు గలవారగుట
చేత మీవల్ల కానికార్యం బేమున్నది ఓ అఖిలాండకోటిబ్రహ్మాండనా
యకా ఆదిమధ్యాంతరహితా అనంతావతారా దాసుడిట్టి పాపము
నకు పాలైతిని, ఈ పాతకమునందుండి నన్ను తప్పింపజేయవేయని
ప్రార్థింపుచుండెను. అపుడు సమీపమందుండిన సతీరత్నము యిట్లు
చెప్పదొడగెను, ఓప్రాణనాథా యీ పిల్లికూనల విషయమున శ్రీ
పాండురంగనికి మొక్కుబడుపునుగట్టి ప్రార్థనచేసుకొన్నట్లయితే మన
మనోరథము ఫలించునని చెప్పగా, అతడాలకించి శ్రీపాండురంగడు
యీపిల్లికూనల కపాయము రానీయక రక్షించియిచ్చినయెడల శ్రీ
యఃపతికి శరణాగతుడనై నిష్కామమునువహించి నాసర్వస్వమును
పరిత్యజించెదను శ్రీహరీ యిదే నేజేసుకొను ప్రార్థనయని ప్రార్థనజేసు
కొనెను. తదనంతరమా దంపతులు తమమనంబుల శ్రీపాండురంగని
ధ్యానించుచు నిశ్చలచిత్తులై మూడహోరాత్రములు నిద్రాహార
ములువర్జించి ఆయావమును చుట్టివచ్చుచు శ్రీహరిని ధ్యానించుచుం
డిరి. అంత నాల్గవదినమాయావమందలి యగ్ని చల్లారగానే భాండ
ముల నొకటొకటిగా యెత్తుచుండగా తల్లిపిల్లి కూయుచు అటుయిటు
దిరుగుచుండెను. ఆయావమందుండిన కూనలు శ్రీపాండురంగని కృప
చేత అపాయమేమియు జెందక భాండమందుండి కూయదొడంగెను.
ఆశబ్దమాలకించిన తల్లిపిల్లి మిక్కిలిసంతోషముతో బిడ్డలలో గలిసి
ఆనందమునుజెందియుండెను. ఆవింతను గని విష్ణుభక్తుడు భార్యను

జూచి ఓసాధ్వీ మనము శ్రీహరి కృపాకటాక్షమునకు పాత్రభూతులైతిమి, మన మనోరథ మీడేరి మన ప్రార్థన ఫలించెను. ఇక మనమీ సంసారబంధమును వదలి స్వేచ్ఛగా సంచరించవలయునని చెప్పి తన గృహంబునందుండు సర్వపదార్థములను బ్రాహ్మణులకు దానముచేసి ఆనందముతో అదివరకు తాను చేయుచుండిన భాండముల వ్యాపార మునుమాని కౌపీన కమండలములను ధరించి ఆసతీపతులు జగదీశుని చరణారవిందములను ధ్యానించుచు అడవికి జని కట్టెల నేరుపరచి మోపుగట్టి తలపైనుంచుకొని అంగడివీధికి జని వాటిని విక్రయించి వాటిచే వచ్చిన వచ్చుబడినిగొని తమదేహయాత్రనడుపుకొని దివారాత్రులు హరినామస్మరణ చేయుచుండిరి. ఇట్లు కాలముగడుపుచుండి అతిథి అభ్యాగతు లేతెంచిన వారిని సత్కరించుచుందురు. కౌపీనమునకుగాను కుట్రపువీధులకుజని తుండుగుడ్డల వెదకుచుండగా వారిని జూచి కుట్రపువారు ఓ రాకాకుమ్మరీ నీవు పిల్లికూనలకై విరక్తిజెందినవాడై సర్వమును త్యజించి తిరుగుచున్నావే నీకు కౌపీనసంరక్షణ మేలయని పరిహాసముగా వచింపసాగిరి. వారిమాటలాలకించి యిది నిజమని విశ్వసించి ఆపేలికలను నచ్చటనేపడవైచి బ్రాహ్మణవీధికి జని వారారగించి పారవేసిన విస్తళ్లను తనమొలకుచుట్టుకొని తృప్తి పొందిజనిరి, ఇట్టివిరక్తితో యీదంపతులు కాలము జరుపుచుండగా శ్రీపాండురంగడు వారియందు కృపాకటాక్షమునుంచి రక్షించుచుండుచు. ఇట్లుండగా వొకదినమతనికొమార్తె నదికిజని స్నానముచేయుచుండెను, ఆసమయమందచట నామదేవులకుమార్తె వస్త్రములుతుకుచుండినందున చెదరుచున్న జలము వంకపైపడుచుండగా ఆచిన్నది నామదేవులపుత్రికనుజూచి ఓతల్లీ కొంచెము నిమ్మళముగాగుంజుము నాయొక్క మానసపూజ ముగిసినపిదప నీయిష్టప్రకారముగుంజుకొనవచ్చునని చెప్పగా అందుకా నామదేవుని కుమార్తె యిట్లనెను. ఓ



కుమ్మరదానా నీవీ భూమియందతిపుణ్యవతివై పుట్టితివా, కుమ్మరకులమందుద్భవించినదానికి శీలమేల, వీధిద్రిమ్మరులై తిరిగెడి మీకు విభవములేల, ఇవిగాక నీతండ్రి పిల్లికూనలకై సర్వమును త్యజించి మిక్కిలి విరక్తిగలవానివలె తిరుగుచున్నాడు. ఇట్టిదాంభికభక్తిచేయుటవలన కాముర్యార్థమునకు చేరునా, మరియును కమలాపతియగు కంజదళాక్షుని పలువిధముల కష్టపెట్టుచున్నాడని వచించుటనువిని కుమ్మరచిన్నది యిట్లని నుడువుచున్నది. ఓసాధ్వీ నీతండ్రి శ్రీహరి విగ్రహమునకు ప్రసాదమునుంచి ఆరగించుమని చేయు వుపద్రవము వారిని కష్టపరచినట్లుకాదా, మరిన్ని తనయెదుట యేవేళకూర్చుండి మాట్లాడుచుండుమని నిర్బంధపరచుట వారిని కష్టపరచినట్లుకాదా, అన్నశ్రమను వారికి కలునియ్యక శ్రీమన్నారాయణుని దివ్యచరణారవిందంబులను సదా ధ్యానంబుచేయుచు అడవులయందు జని కట్టెపుల్లల నేరుపరచి విక్రయించి జీవించుచున్నామని వచింపుచు తన నిలవరముచేరెను. అనంతరము నామదేవుల కొమార్తె వస్త్రముల నుతుకుకొని గృహంబునకేతెంచి వంకాయను కుమ్మరచిన్నది వచించినమాటలను తనతండ్రితో సాంగోపాంగముగా నుడివెను. ఆవచనములను నామదేవులు విని శ్రీహరి సన్నిధికేతెంచి పలువిధముల శ్రీపాండురంగని స్తోత్రములుచేయుచు మిక్కిలి వినయముతో విన్నవించుకొనుచున్నాడు, ఓదేవదేవా రుక్మిణీహృదయేశా దేవరవారి నొకవిషయంబడిగి తెలుసుకొనదలచియున్నవాడను, రాకాకుమ్మరి నిన్ను భక్తితో ధ్యానముచేయుచున్నాడు, అవి సకామమో నిష్కామమో, లేక రక్తినికొనియున్నాడా విరక్తినిగొనియున్నాడా, వీటి వివరంబులను నాకు తెలియజెప్పవలయుననఁగా విని భగవంతుఁడు యిట్లువచింపదొడఁగెను. ఓనామదేవా అతఁడు వైరాగ్యమందతి శ్రేష్ఠుడు, భక్తియందు పరిపూర్ణుఁడు, అతనిమహిమలను గొనియా

డుటకు శక్యముకాదు, నావెంట వచ్చినయెడల అతని వైరాగ్యాది సుగుణములను చూపించెదనని చెప్పి అతనిని రుక్మిణీదేవిని వెంటబెట్టుకొని రాకాకుమ్మరి సంచరించుచుండెడి అడవికి జనిరి. అచ్చట రాకాభక్తుడున్ను వాని భార్యా పుత్రిక వీరు ముగ్గురున్ను రెండవ జామునం దడవియందు ప్రవేశించి కట్టెపుల్లల నేరుచు వాన్ని నొక చోట చేర్చియుంచుచు నొక పుల్లపై మరొకపుల్ల యుండిన వాటిని యెవరైనా చేర్చియుందురని విడిచిపెట్టిపోవుచు తమవల్ల జీవజంతువుల కపాయము రానీయక మిక్కిలిజాగ్రతగా భూమియందడుగుపెట్టుచు సదా భగవన్నామస్మరణ జేయుచు కట్టెలను మోపుగాగట్టి తమశిరంబునం దెత్తుకొనుట కుద్యుక్తులై యుండునట్టిసమయమందు పెరుమాళ్లు పిరాట్టి నామదేవు వారికికనుబడక వారిచర్యలను గని నామదేవుడు రుక్మిణీపిరాట్టినిగాంచి ఓతల్లీ యేదైనా వీరికికనుపడజేసి వాటిమూలముగా వీరి జ్ఞాన భక్తి వైరాగ్యములను పరీక్షించవచ్చునని వచింపగా రుక్మిణీపిరాట్టి తనకరంబునందుండిన అమూల్యరత్న కంకణమును విడదీసి వారు చేర్చియుంచిన కట్టెలమీద యుంచెను, మరికొంతసేపటికి రాకాకుమ్మరి కట్టెలవద్దకువచ్చి కంకణమును గని వేగముగా తనభార్యవద్దికి జని ఆమెను వెంటబెట్టుకొనివచ్చి దూరముగానిలిచి కంకణమునుజూపి మనకీకంకణమువల్ల మహత్తైన సంకటములు సంభవించునని చెప్పగా ఆమె యవినిజమనిసమ్మతించి మనలను చెరుపుటకొరకు భగవంతుడీ విచిత్ర కంకణమును గనుపడజేసి మనలను పరిశోధించుచున్నాడు, మనమీలోకమందలి వస్తువులను తృణప్రాయముగా నెంచి వాటినివిడనాడి శ్రీపాండురంగని చరణారవిందములే వుద్ధారకమనియెంచి శరణాగతి జేసియుండుటకన్న గొప్ప ధనము వేరే యేమున్నదని తమ మనంబును దృఢపరచుకొని ఆయల్పమగు వజ్రకంకణమును జూచుచేలయని అచటినుండి వెడలుటకు



యత్నించిరి. నామదేవు వారిమనోదృఢమునుగని భగవంతునిజూచి ఓస్వామీ దేవరవారు వీరికి సేవయొసగి రక్షింపుడని వేడుకొనెను: ఆక్షణమే భగవంతుండు చతుర్భుజాకారుడై హార కేయూర మకర కుండల కిరీట వనమాలా వైజయంతీ పీతాంబరధరుడై ప్రత్యక్షముగ సేవ యొసంగెను. అప్పుడు రాకాకుమ్మరి వారి దివ్యమంగళస్వరూపమును గాంచి ప్రదక్షిణనమస్కారంబులుచేసి ఓఅచ్యుతా అనంతావతారా ఆదినారాయణా కేశవా గోవిందా ముకుందా మురహారీ యని వారి తిరునామంబులను స్తోత్రంబుచేసి దాసునియొక్క నోము ఫలము యీదినం బీడేరెనని పరమానందముతో పునః పునః దండప్రణామంబులిడి అంజలీహస్తులై నిలిచియుండగా భగవంతుడు కరుణాకటాక్షముతో వారికి మంగళాశాసనములుచేసి అంతర్హితుండయ్యెను. అనంతరము రాకాకుమ్మరి దృఢవైరాగ్యశీలుండై ఆశాపాశంబుల నడుగంటం గోసి శ్రీ పాండురంగనాథుని భజింపుచు పండరీపురంబునందు వాసము జేయుచుండెను.

శ్రీపరాత్పరాయనమః.

# గోరాకుమ్మరి చరిత్రము

శ్రీపండరీపురికి సమీపమున దరఢోహియను గ్రామమునందు గోరాయను కుమ్మరి వాసముచేయుచుండెను. అతడు నడుచునపుడు గుడుచునపుడు భాషించునపుడు శయనించునపుడు యెడతెగక భగవద్దివ్యమంగళ విగ్రహమును జ్ఞాననేత్రములచే సేవించుచు మనస్సునందు సదా వారిగుణానుభవములను మననముచేయుచు వాక్కుచే వారి అనంతతిరునామములను బాడుచు తనదేహముచే వారికైంకర్యములను భక్తిశ్రద్ధలతో చేయుచు గృహస్థధర్మంబును నెరవేర్చుచుండెను. చెవులతో వినునప్పుడును కన్నులతో చూచునప్పుడును

ఇంద్రియవ్యాపారముచే విషయాసక్తియందు విహరించునప్పుడును సర్వము శ్రీమన్నారాయణ దివ్యమంగళస్వరూపముగా తలంచుచుండును. ఇట్టినిష్ఠాగరిష్ఠుడై నిశ్చలచిత్తుడై యుండుసమయమందు వీరి భార్య తనపుత్రుని వాకిలియందువిడిచి బిందెను చంకయం దుంచుకొని జలమునకై వెడలెను. ఆసమయమందచ్చట తండ్రి కుండలను చేయుటకు మన్నుత్రొక్కుచు శ్రీపాండురంగని తనమనంబున నిలిపికొని ధ్యానపరవశుడైయుండినందున తనకు బహిర్ముఖదర్శనమేమి కనంబడకుండెను. అట్టితరుణమందు వాకిలియందున్న శిశువు దోగాడుతూ తండ్రియొక్క పాదములవద్దికి రాగా వారు దేహముమఱచి పరమాత్మునియొక్క వ్యాపకస్థితియందులయము జెందినవారై శ్రీహరి నామములను ధ్యాంపుచు మన్ను త్రొక్కుచుండినందున ఆశిశువు పాదములక్రింద చిక్కుబడినదికూడ తెలియక మన్నుతోమన్నుగా త్రొక్కివేసెను. అంత వారి భార్య జలము నెత్తుకొనివచ్చి గృహంబునందిడి మిక్కిలి ప్రేమతో పుత్రుని పిలిచెను. ఆమె పలుమారు పిలిచియు శిశువుయొక్కసందడి వినరానందున తనపురుషునివద్దికిజని ఓ ప్రాణనాథా యిచట బిడ్డనువిడిచి జలమునకుగాను పోయియుంటిని. ఇపుడు తిరిగివచ్చి చూచునప్పుడు పుత్రుడు కనబడనందుచేత నామనసు పరితాపమునొందుచున్నదని గొప్పధ్వనితో వచించియు అతడు విననివాడై శ్రీహరిగుణానుభవపరుడై తన్మయము జెందియుండెను. అంత నాసాధ్వి తనపురుషుడు త్రొక్కుచుండెడు మట్టియందు రక్తమాంసములు కూడియుండుటనుగాంచి కన్నీరువిడచి యేడ్చుచు రొమ్ముపైమోదుకొని తనపురుషునిజూచి మీరిబిడ్డను మట్టిలోకలిపి త్రొక్కి గృహంబును భస్మముగాజేసితిరి, నేనిప్పుడే నా ప్రాణము విడిచిపెట్టెదనని గొప్పధ్వనితో ప్రలాపించుచుండెను. అతఁడీ శబ్దమాకర్ణించి బహిర్ముఖుడై తన భార్య చేయుచున్న యాగడమును



గాంచి ఓవనితా భగవంతుడు నాహృదయ కమలమునం దతిప్రియముతో నివసించియున్నాడు, నేను వారిని నేత్రానందముతో సేవించుచుండుతరుణమందు కూతలువేయుచు నా యనుభవమును చెరిపితివిగదాయని మిక్కిలి కోపావేశముగలవాడై తన భార్యను కొట్టుటకు చక్రదండమును చేతిలో నెత్తెను. భార్య వారినిగాంచి భయముజెంది నన్ను తాకితివా నీపాండురంగనిపై ఆనవున్నదని చెప్పెను. ఆవచనములను గోరాకుమ్మరి విని దండమును భూమిపైపడవేసి ఓ పాండురంగా భక్తవరదా ముకుందా మురహరీ మూలాధారాయని పలువిధముల వారినామసంకీర్తనలను బాడుచు సర్వసంగపరిత్యాగియై భగవద్గుణానుభవము జేయుచుండెను. ఇట్లితఁడు విరక్తిపరుఁడై యుండుటను జూచి ఆగ్రామమందలి జనులు పలువిధముల వచింపుదొడగిరి. వారిపల్కులను తానువినక మలరహితమైన మనస్సుతో మాధవుని కొనియాడుచు పాడుచు నాడుచుండెను. అనంతరమాసతి ఒకదినము జలమును తెచ్చి భర్తపాదంబులనుగడుగుటకు ప్రయత్నించెను. అప్పుడు గోరాకుమ్మరియను భక్తుఁడు భార్యను జూచి నన్ను తాకవలదని వచించెను. ఆవచనముల నాతనిభార్యవిని తనకు గలిగియుండిన మమతను విడిచి యికమీద నేనీ సంసారభారమును యెట్లుభరింతును, యేదిదిక్కనుచు కన్నీరుమున్నీరుగాబాఱ విలపించుచు తనభర్తను గాంచి ఓప్రాణనాథా పుత్రుని నిమిత్తము నేను చిత్తభ్రమకలిగి గొప్పధ్వనితో కోపముగామాట్లాడితిని, ఆతప్పును మన్నించి నన్నంగీకరింపవలయును, ఇకమీద తాము దాసురాలియందలికోపమునువిడిచిపెట్టుడనివినయముతో వేడుకొనెను. ఆసతి పల్కులనువిని భాగవతుడిట్లు వచింపుచున్నాడు. ఓసతీ నీవు పెరుమాళ్లమీద వుంచిన ఆణను నేనొకప్పుడును మీరజాలను. తూర్పు దిక్కున వుదయించు సూర్యుడు పడమటిదిక్కునం దుదయించినను

నామనోనిశ్చయమును యెంతమాత్రము విడువజాలనని దృఢముగా జెప్పుచున్న వార్తలనువిని భార్య మహా_ర్తైన శోకార్ణవమందుమునిగి పుత్రుడుద్భవించుటకును కులసంరక్షణమునకు సద్గతినొందుటకును మార్గమగుపడనందున వేరొకచిన్నదానిమాట్లాడి వివాహాముచేయింపదలచి తనమాత్రుగృహంబునకేతెంచి తనకున్ను తనభర్తకున్ను నడిచిన వర్తమానములను జననీజనకులతోచెప్పి వంశపరంపర నిలుచుటకుగాను మీవద్దయాచించుటకై వచ్చితిని. అదేమనగా నీకనిష్ఠపుత్రిని నాపురుషునకొసంగి వివాహాముచేసి కులము నుద్ధరించవలయును వారికి నేను భార్యయైయుండుటచేత యితరులు కన్యనొసంగుటకు సమ్మతించరని ఆలోచించి యిచ్చటికి వచ్చితిని. నాయొక్క విన్నపము నాలకించవలయునని పలువిధముల ప్రార్థించుచుండెను. ఆమెవచనములను జననీజనకులు విని కరుణగలవారై కనిష్ఠపుత్రికనొసంగుటకు సమ్మతించిరి. ఆతక్షణంబే బ్రాహ్మణులను రావించి వివాహలగ్నముయేర్పాటుచేసి పెండ్లికొమారునిరప్పించి సర్వసామగ్రులను సేఖరించి బంధువర్గములను రావించి మంగళవాద్యఘోషముతో బ్రాహ్మణులు మంగళాష్టకములు బాడగా జయజయశబ్దములతో వివాహాముచేసిముగించిరి. నాలుగవదినము వారివారి యిండ్లకు పోవుచున్నతరుణమందు మామగారల్లునిగాంచి అయ్యా నీవు నా జ్యేష్ఠకనిష్ఠ పుత్రికలసు వివాహాము చేసుకొనియున్నావు, గాన వారిద్దరియందు వంచనలేక సమభావముగా చూచుచు సుఖముగా యుండవలయును. స్త్రీలిద్దరు సంసారమందు పోరుచేసుకొనుచుంటే యితరజనులు చూచి పరిహాసముచేయుదురు, గనుక నేను చెప్పెడి మాటలను వృథాపరచి వేరుగానడిచితివేని వితొబాపై ఆనయున్నదనెను. వివేకియైన గోరాకుమ్మరి వారిపల్కులనువిని సంతోషము జెంది భగవంతునికృప పరిపూర్ణముగా యుండినట్టయితే బంధములు



తనకుతానే వీడిపోవును. విషయములలో దోషదృష్టిగలిగించి కామవికారంబులులేక శ్రీహరి కృపచేసి రక్షించునని తన గృహామునకు నిద్దరుభార్యలతోగూడ నేతెంచి ఆనందముతో గృహాంబునందుండిన సర్వవస్తువులను సమముగాయిద్దరికొసంగుచు కాలయాపనముచేయుచుండిరి. ఒకదినము పెద్దభార్య తనపురుషునివద్దికేతెంచి ఓస్వామీ వంశవృద్ధికొరకై నాచెల్లెలిని మీకు వివాహాముచేయించినానుగనుక యీచిన్నదానిని కృపతో యంగీకరింపుడని వచింపగా గోరాకుమ్మరి తనపెద్దభార్యనుగాంచి మిక్కిలివినయముతో పల్కుచున్నాడు. ఓ వనితామణీ వినుము, నీతండ్రి నన్ను దారివిడిచిపోవునపుడు యిద్దరియందు సమభావముగా యుండుమని విఠలునిపై ఆనయుంచెను. ఆ కారణమువల్ల నేను మిమ్మిరువురను నా ప్రాణముండు పర్యంతము తాకజాలననెను. ఆవచనములనువిని వారిద్దరు వ్యసనాబ్ధిని మునింగిగాలముగడుపుచుండిరి. ఇట్లుండంగా నొకదినము రాత్రి పెద్దభార్య ప్రేరేపించినందున చిన్నభార్య భర్త శయనించియున్న స్థళముజేరి నిద్రబోవుచుండిన పురుషుని కరములను తనరొమ్మునం దుంచుకొనినంతలో అతండు మేల్కని మిక్కిలిపరితాపముగలవాడై వ్యసనమునొందుచు భగవదాజ్ఞను అన్యముగాయెంచుట మిక్కిలి దోషమనియెంచి నిర్భరత్వమును వహించి స్తంభమునకు అడ్డముగా పట్టాకత్తిని యిరుపార్శ్వములయందు దారముతోబంధించి స్త్రీలను తాకిన కరంబులివిగదాయని రెండుకరంబులు పైకెత్తి మోది కత్తిపై వేసికొనినంతనే తనరెండుకరంబులు తుండములై భూమియందు పడియుండుటనుగాంచి నిర్భయుడై శ్రీహరి నామములను ధ్యానింపుచు నిశ్చలచిత్తుడై పరమానందపరవశుడై యుండెను. అంత స్వపత్నులిద్దరును వుదయమునలేచి వారుండుస్థలమునకువచ్చి ఆవిపరీతమును గాంచి రొమ్ముపైమోదుకొని యెలుగెత్తియేడ్చుచుండంగా, భక్తుడు

యిక మనంబ్రతుకున కేమిచేయవచ్చునని పలువిధముల చింతింపుచు
సంపత్తుకును మోక్షసామ్రాజ్యమునకును శ్రీధరుడైన పాండురంగ
డున్నాడని మనోదృఢముగలవాడై యిక మనము చింతించవలసిన
పనిలేదని గోరాకుమ్మరి వచింపగా, భార్యలిద్దరు భర్తవచనములను
విశ్వసించి సదా భగవద్భక్తిచేయుచుండిరి. ఇట్లుండ పండరీపురమున
ఆషాఢశుద్ధయేకాదశి వచ్చినందున పండరీపురమునకు యీ భార్య
లిరువురు తమ పురుషుని వెంటబెట్టుకొని భగవంతుని సన్నిధానము
నకు వచ్చిరి. అపుడు మహామంతపమునందు గోరాకుమ్మరి హస్తహీ
నుఁడై ప్రవేశించెను, అచట నామదేవుఁడు మిక్కిలి ఆర్తితో కీర్త
నలు పాడుచు నృత్యము జేయుచుండఁగా భక్తులందరు సేవింపుచుండ
శ్రీపండరినాధుడు నాట్యముచేయుచుండుటను చూచెను. అపరిమిత
ముగా శ్రీహరినామములను భక్తులందరు మననముచేయుట కుపక్ర
మించిరి. శ్రీహరినామోచ్చారణం బంతకంతకు హెచ్చి అపారమైన
ఆనందరసమతిశయించినందున అచటనుండిన భక్తులందరు చేతులను
మీదికెత్తి శ్రీహరీ కృష్ణా మురహరీ రామా గోవిందా ముకుందా
గోకులవాసా యని వారి అనంతనామంబులను మననముచేయుచు
కరతాళంబులు వేయుచు ఆనందతాండవనృత్యము చేయదొడంగిరి.
ఆతరుణమందు గోరాకుమ్మరను భక్తుఁడు తాను కరతాళములు వేయు
టకు తనకు కరములు లేవేయని మనంబున దలఁచెను. ఆక్షణంబె
భగవంతుని కృపచే వారికి యిరుకరంబులు మునుపటివలెనే కలిగి
యుండెను. వాటిని గాంచిన భక్తులందరు మిక్కిలి సంతోషమును
బొంది మరిన్ని అధికముగా శ్రీహరినామంబుల నుచ్చరింపుచు భగ
వంతుని కృపాకటాక్షమును కొనియాడిరి. అట్టితరుణమందు గోరా
కుమ్మరుని పెద్దభార్య కరములు ముకుళించుకొని వరములనొసంగు
వాసుదేవా నీకృపాదృష్టి మాయందు ప్రసరింపఁజేసి నాపురుషునికి



కరంబులొసంగితివి. నాపతిచే మట్టియందు త్రొక్కబడిన నాపుత్రుని
నొసంగి మమ్ముద్ధరింపవేయని మిక్కిలివినయముతో వేడుకొనుచుం
డెను. ఆక్షణమే భక్తుల సమీపంబున జేరి పాడుచుండెడి పుత్రునిఁ
గని ఆవనిత మిక్కిలి సంతోషముతో విస్మయమునొంది నిలిచియుం
డెను. ఆసమయమందు రుక్మిణీదేవి మువ్వురిని ప్రీతితో నాదరించి
యిదివరకు మీకుండిన ఆనతీరినది, యికమీద మీరు సంసారమొం
దిచ్ఛగలిగి అన్యోన్యముగా కలిసిమెలిసి యుండుడని ఆపుత్రుని నెత్తి
వారలచేత నొసంగగా వారు ధన్యోస్మియని తీసుకొనిరి. వీరి చరి
తమును ఆమహామంతపంబందుండిన భక్తులందరు విని ప్రియమును
ఆనందమును కలిగియుండిరి.

శ్రీరుక్మిణీకాంతాయనమః.

# చాంగదేవుని చరిత్రము.

స్వర్గమునం దొకదినంబున పాకశాసనుఁడు తనపరివారముతో
సింహాసనమునందు వేంచేసియుండు సమయంబున తనయాజ్ఞనుల్లం
ఘనముచేసిన మరుద్గణుఁడనువానింజూచి మరుద్గణుఁడా నాయాజ్ఞను
మీరి నన్నవమదించినందున నీవు భూలోకంబునందు మనుజుఁడవై
జన్మింపుమని మిక్కిలి కోపముతో శపించెను. ఆవచనములను మరు
ద్గణుఁడు విని తన అవివేకమునకు చింతింపుచు శాంతచిత్తుఁడై దేహ
ము గడగడవణకఁగా కాళ్లు తడబడ నిలిచి ఓ దేవేంద్రమహారాజా
దాసుఁడు తమ విషయమం దపచారపరుఁడైతిని. నాయపచారము
లను మన్నించి తామొసంగిన శాపమును మరలింపుండని పలువిధం
బుల స్తోత్రముఁజేసి వేడుకొనఁగా, ఇంద్రునికి వానియందు కృప
గలిగి ఓమరుద్గణా నీస్తోత్రంబునకు సంతసించినాను. అయితే నీవు
భూలోకమందు మనుజుండవై జన్మించి కొన్నాళ్లంధుండవైయుండి

జ్ఞానానుష్ఠానసంపన్నుఁడై నిశ్చలత్వము వహించి భగవద్భక్తిచేయు
చుండుటచేత చంద్రాదిత్యులుండుపర్యంతము నీకీర్తి ప్రబలునట్లు జేసి
పిమ్మట యిచ్చటికివచ్చి చేరుదువని వరంబొసంగెను. అలాగే మరుద్గ
ణుఁడు భూలోకమందు గోదావరి నదీతీరమునందవతరించి చాంగదే
వుఁడను నామమును బడసి అచ్చటినుండి తపతియను నదీతీరముచేరి
ఆనదియందు ప్రతిదినము స్నానముచేసి నిత్యకర్మానుష్ఠానంబులను
ముగించుకొని తపంబొనరించుచుండెను. వీరి జ్ఞానానుష్ఠానములను
గాంచిన ఆదేశవాసులందరు వీరిమహత్త్యములనుకొనియాడుచుండుట
చేత దూరదేశములందుండు జనులు యీమహానుభావుని సేవించుట
కొరకై అనేకులు గుంపులుగూడి వచ్చుచుందురు. ఇట్లుండగా వరుణ
గ్రామమునుండి యిద్దరు ద్విజోత్తములువచ్చి చాంగదేవుల సేవించి
వారియందు గురుభావంబుంచి వారికి సమయోచితంబుగా కావల
సిన శుశ్రూషల నొకమాసపర్యంతము చేయుచుండి ఒకదినమునందు
చాంగదేవులనుజూచి ఓస్వామీ మీదాసులమగు మాకుపదేశము
చేసి మమ్ము కడతేర్చవలయునని ప్రార్థింపఁగా వారి దీనాలాపము
లను విని యోగీంద్రుడు యిట్లు వచింపదొడంగెను. ఓద్విజోత్తము
లారా నేనీ భూమియందు జన్మించితోడనే జననీజనకులను ధన ధా
న్య రత్నములను వస్త్రాన్నపానాదులను పుత్రమిత్రకళత్రపశుగృహ
క్షేత్రాదులను వర్జించి యేకాకినై సంచరింపుచు యిపుడీ నదీతీరమున
భగవద్గుణానుభవపరుఁడై యిచట వసించుచున్న నాకు ఉపదేశమ
నునది యెట్లు తెలియవచ్చును. నన్నాశ్రయించుటకంటె జ్ఞానభక్తి
వైరాగ్యశీలురై వెలుగుచున్న మహాత్ముల నాశ్రయించి కడతేరుఁ
డని వచించెను. వారి మృదుమధురోక్తులను విని విప్రులిద్దరు చాం
గదేవులను విడువక యథాప్రకారము వారికి కైంకర్యము లొనరించు
చుండఁగా చాంగదేవులు తన జ్ఞానదృష్టిచేత వీరు ధనకామ్యార్థపరు



లగుచు సేవలొనరింపుచుండుటను గాంచి చాంగదేవులా బ్రాహ్మణు
లను చూచి మీరెందులకై నన్నాశ్రయించియున్నారనియడుగఁగా
వారలు మిగుల భయభక్తులతో ఓస్వామీ మేము బహుకాలముగా
న్యాయరీతిననుసరించి వ్యాపారముచేయుచుంటిమి, ఇపుడా వ్యాపా
రమునం దనేక కష్టనష్టములు సంభవించినందున మే మధికకష్టము
పొందుచున్నారము, తాము మాయందు కృపాకటాక్షవీక్షణంబుంచి
మా నష్టకష్టములుతీరి మేము ధనవంతులుగా యుండునట్లు కృప
యుంచి రక్షించవలసినదని పలువిధముల స్తుతింపుచు గద్గదకంఠులై
కన్నులయందు నీరుగారగా దుఃఖించుచుండుటను చాంగదేవులు గని
ఓవిప్రులారా మీరు యెచ్చటనయినా సంతజరుగుచుండెడు చోటికి
వ్యాపారము చేయుటకై కావలసిన వస్తువులను యెత్తుకొని నన్ను
వెంటబెట్టుకొనిపోతిరేని మీకు విశేషలాభమువచ్చునని వచింపగా
వారానందముజెందినవారై వ్యాపారమునకు కావలసినవస్తువులు సిద్ధ
పరచుకొని సంతజరుగుచోటికి తమగురువును వెంటబెట్టుకొనిపోయి
ఆసనంబమర్చి వాటియందు గూర్చుండబెట్టి తమగురునియాజ్ఞవడసి
వ్యాపారముచేయ నారంభించగా బేరకాపులు అధికముగా వచ్చి
కొనుటచేత వ్యాపారము చక్కగాజరిగి తెచ్చినసరకులమ్ముడుపోయి
రెండుపాళ్లు లాభమువచ్చినది. విప్రులిద్దరాలాభముగాంచి సంతోష
ములో తమయాచార్యుల పాదపద్మములకు సాష్టాంగదండప్రణామం
బులుజేసి మీకృపాకటాక్షవీక్షణముచే రెండుభాగములు లాభము
వచ్చెనని కొనియాడుచుండఁగా గురుం డిట్లు వచింపదొడఁగెను. ఓ
విప్రులారా శ్రీహరి కృపాకటాక్షముచేత మీకు ధనము సంప్రాప్తం
బయ్యెను, ఇకమీద మీకీప్రకారముగానే శ్రీహరి యిచ్చుచుండు
నని మంగళాశాసనముచేసెను. ఆవచనములనువిని శిష్యులు సంతో
షముజెందినవారై త్వరగా సమస్తభక్ష్యభోజ్యాన్నంబులను సిద్ధము

చేసి తమ యాచార్యుల నారగించుటకు ప్రార్థింపఁగా వారు మృత్తికతో లింగము జేసి షోడశోపచారములచే పూజించి నైవేద్యం బొనర్చి శేషప్రసాదమును యిద్దరుశిష్యులతోగూడ తాను సహబంతియందు గూర్చుండి భుజించి సంతోషించి మరునాడుదయము తమ యాచార్యులతోగూడ యథాస్థానమునకువచ్చి చేరిరి. ఈప్రకారమే ప్రతివారంబు సంతజరుగుచోటికి తమయాచార్యులతోగూడ వెడలి వ్యాపారము చేసి వచ్చుచుందురు. ఇట్లొకసంవత్సరమువరకు బేరము జేయుటచే అమితద్రవ్యము జేరి వారిదరిద్రము హతంబయ్యెను. వీరాచార్యులవారికి సకలసేవలు చేయుచు వారిమంగళాశాసనమువడసి అధిక ధనాఢ్యులై వెలసియుండి కొన్నాళ్లకు ధనగర్వముచేత తమస్థితియిట్టిదని తెలియక బుద్ధిమాలి తలక్రిందై సంసారబద్ధులగుచు తమ ఆచార్యునియందు ప్రేమతప్పివర్తింపుచుండిరి. ఇట్లుండుటనుగని ఆచార్యులవారేపనియు వీరికి చెప్పకయుండిరి. శిష్యులును తమకు తీరుపాటైనప్పుడువచ్చి కొద్దిగా కైంకర్యములుచేసిపోవుచుందురు. చాంగదేవుడు అంధుడగుటచే తనకు కావలసిన పూజాద్రవ్యముల నొసంగువారు లేకుండుటచేత మిక్కిలికష్టపడుచుండును. ఇట్లాయడవియందు వొంటరిగా కాలముగడపుచుండ ఒకదినంబునం దొక శిష్యుడు చాలాప్రొద్దెక్కివచ్చినందున గురుఁడు చింతించి ఆహా వీరిద్దరు సంసారబద్ధులై తిరుగుచు భగవంతుని మరిచిపోయిరిగదాయని తనమనంబున నెంచి వాని శివపూజకై మృత్తిక తెమ్మనఁగా పామరుండగు ఆశిష్యుడు తన మనంబున కృత్రిమభావముతోడ తపతితీరమునకు వచ్చి యిసుకను తెచ్చి లింగాకారముగా నుంచెను. ఆయిసుక లింగాకారముగా నిలువకయుండుటనుగని ఓరీ శిష్యా నీవేల యిసుకను తెచ్చితివి, మృత్తిక దొరకలేదాయనెను. ఆవచనములనువిని స్వామీ మృత్తిక దొరకలేదని వచింపుచుండగా రెండవశిష్యుఁడు వచ్చెను. వీరిద్దరు జేరి పరి



హాసమునకు తనగురుని చెంబును తలక్రిందుగానాటి ఓగురుపుంగవా యీలింగముచూడుడు, మిక్కిలి ప్రకాశముతో జ్వలింపుచున్నదని వారిచేతులనుబట్టి తీసుకొనివచ్చి పాత్రలింగమువద్దకూర్చుండబెట్టిరి. చాంగదేవుఁడు మిక్కిలిప్రేమతో గంగాధరా పశుపతీ నందికేశ్వరా నాగభూషణా కేశవప్రియా శంకరాయని స్తోత్రముచేయుచు దేహము తెలియక పాడుచునాడుచు ఆర్తుఁడై వేడుచుండగా ఆలింగాకారముగానున్న ఈశ్వరుఁడు చరాచరంబులెల్ల నిండినిబిడీకృతుండై వెలుగుచుండెను. చాంగదేవుడా లింగమును తనకరంబులచే స్పృశించిచూచి ఆహా యిది మిక్కిలి సుందరంబైన లింగంబని పరమానందముతో భజింపుచు ఈప్రపంచమందలి లింగములలో యిది మిక్కిలి తేజస్సుగలిగి ప్రకాశించుచున్నదని భయభక్తి విశ్వాసములతో పూజార్చనలొనరించుచుండెను. అంతలో తనశిష్యులు సిద్ధపరచియున్న పక్వాన్నంబులను తెచ్చి ఆదేవునిముందుంచి ఆర్యా యిదో ప్రసాదంబుంచియున్నాముగాన తాము వాటిని భగవంతునికి నైవేద్యం బిడుమని వచించిరి. అంత చాంగదేవుఁడు ఓ పంకజలోచనా పార్వతీరమణా నేను భావహీనుఁడను క్రియాహీనుఁడను మంత్రతంత్రము లెవ్వియు నెఱుఁగని పాపిని, నాచే నొసంగబడు ప్రసాదం బారగించి నన్ను ధన్యునిఁగాజేసి కాపాడి రక్షింపవేయని దీర్ఘదండంబిడెను. ఆశంకరమూర్తి మిక్కిలి ప్రీతిగలిగి ఆప్రసాదం బారగించెను. అంత నా శిష్యులు ప్రక్కనయుండు విడిగదియందు గురునికూర్చుండబెట్టి వారికి భక్ష్యభోజ్యాన్నంబులిడఁగా వారు భుజింపుచు దాహమునకై శిష్యునిజూచి తన చెంబును తెమ్మనివచింపగా వారతిశీఘ్రమున వెడలి లింగాకారముగానున్న చెంబును యెత్తపోగా అది భూమియందుస్థాపనమై కదలకుండుటనుగని శిష్యులిద్దరు తమతమ శక్తికొలది లేవనెత్తియు రానందున గురువువద్దికేతెంచి ఓస్వామీ మేము తమయందలక్ష్య

బుద్ధిచే యపచారపడితిమి. తాము మాయందు పుత్ర వాత్సల్యము
యుంచి మేమొనర్చిన దుష్కార్యములనుమన్నించి రక్షింపవలయు
నని నానావిధములస్తోత్రములుచేసిరి. గురుఁడు వారియందు కృపా
కటాక్షంబుంచి శంకరుని పలువిధములకొనియాడి ఓవుమేశా మీరు
దాసుని ప్రార్థనంబంగీకరించి తామీస్థలంబునందు వటలేశ్వరుఁడను
తిరునామమువహించి మిమ్ము సేవించువారికి భుక్తి ముక్తుల నొసంగి
రక్షింపుడని ప్రార్థనచేయఁగా శంకరుం డానందపరవశుఁడై చాంగ
దేవునికి నేత్రములు కనఁబడునటుల చేసి అర్చావతారముగా నెల్ల
రకు సేవయొసగుచుండుటచే ఈయద్భుతమగు కార్యము జగమంతయు
ప్రసిద్ధిజెందియుండెను. పిమ్మట చాంగదేవులు తమశిష్యులను పిలిచి
మీరు మీగృహములకు వెడలిపొండని నియమింపగా శిష్యు లధిక
సంతోషముగలవారై దీర్ఘదండప్రణామంబులిడి తమ తమ గృహం
బులుచేరిరి. పిమ్మట ప్రపంచమందలి జనులీమహాత్ముని ప్రభావమును
విని వారివారియిష్టార్థసిద్ధికై ప్రార్థనలుజేసుకొనఁగా వారిప్రార్థనలు
సఫలంబగుచుండెను. ఇట్లుండఁగా నొకవర్తకుఁడు వీరియందు గురు
భావంబుంచి విశేషధనము వ్యయపరచి యొకమఠముకట్టించి ఆమఠ
మునకువచ్చెడి భగవద్భక్తుల కపరిమితముగా అన్నదానముచేయుచు
న్నందున చాంగదేవుల తిరునామము జగద్ధితముగా వెలుగుచుండెను.
ఆవటేశ్వరుని చాంగదేవుం డధికశ్రద్ధాభక్తులుగలిగి ఆరాధింపుచు
యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమా
ధులను అష్టాంగయోగములను సిద్ధిబొందినవారై అనేకములగు విచి
త్రములను జనులకుజూపుచు వెయ్యిన్ని నన్నూరుసంవత్సరములు జీవి
తులై ప్రసిద్ధమైన శిష్యులు వెయ్యిన్ని నన్నూరుమందితోకూడి భగ
వద్భక్తిచేయుచుండి కొంతకాలమునకు జ్ఞాన భక్తి వైరాగ్యశీలుఁడై
అదృష్టాలాభసంతుష్టుఁడై సర్వకాలములయందు శ్రీహరి చరణార



విందములను భక్తితోధ్యానింపుచు దివ్యదేశములను సేవించివచ్చు
చుండగా, దారిలో చంద్రశేఖరునివలె ప్రకాశించుచున్న చాంగదే
వులగాంచి విప్రుండొకఁడు దీర్ఘదండప్రణామంబులిడి పలువిధముల
స్తుతింపుచు పునఃపునః దండముసమర్పించుచు లేచి నిలువంబడియుం
డఁగా చాంగదేవుఁడా విప్రునిగాంచి నీవెచ్చటినుండి యిచ్చటికి వచ్చి
తివి, నీవూరుపేరేమి యేమేమివింత లెచ్చటెచ్చటగంటివి, వాటిని
దాసున కెఱింగింపుమని మిక్కిలిప్రియముతో నడిగెను. అందులకా
విప్రుడు స్వామీ నేను వసించు పైఠనపురమునందు షణ్మాసములు
సన్యసించియుండి పిమ్మట భార్యతో సంసారభారమువహించి కొంత
కాలమునకు నలుగురు పుత్రులను బడసెను. వారిలో నొకపుణ్యా
త్ముఁడు జ్ఞానదేవులను తిరునామము వహించి మిక్కిలి ఖ్యాతిజెంది
మహిషమునోట ఋగ్వేదంబును వచింపజేసెను, ఈభూమియం దిట్టి
వింతనుఁ గని విని యెఱుఁగనని వచింపఁగా విని చాంగదేవుఁడు సం
తోషమునుపొంది జ్ఞానదేవుల వంశపరంపరలను వారివైభవములను
చక్కఁగా విచారించి తెలుసుకొన్నవాఁడై, ఈమహాత్ముఁడు విష్ణుఅంశ
సంభూతుఁడని తలచి వారినాశ్రయించి మంత్రరాజము నుపదేశము
ముపడసి కృతార్థుఁడుకావలయునని తనమనస్సునందుత్సహించి వారికి
విజ్ఞాపన పత్రిక లిఖించుటకై తాళపత్రము చేబూని ఘంటముతో
వ్రాయదొడంగి తన మనస్సునం దిట్లు వితర్కింపసాగెను. చిరంజీవి
యనివ్రాయవచ్చునా, అట్లు వ్రాసినయెడల మనము వారి నాచార్యు
నిగా పరిగ్రహింపవలసినందున అట్లు వ్రాయుటవలన ప్రమాదము సం
భవించును, లేక తీర్థస్వరూపియని వ్రాయవచ్చునా, అతడు నాకన్న
చిన్నవాడుగాన అట్లువ్రాయుట మర్యాదగానుండదు, అని తనమనం
బున చింతింపుచు యేమియును తోచనందున వట్టి తాళపత్రమును
జుట్టి జ్ఞానదేవుల చేతికిమ్మని శిష్యుని చేతికిచ్చిపంపెను. అతఁడా పత్రి

కను దీసుకొని అళకాపురికివచ్చి జ్ఞానదేవుల సముఖమున నిలిచెను. జ్ఞానదేవుం డాతనిగాంచి నిన్ను చాంగదేవుడుపంపెనాయని యడిగి అతనిచేతి తాళపత్రికనుదీసి విప్పిచూచి ఓహో యింతకాలముగడచియు చాంగదేవునిబ్రతుకు వట్టియాకుగానేయున్నది, భర్తృహీనయగు స్త్రీ చేసికొని అలంకారమువలెను, దయాహీనుఁడు చేయు జ్ఞానోపదేశమువలెను చాంగదేవుఁడు బహుకాలము జీవించియు సకలవిద్యలనభ్యసించియు బహుసామర్థ్యములతోఁగూడియుండియు సద్గురువుల నాశ్రయించి కృతార్థుడుగాక వ్యర్థుండయ్యెను. అనివచింపుచు చాంగదేవునికి తానొకపత్రికవ్రాయనారంభించి సర్వప్రాణులకును చైతన్యము సమమైయున్నది, అది పెద్దదియుకాదు చిన్నదియుకాదు స్త్రీపురుష నపుంసకములుగావు, యోగసిద్ధిచే యొకఁడద్భుతవస్తువని చూచుచున్నాడు, ఇంకొకడు అద్భుతవస్తువని చెప్పుచున్నాడు, మరియొకడు అద్భుతవస్తువని వినుచున్నాడు. చూచుచు చెప్పుచు వినుచుండియు దాని నిజస్వరూపము నొకడైన యెఱుగఁడని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ వచించియున్నాడు. ఓ చాంగదేవా నీవు దీని తెలుసుకొనుమని వ్రాసి పత్రిక తెచ్చినవాని చేతికొసంగి వీటిని గొనిపోయి చాంగదేవుని చేతికిమ్మని చెప్పిపంపెను. అతండతివేగంబున జని పత్రికను చాంగదేవుని చేతికిచ్చెను. ఆపత్రికను విప్పిచూచి వ్రాసియుండు శ్రీసూక్తులనుగ్రహించి పరిపక్వచిత్తుఁడై యిట్టి జ్ఞానానుష్ఠాన సంపన్నుఁడైన సదాచార్యు నాశ్రయించి కృతార్థుండగుట మేలని తనశిష్యులు వెయ్యిన్నినన్నూరుమందితో శీఘ్రంబున నొక వ్యాఘ్రముమీద నెక్కి కృష్ణసర్పమును జాటిగా చేబూని జ్ఞానదేవుల సమీపంబునకు వచ్చుచుండ, ఆతరుణమందు జ్ఞానదేవు లొక జీర్ణకుడ్యముపై కూర్చుండి చాంగయోగి వ్యాఘ్రముపై నెక్కివచ్చుటనుగాంచి ఓకుడ్యమా నీవతివేగంబున చాంగదేవునెదుటి కేగుమని



వచింపగానే ఆకుడ్యము వాయువేగముగావచ్చుచుండుటను చాంగదేవుఁడు వీక్షించి ఆహా యిదేమివింత స్థావరగతియైన యీ కుడ్యమును జ్ఞానదేవుఁడు వాహనముగా నడిపించుట మిక్కిలి సాహసమనియెంచి తానాక్షణమే వ్యాఘ్రమును విడిచి దిగి జ్ఞానదేవులను వలగొని వారిపాదంబులు తనశిరంబున సోకునటుల దీర్ఘదండప్రణామంబులిడి వారి తిరువడిగళను గట్టిగాపట్టుకొని ఓస్వామీ దాసునియందు కృపయుంచి మంత్రార్థం బుపదేశముచేయుండని పలువిధముల కొనియాడఁగా జ్ఞానదేవులు వారి రెండుచేతులనుపట్టి లేవనెత్తి ఓచాంగదేవా నీచిత్తానుసారము మంత్రరాజమునొసంగెదను. నీవు నీశిష్యులలోనొకని నాకు బలియిచ్చెదవాయనియడుగ స్వామీ తమ యిష్టానుసారముగా బలియిచ్చెదననిపలికి తాను దిగియుండు చోటునకువచ్చి తనశిష్యులందరిని దగ్గిరికిపిలిచి ఓశిష్యులారా నాయాచార్యులగు జ్ఞానదేవులకు బలిగా యీసంఘమందుండువారిలో యెవరు పోవుచున్నారని యడుగగా, శిష్యులు స్వామీ తమ యధీనములో నుండెడు మమ్ము తమ యిష్టానుసారముగా వుపయోగపరచుకొనవచ్చునని మాత్రము బదులుచెప్పి శిష్యులందరు యేకాంతముగా గుమిగూడి కుశ్చితబుద్ధిగలవారై ఆచార్యులు బలియిచ్చుటకు యత్నించియున్నారని యెంచి చూచితిరా మన యాచార్యుని భావము, తాము సుఖముపొందుటకై మనము బలిగాపోవలెనట, యిట్టిదుర్బుద్ధి యెట్టివారికైనాకలిగియుండునా, ఇట్టివారి సహవాసమువదలి మనప్రాణములు కాపాడుకొనుటయే మేలని తలంచుచు తెల్లవారకమునుపే వెయ్యిన్నినన్నూరుశిష్యులు పరారులై వెడలిపోయిరి, ఉదయమైన వెనుక చాంగదేవుడు తనశిష్యులను బిలచుచు మారుపలుకుట కొకరైన లేకయుండుటనుగాంచి యింతేనా శిష్యవర్గంబుల లక్షణంబని మనసువిసికి నిత్యకర్మానుష్ఠానవిధు లొకరి సహాయములేకనే తామే

జరిపించుకొనుచుండఁగా జ్ఞానదేవు లచటికి విచ్చేసిరి. అంత చాంగ
దేవు వారినిగాంచి వలగొని దీర్ఘదండప్రణామంబులిడి లేచి నిలువం
బడి ఓ స్వామీ ఔపాధిక బంధుసైన తాము దాసునియందు కృప
యుంచినవెనుక ఉపాధి బంధువులైన శిష్యవర్గంబులు చెప్పకుండా
పరుగులిడిరి. ఓ కృపానిధే యిక దాసుని తాము బలిగా నంగీకరిం
పవచ్చునని వారి తిరువడిఘలను గట్టిగా పట్టుకొని లేవకుండెను.
అనంతరము జ్ఞానదేవులు వారి కరంబులనుబట్టి లేవనెత్తి తన నివాస
స్థానమునకు వెంటబెట్టుకొనిపోవుచు వారికి గృహస్థాశ్రమధర్మమును
వచింపుచు నీవనుష్ఠానపరుఁడై స్థిరచిత్తము వహించియున్నావు, ఎట్ల
నఁగా, నీవు పుత్ర మిత్ర కళత్ర ధన ధాన్యాదులను వర్జించి దృఢవ్రత
తుఁడై యేకాంతశీలుఁడై నిష్కాముఁడై సదా భగవద్గుణానుభవర
తుఁడై యున్నావు, ఇట్లమరియుండుట మిక్కిలిదుర్లభము, నీవు నాకు
బలి కావలసినపనిలేదు, నీవద్ద వేషధారులై కాలముగడుపుచుండిన
అప్రయోజక శిష్యుల నివర్తిచేయుటకై యత్నించి నిన్ను బలిదాన
మడిగితినిగాని వేరేమిన్ని లేదు, అనిచెప్పుచు వారికరములను బట్టు
కొని పోవుదారియందొక వటవృక్షముక్రింద విశ్రమించి తత్త్వోప
దేశములను వచింపుచు అచ్చోటువిడిచి జ్ఞానదేవులగృహంబుజొచ్చి
పోవుచుండఁగా అచట ముక్తాభాయి వస్త్రహీనయై స్నానము జేయు
చుండుటను గాంచి జంకి వెనుకకుజనెను. అదిగని ముక్తాభాయి ఓ
చాంగదేవా నీవు సకలధర్మంబులనెఱింగెడి జ్ఞానము నీయందు స్వత
స్సిద్ధముగానుండియు సదాచార్యుని యాశ్రయించి తత్త్వహిత పురు
షార్థ ధర్మంబుల నెఱుంగమిచే నీకిట్టి భేదబుద్ధి కలిగెను. కారడవిని
పశువులు మేయుచుండునపుడు అవి వస్త్రము లేకనుండియు వాటికెట్లు
వికారగుణములులేవో ఆప్రకారము వస్త్రహీనయైన నన్ను జూచిన
జ్ఞానులు నన్ను పశువుగాభావించి వికారరహితులై యుందురు. అట్టి



వారిని పరిపూర్ణ జ్ఞానులందురు. అట్లు సమభావములేక భేదబుద్ధిగలిగి
యుండుటచే నీవు భిన్నజ్ఞానుండవై యున్నావు. ఇకమీఁదట నీకు జ్ఞాన
దేవులయొక్క వుపదేశ సంబంధముచేత సుజ్ఞానముకలుగునని వచిం
చెను. ఆమెవచనములనువిని చాంగదేవుఁడు తనకాలము వ్యర్థపరచి
నందుకు మిక్కిలిచింతనొంది ముక్తాభాయికి దండముసమర్పించి ఆమె
యాజ్ఞవడసి జ్ఞానదేవులకు దండము సమర్పించఁగా, ఆక్షణమే జ్ఞాన
దేవులు చాంగదేవుని శిరంబున కుడిహస్తంబు నునిచి తారకమంత్ర
ముపదేశించి మంత్రార్థములను దెలిపి సర్వదేశ సర్వకాల సర్వావస్థల
యందు యెడతెగక శ్రీహరిగుణానుభవములను పాడుచు నాడుచుం
డుమని హితోపదేశంబు జేసి విడిచిపెట్టఁగా, చాంగదేవుఁడావిశేషా
ర్థములనువిని సదనుష్ఠానపరుఁడై ఒకమాసంబచటవసించి తన ఆచా
ర్యుని యాజ్ఞవడసి వటలేశ్వరంబునకేతెంచి మిక్కిలిప్రీతితో వటలే
శ్వరుని సేవించి బహువిధంబుల స్తోత్రముచేసి యేకాకియై హరిగుణా
నుభవపరుఁడై కాలముగడపుచుండెను.

శ్రీనివాసాయనమః.

# చాంగకేశవదాసు చరిత్రము.

ఇట్లుండగా సమీపమునందు నారాయణడోహియను దివ్యస్థళ
మొకటియుండెను. అందు బ్రాహ్మణ కులంబునం దుద్భవించిన ముద్గో
పంతునకు రుక్మాభాయియను పతివ్రతాతిలకము భార్యగానుండెను.
ఈసతీపతులా ప్రదేశమున నెలకొనియున్న ఉమాపతిని భక్తిశ్రద్ధలు
గలిగి పూజింపుచుండిరి. ఇట్లు కొంతకాలముజరిపి పిమ్మట యీసతీ
పతులు వటలేశ్వరమునకువచ్చి తపతీనది గట్టున అన్నపానాదులను
వర్జించి తపంబొనరింపుచుండి ఒకానొకదినమాసతీపతులు పురుషార్థ
ప్రదాతయగు పశుపతిని అచట వసింపుచున్న చాంగదేవుని సేవించి

పరమానందముతో ధ్యానించుచుండిరి. అప్పుడు పశుపతి కరుణించి చాంగదేవుఁగని ఓ భక్తాగ్రేసరా నీవు నాయాజ్ఞను శిరసావహించి ఆ సతీపతులకు కావలసిన వరంబుల నొసంగుమని యాజ్ఞాపించగా చాంగదేవుఁడు భగవదాజ్ఞను శిరసావహించి ఆ దంపతులను దగ్గిర బిలిచి మీ కోరికలను వచింపుడు వాటిని పూర్తినొందించెదననెను. ఆసతీపతులు వారిపల్కులువిని మిక్కిలి సంతోషముబొందినవారై దీర్ఘదండంబులు సమర్పించి మా మనోరథంబు లీదినం బీడేరెనని పలువిధముల స్తుతింపుచు మాకు మీవలెనొకసుపుత్రు డుద్భవించునటుల కటాక్షింపుడని వేడఁగా, భక్తుఁడా దంపతులనుగాంచి మీకు ద్వాదశాబ్దములలోన గోరఖునాథుని కృపచే సుపుత్రుఁడుద్భవించునని వరంబొసంగి మీరు వారిరాకను నిరీక్షించుచుండుడని వచించి వారి నివాసంబునకు పోవునట్లు నియమించెను. ఆసతీపతులు తమ నివాసస్థళమునకేతెంచి దృఢవ్రతులై దశవర్షములు గడపి పిమ్మట గోరఖునాథులు వసింపుచున్న స్థళంబునకువచ్చి వారిని సేవించి ఓ స్వామీ పూర్వము చాంగదేవు లాజ్ఞాపించినరీతిగా భగవత్కృపచేతాము మాకొక సత్పుత్రుఁ డుద్భవించునటుల యనుగ్రహింపుడని వేడఁగా గోరఖునాథులు వారియందు కృపయుంచినవారై ముధోపంతును యోగము చేయుచుండుమని నియమించెను. ఇట్లు కొన్ని దినములుగడువ భగవంతుడు గోరఖునాథునివలె వేషమును ధరించి ముధోపంతు గృహంబునకు వేంచేసి అలక్ అని శబ్దించఁగా రుక్మాభాయి భిక్షను తెచ్చి వారికిడి దండముసమర్పించి ఓస్వామీ నాకొక సుపుత్రుఁ డుద్భవించునట్లు కృపచేయవలెనని మిక్కిలి వినయముతో వేడుకొనఁగా భగవంతుడు అక్షయంబక్షయంబని వచింపుచు వేణునాదము చేయుచుండెను. అంతనాదంపతులకు అప్పుడుపుట్టినబిడ్డవలె ఒకశిశువు తమయెదుటనుండుటనుగని మిక్కిలి విస్మయము జెందియుం



డఁగా గోరఖునాథుం డంతర్ధానమాయెను. అంత సతీపతులు పరనంద పూరితులై ముధోపంతు శిశువును చేతికెత్తుకొని ముద్దులాడి శిరంబాఘ్రాణించి రుక్మాభాయి చేతికొసంగగా ఆవనిత శిశువును చేతతీసుకొనినదే తన స్థనములయందు పాలు చేపువచ్చి స్రవించుచుండెను. ఆసతీపతులావింతనుగని సంతోషముతో భగవద్భాగవత కృపాకటాక్షమువలన మనతపం బీడేరెనని మనస్సునే పుప్పొంగుచు భగవంతుని పలువిధముల కీర్తించుచుండిరి. ఇట్లుండగా యిరుగుపొరుగు బంధుజనులు రుక్మాభాయివద్దకువచ్చి శిశువునుగాంచి ఓతల్లీ మీరు పుత్రసంతానమునకై బహుకాలముగా తపంబుచేయుచుండినందున భగవంతునికి కృపగలిగి మీమనోరథమును సఫలముగావించెనని పలువిధముల కొనియాడుచు కానుకలొసంగి వెడలిపోయిరి. ఈపుత్రుడు చాంగదేవుని కృపచే యవతరించినవాడుగాన ఈ శిశువుకు ద్వాదశ దివసంబున చాంగదేవుఁడని నామకరణము గావించి తదనంతరము వుపనయనాదికంబులను క్రమప్రకారముజరిపి వివాహమహోత్సవమును నెరవేర్చిరి. పిమ్మట యీ సుపుత్రుఁడు వివేకయుక్తుండై గృహస్థధర్మమును చక్కఁగా జరుపుచు శ్రీవిఠలుని నామమును దివారాత్రులు భజింపుచు సంపత్కరుఁడై ధర్మమార్గప్రవర్తకుఁడై వర్తించుచుచుండెను. ఆచార్యులను జననీజనకులను భాగవతులను దర్శించినంతట చందనకుసుమతాంబూలాదులను జూచినట్లు వారికి శుశ్రూషలొనరింపుచు ఇరువదినాలుగువత్సరముల వయస్సుగలవాడుకాఁగా వయోవృద్ధులుగానుండిన జననీజనకులు జాడ్యముగలవారై వుత్తమలోకము జేరిరి. అంత చాంగుడు వారికి వుత్తరక్రియలొనరించి భూసురులకు ధన కనక వస్త్రాన్నదానంబులు సంతుష్టిగా నొసంగి తదనంతరము మిగిలిన మూలద్రవ్యంబును తన పినతండ్రికొసంగి పండరీపురి యాత్రచేయవలెననితలచి భాగవతులతోఁగూడి

పండరీపురమునకువచ్చి శ్రీపాండురంగని సేవించి అచట వసింపుచున్న భక్తగోష్ఠులను దర్శించి పరమానందమునొంది తన దేహాభిమానము లనువిడిచి, పరోపకారమునకు తన దేహమును వినియోగపరచుచు దృఢవ్రతుండై శ్రీపాండురంగని సన్నిధికేతెంచి సాష్టాంగదండప్రణామంబులొనరించి తన హృదయకమలమునందు శ్రీపాండురంగని నిలుపుకొని స్థిరచిత్తమువహించి ధారణయోగమొనరింపుచు ఓపాండురంగా మీకృపాకటాక్షవీక్షణముచే దాసుని భవబంధంబులనుబాపి తమ పాదారవిందంబులయందు భక్తికలుగజేసి దాసుని మీసొత్తుగా యంగీకరించి రక్షింపవే, ఓ పండరీనాథా పాండురంగా మీరు భాగవతుల హృదయములందు వసించి వారికి జ్ఞాన భక్తి వైరాగ్యములనొసఁగి దివారాత్రులు మీనామోచ్చారణం బతిరమ్యముగా ధ్యానించునట్లు కృపజేసి రక్షించుచుండురీతిగా దాసుని రక్షింపుము. ఓపుండరీకాక్షా మీదాసానుదాసుల చరణకమలములకు దాసుడు శరణాగతిచేసి యదియే పురుషార్థమని తలంచియుండుమార్గము కృపచేయవే, ఓ కేశవా దామోదరా మధుసూదనా మన్మథజనకా నందకుమారా నవనీతచోరా నరహరిరంగా నరకవిభంగా గజగిరివరదా గంగజపాద వేదవినోదా వేంకటవరదా దాసుని కటాక్షించి రక్షించవే కరుణానిధేయని పలువిధంబుల నుతింపుచు వైరాగ్యశీలుండై సమస్తలోకంబులు హరిమయంబనియెంచి మూడహోరాత్రములు నిరాహారుడై చంద్రభాగానది మధ్యస్థితముగానిలిచి యిదిసమయం బిదిసమయము కావరావే వేగబ్రోవవేయని వుభయకరంబులు శిరంబునందిడుకొని ధరాధరా దురితహరా మీకరాబ్జంబుల నాశిరంబు నందిడి రక్షింపరావే యని నానావిధముల స్తోత్రముచేయుచుండఁగా కరుణానిధియగు శ్రీవిఠలరంగడు కరుణించి అసమాన తేజోమయ దివ్యమంగళవిగ్రహుండై తనముందునిలిచి దర్శనంబొసంగెను. ఇట్టి



సుందర సుకుమార లావణ్యాదులతోఁ గూడి తేజోమయుండై ప్రకాశించుచున్న శ్రీపాండురంగని సేవించి దండప్రణామంబు లాచరించి ఓజగదీశా రఘుకులోత్తమా దాసునియందు పరిపూర్ణ కృపాకటాక్షంబుంచి మంత్రరాజమగు తారకమంత్రమునుపదేశముజేసి రక్షింపవే శ్రీహరీయని వేడుకొనుచుండఁగా శ్రీపాండురంగం డాతని నదిలో ముణుఁగద్రొక్కెను. అప్పుడా నదియందు చాంగదేవుడు సన్నిధిగా వెలసి శ్రీపాండురంగని సేవింపుచుండెను. ఆసమయమున పుండరీకవరదుఁడు చాంగదేవుని ముందునిలిచి పరిపూర్ణ కృపతో చాంగుని శిరమున కరంబుంచి శ్రీ రామతారక షడాక్షరి మంత్రముపదేశించి అదృశ్యుండయ్యెను. అంత భక్తుఁడు మంత్రరాజమును పఠింపుచు పలువిధంబుల శ్రీహరినిభజింపుచు తిరిగితిరిగి నదీతీరముజేరి కన్నులు తెరచిచూడఁగా పండరీక్షేత్రము పరమపదంబునుబోలి గోపురమంటప ప్రాకారంబులు కోటిసూర్య ప్రకాశంబుగా దేదీప్యమానంబై వెలుగుచుండుటను గాంచి సన్నిధికేతెంచి పరమానందముతో శ్రీపాండురంగని పలువిధముల స్తోత్రములుచేసి దీనాననుండై తన వూరికి వెడలవలెనని శ్రీపాండురంగని అనుజ్ఞ యొసంగుమని ప్రార్థింపఁగా శ్రీపండరీనాథుఁడు చాంగదేవుని గాంచి కరుణారసంబుతో ఓరీ నా ప్రియభక్తశిరోమణీ నీవిశ్లేషము దుస్సహంబై యున్నది. అయినను నీవచ్చట వసింపుచున్న పామరులకు భక్తిమార్గంబులు తెలుపుచు నీవు సంచరించవలసినవాఁడగుటచేత నీకాజ్ఞయిచ్చెదను, నీవూరికి వెళ్లుమని సెలవొసంగెను. అంత చాంగదేవుఁడు భాగవతగోష్ఠితో గూడి కరతాళంబులువేయుచు భజనజేయుచు నడచినడచి తనవూరు చేరి అచట యుండు బద్ధసంసారులకు జ్ఞానోపదేశముచేసి భగవద్భక్తులనుగావించి కొంతకాలము వసించుచుండెను. ఇట్లుండఁగా ఒక దినంబున శ్రీహరియగు విఠలుఁడు చాంగదేవునియెదుట పురుషాకృ

తిని ధరించి నిలిచి ఓ చాంగదేవా నీవిది మొదలు నీ జన్మదేశమును విడిచి గోదావరితీరంబున వసింపుచు, అచ్చట బద్ధసంసారులై తిరుగుచుండు పామరులను కడతేర్చుచు, అచట యీ కేశవమూర్తిని స్థాపించి పూజింపుచుండుమని శిలావిగ్రహము నొసంగి అదృశ్యుండయ్యెను. అనంతరము చాంగదేవుఁడు శ్రీహరి కృపాకటాక్షవీక్షణము మనకు లభించియున్నదని పరమానందము జెంది శ్రీహరియాజ్ఞను శిరసావహించి వెడలుటకు యత్నింపుచుండగా, ఆచుట్టుప్రక్కల వసింపుచుండు గ్రామవాసులగు భగవద్భక్తులు గుమిగూడివచ్చి చాంగదేవుని పాదపద్మంబులయందు వ్రాలి ఓ స్వామీ తల్లిదండ్రులు లేని బిడ్డలవలె మమ్ము విడనాడి ఇతరప్రదేశంబులకు బోవుట సరియేనా మీవిశ్లేషము మాకు దుస్సహమైయున్నది, గనుక మీరట్లు చేయకూడదని బహువిధముల విలపించుచుండుటనుగాంచి చాంగదేవుఁడు భక్తులారా నేను శ్రీహరి చిత్తానుసారముగా ప్రవర్తించవలసినవాడగుటచేత ధన్యోస్మియని వెడలుచున్నానని వారిని సమాధానపరచి కుటుంబసహితముగా గోదావరితీరంబు జేరి అచట కేశవమూర్తికి సన్నిధి గట్టించి ఆ శిలావిగ్రహ మచట స్థాపించి సంప్రోక్షణాదులు చేసి బ్రాహ్మణులకు ధన ధాన్య వస్త్ర భూషణాదులొసంగి మిక్కిలి ప్రేమతో అమితాన్నంబులిడెను. ఇట్లొనరించుచున్నందున చాంగదేవుని కీర్తి నలుదిక్కులు వ్యాపించగా తాను సదా సాధుసమూహముతోఁగూడి భజనచేయుచు పరమానందభరితుఁడై హరికథా కాలక్షేపములు చేయుచుండుటచేత అనేకజనులు హరికథలు వినుటకై వచ్చుచుందురు. ఇట్లందరు ఆనందపరవశులగుటచే భగవద్భక్తులగు సాధువులీ చాంగదేవుని మహత్యములనుగని చాంగకేశవదాసుండని పిలువసాగిరి. ఇట్లు వీరికీర్తి నలుదిక్కులు వ్యాపించియుండుటచేత ప్రపంచమందలి జనులు వారివారి మనోభీష్టప్రార్థనలు చేసుకొందురు,



ఆప్రార్థనలు నెరవేరుటచే బహుదూరదేశపు ప్రజలేతెంచి కేశవమూర్తిని సేవించి, పిమ్మట చాంగకేశవదాసుని దర్శించిపోదురు. వీరిట్లు ప్రసిద్ధిజెందియుండఁగా, ఈసంగతి దేవగిరిలో వసించుచుండు రామరాజు విని యిట్టిమహాత్ముని సేవించుటచే జన్మసాఫల్యంబగునని తన బంధుమిత్రపరివారంబులతో నేగుదెంచి చాంగకేశవదాసులను వలగొని దీర్ఘదండప్రణామంబులాచరించి వారిచే మంగళాశాసనము వడసెను. అంత భక్తుఁడు రాజుంగని ఓ రాజా నీవీదినంబు నాయింట భుజించిపొమ్మని వచింపగా, రాజు స్వామీ నేనొక్కఁడనుగాను, నాతో కలిసి అనేకులు వచ్చియున్నారు, వారినివిడిచి నేనెట్లు భుజింపవచ్చునని వచింప చాంగకేశవదాసు మీరందరు యేకీభవించి సహబంతిని భక్షింపుఁడని యాజ్ఞాపించెను. రాజందుకు సమ్మతించి స్నానాద్యనుష్ఠానపూజాకృత్యంబులను ముగించుకొని వచ్చియుండ చాంగకేశవదాసు వారందరిని వరుసగా కూర్చుండబెట్టించి కేశవనామ స్మరణ చేయుచు కేశవమందిరమునందుజొచ్చి కేశవుని ఆపాదమస్తకపర్యంతము సేవించి తీర్థముగైకొని వంటగృహంబు ప్రవేశించి మాధవస్మరణతో ప్రోక్షించఁగా పదుగురికిసిద్ధపరచియున్న ప్రసాదము వెయ్యిమందికి సరిపడునట్లు వృద్ధిబొందియుండెను. అంత యాభక్ష్యభోజ్యాన్నంబుల నందరికిని తృప్తిగా నిడి చందన కుసుమ తాంబూలాదులొసంగి గోష్ఠికి ప్రదక్షిణముగావచ్చి దండముసమర్పించెను. అనంతరమా నృపతి చాంగకేశవదాసుల మహత్యమును బహువిధముల స్తోత్రంబులుచేసి వారిచే సెలవుపుచ్చుకొని తనపురంబునకు వెడలెను. చాంగకేశవదాసు శ్రీహరి కీర్తనలు శ్రీహరి కాలక్షేపములు సదా శ్రవణానందముగాచేయుచుండుటను వినుటకై ప్రజలు బహుదూరమునుండి వత్తురు. ఇట్లుండఁగా కలుబురుగా యనెడు పురమునందు భావశుద్ధిగలిగిన బ్రాహ్మణుం డొకఁడు శంకరుఁడను నామంబువడసి

వసించుచుండెను. ఆ బ్రాహ్మణుడు బహుకాలము సంతానము లేక యుండి మధ్యవయస్సున మృతిబొందుటచే అతని భార్యయు తల్లియు వ్యసనాక్రాంతులగుచు అతనికి సంస్కారకృత్యంబులు సాంగముగా జరిపి పిమ్మట కొన్నాళ్లకు పతివిశ్లేషము సహింపజాలక వారణాశికి పోయి గంగాస్నానము చేసి శ్రీరామనామమును జపించి కాలము గడుపునటుల తమమనంబును దృఢపరచుకొని అచట లేని వస్తువులను కొంత సేఖరించుకొని వారణాశికి బోవుచుండు దారిలో గోదావరినదినిగాంచి స్నానాదిక్రియలను ముగించిపోదమని నిలిచి అచ్చట వసింపుచున్న చాంగకేశవదాసుల ప్రభావంబులువిని వారిని సేవింపవలయునని తమ మనంబుల నుద్దేశించి అత్తయు కోడలుగూడి శ్రీహరిభక్తుని చెంతకేతెంచిరి. కోడలు చిన్నతనంబున వైధవ్యము జెందినదగుటచే కొందరు బంధువులు గూడి యీమెకు శిరోముండనము చేయింపక కొంత కాలము వుండనిమ్మని సెలవిచ్చినందుచే కేశంబులు చక్కగా పెరిగియుండెను. ఈమెనుగాంచి చాంగకేశవదాసు ముత్తైదువయని తలంచుచుండు సమయంబున కోడలు ముందుగా దండము సమర్పించగా ఆమెను పుత్రవతివై యుండువని మంగళాశాసనమ్మొనరించెను. వీరి మంగళాశాసనమును వినిన అత్తగారు భక్తునికి దండము సమర్పించి ఓస్వామీ తమ మంగళాశాసనము వేరువిధంబుగా యున్నదని నవ్వి తనకోడలు వైధవ్యంబును పొందియుండగా పుత్రుడెట్లు కలుగునని వచింపగా చాంగకేశవదాసుడు ఓతల్లీ నావాక్కున కేశవుడు మృషలు పలికించడుగాన నీకోడలిగర్భమందు ఒకసుపుత్రుండు భగవద్భక్తుండై వుద్భవించును. అనిచెప్పగా విని అచటనున్న విప్రులాశ్చర్యముతో యీవింతను గనుంగొనవలయునని ఆయిద్దరుస్త్రీలను పోనివ్వక అచ్చటనేయుండునట్లునియమించి గృహంబొకటి యిచ్చి వసింపజేయగా, వారచ్చటనే భగవద్గుణానుభవముచేయుచు తొమ్మిది మాసములవరకచ్చటనే యుండి ఆవిధవస్త్రీ వివేకశీలుడగు సుపుత్రునిగాంచెను. అంత వారాశిశువును ద్వాదశదివసమున చాంగకేశవదాసుని చరణకమలములయందు పడవేసి దండము సమర్పించగా చాంగకేశవదాసు పుత్రుని కరంబులయందిడికొని ఆ సుపుత్రునికి విఠలుడని నామంబిడి విప్రులను రావించి ఆశిశువుకు చేయవలసిన సత్క్రియలను సాంగముగా జరిపించి ధనధాన్యవస్త్రభూషణాదులను దానంబొసంగి తదనంతరమాశిశువును మిక్కిలిగారాబముతో పోషింపుచుండగా ఆశిశువు పంచాబ్దంబులవాడయ్యెను. అట్టిసమయంబున చాంగకేశవదాసు శ్రీపండరీపురియాత్ర చేయవలెనని తలంచి విప్రసమూహముతో గూడి పండరీపురమున వసించి శ్రీపాండురంగని సేవించుచు, ఒక సుదినమందు విధవస్త్రీని జూచి ఓతల్లీ నీపుత్రున కీదినం బుపనయనంబు చేయింప నుద్దేశించియున్నానుగనుక నీవు సమస్త భక్ష్యభోజ్యములను సిద్ధముచేసి యుంచుమని నియమించి ఆపురంబున వసించు విప్రవరులకు నామంత్రణంబు చెప్పుటకొక విప్రునిపంపి తదనంతరము సమీపమందున్న పదుగురు విప్రులను రావించి ఓవిప్రులారా శ్రీహరి కృపాకటాక్షముచే వుద్భవించిన వరపుత్రునికి ఈశుభముహూర్తమందు వుపనయనము జరిపించవలయునని వచింపగా ఆవిప్రులు యీర్ష్యాపరులై చాంగకేశవదాసా నీమనసుపోయినట్లు నీవునడుచుట సరికాదు, గృహస్థాశ్రమ ధర్మమున కనుగుణముగా యే కార్యంబైనను చేయవలయునుగాని మీరినడుచుట సరికాదు. ఈవిధవపుత్రున కుపనయనము చేయించుటకు మేమువొప్పుకోము. ఈపురంబుననుండు బ్రాహ్మణులెవరు భోజనమునకురారు, ఇందు కెవరు సమ్మతించెదరో వారినికొని జరిపించుకొనుమని తమయిండ్లకు వెడలిపోయిరి. ఈసంగతులను విధవస్త్రీ విని పచనమగుచున్న సర్వపదార్థములు వ్యర్థంబగుచున్నదని చింతిం

చుచుండుటనుగని చాంగకేశవదాసు శ్రీపాండురంగనిసన్నిధికేతెంచి
శ్రీహరిని సేవించి వారిపాదద్వయంబులందు శిరంబుంచి ఓకృపానిధే
మీకృపాకటాక్షముచేత వుద్భవించిన విఠలునికి వుపనయనము జరి
పించకూడదని విప్రులు కోపించి జనిరి. ఇక మీరుగాక నాకెవరు
రక్షకులున్నారు ఓజగధీశా రమేశా దేవదేవా దీనదయాళా యీ
బాలునితల్లి సమస్తపదార్థములు పచనముచేయుచున్నది, అచ్చటికి
మీరు భక్తసమూహముతో వేంచేసి పుత్రునకుపనయనంబుగావించి
ప్రసాదమారగించి రావలయుననఁగా పాండురంగడు వారి పల్కుల
కామోదించి చిరునవ్వుతో శిరఃకంపము గావించెను. అంత చాంగ
కేశవదాసు పరమానందముతో తాను వసించుచున్న స్థళంబునకు
వచ్చి ఓతల్లీ శ్రీహరి కృపాకటాక్షముతో వేంచేసి నీపుత్రునికి వుప
నయనముగావించి ఆరగించిపోవుటకు వచ్చుచున్నారు. కావున
నీవు మిక్కిలి జాగ్రతగలిగి యుండుమని చెప్పఁగా ఆసుశీల సమస్త
భక్ష్య భోజ్యాన్నములను మధ్యాహ్నములోగా సిద్ధముచేసి శ్రీహరి
రాకకెదురుచూచుచుండఁగా శ్రీపండరీనాధుడు సన్నిధివిడిచి కుతూ
హలముతో చాంగకేశవదాసుగృహమునకు వచ్చిచేరెను. అట్టిసమ
యంబున శ్రీపాండురంగని సేవించుటకు వచ్చిన బ్రాహ్మణులు పుర
జనులు సన్నిధియందు పెరుమాళ్లు లేకుండుటను గాంచి చింతించు
చుండుసమయమున కొందరుభక్తులు మీరేల చింతించుచున్నారు,
శ్రీహరిని చాంగకేశవదాసుఁడు తన గృహంబునకు వెంటబెట్టుకొని
పోయియుండవచ్చును, అచ్చటికిపోయి చూడుండని వచింపఁగా సరి
సరి యిది నిజముగాయుండవచ్చునని తలంచి వారందరు గుమిగూడి
భక్తునిగృహమునకువచ్చి ఓభక్తాగ్రగణ్యా శ్రీపండరీనాధుడు సన్ని
ధిలో లేఁడు, వారెచ్చటికి వేంచేసియున్నారో తెలియదని వ్యసనా
క్రాంతులగుచు దీనస్వరులై పరితపించుచుండుటనుగని చాంగకేశవ



దాసు విప్రులారా విధవకుపుట్టినవానికి వుపనయనము చేయుమనిన్ని
వారింట ప్రసాదము స్వీకరించమని చెప్పి యవమానపరచితిరి; గాన
దిక్కుదెసలేని మమ్మాదరించ నెంచి శ్రీపాండురంగడు వేంచేసియు
న్నాఁడు, లోపలికిపోయిచూడుండని వచింపఁగా విప్రవరులు యింటి
లోపలికేతెంచి గృహంబంతయు వెతకిచూచి శ్రీహరి వారినేత్రము
లకు దృశ్యుఁడుకాక చాంగకేశవదాసుకుమాత్రము దర్శనమొసగు
చుండఁగా వారు సందేహపడుచు విప్రులలో కొందరిట్లు వచింపుచు
న్నారు. ఇప్పుడు మనతోకూడ వచ్చినబ్రాహ్మణులు అసంఖ్యాతమై
యున్నారు, ఈగృహంబునందు పచనము చేసియుంచిన ప్రసాదము
కొద్దిగాయున్నది, ఈ ప్రసాదము యిచటయున్న భక్తులగోష్ఠికి సరి
పోయినయెడల శ్రీపాండురంగడు యిచట వేంచేసియున్నాడని తలం
చవచ్చును, లేనియెడల లేదనియెంచుకొందమని వచింపుచుండఁగా
చాంగకేశవదాసు విప్రగోష్ఠినిగని ఈపృధివియందలిజనులందరు గుమి
గూడి వచ్చినను స్వర్గలోకమునందుండు కామధేనువువలె ఈవనిత
షడ్రసోపేతముగా పరిమారుటకు సిద్ధముగాయున్నది, చూడుండని
వచించుటను విని బ్రాహ్మణులందరు ఓ భక్తాగ్రేసరా యిపుడు మే
మందరు యేకీభవించి భుజించుటకు వచ్చుచున్నామని వచింపుచు
స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు ముగించుకొని భక్తునియింటికిరాగా
వారినందరిని కూర్చుండబెట్టి ఆవిధవస్త్రీ భక్ష్య భోజ్యాన్నంబులు
పరిమారఁగా నాలుగువేల బ్రాహ్మణులు సంతుష్టిగా భుజించి లేచి
చందన కుసుమ తాంబూలాదులుధరించి పరమానందముతో శ్రీహరి
కృపాకటాక్షమును కొనియాడుచు శ్రీపాండురంగని సన్నిధికేతెంచి
జగద్రక్షకుండగు శ్రీ విఠలమూర్తిని నేత్రానందముగా సేవించి శ్రీ
పాండురంగని మహిమలను బొగడుచు పరమానందభరితులై వారి
వారి గృహంబులకేతెంచిరి. మరునాడుదయము బ్రాహ్మణులందరు

గుమిగూడివచ్చి యొకశుభలగ్నమునందు విధవపుత్రునకు నుపనయ
నము జరిపించఁగా ఆవిధవస్త్రీ అమితధనమును విప్రులకొసఁగి తృప్తి
గావించెను. అనంతరము చాంగకేశవదాసు విధవ సహితము కలు
బురుగకు వెడలిపోఁగా నచట నివసించుచుండు పెద్దలందరు యెదు
ర్కొనివచ్చి మర్యాదతో పిలుచుకొని వెళ్లఁగా నందరు శంకరుని
యింటియందు కొన్నిదినములువసించియుండిరి. ఇట్లుండఁగా చాంగ
కేశవదాసు పురజనులకు భక్తిమార్గంబుపదేశించి భగవద్భక్తులుగా
జేయుచుండ బాలుడు ప్రవర్ధమానుండగుచుండుటనుగని బ్రాహ్మణుం
డొకడు బాలునకు తనపుత్రికనిచ్చెదనని వచింప భక్తుడు సమ్మతించి
వివాహముహూర్తమును స్థిరపరచి మిక్కిలికోలాహలముగా వివాహ
కార్యములు నెరవేర్చి బ్రాహ్మణులకు ధన ధాన్య వస్త్ర భూషణాదు
లొసంగి తృప్తిపరచి అందరానందముజెందియుండ చాంగకేశవదాసు
ఆపురవాసులకు సుబుద్ధులు గరపి వారిచే సెలవుపుచ్చుకొని ద్వార
కకు పోవుటకు ప్రయాణముకాఁగా వారితోఁగూడ విప్రులు సాధు
సమూహములు వెంబడించిరి.

శ్రీపరమపురుషాయనమః.

# యాదవపంతు చరిత్రము.

ఇట్లు చాంగకేశవదాసుతోఁగూడ భక్తులందరు పోవుచుండగా
పాండ్యదేశమున ధారూయను గ్రామమునందు యాదవపంతుఁడను
విప్రుఁడొకఁడు సద్గుణసంపన్నుఁడై శమదమాదులు గలిగి సర్వదేశ
సర్వకాల సర్వావస్థలయందును స్థిరచిత్తము వహించి శ్రీహరిగుణ
గణములను భజించుచుండును. ఆగ్రామ మార్గముగా చాంగకేశవ
దాసు సాధుసమూహముతోఁగూడి కరతాళములు వేయుచు భగవ
న్నామములను పాడుచునాడుచు మహావిభవముతో పోవుచుండగా



యాదవపంతు భాగవతగోష్ఠినిగని ప్రదక్షిణముగావచ్చి దండప్రణా
మంబులాచరించి చాంగకేశవదాసు మహిమల నెఱింగినవాడుగాన
వారి నాచార్యునిగావరించి ఓస్వామీ మీతోఁకలిసి యాత్రచేయు
టకు కుటుంబసహితముగా వచ్చెదనని వచించి తనభార్య గర్భవతి
యగుటచే ఆమెను గృహంబునందుండుమని నానావిధముల యాదవ
పంతు వచించియు ఆసాధ్వి మిమ్మెడబాసి నిమిషమాత్రముకూడ నే
నుండజాలను, చాంగకేశవదాసులుండఁగా నాకు భయమేమున్నది
నేనవశ్యము మీతోఁకలిసివచ్చెదనని దృఢచిత్తముతో చెప్పుచున్న
వచనములను యాదవపంతువిని తన భార్యయొక్క వైరాగ్యశీలాది
సుగుణములకు సంతోషించి వెంటబెట్టుకొని పోవుచుండుటను గని
పురజనులందరు ఆహా వీరితోఁగూడ యీ గర్భిణిస్త్రీ యెట్లు నడిచి
పోవును, ఇది యేమిభక్తి ఈయన్యాయము యెచ్చటైనా గలదా
యని బహువిధములపరితపించుచుండిరి. అంత నాసతి శ్రీహరిగుణా
నుభవములను ధ్యానముచేయుచు తిన్నగానడిచిపోవుచు తనగర్భమే
తనకు నిండాభారముగా తోఁచుసమయమందా వనిత శ్రీహరినామ
ముల నుచ్చరింపుచు దేహము మరచి నడిచిపోవుండును. యాదవ
పంతు తన యాచార్యునికి శిశ్రూషలుచేయుచు సర్వకాలములందు
పరబ్రహ్మస్వరూపునియందు చిత్తమునిలిపి యితర విషయములందు
తనమనంబును పోనివ్వక చాంగకేశవదాసుతోఁగూడి శ్రీహరి గుణా
నుభవంబులు పాడుచు నడుచుచుండునుగాని తన భార్య యెట్లున్న
దని తిరిగిజూడడు. ఆసతి తనపురుషునికి కాలోచితముగా పరిచర్య
లొనరింపుచు దారినడచునప్పుడు శ్రీకృష్ణ నామామృతమును పఠిం
పుచు చమటలుకారగా మిక్కిలి కష్టముతో మెల్ల మెల్లగా సాయం
కాలములోఁగా యాత్రవాసులు వసించుస్థళమునకు నడిచివచ్చి వా
రుంచిన ప్రసాదమునుభుజించి ఆరాత్రి యచటశయనించి మరుదిన

ముదయమున లేచి నడిచిపోవుచుండును. ఇట్లాసతి దృఢచిత్తముగలిగి వెనుకచిక్కి ఘోరారణ్యమునందు నడిచిపోవుచుండఁగా, దేహము బరువై చమటలుకారి నడుమునొప్పియెత్తఁగా నొకవృక్షముక్రింద విశ్రమించి యీ ప్రసవసమయమందు తల్లిదండ్రులు తోడబుట్టువు బంధువులొకరైనా లేరైరి, మనతోడవచ్చిన యాత్రవాసులున్ను ముందుపోవుచున్నారు, మనగురుని వెంబడి పతియు పోవుచున్నారు, ఈ మహాదారణ్యమందు నాకు దిక్కెవ్వరని మిక్కిలి పరితపించుచు చాంగ కేశవదాసు చరణకమలంబులను తనమనంబున ధ్యానింపుచు ఓ ఆచార్యా యేకాకిగా నున్న నాకీ ఘోరారణ్యమునందు ప్రసవ సమయముగాయున్నదని విన్నవించుచు భగవంతుని స్తుతింపదొడంగెను. ఓఅఖిలాండకోటి బ్రహ్మాండనాయకా ఆదిమధ్యాంతరహితా అనంతకల్యాణగుణాకరా అనాథబంధూ అమరవినుతా అఖిలాధార ఆనందరూపా మీరు భక్తులమొరలువిని సర్వరక్షకులగుచు రక్షించి యున్నారు. ఆరీతిగా యిజ్ఞానహీనురాలైన నామొరాలకించి నన్నీ ప్రసవసమయమునందు కాపాడి రక్షింపరావే యని బహువిధముల స్తుతింపుచుండఁగా కరుణానిధియగు శ్రీహరి స్త్రీరూపమునుధరించి దివ్యమైన వస్త్రాభరణములనుధరించి నొసటకుంకుమబొట్టుంచుకొని ఆవనితచెంతకు మంత్రసానివలెవచ్చి బాలింతను జూచి ఓతల్లీ నీవెత్తవు నీరూపరేఖావిలాసంబులనుచూడఁజూడ చోద్యంబగుచున్నది. నీవీ కాననంబున నొంటరిగా నుండుటకు కారణంబేమని వేషధారియగు భగవంతుఁడు ముద్దుపలుకులతో శ్రద్ధగలిగిన స్త్రీవలె ఆమెవద్దికిజని మిక్కిలిమచ్చికతో ఓతల్లీ నీగురుండగు చాంగ కేశవదాసు నీకు ప్రసవకాలము తటస్థించినదని తెలిసి నన్నతిశీఘ్రంబున జనుమని పంపించెను. నన్నందరు కృష్ణాభాయని మిక్కిలి ప్రియముతో పిలుచుచుందురు. ఇక నీవు మనోదుఃఖముమాని సంతోషముజెందియుం



డుము, ఇతరులవల్ల సాధ్యముకాని యెట్టికార్యమైనా నేనతిజాగ్రత గలిగి చేయగలనని ధైర్యముచెప్పి తన మాయచే తత్క్షణం బచట గ్రామంబొకటి నిర్మించి అందొకగృహంబులోనికి ఆవనితను మెల్లగా పిలుచుకొనిపోయి కూర్చుండబెట్టి నడుమునుపట్టుకొని ఆమెకు సమయోచితముగా పరచర్య లొనరింపుచు, అమ్మా నీవు సంకోచింపక నీకు కావలసినవాటిని చెప్పుము, ఆకార్యముల నప్పుడప్పుడు చేయుచుందునని వచింపఁగా, ఆయువతి యిట్టిదయాగుణములుగల స్త్రీకి తగిన సన్మానమొసఁగి సంతోషింపజేయుటకు నావద్ద ధనమేమియు లేక దరిద్రదశలో యుంటున్నానేయని తన మనంబున చింతింపుచు ఓతల్లీ నీవీసమయమందు చేయుకార్యములకు మెచ్చి నేనేమివ్వగలనని అంజలిచేసి పరితాపముతో చెప్పగా వేషధారియగు కృష్ణాభాయి ఆమెకు కావలసిన వస్తువులను మరియొకగృహంబునందుండి తెచ్చి యిచ్చుచుండఁగా ప్రసవసమయము సమీపించి సుఖముగా సుపుత్రుని గనెను. అప్పుడు వేషధారియగు కృష్ణాభాయి బిడ్డకు స్నానముచేయించి నాభిని తెగకోసి తల్లికి పడకవేసి పరుండబెట్టి దివారాత్రులు దీపమునుంచి తగిన ఔషధములిచ్చుచు పత్యము చేయించి సర్వపదార్థములను కొరతలేక సిద్ధముచేసియుంచి పదిదినములు గడచినపిమ్మట బాలింతకు స్నానము చేయించి యొకమాసమువరకు ఆ యువతికి నుపచారంబులు చేయుచుండెను. ఈసంగతులు ప్రపంచమందలి ప్రజలకు యెవరికి తెలియక యుండెను. ఇంతలో చాంగ కేశవదాసు యాదవపంతుతోగూడి ద్వారకకుపోయి అచటయున్న పుణ్యతీర్థమునందు స్నానముచేసి సన్నిధిలోనికివచ్చి విగ్రహరూపము ధరించియున్న ద్వారకనాథుని సేవించి కళాహీనుడుగానుండుటనుగని యిదేమివింత ఈవిగ్రహమునకు షోడశకళలుండవలసినదికదా, ఇప్పుడొక కళయైనను లేకుండుటకుకారణంబేమని మనంబున వితర్కిం

చుచు యోగ బలంబున చూచి జగన్నాథుడు ఘోరారణ్యమందు స్త్రీకి కానుపు చూచుచున్నట్లు తెలుసుకొని విస్మితుఁడై యుండగా సన్నిధియందు వేంచేసియున్న రుక్మిణీదేవి ప్రసన్నమై భక్తునిగని ఓచాంగశేశవదాసా మనకృష్ణమూర్తి మహారణ్యమందొక స్త్రీ ప్రసవవేదనపడుచుండగా కృపానిధియగు సర్వేశ్వరుం డాసాధ్వికి కాన్పుచూచుటకై పోయియున్నారు, మీరచ్చటికి పోయి శ్రీహరిని సేవించి పిలుచుకొనిరండని చెప్పిపంపెను. వారాక్షణమే వేగముగా వెడలి కొన్నిదినంబులకాకాననంబుప్రవేశించిపోవుచు నొకగ్రామం బచటగాంచి ఆగ్రామవాసులను కొందరినిజూచి కృష్ణాభాయి యిల్లెచటయున్నదని విచారింపగా వారు కృష్ణాభాయి యిల్లును చూపించిరి. ఆచార్యులాయింటిలోనికివచ్చిజూడఁగా వేషధారియగు కృష్ణాభాయి వారిని జూచి దండము సమర్పించి యేమో కార్యార్థముగా వెలుపలికిబోవునట్లు కనుపరచి అదశ్యంబయ్యెను. అనంతరము చాంగకేశవదాసు తాను జూచిన స్త్రీ శ్రీహరియనియెంచక భ్రాంతిజెంది బాలింతసమీపమునకు రాగా ఆమె తనగురునిజూచి లేచి పుత్రుని వారిపాదకమలములయందు పడవేసి తాను సాష్టాంగదండప్రణామం బొనరించి ఓకరుణానిధీ మీరు నాయందుకృపాకటాక్షవీక్షణంబుంచి పంపించిన కృష్ణాభాయివల్ల నేనతి సులభముగా పుత్రునిగని సౌఖ్యముగా యున్నానని వచింపఁగా విని యచ్చెరువంది ఓతల్లీ కృష్ణాభాయి యెచ్చటయున్నది చూపుమని వచింపఁగా, బాలింత కృష్ణాభాయి వీధిప్రక్కఁ పోయియున్నది యిప్పుడేవచ్చును చూడుండనగా గురుఁడాక్షణమే వీధియందు చూచి కానక తన మనంబున క్లేశము జెంది రుక్మిణీదేవి వచించినమాటలను జ్ఞాపకము తెచ్చుకొని అందరిని వెంటబెట్టుకొని ద్వారకకువచ్చి మూర్తికరంబై ప్రకాశింపుచుండు శ్రీహరిని నేత్రానందముగా సేవించి ఓజగధీశా మీరాపద్బాంధవు



లనుటకే సందియములేదు. మహారణ్యమందు ప్రసవవేదన పడుచున్న బాలింతకు నేను పంపినట్లుచెప్పి ఆసతికి భీతిమాన్పి సుఖముగా పుత్రునిగనునటుల జేసి కాపాడినదిగాక ఈభూమియందనేకభక్తులను నాకొరకై రక్షించితివి. ఓ ద్వారకావాసా నీ మహిమలు బ్రహ్మరుద్రాదులకుకూడ గణుతింప శక్యముకాకయుండగా మీ మహిమలను పొగడ నేనెంతటివాఁడను. ఓ అనాధనాథా అఖిలాధారాయని కొనియాడి యాదవపంతును బిలచి ఓభక్తాగ్రగణ్యా నీవిదిమొదలు సంసారసహితముగానుండి భగవద్భక్తిచేయుచు కాలముగడుపుము, అట్లొనరింపక సుశీలయగు నీభార్యను విడనాడి యాత్రచేయుచుంటి వేని నీకవశ్యము పాపముసంభవించును, గాన యిక సదా నీభార్యతోగూడి శ్రీహరిగుణములను భజింపుచుండుము, నీకుద్భవించిన సుపుత్రుఁడు భక్తాగ్రగణ్యుఁడై ఈపృథివియంతయు ప్రఖ్యాతిగాంచును. అతనిగర్భమున మనుమఁడుపుట్టి నీవంశము నుద్ధరించునని నానావిధముల సుబుద్ధులుగరపి ఆసతీపతులను వారిదేశమునకుపొమ్మని యాజ్ఞాపించెను. అంత యాదవపంతు చాంగకేశవదాసువద్ద అనుజ్ఞను పొంది తనపురంబున కేతెంచి సతీపతులు సదా భగవన్నామమును భజింపుచు సుఖముగా గృహస్థధర్మమును జరుపుచుండిరి.

శ్రీసకలలోకాధారాయనమః.

# చాంగకేశవదాసు చరిత్రము.

అనంతరము చాంగకేశవదాసు ద్వారకయందు నాలుగు నెలలు వసించి భగవంతుని సేవింపుచుండి భాగవతగోష్ఠితోగూడి తనవూరికి వచ్చి కొంతకాలము భగవద్భక్తిచేయుచు కాలముగడుపుచుండఁగా వింధ్యదేశాధిపతియగు నబాబు పండరీపురమునకువచ్చి తురక సిపాయీలను గృహంబులయందు ప్రవేశింపఁజేసి సకలసొత్తులను కొల్ల

బెట్టుచు ప్రజలను బాధపరచి బహువిధకష్టంబులను కలుఁగజేసి వుప
ద్రవపరచుచుండగా విప్రులు దేశవాసులు బెదరి కాల్లుచేతులు కదిలిం
చుటకు తెరవుగానక భీతిజెంది పరారులై నలుదిక్కులకు పారిపోయి
రని యాత్రవాస్తులగు భగవద్భక్తులమూలముగా చాంగకేశవదాసు
విని తన మనంబున మిక్కిలి చింతనొందినవారై ఓ అఖిలాండకోటి
బ్రహ్మాండనాయకా ఆదిమధ్యాంతరహితా అనంతకల్యాణగుణాత్మకా
ఆదిపురుషా ఈచరాచరబ్రహ్మాండంబులయందు సృష్టి స్థితి సంహారం
బులు కాలోచితంబుగా జేసి రక్షించుచున్న దయాళా నీవు శ్రీపం
డరీపురంబున వసించు ప్రజలకు వింధ్యదేశాధిపతిచే కష్టము సంభ
వింపజేయుట నీకు లీలగాయున్నదా, శ్రీహరీ గోవిందా ముకుందా
కృష్ణా మురహారీ వామనా ధరాధరా దానవమర్దనా మీరు పూర్వ
మునందు దుష్కార్యములొనర్చుచుండిన రావణకుంభకర్ణ హిరణ్య
హిరణ్యాక్షు శిశుపాల దంతవక్త్రాది దుష్టశిఖామణుల హృదయంబు
లకు కుఠారంబై వారినిసంహరించి మీభక్తులను రక్షించితిరి. మీ
శౌర్యప్రతాపములనువర్ణించుటకు బ్రహ్మరుద్రాదులకైన శక్యమా,
అట్టి మీరు తత్కాలమందు శ్రీపండరీపురంబున దుష్టజనులు గుమి
గూడి పురివాసులను కష్టపరచుటను గని ఆదుర్మార్గులను శిక్షింపక
వేడుక చూచుచుండుట మిక్కిలి ఆశ్చర్యమును గలిగించుచున్నది.
ఓ పండరీనాథా పాండురంగా పరమదయాళా పరమపురుషా పతిత
పావనా పద్మనాభా పరాత్పరాయని స్తుతింపుచు తన మనంబును శ్రీ
పాండురంగనియందు లయింపఁజేసి ధ్యానింపుచుండఁగా, శ్రీపాండు
రంగడు వారిధ్యానమునందు సేవయొసగి ఓచాంగకేశవదాసా నీవతి
శీఘ్రంబుగా బిదురు పురమునకు పొమ్మని యాజ్ఞాపించెను. అంత
భక్తాగ్రేసరుఁడు పరమానందముజెంది భాగవతశిఖామణులను గూడి
భగవన్నామముల నుచ్చరింపుచు చనిచని సాయంకాలమునందొక



రమణీయమైనస్థలమునందు బసచేసి భక్ష్యభోజ్యాన్నములను పచన
ముచేయించి భగవదర్పణముచేసి భుజించి కాళ్లయందు గజ్జెలుకట్టి
కరంబున తంబుర తాళముధరించి ఈకలిపురుషునిమాయను బహు
దూరముపోవునట్లునెట్టి యమపురమునకుబోవుటకు సిద్ధముగానున్న
పామరులను బట్టి భగవద్గుణానుభవాబ్ధిలో నెట్టి బహుదిట్టముగా కర
తాళంబులువేసి భజనచేయుచు అలసి సొలసి కొంతతడవు నిద్రించి
మరల వుదయాత్పూర్వమున లేచి బిదురుపురమునకు పోవుచుండెను.
ఇట్లుపోవుచుండఁగా నచ్చటచ్చట వసింపుచుండు సాధు సజ్జను లనే
కులు గుమిగూడి వీరివెంబడి వచ్చుచుండిరి. ఇదిగాక కామ్యార్థమును
కోరు సంసారులు వారివారిమనోభీష్టంబులు నెరవేరునని ఈమహా
త్ముని వెంబండించి వచ్చుచుండఁగా దారిలో గొప్ప గ్రామంబొకటి
తటస్థమాయెను. ఆ పురంబునందు వసింపుచున్న జంగమకులస్థులు
క్షుద్రమంత్రంబులనుపఠించి సిద్ధిబొందినవారై వాటిచే తాము మహా
ప్రవీణులని తలంచి మిక్కిలిగర్వించియుండగా వీరి కులగురువొకఁడు
శ్వానమును బెంచి దానికి చాంగుడనుపేరుంచి మిక్కిలిగోప్యముగా
భద్రపరచియుండెను. ఇట్టిదుర్మార్గులను భంగపరచుటకై వచ్చుచున్న
చాంగకేశవదాసును జంగమగురుడుచూచి చూడనివానివలెయుండ
దాసులవారా జంగమగురునకు దీర్ఘదండంబిడఁగా జంగమగురుడగు
మల్లికార్జునుఁడు అహంభావమువహించి వంగిదండముబెట్టక స్నేహి
తునివలె తన సమీపమందున్న చిత్రాసనమునందు కూర్చుండుఁడని
నియమించెను. ఆయాసనంబెట్టిదనగా జంగమగురునివద్దికి పెద్దలెవ
రైనా విద్వాంసులని వచ్చెడివారిని ఆయాసనమందు కూర్చుండబెట్ట
గానే అధోగతిగా భూమియందు పడి అవమానముపొంది పోదురు,
లేక మరణమైనాపొందుదురు. అట్టియాసనమందు భక్తుడుకూర్చుండక
దానిని దృష్టించిచూచినంతలో నాయాసనము భస్మంబైపోవుటను

గని జంగమ గురుండగు మల్లికార్జునుఁడు భయకంపితశరీరుఁడై లేచి దీర్ఘదండప్రణామంబులిడి ఓస్వామీ నేను మీ ప్రభావం బెఱుంగమిచే తగినమర్యాదలొనరింపక అపరాధుడనైతిని. అయినను తామునాయందు పుత్రవాత్సల్యంబుంచి రక్షింపుడు. ఈగ్రామమందు నేను గొప్పపండితుఁడని పేరుపెట్టుకొని బ్రతుకుచున్నాను, ఇప్పుడు తామీ పీటను భస్మముగావించితిరి, దీనిని శిష్యులు గ్రామస్థులు జూచిరిగనుక వారిదిమొదలు నాయందు గౌరవబుద్ధిమాని నన్నలక్ష్యముగాఁ జూతురు. గనుక ఓ భక్తాగ్రగణ్యా నాయందు కృపయుంచి ఈచిత్రాసనమును యథాప్రకారముగా జేయవలెనని వేడుకొనగా దాసులవారు కరుణించి జగన్నాథుని ప్రార్థించి దానిపై విభూతిని చల్లగా తక్షణమే ఆయగ్ని చల్లారి చిత్రాసనము మునుపటివలెనే అందరికి కనఁబడుచుండెను. ఈ విషయంబంతయు చూచుచుండిన సభవారు జంగమగురునికి పరాక్రమము తక్కువయనిన్ని, చాంగకేశవదాసు విశేషప్రభావము గలవాఁడని మాట్లాడుకొనుచుండిరి. ఇట్లుండగా జంగమగురుఁడు చాంగకేశవదాసుకు విశేషమర్యాదలు గావించి వారిని తమ గృహంబున భుజించి పొమ్మని వేడుకొనఁగా ఆజంగమగురునియందు దయగలిగి దాసులవా రందుకు సమ్మతించి యొప్పుకొనఁగా నాతక్షణంబే బ్రాహ్మణులను రప్పించి సమస్తభక్ష్య భోజ్యాన్నములను సిద్ధపరచుడని యుత్తరవుచేయఁగా వారతిశీఘ్రంబున సమస్తముసిద్ధముచేసిరి. అదిగని చాంగకేశవదాసు వారు సిద్ధపరచిన ప్రసాదంబులను భగవదారాధనకు తెమ్మని వాటిని భగవంతున కారగింపుచేసి అందరికి తీర్థంబులొసఁగి భూమిపై విస్తరులను వేయించి సర్వపదార్థంబులు పరిమారి జంగమ గోష్ఠిని గూర్చుండబెట్టి జంగమగురువును జూచి ఓ మల్లికార్జునా మీ ధ్యానమూర్తియగు చంద్రశేఖరుని ధ్యానించి ఈప్రసాదములను వారికారగింపు



చేయించి మీరు భుజింపుడని వచింపఁగా వారందరు లింగకాయలను మెడనుండితీసి తెరచిచూడగా వాటియందు లింగాకారముగానున్న చంద్రశేఖరుఁడు లేకుండుటనుగని అందరుభ్రమజెంది చింతాక్రాంతులై తమగురునిముఖంబుజూచి ఓగురుడా మీవలన మాకిట్టి నగుపాటు సంభవించినదని లజ్జగలవారై తలలు వంచుకొని యుండఁగా మల్లికార్జునుఁడు తనలింగకాయలో శంకరుడు లేకుండుటనుగని లజ్జాదుఃఖములుగలవాఁడై చాంగకేశవదాసును జూచి ఓ భక్తాగ్రగణ్యా మేము మీతోగూడి భుజించలేదనుకొరత మీమనస్సునందుంచక మీరు తృప్తిగాభుజింపుడు, మేము మీతోగూడి భుజించుటకు అర్హులము కాకయున్నాము, కారణమేమనగా మాదౌర్భాగ్యముచే మా లింగకాయలయందుండు శంకరుఁడు కోపముజెంది మాకు వశవర్తిగాకయున్నాఁడు. మేము శంకరుని బహువిధముల ప్రార్థించి వారిని శాంతపరులనుగా జేసి యీప్రసాదం బారగింపుచేసి పిమ్మట మేము భుజింపవలయునుగనుక మీరుభుజింపుడు మాకు కొంతకాలాతీతంబగునని దీనాననుఁడై వచించుటను చాంగకేశవదాసు విని ఓ మల్లికార్జునా మీరేల భుజింపక వుపవసించి కష్టపడుచున్నారు, మీదైవమగు నీలకంఠుఁడు మిమ్ము విడిచి యెందుకుగాను మరిగియున్నాఁడు వివరింపుమనగా, జంగమగురుడు కొంతసేపు యోచించి నాకేమిదోచలేదని చెప్పఁగా, భక్తుఁడా వచనములనువిని నీకాసంగతి తోచనియెడల నేను వచింపుచున్నాను వినుము. నీవొక కుక్కను పెంచి దానికి చాంగుడని నామంబిడి చైతన్యము సమమనియెంచక ఆశ్వానమును పెరటియందు దాచియున్నావు, గనుక ఆశ్వానమే యిప్పుడీలింగములను భక్షించియున్నది, యిది సత్యమని వక్కాణించెను. ఆతక్షణమే జంగముండొకఁడు శీఘ్రంబున లేచి పెరటియందు కట్టియున్న శ్వానమును విప్పుకొనివచ్చి గోష్ఠియందు నిలిపెను. అంత చాంగకేశవ

దాసానుక్కనుజూచి నీవు శునకమైయుండి శంకరభక్తుల లింగముల నపహరించవచ్చునా వారందరు తమలింగంబులుగానక మిక్కిలి చింత నొంది వుపవశించియుండుట న్యాయముకాదు, గాన నీవు కృపవుంచి వారికి లింగములనిచ్చి రక్షింపుడని వచించెను. అంత నాశ్వానము తనశిరమును క్రిందికివంచి లింగములనంతయు బైటికి క్రక్కెను. ఈ వింతనుజూచి జంగమగురుడు భయభ్రాంతులుగలవాడై భక్తాగ్రేసరుని బహువిధముల స్తోత్రములుచేసి వారి నాలింగనము జేసుకొనెను. అంత జంగములందరు పరమానందముతో తమతమలింగంబుల నెత్తుకొని ఆ లింగంబులకు ప్రసాదంబుల నారాధనము చేయుచుండఁగా భక్తాగ్రేసరుం డందరు వినునట్లు సూటిగా చెప్పుచు సర్వపదార్థములను ప్రీతితో నారగించెడి భోక్త శ్రీహరియేయని ఆపోశనము జేసెను. పిమ్మట గోష్ఠివారందరు భక్తుడు వచించిన శ్రీసూక్తులనువిని శ్రద్ధాభక్తులుగలవారై భక్షించిలేచిరి. అనంతరము చందనకుసుమతాంబూలాదులను ధరించి భగవద్గుణానుభవము చేయుచుండఁగా జంగమగురుఁడైన మల్లికార్జునునిజూచి చాంగకేశవదాసు యిట్లని వచింపుచున్నాఁడు. సర్వ వేదాగమ పురాణంబులను చక్కగాగ్రహించినవాడైనను తర్కమీమాంసాదులయందు ప్రాబల్యుఁడైనను అష్టాంగయోగసిద్ధుఁడైనను ఆచార్యపురుషుఁడైనను నాకంటె నీచుడులేఁడని దలచినవాఁడు పరమభక్తుఁడు, అట్లు లేక అహంభావము వహించినవాఁడు నేర్చిన విద్యలన్నియు బూడిదపై పోసిన పన్నీరు చందంబున నిష్ఫలంబగును. గనుక జ్ఞానాధికులు సర్వ జీవములను సమభావముతో నాదరింతురుగాని గర్వముచేత భగవద్భక్తులనుగని అమర్యాదచేయరు. గనుక నీవికమీద జాగరూకతగలిగి ప్రవర్తింపవలసినదని వచింపఁగా జంగమగురుడువిని చాంగకేశవదాసు చరణకమలంబులయందు తనశిరంబిడి సాష్టాంగదండప్రణామంబుగావించి



లేచి ఆలింగనముచేసికొని ఓమహాత్మా మీ కృపాకటాక్షంబు సదా నాయందుంచి రక్షింపవలెను. తామనుగ్రహించిన సుబుద్ధిప్రకారము ప్రవర్తించుచున్నానని వచింపగా విని సంతోషించి చాంగకేశవదాసులు జంగమగురునికి వందనముచేసి అనుజ్ఞతీసుకొని వెడలి శీఘ్రముగా బిదురుపురమునకు వచ్చి, పురసమీపంబుననున్న తోటలో బసచేసి తటాకమునదిగి స్నానముచేసి పరిశుద్ధస్థలమునకూర్చుండి స్థిరచిత్తమువహించి భగవధ్ధ్యానంబుచేసి తనతో చేరియున్న భాగవతగోష్ఠితోచేరి శ్రీపాండురంగని పాడుచునాడుచు చొక్కుకుసోలుచు మైమఱచి కొంతసేపు పూరకయుండి పిమ్మట భగవద్గుణాను భవములను వినుటకై వచ్చియున్న జనసమూహములనుగని శ్రీహరికథలు జెప్పుటకుపక్రమించి పరమతత్వహిత పురుషార్థలక్షణములను చెప్పుచుండఁగా రాజాంగమునందుండు పండితులు జోస్యులు పురజనులు మొదలగువారు ఏకజామువరకువిని పరమానందముజెంది కథముగిసినవెనుక హారతులిచ్చి మంగళశ్లోకము పాడినిలుపగా జోస్యుండొకఁడు హరిభక్తునికి దండప్రణామంబులిడి వీరుఁడైన ఈధరణీనాథుఁడు విష్ణుమందిరములనుజూచినదే నాశముచేయుతలంపుగలవాడు, ఇతడు పండరీపురమున గల పాండురంగని సన్నిధిని తురకలపాలుచేసి నాశపరచెను, అదియునుగాక దుర్వ్యాజ్యమునకై అచట నొకమసీదును కట్టించియున్నాడు. అచ్చట వసింపుచున్న బ్రాహ్మణులు భక్తులు పాండురంగని భద్రపరచి పరారులై పారిపోయిరి. ఇది మహాకష్టమైన కాలముగానున్నదే, ఇట్టితరుణమందు యీమహాత్ముడు కృపాళుఁడై భాగవతసమూహముతో గూడి పరమార్థములను బోధించుచున్నాడు. రాజీసంగతి వినినతోడనే వీరికిబహుసంకటములను గలుగజేసునుగాన వీరిట్టికాలంబునం దాడంబరములుమాని ప్రాణంబులు తప్పించుకొనుట యుచితంబు, అయితే యీసమయమందు పృథివీ

పతికొక సంకటంబు గలిగియున్నది. అదేమనఁగా రాజుభార్య యీ దినంబొక సర్పముచేత కరవబడి మరణము జెందియున్నది. అచ్చటి కనేకవైద్యులువచ్చి ఔషధంబు లిచ్చి నిష్ప్రయోజకులై పోయిరి. నీతిపరుఁడుగాని రాజమిత దుఃఖములను బొందునని వచించు పెద్దల వాక్యముతప్పునాయని పరితపించుచుండఁగా చాంగకేశవదాసు విని అయ్యో పాపము అచ్చటికి నన్ను వెంటబెట్టుకొని పోయినయెడల రాజుభార్యను తక్షణమే లేపివేసెదను, నీవీవిషయమును రాజుతో విన్నవించవలయునని జోస్యునితో వచింపఁగా అతఁడాక్షణమే వేగంబుననేగి రాజుగారికి యీసంగతులను చెప్పఁగా విని రాజాక్షణంబే వేగంబుగాజని చాంగకేశవదాసును పిలుచుకొనిరండని తన భటుల కాజ్ఞాపించెను. ఆతక్షణమే భటులు వేగముగాజని భాగవతుని పిలువగా వారాక్షణమే భాగవతగోష్ఠితోగూడి తంబుర తాళ మృదంగ రవముతో కరతాళములువేయుచు శ్రీహరి నామంబులను బాడుచు నాడుచు రాజమందిరమునకురాఁగా రాజుజూచి భాగవతునికి మర్యాదలొనరింపక దండముబెట్టక కుశలప్రశ్న చేయకయుండుటను గని అలుకవహింపక చాంగకేశవదాసు కొంచెము విభూతినియెత్తి ఆవని తపై వేయుసమయమున రాజు నేత్రములకు భాగవతుఁడు భగవంతునివలె ప్రకాశముతోగూడియుండుటనుగని ఓహో వీరు మహాత్ములుగా గానబడుచున్నారు, అట్లుగాకుండిన వీరి ముఖము కోటి సూర్యప్రకాశముగలిగి పరబ్రహ్మస్వరూపంబై వెలుగుచుండుటేమని భయభ్రాంతులుగలవాఁడై గడగడవణుకుచు వారికి దీర్ఘదండప్రణామంబులొనరించి ఓస్వామీ తాము నాపట్టమహిషిని బ్రతికించి నాకు సంతోషము కలుగజేయవలెనని నానావిధముల స్తుతింపుచుండగా చాంగకేశవదాసు రాజా నీమనోభీష్టప్రకారమే విఠలుఁడు కృపజేసునని చెప్పి కొంతవిభూతినియెత్తి నరపతిచేతికొసంగి నీభార్య నొసటి



యందుంచుమనివచింపగా రాజావిభూతిని భక్తితోచేకొని తనభార్య నుదుటియందిడగా పీనుగవలె పడియున్న రాజుభార్యలేచి పెద్దకేక వేయుచు ఆర్భాటముచేయుచుండుటను గని రాజు మిక్కిలిచింతగలవాఁడై చాంగకేశవదాసు సమీపమునకు వచ్చి తన భార్య చేయుచున్న చేష్టలనుచెప్పి విచారపడుచుండఁగా చాంగకేశవదాసు నరపతినిగని నీవు మరల నీభార్యవద్దికేగి ఆమెకేదియిష్టమో వాటిని చెప్పుమని యడుగుమనగా రాజామెచెంతకువచ్చి నీవేమి కోరుచున్నావని యడిగెను. అంత నాసాధ్వి నాకు ప్రాణదానముచేసిన భక్తాగ్రేసరుని మనోభీష్టంబులు తీర్చి సదా వారియందు ప్రీతిగలవాఁడై యుండునట్లు కోరుచున్నానుగాని యిక వేరే నాకేకోరికయు లేదని చెప్పెను. అంత రాజావచనములనువిని భక్తునియందు ప్రీతివిశ్వాసములుగలవాఁడై నారిచెంతకువచ్చి ఓ స్వామీ మీరేమి కోరెదరో వాటిని నే నవశ్యము యిచ్చుటకు సిద్ధుఁడనైయున్నాను తెలుపవలయునని మిక్కిలిశ్రద్ధతోవచింపఁగా భక్తుఁడువిని ఓరాజా నాకు ధన కనక వస్తువాహనములు కావలసినదిలేదు. అయితే నేను కోరువాటిని మాత్రము యివ్వవలెను. అదేమనగా శ్రీపండరీపురమున నెలకొనియున్న పాండురంగని సన్నిధానము పురివానులకున్ను భాగవతులకున్ను బాధ్యతగలిగియుండఁగా ఆపురమును మీరు వశపరచుకొని అనేకదుష్కార్యములుచేసినందున యాత్రవానులు శ్రీపాండురంగని సేవించుటకు వల్లకాక తురకలభయముచేత మరలిపోవుచున్నారు. ఇదిగాక సదా ఆ పురంబునందు వసింపుచుండిన బ్రాహ్మణులు భక్తులు భీతిజెంది పరారులై దేశాటనముచేయుచు వారందరు దుఃఖించుచుండుటచేతనే అకస్మాత్తుగా మీకీయాపద సంభవించినది గనుక ఓరాజా తురకలచేత మాకే భయము గలుగకుండునటుల నీవొక తాకీదుమాత్రము వ్రాసి యిప్పించవలయుననఁగా రాజు సమ్మ

తించి తాకీదువ్రాసి మొహరువేసి కొందరుభటులను వారితోగూడా బంపి తాకీధు చాంగకేశవదాసుకు నొసంగి తగినమర్యాదలు సలిపి కొంతదూరము వెంటజని దారిసాగనంపి భక్తునిచేత సెలవుపుచ్చుకొని గృహంబుచేరెను. భక్తుడు తాకీదును చేబూని భటసమూహముతో పండరీపురమునకు వచ్చుచుండఁగా సాధువులు పురజనులు పరమానందముతో యెదుర్కొనివచ్చి తగినమర్యాదలతో పిలుచుకొనిపోయి సన్నిధిలో ప్రవేశించి శ్రీపాండురంగనిసేవించగా పాండురంగడు తిరిగియుండుటను గని యిచ్చట తురకలుచేసిన దుండగములకు భీతిగలవారై పురజనులు శ్రీపాండురంగడు కనబడకుండుటకై భగవంతుని త్రిప్పియుంచిరని తెలుసుకొని తక్షణమే పాండురంగని మరలించి సంప్రోక్షణాదులుచేసి మిక్కిలిసంతోషముతో భక్తులందరు గుమిగూడి పురప్రదక్షిణంబువచ్చుచుండఁగా భాగవతులందరు చాంగకేశవదాసుల ప్రభావమును గొనియాడి మిక్కిలి భక్తివిశ్వాసములతో పరమానందము జెందియుండిరి. అనంతరము చాంగకేశవదాసు సంవత్సరపర్యంతమచటవసించి ఒకదినంబున భగవంతుని నేత్రానందముగా ఆపాద మస్తకపర్యంతము సేవించి ఓవిఠలా నాకెచ్చట సమాధియివ్వ వుద్దేశించియున్నారని మిక్కిలి దీనవదనుఁడై విన్నవించుకొనగా శ్రీపాండురంగడు కరుణించి ఓచాంగకేశవదాసా నీవు గోదావరితీరంబునకరిగి నాచే నొసంగబడిన షడాక్షరి మంత్రమును నీపుత్రునికుపదేశించి అనంతరమచటనే నీవుసమాధికావచ్చునని వచింపగా భక్తుడువిని పండరీనాధునికి దండప్రణామంబు లాచరించి పరమానందభరితుఁడై నానావిధములస్తోత్రంబులుచేసి శ్రీపండరీపురంబున వెలయుచున్న భక్తులకందరికి దండప్రణామంబులు సమర్పించి వారిచే యనుజ్ఞవడసి భగవన్నామములనుచ్చరింపుచు తమ వాసస్థలమునకు వచ్చి, తన పుత్రుఁడగు కేశవుని చేరబిలిచి పరమ



గోప్యమగు షడాక్షరమంత్రం బుపదేశించి నీవీమంత్రరాజమును నీ తమ్ముఁడగు విఠలుని కుపదేశించి నీవీప్రపంచమున కెల్లప్పుడు హితమొనరింపుచుండుమని సుబుద్ధులు గఱపి భాగవతగోష్ఠికి సాష్టాంగ దండప్రణామంబులాచరించి వారిచే సెలవుగైకొని భాగవతులందరు చూచుచుండ సమాధిపొందగా అచట నుండిన భాగవతులందరు పరమానందభరితులై వారందరు గుమిగూడి చాంగకేశవదాసు ప్రభావములను కీర్తించుచుండిరి. అనంతరము జ్యేష్ఠపుత్రుడగు కేశవదాసు పన్నెండుసంవత్సరములు యాత్రచేసివచ్చి తనతమ్మునికి షడాక్షరిని వుపదేశించి పాండురంగని చరణకమలయందుచేరెను. తదనంతరము విఠలునిసంతతి ప్రబలముజెంది భగవద్భక్తులై వెలుగుచు ఇట్లు యేడు పరంపరలయందును భగవద్భక్తులై జన్మించుచుండిరి. అందు యేడవ సంతతివారు చాంగకేశవదాసుల యంశంబునబుట్టి సన్నిధులుజీర్ణోద్ధారణములుజేసి ధన్యులైరి. శ్రీహరిభక్తుల మహిమలపారములు, అవి చెప్పుటకలవిగాదు. ఇట్టి మహాభక్తుల చరిత్రములను చదివి వినువారు యిహపరసుఖంబులనుభవించి అంత్యమున శ్రీహరిపాదపద్మంబులు జేరుదురు.

శ్రీపాండురంగవిఠలకృష్ణాయనమః.

# కపీరుదాసుచరిత్రము.

భగవదాజ్ఞచే శుక్రాంశమున నొకశిశువు ముత్యపుచిప్పయందణిగి వర్షధారలతో గలసి గంగానదిలోపడెను. ఆ ముత్యపుచిప్ప తేలుచు కాశీపట్టణమునందు మణికర్ణికా ఘట్టమున వచ్చుచుండఁగా కమాలను పేరుగలిగిన దూదేకుల తురకసాయబు నదీతీరమున నూలుతుకుచు నదిలో తేలుచూవచ్చుచున్న ముత్యపుచిప్పనుగని యీదుచుబోయి వాటినిచేకొని మరల గట్టుకువచ్చి ఆముత్యపుచిప్పను తెఱచి

చూడఁగా భగవంతుని నిర్హేతుక కృపచే కోటిసూర్య ప్రకాశమాన
ముతోఁగూడి సర్వలక్షణములతోనొప్పుచున్న శిశువునుగని మిక్కిలి
సంతోషచిత్తుఁడై ఆబిడ్డసహితముగ గృహంబునకువచ్చి తనభార్యను
బిలిచి మనము పుత్రులు లేక బహుకాలముగా పరితపించుచున్నా
ముగదా. భగవంతుఁడు మనయందు పరిపూర్ణకృపయుంచి మనకీ
బిడ్డను ముత్యపుచిప్పయందు కనఁబడునటుల అనుగ్రహించెను. మన
భాగ్యవిశేషము నేడు సిద్ధించెనని రామనామోచ్చారణ చేయుచుం
డెడి శిశువును తనభార్యచేతికొసంగెను. ఆమె మిక్కిలి ప్రియముతో
శిశువును చేఁదీసుకొని ముద్దుబెట్టుకొనఁగా ఆమె స్థనములయందు
పాలుచేపువచ్చి స్రవించుచుండుటను గని పరమానందముజెంది శ్రీ
హరి కృపాకటాక్షమునకు సంతసింపుచు బిడ్డకు స్తన్యపానమొసంగి
మిక్కిలి గారాబముతో శిశువును బెనుచుచురాఁగా ఆశిశువు దిన
దినప్రవర్ధమానుఁడై చంద్రునిపగిది వృద్ధిబొందుచుండెను. అంతట
కమాల్ బిడ్డకు కబీరని నామకరణముగావించి పరమానందముజెంది
యుండగా ఆబిడ్డ సదా భగవన్నామము నుచ్చరింపుచుండుటను ఆ
గ్రామవాసులు గని ఈసుపుత్రుఁడు భగవదిచ్ఛచే అవతరించినాడని
వచింపుచు ఈమహాత్ముఁడు తనయవ్వనకాలంబున జ్ఞానభక్తివైరాగ్య
శీలుఁడైయుండును, ఇతని జననీజనకులు పూర్వజన్మమందెట్టిపుణ్య
ములను జేసిరో. గాన యిట్టిపూర్ణజ్ఞాని యీదంపతులకు పుత్రుఁడై
జన్మించినాఁడని కొనియాడుచుండఁగా యీ సంగతి దేశదేశములు
వ్యాపించి యీసుపుత్రునిమహిమావిశేషములు ప్రకాశించుచుండెను.
అనంతరమీపుత్రునికి వివేకదశ వచ్చినతరువాత తల్లిదండ్రులు తమ
స్వవృత్తియగు నేతపని నేర్పుటకు యత్నించిరి. అతనికాపనియందు
మనసు నిలువక మానసువహించియుండుటనుగని తల్లి అప్పుడప్పుడు
శిక్షింపుచు మిక్కిలి సులభముగా నేర్పించుచుండెను. ఇట్లుండగా



ఒకదినము తల్లి నూలుకండెను కబీరుచేతికిచ్చి చీరెను నేయునట్లా
జ్ఞాపించి తాను కార్యార్థముగా బైటికిపోగా కబీరు రామమూర్తిని
భజింపుచు కన్నులు మూసుకొని దేహముమఱచి పనిచేయకయుం
డుటను తల్లిగని ఓరీకబీరా నీకు నియమించినకార్యము నీవుచేయక
వీధిద్రిమ్మరివై వూరకున్నావుకదాయని కోపించి వీపుపై నొకదెబ్బ
కొట్టగా కబీరు జాగ్రతకలవాడై నేయుటకెత్నించి కొంత నేసి తన
ధ్యానమూర్తి తనయెదుట ప్రతిఫలించుచుండుటనుగని ఆయానంద
పరవశమున తన్మయముజెంది దేహముమరచియుండఁగా భగవంతుడు
తానే వస్త్రమును నేసిముగించి కబీరునకు జాగ్రతావస్థ కలుగచేయ
నెంచి కబీరుసమీపమందు నిలిచియుండెను. అంత కబీరు జాగ్రతా
వస్థనుపొంది కన్నులుతెరచిచూచి వస్త్రమంతయు నేసిముగిసియుం
డుటనుగని ఇది భగవంతునికార్యమని సంతసించి వాటినిమడతవేసి
తనతల్లిచేతికివ్వగా ఆమె చీరెను మరల పుత్రునిచేతికొసంగి వీటిని
బజారువీధికికొనిపోయి విక్రయించి కాసులుతెమ్మని వచించెను. అంత
కబీరు చీరెనుచేతనుంచుకొని అంగడివీధికివచ్చి వొకప్రక్కకూర్చుండి
చీరెను నలుగురు చూచునటుల తనముందుగానుంచుకొని శ్రీహరి
దివ్యమంగళవిగ్రహమును ధారణచేసికొని భగవన్నామమును ధ్యా
నింపుచు జగత్తును మరచియుండెను. ఆవస్త్రము శ్రీహరిహస్తము
చేత నేయబడినదిగావున దాని వెలమదించువారి మదింపునకు వారి
శక్తికి మీరియుండునట్లుగా తోచబడుటచేత వచ్చిచూచువారందరు
దీనికింతవెలయని యెవరు నిర్ధారణచేయకపోయిరి.. మఱికొందరా
చీరెనుచూచి మాకుండెడియాస్తి పదివేలు, ఈచీరెమదింపు యిరు
వదివేలరూపాయలగుచున్నది, వీటినిగొనుటకు మేమశక్తులమనుచు
వెళ్లిపోవుచుండిరి. ఇట్లందరాచీరెను చూచిపోవుచుండుటచే ప్రొద్దు
గ్రుంకుసమయమగుటవలన కబీరావస్త్రమును మడిచి తనకరమున

నుంచుకొని తనతల్లి కోపించునను భీతిగలవాఁడై తన గృహంబునకు వచ్చుచు దారిలో మనుష్యులు వసించని యిల్లొకటినిగని ఆయింటిలో ప్రవేశించి అచట నెమ్మదిగా నొకచోటకూర్చుని శ్రీహరిని స్మరించుచుండెను. అంత శ్రీహరి బీదబ్రాహ్మణరూపమునుధరించి వచ్చి యెదుటనిలిచి అయ్యా యిపుడు మహాచలికాలముగానున్నది, నేను వస్త్రములేక బహుకష్టపడుచున్నాను గాన నాకొక వస్త్రంబిమ్మని ప్రార్థించగా కబీరా బ్రాహ్మణునిగని మిక్కిలి దయగలవాఁడై అర్థభాగముగా చీరెనుచించి బ్రాహ్మణునికొసంగెను. వారాచీరెను దీసుకొని కబీరునుపరీక్షించుటకుగాను పకీరువేషముధరించివచ్చి అయ్యా వస్త్రహీనుడుగా నుండుటచేత నాకు తొడుగుకొనుటకొక వస్త్రంబిమ్మని యడుగుచు భగవంతుడు నిరాకారుడైయుండగా నీవేల శ్రీహరిని సగుణముగా ధ్యానించుచున్నావని చర్చచేయగా అందుకు కబీరిట్లని వచింపుచున్నాడు. శ్రీహరియొక్క కృప కరిగించిన నెయ్యివలెను కరిగించని నెయ్యివలెను యుంటున్నది. నిరాకారమైన ధ్యానము కరిగించని నెయ్యివలెయుండును. వానియొక్క సగుణస్వరూపము కరిగిన నెయ్యివలె యుండును. నెయ్యి కరిగియుండినను కరగక యుండినను వస్తువు వేరగునా, ఆరీతిగా అవ్యక్తమైన తేజస్సు భక్తజనులకుగానువ్యక్తరూపము పొందినదని చెప్పగా పకీర్ మరుమాట చెప్పక వస్త్రంబడిగెను. అంత కబీరు తనవద్దయున్న సగము చీరెను వారికొసఁగి కష్టము నివర్తించుకొన్న వానివలె తలంచి రామనామమును ధ్యానించుచుండెను. పిమ్మట భగవంతుడు బ్రాహ్మణవేషమును ధరించి కబీరుగృహంబునకువచ్చి అతనితల్లిని వెలుపలకుపిలిచి కబీరు చేసిన వ్యవహారములను చెప్పి ఆమెకు కోపముకలుగఁజేసి అతఁడు యింటికిరాక జనులెవరు వసించని యింటియందుప్రవేశించి శ్రీరామధ్యానము చేయుచున్నాడని చెప్పగా విని ఆమె బ్రాహ్మణునితో నిట్లు



వచింపుచున్నది. ఓ స్వామీ కబీరు యింటికివచ్చినతోడనే వానిని చక్కఁగా మర్దించుచున్నానని చెప్పఁగా, భగవంతుడు యిప్పుడతఁడు గృహంబునకురాలేదు కాబట్టి నీవు నాతోగూడ వచ్చితివేని అతండున్న స్థలంబును నీకుచూపెదనని బలవంతపరచి ఆవనితను రమ్మని చెప్పి వెంటదీసుకొనివచ్చి దూరముగానుండి కబీరుండెడి చోటును చూపించెను. ఆమె తన కొమారుడచట యుండుటనుగని సమీపంబునకువచ్చిచూచి అతడు భగవన్నామస్మరణచేయుచుండుటనుగని ఓ కబీరా నీవిపుడు నేసిన వస్త్రమును బజారునకు విక్రయించుటకు తెచ్చితివిగదా, ఆచీరెను యెచటవుంచియున్నావని బెదరించి యడుగఁగా కబీరు మౌనమువహించి శ్రీరఘురాముని దివ్యనామమును మనస్సునందు ధ్యానింపుచు దేహముమరచి బహిర్ముఖదర్శనములేక స్థిరచిత్తుఁడై యుండుటనుగని తల్లి కరంబున వేముంచుకొని మిక్కిలి కోపముతో తిట్టుచు వీపుపై కొన్ని దెబ్బలు కొట్టెను. ఆమె కొట్టిన దెబ్బలు కబీరునకుతగలక భగవంతుని వీపునందు దద్దులుదద్దులుగా లేచియుండఁగా ఆదెబ్బల దద్దులను భగవంతుఁడు తుడుచుకొనుచు ఓతల్లీ కొట్టవలదు క్షమింపుమని తనవీపునతగిలియున్న దెబ్బలదద్దులన్నిటిని ఆమెకుచూపి విప్రవేషమును వదిలి తన నిజస్వరూపమైన నీలమేఘ శ్యామల కోమలాకారమగు తిరుమేనితో కర్ణకుండలంబులు ధరించి విశాలమగు వక్షస్థళముతోగూడి గాంభీర్యమగు బాహువులతోనొప్పుచున్న కరంబులయందు శరచాపములను ధరించి నవరత్నఖచితమగు హారకేయూర కిరీటాదిదివ్యభూషణాలంకృతుఁడై సీతాపిరాట్టిసమేతముగా సేవయొసగెను. అట్టిసమయంబున కబీరు ధ్యానమును వదలి కన్నులుతెరచి దివ్యమంగళవిగ్రహుఁడైన శ్రీమన్నారాయణుని ఆపాదమస్తకపర్యంతము నేత్రానందముగా సేవించి పరమానందముతోస్తుతింపుచుండఁగా భగవంతుఁడు కబీరునుగాంచి

యిట్లు వచింపుచున్నాఁడు. ఓకబీరా నీమనోదృఢమునుగనుటకు నిన్ను పరీక్షించినాను, నీవంతటికిసహించియుంటివి, గాన ఇది మొదలు నిన్నెడబాయక నీవద్దనే ధ్యానమూర్తిగా యుందును. నీవు నన్ను మఱవక సదా భజించుచుండువుగాకయని ఆశీర్వాదము జేసి కబీరుతల్లిని చూచి ఓతల్లీ నీవు నాశములేనిభాగ్యముగలిగి నన్ను సదా నీహృదయమున నిలుపుకొని ధ్యానించుచుండుమని మిక్కిలి ప్రియముతో వచించి అదృశుఁడయ్యెను. అంత కబీరునితల్లి పరమానందము జెంది పుత్రుని ముద్దుపెట్టుకొని ఓ కుమారరత్నమా నీవు శ్రీరామ భక్తుఁడవై వారికటాక్షముపొందుటచేత నీవల్ల నేనున్ను ఆ నీలమేఘశ్యాముఁడైన శ్రీమన్నారాయణమూర్తి దివ్యమంగళస్వరూపమును నా కనులార సేవించి శ్రీహరిని నాచిత్తమునందు భద్రపరచియున్నాను నామనంబానందపరవశత్వము జెందియున్నది. వీటికి కారణభూతుడు నీవుకదాయని వచింపుచు పుత్రుని గృహంబునకు దోడుకొనివచ్చి వారిద్దరు సదా శ్రీరామమూర్తిని ధ్యానింపుచు కొరతలేములు లేక ఆనందసాగరమునందు మునిగి సుఖముగాయుండి తల్లి పుత్రునియిష్టమునకు మారువచింపక ప్రవర్తించుచుండెను. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట పుత్రునికి సలక్షణమైన కన్యకను మాట్లాడి విధిపూర్వకముగా కబీరునకు వివాహము చేయించిరి. అంత కబీరు గృహస్థధర్మమును క్రమముగాజరుపుచు భగవద్భాగవతారాధన చేయుచుండగా అతనితల్లి దివారాత్రులు శ్రీరామనామమును ధ్యానింపుచు అఖండ జ్ఞానముకలదై మిక్కిలి ప్రసిద్ధివహించియుండెను.

కబీరు పతివ్రతాతిలకంబగు స్వపత్నితోగూడి ధనధాన్యవస్తువాహనాది సుఖభోగంబులు తుచ్ఛమనితలఁచి నిత్యానందసుఖమగు సర్వేశ్వరుని చరణకమలంబులే శాశ్వతసంపత్తనియెంచి భగవద్ధ్యానము జేయుచు కాలముగడుపుచుండ వారికొక సుపుత్రుఁడు జనించెను.



ఆబిడ్డకు ద్వాదశదివసమున బంధువర్గములనురావించి బ్రాహ్మణులు మంగళాష్టకములు పాడుచుండగా శిశువుకు కమాలని నామకరణము జేసిరి. ఆ సుపుత్రుఁడు చంద్రుని పగిది నానాట వృద్ధిబొందుచు సద్గుణసంపన్నుఁడై పితృవాక్యమునుజవదాటక తనతండ్రిచే సొంతముగా వ్రాయఁబడిన కీర్తనలను పాఠముచేసి వాటియందు చెప్పఁబడిన సూనృతవాక్యముల ననుష్ఠింపుచు సుచిర్యాతుఁడై జ్ఞానభక్తి వైరాగ్యములు గలిగి శ్రీహరి నామామృతమును గానరూపముగా పాడుచుండును. కమాల్ చిన్నవాడుగానుండియు నొకదినమునందు తండ్రివద్దికేతెంచి వారిపాదకమలములకు సాష్టాంగదండప్రణామంబులొనరించి ఓతండ్రీ నేను ద్వారకాపురిని సేవించిరావలయునని అపేక్షను జెందియున్నాను. గనుక తాము నాకనుజ్ఞ యొసంగినయెడల శీఘ్రముగాజని సేవించివచ్చుచున్నానని భక్తిపూర్వకముగా వేడుకొనెను. కబీరు కుమారునిముద్దుపల్కులువిని మిక్కిలిసంతోషించి యింతచిన్నతనములో యాత్రచేసి రావలయునను చింతవహించుట శ్రీహరి కృపాకటాక్షమని సంతోషించి సుఖముగా పోయిరమ్మని యాజ్ఞనొసంగెను. అంత కమాల్ తండ్రి యాత్రపోవుటకు సమ్మతించి అనుజ్ఞయిచ్చినందుకు పరమానందము జెంది వారిని ప్రదక్షిణముగావచ్చి వారితిరువడియందు తనశిరంబిడి సాష్టాంగదండప్రణామంబాచరించి అనుజ్ఞపుచ్చుకొని శ్రీరామనామముచు ధ్యానింపుచు కాశీ విడిచి పోవుచు షడ్రసోపేతములైన అన్నపానాదులయందు ఆశలుడిగి దేహాభిమానమును వదిలి ధనవంతుల ద్వారములందు దూరకవారి నేదైన యిమ్మని అపేక్షించి యడుగక తన యనుష్ఠానమునకు విరోధములేక నడిచిపోవుచుండెను. ఇతడు సదా భగవన్నామసంకీర్తనలను రాగతాళములతో పాడుచు పోవుచుండుటను గని పురవాసులు మిక్కిలి ప్రీతితో వీరిని సన్మానించుచుందురు. అతఁడు నారదుని

పగిది శ్రీరామకీర్తనలను రాత్రింబగళ్లు పాడుచుండుటవలన వీరికీర్తి లోకమంతయువ్యాపించి నానాదేశస్థులువచ్చి మిక్కిలిప్రీతితో వీరిని సేవించిపోవుచుందురు. దారియందు కనుబడు ప్రతిగ్రామమందును పట్టణమందును ఒకదినము వసించునుగాని మరుదినముండడు. ఇట్టి నిశ్చయహించి ప్రయాణమైపోవుచు కొన్నిదినంబులకు ద్వారకాపురి జేరి అచట నెలకొనియున్న పుణ్యతీర్థమందు స్నానానుష్ఠానంబులు దీర్చుకొని ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరించుకొని భయభక్తులు గలిగి మిక్కిలిప్రీతితో సన్నిధియందు ప్రవేశించి శ్రీకృష్ణమూర్తిని దర్శించి సాష్టాంగదండప్రణామంబులొనరించి అంజలీహస్తుడై భగవద్విగ్రహమును ఆపాదమస్తకపర్యంతము సేవించి వారిని తనహృదయకమలంబుననిలిపికొని అనంతనామములచేస్తుతించి నూతనకవిచే పద్యకీర్తనలుచేసి గానరూపముగా పాడుచు నాలుగునెలల పర్యంతమచ్చట నివసించి భగవంతుని నేత్రానందముగా సేవించి వారిచే సెలవుగైకొని తననివాసస్థానమునకు ప్రయాణమై శ్రీరామభజనము చేయుచు వచ్చుచుండగా దారియందొకగ్రామంబున వసించుచున్న విష్ణుదాసుడను వర్తకుడు కబీరుదాసుపుత్రుడగు కమాలను భక్తశిరోమణి ఆగ్రామమార్గముగా వచ్చుచున్నారని విని భాగవతగోష్ఠితో యెదుర్కొనివచ్చి కమాలునకు ప్రదక్షిణ నమస్కారంబులు జేసి మర్యాదపూర్వకముగా తనగృహంబునకు వెంటబెట్టుకొనివచ్చి దివ్యాన్నంబులిడి భుజింపజేసి రత్నజమకాళముపై కూర్చుండబెట్టి చందనకుసుమతాంబూలాదులొసంగి కుశలప్రశ్నలుచేయుచుండగా కమాల్ సంతోషముజెంది శ్రీరామచంద్రునిమీద కొన్నికీర్తనలు పాడుచుండెను. అప్పుడచటయుండిన భాగవతులు పురజనులు వారి హరినామసంకీర్తనలువిని బ్రహ్మానందముజెంది పరవశులై యుండు సమయమందు వర్తకుడు పరమానందభరితుడై మనమీ కమాల్



దాసునకు సన్మానముచేసిపంపవలెననియెంచినాముగదా, వీరు నిరాపేక్షులుగాయుంటున్నారుగనుక నేనొసంగు ద్రవ్యరాసులను ధిక్కరించుననియెంచి తనవద్ద అపూర్వముగానున్న మాణిక్యమును తట్టయందుంచి వారియెదుటబెట్టి నమస్కారముచేసి ఓస్వామీ తమవద్ద ఈరత్నముండిన రాత్రికాలములయందు దీపమవశ్యములేదు. గాన తామీరత్నమును అంగీకరింపుడని పలువిధముల ప్రార్థించుచుండగా కమాలావర్తకునిప్రార్థనవిని అయ్యా ఈరత్నమును నేనుతీసుకొనిచనినయెడల నా తండ్రియగు కబీరుదాసు కోపించును. నేను నవరత్నంబులను గుల్లరాళ్లుగా తలంచియున్నానుగాని వాటివలన నాకే ప్రయోజనముకలుగదుగాన నీవు ప్రయాసపడవద్దు, నేనీరత్నమంగీకరింపను గనుక నీవీరత్నమునుగొనిపొమ్మని వారిచేతికొసంగెను. అంత వర్తకుడు భక్తాగ్రేసరులగు సాధువులయొక్క క్రియావిశేషంబులు తెలియనివాడుగాన కమాల్దాసు నిద్రాపరవశుడైయుండుసమయమునందు వారి కౌపీనమందారత్నమును ముడివేసియుంచెను. అంత కమాల్ వుదయాత్పూర్వమునలేచి కౌపీనమునందు రత్నము ముడివేసియుండుట యెఱుగక ప్రయాణమైపోయి ఆదినమే తనగృహంబు జేరి తండ్రినిగని దండముసమర్పించెను. అటుపిమ్మట తన కౌపీనమందు ముడివేసియున్న రత్నమును చూచి మిక్కిలి భీతిగలవాడై తండ్రితో తనకు వణిజునికి జరిగిన వృత్తాంతమును తెలిపి వర్తకుడు తాను నిద్రించుచున్నసమయమునందు రత్నమును కౌపీనమునందు ముడివేసియుంచినాడని తనతండ్రికి చెప్పి మాణిక్యమును చూపగా ఆవచనమును కబీరుదాసువిని మూర్ఛాక్రాంతుడై భూమియందుపడియుండి కొంతసేపటికి మూర్ఛతెలిసిలేచెను. అంత వారిభార్య అచ్చటికివచ్చి యేమివిశేషంబని విచారించగా కబీరుదాసు తనపుత్రుని యెదుట నిలువనియ్యక తరమకొట్టి మిక్కిలికోపముజెంది తనభార్య

నుజూచి యిట్లు వచింపుచున్నాడు. నీపుత్రుడు రామనామము గాన
రూపముగాఁబాడుచు లోకులనురంజింపజేసి వారొసంగిన రత్నమును
చేకొని వచ్చియుండుటను చూడఁగా రామనామమును విక్రయించి
రత్నమును తెచ్చినట్లయినది గనుక మన వంశము వీనివల్ల మునిఁగి
పోయినందుకుగాను నేను మిక్కిలి దుఃఖించుచున్నానని వచించెను.
ఈవచనములను విని కమాల్ గృహంబున నిలువక తత్క్షణమే ప్రయా
ణమై వర్తకునివద్దికిజని తనతండ్రి కోపించి చెప్పిన సకలసంగతులు
తెలియపరచి రత్నమును వర్తకునికి యిచ్చి ఆక్షణమే బయలుదేరి
స్వగృహంబునకు వచ్చి జననీ జనకులకు దండప్రణామంబులు చేసి
తాను పోయివచ్చిన సంగతులను విశదపరచెను. ఆ వచనములను
జననీజనకులువిని తమపుత్రుడు భగవంతునివిషయమున నిరపరాధి
యయ్యెనని మిక్కిలిసంతోషమును జెందియుండిరి.

ఒకదినము కబీరుదాసు శ్రీరామమూర్తియొక్క కీర్తనములు
పాడుచు అంగడివీడియందు పోవుచుండఁగా ఆవీధియందొక గృహిణి
తనగృహమునం దొంటరిగా యంత్రమునందు పిండివిసరుచుండఁగా
కబీరాయంత్రమునుజూచి తాను భగవన్నామమునుపాడుచు ఆనం
దించుచుండుటనువిడిచి మిక్కిలి యేడ్చుచుండెను. అతండేడ్చుచుం
డుటనుగని బాటసారులందరు భ్రమజెంది వింతగాచూచుచుండఁగా
కొందరు కబీరుదాసునుజూచి నీవుదుఃఖించుటకు కారణమేమని విచా
రించగా కబీరుదాసు వారిని కన్నెత్తిచూడక వారితో మరుమాట
వచింపక వీరందరు కలిమనుజులనియెంచి తానెప్పటివలె యేడ్చుచుం
డెను. అట్టితరుణమందు నిపట్ నిరంజనుడను భక్తుండామార్గంబుగా
బోవుచు కబీరునుజూచి నీవేలఁ యేడ్చుచున్నావని విచారించెను. ఓ
స్వామీ ఈలోకమునందు ప్రకృతిసంబంధమగు జనులకు నిజమును
చెప్పినను వారు గ్రహించుటకు శక్తులుకారని వారడిగిన ప్రశ్నలకు



మరుత్తరము చెప్పక మౌనమువహించియుంటిని. తామడిగినప్రశ్నకు
మరుత్తరము చెప్పుచున్నాను వినుడు. ఆయంత్రమున పిండిగావిసరు
చున్న ధాన్యమంతయు పొడిగా పోవుచున్నదిగదా, అటువలె నేనీ
సంసారచక్రమందు చిక్కి నాశముపొందుట తప్పదని భయపడి మి
క్కిలి దుఃఖించుచున్నాననివచించెను. ఆవచనములను నిపట్ నిరంజ
నుడు విని కబీరుయందు మిక్కిలి ప్రీతిగలవాఁడై వచింపుచున్నాడు.
ఓకబీరా యీలోకమందు భగవద్భక్తులు తమ నిశ్చలభక్తిని వదలక
నిశ్చలభావమును విడువకుండిరేని వారికి యెచ్చట భయముండదు.
అట్టి నిశ్చల భావమును అవలంబించనివారు భవచక్రమందు చిక్కి
పొడిగా పోవుచున్నారు. అదెట్లనఁగా యంత్రమునకు మధ్యభాగ
మందున్న మానుఅచ్చుకు చుట్టుప్రక్కల యుండు ధాన్యము పొడి
కాక యుండుప్రకారము శ్రీరామనామామృతమును పానముచేయు
చున్న మహాత్ములకు కాలచక్రముయొక్క భయమేమిన్నిగలుగదు.
నీవు పరమోత్కృష్టమగు జ్ఞాన భక్తి వైరాగ్యములనుపొంది శాంత
శమదమాదులుగలిగి సద్గుణసంపన్నుడై యుండియు నీవేల భీతిజెంది
కన్నీరువిడచి యేడ్చుచున్నావని పరమార్థములను వచించి దుఃఖోప
శమనముగావించి అతనిమనసురంజింపచేసెను. కబీరు వారువచించిన
పరమార్థములనువిని సంతోషపడుచు తనకుగలిగిన దుఃఖమును శమ
నముచేసుకొని నిపట్ నిరంజనునకు దండముసమర్పించి మీనుబోధ
ములనువిని నేను ధన్యుండనైతినని స్తుతింపుచు వారిద్దరుగూడి భగవ
ద్గుణానుభవములు పాడుచునాడుచు తమతమ నివాసంబులు జేరిరి.

ఇవ్విధముగా శ్రీహరిగుణానుభవముచే కాలముపుచ్చుచుండి
కబీరొకదినము తనలో యిట్లని వితర్కింపుచుండెను. ఈమాయాప్ర
పంచమందు గృహస్థధర్మమునందుండువాఁడు నిష్కళంకుఁడై సదా
చార్యుని చరణకమలములాశ్రయించి శుశ్రూషాపరులుగాకుండునట్టి

మనుజులు ప్రేతసమానులగుదురు. ఒకపురుషునికి ప్రియమైన పత్ని లేనియెడల ప్రపంచకార్యములు జరుగనేరదు. బిడ్డలులేని గృహాము నందు నివసించువారు కాననమునందుండురీతిగా సంతోషమువిడిచి సదా పుత్రలాభమునకుగాను చింతింపుచుందురు. ఆరీతిగానే సదాచార్యుని కటాక్షమును లభించనివారు వారి జీవితకాలము వ్యర్థపరచినవారగుచున్నారని చింతింపుచు ఆపట్టణమందు నెలకొనియున్న రామానందస్వామియను సన్యాసిని సదాచార్యునిగా వరించి తాను కృతార్థుడై సంసారసాగరమును దాటవలయునని తలఁచి ఒకదినము ఆచార్యుని సన్నిధానముజేరి దూరముగానిలిచియుండి సాష్టాంగదండముసమర్పించి ఓస్వామీ దేవరవారి కృపాకటాక్ష వీక్షణమునకు దాసుఁడు పాత్రభూతుండగునటుల వుపదేశమనుగ్రహించి నన్నాదరించి రక్షింపవలయునని నానావిధముల ప్రార్థించుచు నిలువబడియుండఁగా రామానందస్వామి ఓరీ కబీరా నీవు తురకవంశమునం దుద్భవించినవాడుగాన నీకు నేనుపదేశింపతగదనెను. ఆవచనములనువిని కబీర్ స్వామీ దాసుఁడు తక్కువకులమందు పుట్టినవాడుగాయుండియు దేవరవారి తిరువడిత్తామరయందు నిశ్చలమైన భక్తియుంచి భజింపుచున్నవాడనుగాన దాసుని యేరీతిగానైనా కడతేర్చవలయునని సాష్టాంగదండముసమర్పించి తన గృహంబునకువచ్చి చింతింపుచు తానేరీతిగానైనా తన గురువగు రామానందస్వామి చరణకమలంబులు తనశిరంబునసోకి తాను పవిత్రుఁడుగావలెనని యెంచి. అందుకు తగిన సదుపాయము యోచింపుచుండెను. ఇట్లు కొంతకాలముగడిపి ప్రతిదినము రామానందస్వామి ప్రాతఃకాలమునలేచి స్నానార్థము గంగానదికి బోవుచుండుసమయమునందు తనయిష్టాపూర్తినొందవలయునని నిర్ధారణచేసికొని ఒకదినము రామానందస్వామి గంగానదికి వచ్చుసమయము కనిపెట్టియుండి గంగానదియందుదిగు పడికట్లమీ



దుగా ముసుకువేసుకొని పరుండియుండెను. రామానందస్వామి అరుణోదయమునకుమునుపు సందెచీకటిలో స్నానఘట్టమునకు వచ్చుచుండఁగా చీకటియందు తెలియక కబీరు శిరస్సునందు పాదముంచి రామరామా యెవరినో చీకటిగానున్నందున తెలియకత్రొక్కితినని అనుతాపముగలిగి వచింపుచు గంగలోదిగెను. తక్షణమే కబీర్ లేచి ఓస్వామీ దాసుడు దేవరవారి కృపాకటాక్షమును పొందితిని. నా పూర్వపుణ్యపరిపాకముచే తమదివ్యచరణారవిందములు నాశిరమున వుంచి నన్నుపరిశుద్ధునిగాజేసి శ్రీరామమంత్రమును నాకు కృపతో వుపదేశించితిరి. నేననేకజన్మములయందు జేసినసుకృతంబులు నేడు ఫలించి నేనుకృతార్థుండైతిననివచింపుచు పునఃపునః సాష్టాంగదండప్రణామంబులొనరించి దేహాముమరచి నృత్యముచేయుచు ఆచార్యుని అనుగ్రహాముపొందితినని కీర్తనరూపముగా పాడనారంభించెను. ఈ విచిత్రమునుగని రామానందస్వామి సంతోషముజెంది కబీరును పరిశోధించవలయునని తలంచి ప్రియవచనములాడుచు స్నానసంధ్యాద్యనుష్ఠానములు ముగించి తమయాశ్రమమునకు వచ్చిచేరిరి.

అనంతరమొకదినము కబీర్ దాసు శ్రీహరికీర్తనలను పాడుచు అంగడివీధియందు బోవుచుండఁగా భగవన్నామోచ్చారణం బధికరించి ఆనందభాష్పపూరితనేత్రుడగుచు దేహాముమఱచి నృత్యము చేయుచు నాయాచార్యుఁడగు శ్రీరామానందస్వామి దివ్యచరణారవిందములు పట్టిననాడే నాకొరతలన్నియుతీరినదని తనయాచార్యుని ప్రభావములను పలువిధములస్తోత్రముచేయుచు గంతులువేయుచుండెను. అట్టిసమయంబున రామానందస్వామి ఆదారిగావచ్చుచుండి ఆవచనములనువిని కోపముజెందినవారివలె బైటివారికికనుపరచి తన హృదయమునందు సంతసమొందుచు ఒరే కబీరా నీవు నాశిష్యుడని జగమంతయు ప్రసిద్ధిచేసితిరుగుచున్నావు. నేను నీకు యేకాలంబున

మంత్రోపదేశము చేసినాను, అందుకు సాక్షులు యెవరువున్నారు, వృథాగా యేల నీవిట్లు వాశరుచు తిరుగుచున్నావని కోపముజెందిన వారివలె నటించి తమ పాదంబులయందున్న పాదుకలను చేతదీసుకొని కబీరుపై విసరివేసెను. ఆపాదుక లతని ముఖంబున తగిలి అపరిమితముగా రక్తమువచ్చుచుండుటను గని కబీరు సంతోషచిత్తుండై ఓస్వామీ దేవరవారు ముందు యేకాంతముగానొసంగిన వుపదేశము పరమగోప్యముగా నుండెను. తామిపుడు పదుగురికి తెలియునటుల తమ పాదద్వయంబులయందు ధరింపుచున్న పాదుకలను దాసుని శిరంబున నుంచితిరి. మంత్రము లభించిన ఆదినము పంచభూతములను సాక్షియుంచి దేవరవారి చరణకమలములనుపట్టితిని, ఇప్పుడు తాము కృపచేసిన వుపదేశమునకు శ్రీహరియే నాకు సాక్షిగాయున్నాడని వచించెను. అతని దృఢచిత్తమునకు రామానందస్వామి సంతసించి వానియందు మిక్కిలి ప్రీతిగలిగి కబీరునుదగ్గిరబిలిచి తన కుడిహస్తంబును అతనిశిరంబునందుంచి తారకమంత్రమును వుపదేశించి తమ నివాసస్థానమునకు వెడలిపోయిరి. అనంతరము కబీరు పరమానందముజెందినవాడై కమలాక్షుడగు శ్రీరామచంద్రమూర్తిని కవితారూపంబుగాస్తోత్రముచేసి వాటిని సకలమైనవారికి గరపి మిక్కిలిప్రసిద్ధివహించియుండెను. వీరి ప్రభావములను జూచుచున్న కొందరుదుర్మార్గులు అసూయాపరులగుచు కబీరుదాసునకు వచ్చిన కీర్తిప్రతిష్ఠలనుగని సహింపజాలక అతనికి యేవిధముగానైనా అవమానపరచవలయునని యెంచి దుర్జనులందరుగూడి యేకాంతముగా యోచించి తీర్మానించిరి. ఎట్లనగా యీప్రపంచమునందుగల సమస్త దివ్యదేశములయందు వేంచేసియున్న భాగవతోత్తములకు, ఈకాశీక్షేత్రమునందు పలానిసంవత్సరము పలానినెల పలానితారీఖునందు రామోత్సవము జరుగబోవుచున్నది. కావున తాము తమయిష్టజన



కుటుంబసమేతముగా వేంచేసి యీవుత్సవమును జరిపి శ్రీరామమూర్తికి మంగళాశాసనము జేయుదురని తమ మేలైనఘనతను కోరెదనని కబీరుదాసు వ్రాసినట్లువ్రాసి కొందరుమనుష్యులవద్ద పంపినట్లయితే అఖిలభాగవతులువచ్చి అవమానపరచిపోదురని తీర్మానించి జాబులువ్రాసి మనుష్యులవద్దయిచ్చిపంపిరి. అంత వారు హరిద్వారము బృందావనము అయోధ్య ద్వారక మధురమొదలగు క్షేత్రములకుజని భాగవతులకు విజ్ఞాపనపత్రికలొసంగిరి. అంత భాగవతులందరు పత్రికలను చదివిచూచి ఆయాక్షేత్రములయందున్న భగవద్భాగవత సాధుసజ్జనులందరు గుమిగూడి కాశీక్షేత్రమునకు వచ్చి పట్టణమంతయునిండి కబీరుదాసుగృహంబునకువచ్చి మీరాజ్ఞాపించి పంపినప్రకారము తప్పక వుత్సవమునకు వచ్చిచేరినామని దండము సమర్పించిరి. ఇట్లు నూరువేలభాగవతులు యేకకాలమున గుంపులుగూడి భగవన్నామసంకీర్తనలుచేయుటచే జయజయశబ్దంబు లాపట్టణమంతయువ్యాపించి మహావిభవముగా నుండుటనుగని కబీరుదాసు పరమానందభరితస్వాంతుడై గోష్ఠికి ప్రదక్షిణముగావచ్చి సాష్టాంగదండప్రణామంబులాచరించి నాభాగ్యవశమున మిమ్ము సేవింపగలిగె నాకిది సుదినమని కొనియాడుచుండెనుగాని యిది దుర్జనులు చేసిన దుష్కార్యములని తెలియక శ్రీహరి కృపాకటాక్షమువలన మనకు భగవద్భక్తులయొక్క సేవలభించెనని ఆనందసాగరమునందు మునిగియుండెను. కబీరిట్లుండగా శ్రీరామమూర్తి ఈర్ష్యాపరులైన దుర్జనుల ప్రేరేపణము నిష్ఫలమగునట్లుగాను కబీరుదాసు మహిమావిశేషములు ప్రకాశించునట్లుగాను వచ్చినభాగవతులందరు సంతుష్టిచెంది ఆనందించునట్లుగాను కరుణించి భక్తుని కార్యమందు ప్రవేశించెను. అదెట్లులనగా కాశీక్షేత్రమునందు వచ్చియున్న భాగవతులందరివద్దికి కబీరురూపమునుధరించి వారివారి కనుగుణముగా పరిచర్యలొనరిం

పుచు, సాధుసజ్జనులనుకుశలప్రశ్నములు చేయుచు, వారువారుకోరిన సకలవస్తువులనొసంగుచు, కొందరి పాదపద్మములను కడిగి రమణీయ్యమైనస్థలంబులయందు కూర్చుండబెట్టుచు, మరికొందరికి స్నానసంబులుచేయించి ధౌతవస్త్రంబులిచ్చుచు, కొందరికి తిరుమణి శ్రీచూర్ణము గోపీచందనతిలకములొసంగుచు, మరికొందరికి పంచభక్ష్యపరమాన్నములుపరిమారి వారినితృప్తిగావించి చందనకుసుమతాంబూలాదులచేనలంకరింపజేయుచుండెను. కొందరివద్ద శ్రద్ధాభక్తులుగలిగి చేతులుకట్టుకొని వారిసమీపమందు నిలిచి వారియిష్టానుసారముగా ప్రవర్తింపుచు, కొందరు సాధుసజ్జనులకు వారు నడిచివచ్చిన శ్రమపరిహారమగునట్లు వారిపాదద్వయంబులు పట్టుచుండును. మరియొకచోట భాగవతుల పాదరక్షలను శిరమునందుంచుకొని పరమానందభరితుడై శ్రీరామనామ సంకీర్తనములు పాడుచు నృత్యముజేయుచుండును. కొందరిని యొకవేళ భుజింపజేసి వారినిసంతుష్టిగావింపుచు, వారువారు కోరినప్రకారము గుడాకునందుమందు వేసి అగ్నిరగిలించి యిచ్చుచు, కొందరికి తాంబూలము మడిచియిచ్చుచు, మరికొందరికి తులసీ నలినాక్ష మాలెలను కంఠములయందు వేసి సేవింపుచు, కొందరికి నొసట కస్తూరితిలకంబు బెట్టుచు, మరికొందరికి నూతన వస్త్రములనొసగుచు, కొందరికి దివ్యమైనరత్నభూషణములను ధరింపజేసి యానందించుచుండును. మరికొందరికి వంటచేసుకొనుటకు కావలసిన పప్పు బియ్యము నెయ్యి మొదలగు సామగ్రుల నిచ్చుచు, కొందరికి యేకాంతస్థళమున ఆత్మవిచారమునుగురించి వుపన్యాసములొనరింపుచు, మరికొందరు భాగవతులను బంతిబంతిగా కూర్చుండబెట్టి వారు చాలుచాలునని చెప్పువరకు తృప్తిగా సర్వపదార్థములు పరిమారుచు, కొందరికి యెదుటనిలిచి విసనకఱ్ఱలనుచేబూని విసరుచుండును. మరికొందరికి శయనించుటకు కావలసిన మెత్తలు దిండ్లు



సాపలు మొదలగునవి యిచ్చి శయనింపజేయుచు, కొందరికి నిద్ర వచ్చుటకు పరవశత్వము నొందునటుల దేహమంతయు త్తిన్నగాపట్టి నిద్రించునటులచేయుచు, మరికొందరికి వింజామరలనుచేబూని పరమానందపరవశులగునటుల చక్కగావిసరుచు, ఇట్లు సకలభాగవతులను సంతుష్టులుగాజేసి తనభక్తునికి చెడుపేరురాకుండునటుల సకలకార్యంబులు సమర్థింపుచు, వచ్చిన భాగవతులందరు కబీరుదాసు మనయందు మిక్కిలి కృపయుంచి మనవద్దనే యుండి సర్వవిధముల రక్షించెనని తమతమ మనంబులయందు తలంచుచు పరమానందభరితులై సంతోషము జెందియుండిరి. ఈరీతిగా సర్వవ్యాపకుడై మూడహోరాత్రములు వారివారియిష్టానుసారముగా సర్వకార్యములు తానేభరించి అందరికి సంతోషమును గలిగించి అపారముగా ధన కనక వస్త్రాభరణంబులొసగి వారి మనస్సును రంజింపజేసి వందనపూర్వకముగా వారివారినివాసములకు సాగనంపి భగవంతుడంతర్హితుండయ్యెను. అనంతరము యీర్ష్యాపరులైన దుర్జనులీ విచిత్రములనుగని గడగడవణకుచు మనము కబీరుదాసు మహాత్మ్యము తెలియక మహాపరాధము చేసినవారై అపచారపరులైతిమి, ఈభాగవతాపచారము తీర్చుకోక మనము కడతేరజాలమని దిగులొంది వారి చరణంబుల కెరగి ఓస్వామీ మేము మీకొనరించిన అపచారంబులు క్షమింపవలెనని వేడుకొనంగా కబీరుదాసుకు వారియందు కరుణగలిగి వారికి తారకమంత్రముపదేశించి భక్తిమార్గమును దెలిపి సదా భగవన్నామోచ్చారణపరులుగాజేసి వారిని శిష్యులుగా యంగీకరించిరి. అనంతరము కబీరుదాసు శ్రీరామమూర్తికి సమము వారిభక్తులకు సమము యీజగత్తున లేదని సదా భార్యాపుత్రులతో గూడి శ్రీహరిని భజింపుచుండెను.

శ్రీసీతాపతయేనమః.

# తులసీవాణి చరిత్రము.

కబీరుదాసు గృహస్థాశ్రమధర్మమందు భార్యా పుత్రాదులతోఁ గూడియుండి సంసారసహితుఁడై యుండియు జ్ఞాన భక్తి వైరాగ్యాది సకలసద్గుణంబులుగలిగి శాంతశమదమాదులతోఁగూడినవాఁడై సదా హరిభక్తియుతుఁడై యుండును. ఇట్లుండఁగా నొకదినమందు పదివేల సాధువులు ద్వాదశోర్ధ్వపుండ్రములుదాల్చి తులసీనలినాక్షమాలికలను ధరించి కరతాళములతోఁ భగవన్నామము లార్తితోఁ బాడుచు జయజయశబ్దములతోఁ సకలదివ్యక్షేత్రములను సేవించి కాశీపట్టణమునకేతెంచి అచ్చటవాసముచేయుచున్న ప్రజలనుజూచి ఓజనులారా ఈపట్టణమందు మాకందరకు అన్నము పెట్టి సన్మానించు ప్రభువులున్నారాయని విచారింపఁగా అచట వసింపుచున్న కొందరు దుర్మార్గులు సాధువులనుజూచి ఓసాధులారా ఈపట్టణమందు కబీరని ప్రసిద్ధివహించిన సాధుజనాగ్రేసరుఁడు నివసించియున్నాఁడు, వారిగృహంబునకు వేంచేసినట్లయితే మీకందరికి అన్నముపెట్టి పూజించునని చెప్పిరి. వారి పరిహాసపు వచనములను భాగవతులు నిజమనియెంచి కబీరుదాసు గృహమునకువచ్చి జయ సీతారాంయని అందరు యేకకంఠముగా శబ్దించిరి. ఈశబ్దమును వినిన కబీరుదాసు పరమానందభరితుఁడై బైటికివచ్చి సాధువుల పాదపద్మములకు దీర్ఘదండ ప్రణామంబులాచరించి లేచి అంజలీహస్తుఁడై నిలిచియుండెను. అంత సాధువులు భక్తాగ్రేసరా మేమందరు తీర్థయాత్రచేయుచు ఈపట్టణపు వీధియందు వచ్చి ఇచట సాధువులను సన్మానించు దాతలున్నారాయని విచారించుచుండగా కొందరు మీరిచ్చట మమ్ము సత్కరించి పంపుదురని చెప్పినందున మేము మీగృహమునకువచ్చితిమని చెప్పిరి. ఆసాధువులవచనములనువిని కబీరుదాసు వారందరిని తనగృహంబున



వసింపజేసి ఆక్షణమే అంగడివీధికిజని తులసీదాసను వర్తకునిసమీపమునకువచ్చి అయ్యా యీదినము నాయింటికి సాధుజనులనేకులు వచ్చియున్నారు, వారికి కావలసిన సామగ్రులు తామొసంగినయెడల వాటిక్రయమును నేనొకటిరెండుదినములలో యిచ్చివేసెదనని చెప్పెను. ఆవచనములనువిన్న వర్తకుడు ఓకబీరు నీభార్యను నేటిరాత్రికి నావద్దకు భోగదానముగా పంపితివేని నీగృహంబునకు వచ్చియున్న సాధులందరికిన్ని కొరతలేక సామగ్రులిచ్చుచున్నానని వచించెను. ఆవచనములనువిని కబీరు వాని యిష్టప్రకారము సమ్మతించి సాధువులకు కావలసిన సామగ్రులను కొరతపడక తీసుకొని గృహంబునకుతెచ్చి వారికి తృప్తిగానొసఁగి వారిమనసును సంతోషపరచి ఓసాధులారా భగవంతుని నిర్హేతుకకృపాకటాక్షముచే మిమ్ము సేవింపగలిగెను. నాజన్మము సాఫల్యంబై నాభాగ్యం బీడేరెనని బహువిధంబుల స్తోత్రంబులుచేసి వారిని వలగొనివచ్చి దండముసమర్పించి వారిచే సెలవుగైకొని వర్తకుఁడైన తులసీదాసుకు వాక్కిచ్చినప్రకారము జరుపవలయుననియెంచి శీఘ్రముగా తన భార్యను చేరబిలిచి చెప్పుచున్నాఁడు. ఓవనితా చేయరానటువంటికార్యము నేటిదినము చేయవలసివచ్చెను. అదేమనగా తులసీదాసనువర్తకునికి నేటిదినము రాత్రికి నిన్ను విక్రయించినానుగనుక నీవు వానియొక్క యిష్టప్రకారము యేకొరతలేక సంతుష్టిపరచి రావలెను. అతఁడు సాధుజనుల పోషణకై కావలసినంతవరకు సామగ్రుల నిచ్చియున్నాఁడు గనుక అట్టి మహోపకారమొనరించినవానికి పాపమని సంకోచింపక నీవీ రాత్రి వానియిష్టమును తీర్చి నావాక్కును పరిపాలించిరావలెనని చెప్పెను. అందునకామె సమ్మతించగా కబీరుదాసు భార్యను వెంటబెట్టుకొని వర్తకునిగృహమునకువచ్చెను. ఆతరుణమందు వర్తకుడు దివ్యమగు హంసతూలికాతల్పమునుశృంగారించి వాటియందు మంచి

మృదువైన మెత్తనువేసి వాటిమీద మహమ్మలునుపరచి అందుపై
మల్లెపువ్వుల నెరపి పన్నీరుచల్లి చందన కుసుమ తాంబూల పరిమళ
ద్రవ్యములను తట్టలయందు సిద్ధపరచి, మధురములయిన మామిడి
పనస అరటిమొదలగు ఫలవర్గములను, లడ్డు బూంది ఫేణి బర్ఫి లాడు
మొదలగు మిఠాయివర్గములను, మనోరంజితమైన కాస్మీర్ బనారస్
బొంబాయ్ కలకత్తా మొదలైనదేశముల శాల్వులు కోకలు రవికెలు
నవరత్నఖచితములగు సమస్తాభరణములు తట్టలయందుంచి గృహం
బంతయు దేదీప్యమానముగా దీపములువెలిగించి కబీరుదాసు భార్య
రాకకు నిరీక్షించుచుండగా కబీరుదాసు భార్యాసమేతముగా వచ్చి
వర్తకునివశమున భార్యనువిడిచి తనగృహంబునకువచ్చిచేరెను. తద
నంతరమా సాధ్వి వర్తకునిచెంతకేతెంచి మహానుభావా నీవీదినము
భాగవతులను సంతుష్టిపరచి వారి క్షుద్బాధ తీర్చినావు, అట్టిమహో
పకారమొనరించి నాభర్తకోరికప్రకారము సకలసామగ్రులనొసంగి
సంరక్షించినందున మాకు మహాసుకృతముసిద్ధించినది, తమకు విష
యాపేక్ష గలిగివుండుటవలన నేనిచ్చటికి వచ్చినాను, ఇక తమయిష్ట
మును పూర్తిపరచుకొనవచ్చునని మృదు మధురాలాపము లాడుచు
అతఁడు మోహాక్రాంతుండగునట్లు కొన్ని పాటలు పాడుచుండఁగా
వర్తకుఁడు కామాతురుఁడై ఆపతివ్రతను సామాన్యస్త్రీగా భావించి
వండు దీపమునుగని ఫలమనిభ్రమిసి దీపముమీదపడి తాను గతించు
రీతిగా కామాంధుడగు వర్తకుఁడు ఆమె నాలింగనము జేసుకొనుటకు
చేరవచ్చి తాకుటకుయత్నించెను. అట్టితరుణమందు కాకుత్సవంశో
ద్భవుడగు శ్రీరామచంద్రుడు ఆవూరు కొత్తవాల్ వేషమునుధరించి
శరచాపములు డాల్ కత్తి మొదలగు సర్వాయుధములను చేబూని
అకస్మాత్తుగా వర్తకునియెదుట నిలిచి ఓరీ నీచుఁడా నీవు స్వల్పసుఖ
మునకాశించి మహాఘోరమైన నరకకూపమునందుబడి అనుభవించు



నటువంటి పాపంబును ఈక్షణమునందు చేయుటకు సర్వసిద్ధుఁడుగా
వున్నావు, ఇట్టిమహాపాతకుఁడుగానున్న నిన్ను నాచేతి శరచాపము
లచే పరిమార్చుచున్నానని వచించెను. అంత వర్తకుఁడు గడగడవణ
కుచు కాళ్లు తడబడ సిగముడి వీడ నోటమాటరాక కొళకొళయని
వ్రేళరుచు నేనపరాధుడనైతిని, నన్ను మన్నింపుడు, మీరడిగిన ధన
మొసంగెదను, ఈసమయమందు నాకుప్రాణదానంబిచ్చి రక్షించు
డని భూమిపైపడి వారిపాదంబులనుగట్టిగాపట్టుకొని బహువిధంబుల
స్తోత్రముచేయదొడంగెను. అంతవరకు వర్తకుఁడు కామాంధకార
మున మునిగియుండినవాడగుటచేత భగవంతుని సేవలభించి దాశ
రథియొక్క పాదకమలంబులు స్పర్శించినమాత్రంబున జ్ఞానముకలిగి
ఆమెయందతనికి మాతృభావము జనించెను. అంత వేషధారియైన
భగవంతుఁడు వర్తకుని జూచి ఒరే తులసీ కబీర్ దాసుభార్య నాకు
భగినియగుచున్నది, కాబట్టి నీవామెకు దండముసమర్పించి అపరాధ
క్షమాపణముచేసికొనుమని వానికినుబుద్ధులుగరపెను. అంత వర్త
కుఁడా వాక్యములను శిరసావహించి అమ్మా నేను పాపకృత్యమని తల
చక చేయుటకుద్యమించిన నీచకృత్యమును క్షమించి నన్ను పుత్రునిగా
భావించి మన్నించవలయును. ఇఁక నేనిట్టి పాపకార్యములయందు
ప్రవేశింపనని వచించుచు తామ్రము తమగృహంబునకు వెడలిపోవచ్చు
నని మిక్కిలి వేడుకొనుచుండగా, భగవంతుడు వర్తకుని దీనాలాప
ములనువిని కరుణగలిగి నీవిదిమొదలు దుష్టకార్యంబు లాచరింపక
ధనమదముచేత భగవంతుని మరచిపోక మిక్కిలిజాగ్రతగలిగి పాప
కార్యములందుప్రవేశింపక సన్మార్గప్రవర్తకుఁడై వర్తింపుచుండుమని
సుబుద్ధులుగరపి నీవీక్షణమే ఆమెను వెంటబెట్టుకొనిపోయి గృహం
బునందువిడిచి కబీరుదాసు విషయంబున చేసిన మహాపరాధమును
క్షమాపణము చేసికొనుమని యాజ్ఞాపించి కృపాకరుఁడైన భగవం

తుడు వారికి కనుబడక మఱిగిపోయెను. అంత వర్తకుఁడు తక్షణమే భగవంతుడు నియమించినప్రకారము ఆపతివ్రతాతిలకమును వెంట దోడుకొనిపోయి కబీరుదాసుగృహంబునవిడిచి తననిలవరము జేరెను. అంత కబీరు తనభార్యతిరిగివచ్చియుండుటనుగని ఓవనితా నీవు వర్తకుని యిష్టప్రకారము వర్తింపక మిక్కిలిశీఘ్రముగా మరలివచ్చినట్లు తోఁచబడుచున్నదనఁగా ఆవచనంబులను విని ఆమె యిట్లనిచెప్పుటకుపక్రమించెను. ఓనాథా తమ చిత్తానుసారము నేను నడుచుకొనుటకు సిద్ధముగానుండుసమయమందు గ్రామాధిపతియగు కొత్తవాలు వచ్చి వర్తకునిశిక్షించి నన్ను వెంటనేగృహంబునందు విడిచివచ్చునట్లు వుత్తరవుచేయగా వర్తకుడాప్రకారమే నన్నుతోడుకొనివచ్చి విడిచిపోయెనని చెప్పెను. ఆవచనములను విని కబీరు కోపమును జెంది వెంటనే కొత్తవాలుగృహంబునకు వచ్చి కొత్తవాలు కొత్తవాలని పిలువగా అతండదరిపడిలేచి తలుపుతెఱచి వెలుపలికి వచ్చి కబీరుదాసుకు వందనముచేసి యెదుటనిలిచి విశేషమేమనియడిగెను. అంత కబీరు ఓకొత్తవాలా నేను తులసివర్తకునికి నాభార్యను భోగదానమునకై విడిచివచ్చియుండగా నీవేల వర్తకుని గృహంబునకేగి యతనిని తొందరపరచినావు. ఈదినమతఁడు పదివేలమందికి అన్నముంచినందున అతనికోరికప్రకారము నాభార్యను వర్తకునిగృహంబున విడిచివచ్చినాను. నాయిష్టప్రకారము సమ్మతించి నాభార్యతోఁగూడ వర్తకుడు యేకాంతముగానున్నస్థలంబునకుపోయి వర్తకుని బెదరించి శిక్షించినావని మిక్కిలికోపించెను. ఆవచనములను కొత్తవాలువిని భయభ్రాంతులుగొన్నవాఁడై మరుమాటవచింపక కొంత తడవు వూరకుండి ఓభాగవతాగ్రగణ్యా ఈశ్వరుని సాక్షిగా నేనా వర్తకుని చూచినదేలేదు, మీరుచెప్పినసంగతులేమిన్ని నాకు తెలియదు. అట్టిసంగతియందు నేనుప్రవేశించినయెడల నావుభయనేత్రంబులు కనుబడకపోవును. తాము శ్రీహరి భక్తులుగాన తమవద్ద నేనసత్యము చెప్పినట్లయితే రౌరవాదినరకము బొందుదునని ప్రమాణముచేయఁగా కబీరుదాసు తనలో నాలోచించి యిట్టికార్యములు చేసినవాడు శ్రీరామమూర్తియనివూహించి భక్తజనులరక్షణార్థము సర్వేశ్వరుఁడు యిట్టిమాయ గావించినాఁడని మిక్కిలి సంతోషము జెంది తక్షణమే తులసీవర్తకునిగృహముప్రవేసించి ఓవర్తకుఁడా నీ భాగ్యమేభాగ్యము శ్రీరామమూర్తికి నీయందువిశేషకటాక్షముగలిగి నీకు తన యద్భుతమైనసేవనొసఁగెను. అతఁడు బ్రహ్మారుద్రాదులకు నలభ్యుఁడు, యాగ యోగాదు లాచరించినవారికిఁగూడ వారి సేవ లభించుట మిక్కిలి దుర్లభము. అట్టి పురుషోత్తముని సేవనాయాసముగా సేవించితివి. నీవనేకజన్మజన్మాంతరములయందు చేసినపుణ్యఫలము నీకీదినము లభ్యమైనది. అని పరమానందముతో విన్నవించఁగా తులసివర్తకుఁడు విని భక్తాగ్రేసరుని పాదములను పట్టుకొని ఓపుణ్యపురుషా దాసుఁడు మహాపాపిని, వ్యభిచారదోషగ్రస్తుఁడై నరకకూపమునబడుటకు సిద్ధుడుగానున్న నన్ను కృపాకటాక్షముంచి రక్షించితిరి. విషమును భక్షించి ప్రాణమును రక్షించుకొన్నరీతిగా మహా పాపాత్ముఁడైన నాకు పరమపురుషుని దర్శనము లభించినది. చత్రాయిని వీపున గట్టుకొని సముద్రమునందు యీఁతకొట్టినవాని చందమున తమ కృపాకటాక్షవీక్షణముచే కడతేఱితినని మిక్కిలి పరితాపపడుచు శ్రీహరి భజనయందు ప్రీతిగలవాఁడై సదా భాగవతులతోఁగూడి శ్రీహరిని భజింపుచు తనపాపంబులను పోగొట్టుకొని భగవద్భక్త గోష్ఠియందు యీడుపడుచుండెను. అంత కబీరుదాసు తన గృహంబునకేతెంచి మిక్కిలిప్రీతితో శ్రీరామచంద్రుని భజింపుచు భార్యాపుత్రసమేతముగా పరమానందముజెందియుండెను.

శ్రీకోదండరామాయనమః.

# కమాల్ దాసుచరిత్రము.

కాశీపట్టణమునం దొకదినము భాగవతు లనేకులు గుమిగూడి తీర్థయాత్రచేసుకొని జామురాత్రిసమయమందు కబీరుదాసుగృహంబునకువచ్చిచేరిరి. ఆభక్తసమూహమును భక్తాగ్రగణ్యుఁడు సేవించి మహాసంతోషముజెంది వారిని విశ్రమింపజేసి మధురవాక్యములచే కుశలప్రశ్నములు చేయుచు కొంతసేపు ముచ్చటించి పిమ్మట కబీరుదాసు భార్యచెంతకేతెంచి యేకాంతముగా ఓ వనితా యీదినము మనగృహంబునకు విలక్షణమైన సాధుసజ్జను లనేకులేతెంచి విశ్రమించియున్నారు. నేను వారికి ప్రసాదముంచి సత్కరించి పంపవలయునని అపేక్షకొనియున్నానని వచింపఁగా, ఆసతి నాథా మనయింటయుండు భాండములన్ని శూన్యముగా యుంటున్నది, కించిత్తైనను అన్నముకూడా లేదు, ఇరుగుపొరుగువారిని అప్పుగాయివ్వమని అడుగుతామనియెంచినయెడల మనకు అప్పిచ్చువారెవరు లేరు, ఏమిచేయవచ్చును, కోమిటివాడు చేతిలో కాసివ్వక సామగ్రులొసంగువాడు కాడు. తత్కాలమందు మనచేతిలో కాసులేనందున దొంగలించైనా తీసుకొనిరండి, వాటిమూలముగానైనా సాధువులను సత్కరించిపంపవచ్చును, మనము సాధుజనులనిమిత్తము తస్కరించి తెచ్చుటచేత మనకు పాపము సంభవింపదు. మీరు కోమిటివాని గృహంబు ప్రవేశించి పప్పు బియ్యము నెయ్యి మొదలగుసామగ్రులను తక్కువపడక సంగ్రహించి తెచ్చినయెడల దాసురాలు తక్షణమే పచనముగావించి సాధుజనులను తృప్తిపరచి పంపెదనని వచింపఁగా కబీరువిని యిది తత్కాలమునకు తగిన వుపాయమని సమ్మతించి తన కొమారుడైన కమాలును వెంటబెట్టుకొని తస్కరించి తెచ్చుటకు కావలసిన పరికరములను కరంబుననిడికొని ఒక గొప్పదుకాణమునందు వర్తకుఁడు



నిద్రాపరవశుఁడై యుండుటనుగని తమ ఆయుధములచే గోడయందు ద్వారముచేసి కబీరు ద్వారమునకు వెలుపలయుండి కమాలునుగని నీవు లోపలికిపోయి మనకుకావలసినవాటిని శీఘ్రముగాయెత్తుకొని వచ్చునట్లాజ్ఞాపించగా తండ్రివాక్యప్రకారము కమాలు లోపలప్రవేశించి ద్రవ్యరాసులను వస్త్రభూషణములమూటలను ప్రక్కొకచోటునందుండుటనుగని వీటితో మనకేమిప్రయోజనమని వాటినివిడిచి మరియొకప్రక్కకు పోయిచూడగా అచ్చట పప్పు బియ్యము మొదలగుసామగ్రులుండుటనుగని తమగృహంబునందు విశ్రమించియున్న సాధువులకు యెంతకావలెనో అంతవరకు సంగ్రహించుకొని తండ్రిచేతికందిచ్చుచుండగా సకలసామగ్రులను కబీరుమూటలుగట్టి తనలో కొంతయోచించి కుమారా మనమీసామగ్రులను చేకొని మనగృహంబునకు పోయినపిమ్మట మనము చేసియుంచిన ద్వారమునందు చోరులెవరైనా ప్రవేశించి సకలవస్త్రాభరణధనధాన్యములను కొల్లబెట్టిచనినయెడల మనకవశ్యము తప్పక పాపముసంభవించును. అందుచేత మన స్వరూపమునకు హానికలుగును. గనుక లోపల కావలికై నిద్రింపుచుండువారిని మేలుకొనునట్లు చేసి మనమతిజాగరూకతతో వేగముగా మనగృహంబునకుబోవుట వుత్తమమని చెప్పగా కమాలు తండ్రిమాట శిరసావహించి లోపలికివచ్చి నిద్రించుచుండు అంగడిసొంతగాండ్లను తట్టిలేపి మేమిద్దరుదొంగలు మీయంగడియందుప్రవేశించి సామగ్రులను సంగ్రహించుకొనిపోవుచున్నాముగనుక యికజాగ్రతగలిగి సకలసొత్తులను భద్రపరచుకొండని చెప్పుచు వేగముగా వచ్చి ద్వారమునందు దూరి శిరస్సును వెలుపలికి తెచ్చెను. మిగత దేహము వెలుపలికివచ్చునంతలో లోపలనుండిన వర్తకుడు వేగముగావచ్చి కమాలుయొక్క కాళ్లను పట్టుకొనగా కమాలు నిశ్చేష్టితుఁడై ఓతండ్రీ వర్తకుఁడు నాకాళ్లనుపట్టి లోపలికీడ్చుచున్నాడు.

ఇక నీవు కాలహరణము చేయుచుంటివేని యితరజనులు వచ్చిచేరి మనలను దొంగలనిభావించి పరిహాసముచేతురు. ఇప్రుడు మనగృహంబున విశ్రమించియున్న భాగవతులకు భక్ష్యభోజ్యాన్నములుపరిమారి సంతుష్టిపరచిపంపవలయును. గాన తాము నాశిరంబును తెగగోసి తీసుకొని జనుడు, శిరస్సుమాత్రము మరుగుపరచితివేని పురజనులు ఫలానివాడని కనిపెట్టజాలరు, ఈ ప్రకృతిసంబంధమగు మాయచే సంభవించునట్టి దుఃఖమునువిడనాడి భాగవతులనిమిత్తము నాశిరంబును ఖండించి తీసుకొనిపోవచ్చును. ఈదేహము క్షణభంగురమని యెంచి తృణీకరముతో నాశిరమును తెగగొట్టుము. నీవట్లు తృణీకరించక నాయందు పుత్రవాత్సల్యతయుంచి విడిచిపెట్టితే సత్యహాని కలుగును. ఇదిగాక మనము చోరులని భాగవతు లెఱింగినయెడల మనలను వేషధారులనితలంచి తొలగిపోదురుగాన నీవీతరుణమందు యీమాయాప్రపంచమును తృణప్రాయముగా నెంచి తామసించక కార్యసాఫల్యముచేసుకొని శీఘ్రముగా గృహంబునకు వెళ్లిపొమ్మని కమాలు వచింపఁగా విని కబీరు తుపాకి కడుపున ఫిరంగి పుట్టినట్లు మనకుద్భవించిన యీకమాలు మిక్కిలివైరాగ్యపరుడై మెఱుపువలె చలింపకయున్నాడని మిక్కిలిసంతోషమునుజెంది కత్తితో పుత్రుని శిరస్సును తెగగోసి భద్రపరచి సామగ్రులనుచేకొని తనగృహంబునకువచ్చి అచ్చట జరిగిన సకలసంగతులను భార్యకుతెలిపి తెచ్చిన సామగ్రులను పుత్రుని శిరస్సును ఆమెచేతి కొసంగెను. ఆసతి తన పుత్రుని శిరమునుగని ఓవత్సా నీవు సాధువులనిమిత్తము నీశరీరము పెంచి యుంచితివో, నీ దృఢవైరాగ్య సుగుణంబులను నేనెచ్చటగందునని విలపించి ఓపుత్రకా భగవంతుని పలువిధములభజించి నీ శిరంబును సాధువులనిమిత్తము భగవదర్పణముచేసి మనవంశమును పుద్ధరించితివి. నీవీప్రపంచమందు నాగర్భమునం దుద్భవించి భగవద్భక్తియం దీడుపడి సకలతత్వార్థంబులెఱింగి ముక్తిజెందితివోయని తన మనంబున లేశంబైనా పుత్రవాంఛనుంచక భగవదర్పణమైనాడని సంతోషముజెంది ఆశిరంబును నొకమూలయందు దాచియుంచెను. అనంతరము భగవద్గుణానుభవముచేయుచు పంచభక్ష్య పరమాన్నములను పాకముచేసి భాగవతులను బంతిబంతిగా కూర్చుండబెట్టి సమస్త పదార్థములను పరిమారి భుజింపచేసి చందన కుసుమ తాంబూలాదులొసఁగి భాగవతులను సంతుష్టిగావింపగా కబీరుదాసు మిక్కిలిసంతోషముతో నాకీదినముసుదినంబై భాగవతులసేవలభించి నాభాగ్యంబీడేరి మేముకృతార్థులైతిమని ఆసాధువులతోగూడి సంభాషింపుచు వారియొక్క సేవలో యీడుపడుచుండెను. అంతలో అరుణోదయమైనందున సాధువులందరులేచి శ్రీహరినామస్మరణచేయుచు స్నానమునకు వెడలిరి.

ఇట్లుండఁగా వర్తకుడు తనగృహంబున దొంగలుప్రవేశించినారని విశేషముగా కూతలువేయుచుండగా యిరుగుపొరుగున నున్న జనులందరుగుంపులుగూడి యేకకాలంబున వర్తకునిగృహంబులోనికి ప్రవేశించి శిరములేనిదేహమునుచూచి ఫలానివాడనిచెప్పటకు వల్లపడక దొంగయొక్క శిరసును వేరొకదొంగ ఖండించి తీసుకొనిపోయెనుకాబట్టి మనము వ్యసనపడవలసినపనిలేదు. నీవు ద్రవ్యమును పెట్టుకొని వొంటరిగా పడుకొనియుండుట తగదు, ఆద్రవ్యమూలముగా గొప్పవుపద్రవములు సంభవించునుగాన ద్రవ్యమే సకలానర్థములకు మూలకారణంబైయుండుటయేగాక ధనమే తన్ను చంపుటకు సిద్ధముగాయున్నది. అయితే యిచ్చటికివచ్చిన దొంగలు ధనమును కొంచెమైనను కొనిపోక సామగ్రులుమాత్రము యెత్తుకొనిపోయినారుగాన వారు మంచిసుగుణములుగల సాధువులుగా యుందురు, నీకు వారిమూలమున సౌఖ్యము పొందుటకు హేతువైనదని

చెప్పి వారివారిగృహంబులకుజనిరి. అనంతరము వర్తకుఁడు రాజు సముఖమునకేతెంచి రాత్రి తన గృహంబున జరిగిన సవిస్తారమును చెప్పి దొంగయొక్కశిరస్సును చూపించగా రాజు వీటిని చక్కగా విచారింపక తస్కరునియొక్క దేహమును శూలమునందు గ్రుచ్చి మూడుదారులు గలచోట నాటియుంచుడని సేవకులకాజ్ఞాపించెను. అంత సేవకులు రాజాజ్ఞాపించినప్రకారము దొంగయొక్కశరీరమును మూడు దారులు గలియునటువంటి స్థలమునందు శూలమును నాటి దానియందు ఆశరీరమును గ్రుచ్చియుంచి తస్కరులకు విధింపబడు శిక్ష యిదియని అచ్చటవచ్చియుండిన జనులందరికి వారు తెలిపిరి.

అంత కబీరుదాసుగృహంబునకువచ్చిన సాధువులందరు గంగాస్నానము చేసికొని ద్వాదశోర్ధ్వపుండ్రంబులుంచుకొని తులసీ నలినాక్షమాలెలను ధరించి కబీరుదాసువద్ద సెలవుపుచ్చుకొని శ్రీహరి భజనచేయుచు పోవుచుండుతరుణమందు కబీరుదాసుభార్యయేతెంచి ఓస్వాములారా తాము మాయందు కరుణాకటాక్షముంచవలయును. మీవంటిమహాత్ములను మరల మేమెప్పుడు సేవింపగలమోయని భక్తిపూర్వకముగా దీర్ఘదండము సమర్పించి సతిపురుషులిద్దరు సాధువులను దారివిడిచిపోవుటకువచ్చుచుండిరి. అప్పుడాసాధువులు త్రిసంధిమార్గముగా వచ్చుచుండి శూలమునందు శిరసులేని మొండెమును జూచి యిదేమి వింతయని కొంతతడవచ్చట నిలిచియుండిరి. ఆతరుణమందు మొండెముగానున్న శరీరము కరములు రెండున్ను చేర్చి సాధువులకు దండముసమర్పించగా ఆవింతనుజూచిన సాధువులాశ్చర్యముజెంది యింతవరకీ ప్రేతశరీరము ప్రాణముంచుకొనియుండుటకేమికారణమని యోచింపుచుండఁగా కబీరుదాసు ఓస్వాములారా యీప్రపంచమందలి భక్తులలో యితఁడొకసుగుణవంతుడుగా నుండుటచేత తమకు దండముసమర్పించుటకై యింతవరకు తనప్రేతశరీరమందు ప్రాణముంచుకొనియుండెను. ఇప్పుడతని సంకల్పమ్ము నెరవేరగానే తాను కృతార్థుడైనట్లుయెంచి పరమానందముజెందియున్నాడని వచింపగా విని సాధువులానందముజెందినవారై భక్తాగ్రగణ్యా యీదొంగ సవిస్తారమును మేమందరు వినునటుల వివరించిచెప్పవలయునని ప్రార్థించగా కబీరుదాసువిని రాత్రి జరిగిన సంగతులాద్యంతము వారికి తెలియచెప్పెను. సాధువులావర్తమానము లాలకించి మేము మిమ్ము ప్రసాదముంచుఁడని కోరకయుండియు మాకొరకై పుత్తమగుణములుగల నీపుత్రుని యేలచంపితివని వచింపుచు కబీరుదాసునుచూచి నీసుపుత్రునియొక్క శిరసును శీఘ్రముగా తెమ్మని యాజ్ఞాపించిరి. అంత కబీరుభార్య వారివచనములనువిని తనగృహంబునకువచ్చి దాచియుంచిన పుత్రుని శిరంబును తెచ్చి చూపెను. సాధువులాశిరస్సును జూచి సంతోషముజెంది కమాల్ దాసు శరీరమును శూలమునందుండి విడదీసి భూమియందుంచి శిరస్సును శరీరమందు చేర్చగానే కమాలు ప్రాణముగలవాడై లేచి సాధుజనులకు సాష్టాంగదండము సమర్పించి భక్తిశ్రద్ధలతో అంజలీహస్తుడై నిలిచియుండెను. అంత సాధువులు కమాలుయొక్క సద్గుణంబులకు మెచ్చి పలువిధముల ఆశీర్వాదములుచేసి భాగవతులు వెడలిపోయిరి. అంత కాశీక్షేత్రమందు వసింపుచున్న జనులందరు కబీరు కమాలును పలువిధముల కొనియాడుచుండిరి. అనంతరము కబీరు తనపుత్రుని పిలుచుకొని భార్యసహితముగా గృహంబునకేతెంచి సదా శ్రీరామనామమును ధ్యానింపుచుండెను.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# కబీరుదాసుభార్య చరిత్రము.

ఒకదినము రాత్రియందు సాధుజనులు యాత్రచేయుచు కాశీ పట్టణమునకువచ్చి కబీరుదాసుగృహంబును విచారించుకొని కబీరు

యింటికివచ్చిచేరగా ఆసాధువులను గని దంపతులు ప్రదక్షిణముగా
వచ్చి దీర్ఘదండప్రణామంబులాచరించి వుచితస్థలంబునందు విశ్రమిం
పజేసి వారి పాదకమలములకు అర్ఘ్యపాద్యాచమనంబు లొనరించి
కబీరు యేకాంతముగా భార్యనుగని మనము వీరికి ప్రసాదంబుంచి
ఆదరించిపంపుట వుచితంబనిచెప్పెను. ఆమె భర్తవచనములాలకించి
మిక్కిలిచింతతో స్వామీ నేనేమిచేయుదును గృహంబునందు సకల
వస్తువులు పూజ్యముగానున్నది. మనమందరు యీదినము వుపవాస
ముతో కష్టపడుచున్నామే, మనకు యిరుగుపొరుగువారు అప్పుగా
యివ్వమని అడిగినను యెవరు యిచ్చెడువారుగా కనబడలేదే యని
చింతింపుచు, అయినను బజారువీధికిజని వర్తకుని అడిగివచ్చుచున్నా
నని శ్రీరామనామమును ధ్యానింపుచు అంగడివీధికిజనెను. అట్టితరి
అంగళ్లన్నియు మూయబడియుండి వొకయంగడి మాత్రము తెరచి
యుండుటనుగని ఆమె వర్తకునిచెంతకువచ్చి అయ్యా నాగృహంబు
నందు విశేషముగా సాధుసజ్జనులు వచ్చియున్నారు. తాము మా
యందు నమ్మకముంచి కొంతవుపకారము చేయవలయును. అదియే
ననగా సాధువులకు కావలసిన సామగ్రులు యిచ్చితిరేని వాటిక్రయ
మును పిమ్మట తెచ్చియిచ్చుచున్నాను యీమాట తప్పను చూడు
మనెను. ఆమెవచనములనువిని వర్తకుడు లోపడనివాడై నీవూరేమి
పేరేమి నీవెచ్చటవసింపుచున్నావని విచారించెను. ఆవచనములను
విని కబీరుదాసుభార్య అయ్యా నేనీపట్టణమందు వసింపుచున్నదా
నను, నాగృహంబునకు సాధువులు వచ్చియుండుటచేత నేను సామ
గ్రులడుగుచున్నానని చెప్పెను. ఆమె మధురవాక్యములను సుందర
వదనారవిందమును వర్తకుడు చూచి కామపరవశుడై మోహము
జెంది ఆవనితనుగని నీవు నామనోరథమును పూర్తిచేసితివేని నీకు
కావలసినంత పప్పు బియ్యము నెయ్యి పిండి మొదలగు సామగ్రులు



ధనకనకవస్త్రభూషణములు అపరిమితముగా యిచ్చుచున్నాను, నీ
విందుకు సమ్మతించనియెడల వచ్చినదారిగానే మరుమాటవచింపక
తిరిగిపోవచ్చుననెను. ఆవనిత వర్తకునివచనములన్నువిని తనమనం
బున కొంతచింతించి వచ్చియున్న సాధువులకు అన్నముంచనిపక్ష
మున మన సత్యమునకు హానిసంభవించునుగాన మనకు కావలసిన
సామగ్రులు మరెచ్చటను చిక్కదు, విధినిషేధంబులు లౌకికులకు
విధింపబడియున్నది, సకలధర్మములనువిడిచి శ్రీహరిచరణములే గతి
యని నమ్మియున్నవారికి యిహలోకంబున ధర్మాధర్మములు యెంచ
వలసినపనిలేదు, శ్రీభరతాళ్వాను తనతల్లియగు కైకేయిదుర్బోధన
లకు లోబడనివాడై శ్రీరఘురాముని పాదారవిందములాశ్రయించి
యుండెను. ప్రహ్లాదుడు త్రిలోకకంటకుడగు తండ్రివాక్యములను
వినకయుండుటచే పరమపురుషుడైన శ్రీమన్నారాయణుని పాదార
విందములుచేరెను. బలిచక్రవర్తి గురువాజ్ఞను తిరస్కరించినందున
మాధవునికటాక్షము పొందెను. గోపికాస్త్రీలు శ్రీకృష్ణమూర్తిపై
ప్రీతియుంచినవారై తల్లిదండ్రులనుసహావిడిచి పరమపదముజెందిరి.
ఇట్టి పూర్వులచరితములనుజ్ఞాపకమునకు తెచ్చుకొని పరంధామునిపై
భారముంచి తనమనంబును స్థిరపరచుకొని వర్తకునిపరికించి అయ్యా
మీరు సకల సామగ్రులను కృపచేసినయెడల భాగవతులు వుపవాస
ముతో శ్రమజెందుచు శయనించకమునుపు వారినివుపచరించవలెను
గాన నేను శీఘ్రంబున సాధువులనారగింపజేసి వారినిసంతుష్టిపరచి
తక్షణమే యిచ్చటికేతెంచి తమమనోరథమును పూర్తిపరచెదనని
విన్నవించెను. ఆవచనములనాలకించి వర్తకుడు ఓకాంతామణీ నీకు
ముందుగా సామగ్రులను యిచ్చినయెడల నీవుగృహంబునకుపోయి
తక్షణమే తిరిగి నాచెంతకువత్తువనుపలుకులను నేనేరీతిగావిశ్వసింప
వచ్చుననగా ఆమె వర్తకుడు నమ్ము[illegible]న సత్యప్రమాణములుచేసి

సామగ్రులను గైకొని గృహంబునకేతెంచెను. అంత నాసాధువులు అమ్మా సామగ్రులను మాకనుగ్రహించినయెడల మేము పచనము చేసికొని భుజించుచున్నామనగా ఆమె వారియిష్టానుసారము సకల సామగ్రులనుసమర్పించెను. తక్షణమే సాధువులు పచనముచేసికొని ప్రీతితోనారగించి ఆనందముజెందియుండిరి. అనంతరమాసాధ్వి తన భర్తను యేకాంతస్థలమునకు వెంటబెట్టుకొనిపోయి ఓ నాథా అడిగేని వర్తకునిసంతుష్టిపరచునట్లు వాగ్దానముచేసి సామగ్రులను చేకొనివచ్చి సాధువులకు సమర్పించితిని. గనుక నేను వర్తకుని మనోరథమును తీర్చవలసినదాననుగాయున్నందున దేవరవారు అనుజ్ఞను కృపచేయుడు నేను పోయివచ్చెదనని విన్నవించెను. ఆవచనములను విని కబీరుదాసు ప్రీతిజెంది వర్తకుడుచేసిన వుపకారము శ్రేయముగా యున్నందున నీవు సాధువులనిమిత్తము అనిత్యమైనశరీరమును విక్రయించివచ్చినందున మిక్కిలిశ్రేయమనియెంచవలసియున్నది. గనుక నీవీయర్థరాత్రియందు వొంటరిగా యెట్లు యీయడుసులో నడిచిపోగలవని పలుకుచు భార్యను [illegible]ంబునందెక్కించుకొనిచని వర్తకుని యంగడివద్ద విడిచి ఓవనితె [illegible]వు సంకోచింపక వర్తకుని వాంఛను తీర్చిరమ్ము. అతడు నీయందలివ్యామోహముచే సాధువుల కుపకృతి చేసినమహానుభావుడు, మనకు సుకృతము లభ్యమయ్యెను, నీవీయుపకారిని సంతోషపరచిరమ్ము, నేను సాధువులకు పరిచర్యజేయుటకు పోవుచున్నానని తనగృహంబునకు మరలెను. అనంతరమాపతివ్రత వర్తకునియంగడిప్రవేశించుతరి అతడా సతీరత్నము యెపుడువచ్చునో యని నిరీక్షించుచున్నందున ఆమెను వీక్షించినదే ఆనందమున్ను జెంది ఓసుశీలా ప్రస్తుతము వర్షముచేత మార్గంబంతయు పంకముతో నిండియుండిన్ని కాళ్లయందు బురదలేక యెట్లునడిచివచ్చితివనియడిగెను. అందునకామె ఓమహాప్రభో నీవు కృపచేసిన వస్తువులచేత సాధువు



లానందముజెంది పాకముచేసికొని తృప్తిగాభుజించి సంతుష్టిపొందిరి ఈసుకృతము నీకులభ్యమయ్యెను తాముచేసినమహోపకారమునకు నేనేమి ప్రత్యుపకారము చేయబోవుచున్నాను, నేను పతివ్రతనుగానున్నందున భర్తయనుమతిబొందివచ్చినాను, నాభర్త నిశీధవేళగా యుండుటచేత దారిచక్కగాలేనందున నన్ను భుజమునందుంచుకొని నాపాదములకుపంకమంటనీయక తెచ్చి నన్నిచటవిడిచిచనిరి. గనుక తమమనోరథమును తక్షణమే పూర్తిపరచుకోవచ్చునని మృదుమధురాలాపములతో విన్నవింపుచుండుటను వర్తకుడువిని మిక్కిలి అనుతాపముతో నేను మానవజన్మమెత్తి సత్కార్యములనాచరించలేదు, ఎనుబదినాలుగులక్షలయోనులయందుపుట్టుచుగిట్టుచు మిగులశ్రేయమైన మనుష్యజన్మము లభ్యముచేసికొంటిని, ఇట్టి మానవశరీరమును బడసి విషయాసక్తిచే కాలముగడుపుచు తులసీవనమును ఛేదించినట్లు అపారపారావారమైన పాపకార్యము[illegible] లోబడినాను, కబీరుదాసు భక్తాగ్రగణ్యులలో మిక్కిలి పుణ్యవంతుడు, అతడు భోగదాసీమునకు తనపత్నిని మనఃపూర్వకముగా తెచ్చివిడిచిపోవుటనుచూడగా యిట్టిచర్యను యెచ్చటను కని విని యెరుగను, పతివ్రతారత్నమగు యీమెను నేను జననిగా భావించవలయునని ఆమెకు దండమ్ముసమర్పించి ఓతల్లీ నాతెలివిలేనితనముచే నేను మీవిషయమున సలిపిన మహాపరాధమును క్షమించి దాసుని భాగవతాగ్రగణ్యుడగు కబీరుదాసుసన్నిధికి వెంటబెట్టుకొనిపోయి వారిచరణాంబుజములయందు నన్నుపడవేసి పురుషాకారివై యుండి యేలుకొనునట్లు చేయవలయునని పలువిధముల వేడుకొనెను. ఆమె వర్తకుని దీనాలాపములను విని అయ్యా శ్రీరామచంద్రుని కరుణారసము నీమీద ప్రసరించినందున నీకు అనుతాపముగలిగెను, అందుచే నీవొనరించిన సర్వపాపములునశించి తరుణోపాయమగు శ్రీహరి చరణాంబుజములయందు

నీకు భక్తిజనించెను, గనుక నీవు భీతినివిడిచియుండుమని కొన్ని హిత
వచనములుపలికి వర్తకుని కబీరుదాసు చెంతకు వెంటబెట్టుకొనివచ్చి
యావద్వృత్తాంతమును భక్తాగ్రేసరునికి విన్నవించెను. అంతనావర్త
కుఁడు భక్తితో వారికి దండప్రణామములొనరించి నిలిచియుండఁగా
కబీరుదాసు వర్తకునియందు కృపగలవారై పరమార్థమును నుపదేశ
ము చేసి నిలవరంబునకు పోవునట్లు అనుజ్ఞనొసఁగగా వర్తకుడు పర
మానందంబు జెంది గృహంబునకేతెంచి భాగవతగోష్ఠితోఁగూడి భగ
వన్నామమును స్మరింపుచు కృతార్థుఁడయ్యెను.

శ్రీరఘురామాయనమః.

# తత్త్వాడు జీవుడను వారి చరిత్రము.

ఒకకాలంబున జ్ఞానదేవులు నామదేవులు సకల దివ్యక్షేత్రము
లను సేవింపుచు కాశీపురమునకేతెంచి కబీరుదాసును వీక్షించి వంద
నోపచారములనుచేసికొని ఆనందమును జెందినవారై కుశలప్రశ్నలు
చేసికొనుచు నామదేవులు కబీరుదాసును పరికించి యిట్లువచించిరి.
మేము సకలదివ్యక్షేత్రములనుయాత్రచేయుచువచ్చుచుండఁగా మా
భాగ్యవశమున దాసులము దేవరవారిసేవ లభింపఁజేసుకొని కృతార్థు
లైతిమనికొనియాడుచు యేకనిష్ఠతో శ్రీహరికల్యాణాతిశయములను
పాడుచునాడుచు పరమానందము జెందియుండిరి. ఇట్లుకొంతకాలము
సుఖముగాయుండి నామదేవు శ్రీపండరికిపోవలెనను భ్రాంతితో కబీరు
దాసును పండరీక్షేత్రమునకేతెంచి పాండురంగని సేవించివచ్చుటకు
ప్రీతితోఁ పిలువఁగా కబీరుదాసు వారిప్రార్థనలకంగీకరించి శ్రీపాండు
రంగనిసేవించుటకు పండరికి వచ్చుచున్నాననని విన్నవించిరి. అనంత
రము జ్ఞానదేవులు నామదేవులు కబీరుదాసువద్ద అనుజ్ఞనుపొంది తీర్థ
యాత్రచేయుచుండిరి. కొంతకాలమునకుపిమ్మట కబీరుదాసు శ్రీపం



డరీక్షేత్రమునకు ప్రయాణమై వచ్చి శ్రీపాండురంగని ప్రీతితో సేవించి
జ్ఞానదేవు నామదేవు నివర్తినాథులు మొదలుగాగల భాగవతోత్తము
లను మిక్కిలి ప్రేమతో సేవించి కొంతకాలమచ్చటనివసించి భాగవ
తుల యాజ్ఞవడసి దర్భశయనమును సేవించిరావలెనను తలంపును
గొన్నవారై మార్గమందున్న పుణ్యతీర్థక్షేత్రములను సేవింపుచు శ్రీ
హరి గుణానుభవములను పాడుచు పోవుచుండెను. ఇట్లు పోవుచుం
డఁగా దారియందొకపట్టణమునువీక్షించి అచ్చటబసచేసి అఖిలజనం
బులు విని సంతోషించునటుల భగవన్నామసంకీర్తనములను పాడు
చు జనులకు ఆనందము గలుగచేయుచుండినందున ఆలకించుచుండిన
పురజనులలో తత్త్వాడు జీవుడను బ్రాహ్మణులిద్దరు పరమానందము
జెంది కబీరుదాసును గురువుగాభావించి వారిని ప్రదక్షిణముగాచుట్టి
వచ్చి దండప్రణామములొనరించి భయభక్తులతో నిలిచియుండగా
కబీరుదాసు బ్రాహ్మణులిద్దరు పరిశుద్ధస్వభావలక్షణములుగలవారని
భావించి వారిని దగ్గరకిరావించి వారి మనోభీష్టంబులెఱిఁగి మిక్కిలి
ప్రీతితో వారికి తారకమంత్రమును కృపజేసిరి. వారామంత్రోపదే
శమును లభ్యముచేసుకొని ఆచార్యునకు సాష్టాంగదండప్రణామము
లొనరించి వారివద్ద అనుజ్ఞనుపొంది తమ గృహంబునకు వచ్చి సర్వ
కాలంబులయందును శ్రీహరిని స్మరింపుచుండిరి. అనంతరము కబీరు
దాసు అచ్చటినుండిప్రయాణమై రామేశ్వరమునకువచ్చి సేతువును
సేవించుకొని దర్భశయనుని ప్రీతితో సేవించి పరమానందభరితులై
అచ్చటినుండి ప్రయాణమై వారణాశికి వచ్చిచేరి సుఖముగానుండిరి.

ఇట్లుండగా తత్త్వాడు జీవుడను బ్రాహ్మణులిద్దరిని బంధుమిత్రా
దులు యితరబ్రాహ్మణులు పరికించి మీరు తురుష్కునివద్ద నుపదేశ
మునుబొందినారనినిందింపుచు మీకు బ్రాహ్మణత్వముచెడెను, అను
ష్ఠానహీనులైతిరి మిమ్మును కులంబునందు చేర్చమని పలువిధముల

దూషింపుచు వారిని కులభ్రష్టులనుగాజేసిరి. ఇట్టి క్రూరమైనశిక్షను అపారముగైనశ్రమలను జెందియుండియు తమ యాచార్యుని చరణాంబుజములను సదాధ్యానింపుచు వారిచరణములేగత్యంతరమనినమ్మియుండిరి. ఇట్లు బ్రాహ్మణులిద్దరు కాలము గడుపుచుండగా వకని పుత్రుడు యుక్తవయస్సుగలవాడయ్యెను, మరొకనిపుత్రిక యవ్వన దశకు వచ్చియుండుటచే చిన్నదానికిన్ని చిన్నవానికిన్ని వివాహము చేయుటకు చిన్నపాపకు వరుడున్ను చిన్నవానికి కన్యకయున్ను లభించనందున తమబంధుమిత్రాదులను విచారింపగా వారు మీరు కులభ్రష్టులుగాయుండుటచే మాతోగూడియుండుటకు వీలుపడదని నీళ్లునిప్పివ్వక గ్రామకట్టుబాడుచేసిరి. ఇట్లుండగా తత్వ్వాడు జీవుడు కాశీపురికివచ్చి ఆచార్యులగృహంబుజేరి దండప్రణామంబులొనరించి తమగ్రామమందు తమకుసంభవించియున్న శ్రమలను సాంగోపాంగముగా విన్నవించుకొనగా కబీరుదాసు వారివచనములనువిని యిట్లనిరి. మీరు నన్నాశ్రయించి నావద్ద వుపదేశమునుబొందితిరిగాన మీకిట్టి కష్టములు సంభవించినవి. అయినను మీరిద్దరు సంబంధములు చేసికొంటిరేని మీరు తప్పక పునరావృత్తిరహితమైనపరమపదమును జెందుదురని ఆనతిచ్చిరి. అనంతరము బ్రాహ్మణులిద్దరు ఆచార్యుండతిప్రీతితో వినిపించిన విశేషములనుగ్రహించి సాష్టాంగదండప్రణామములుసమర్పించి తమ యాజ్ఞానుసారమువర్తించుచున్నామని తమ పురంబునకు వచ్చిచేరి వివాహమునకు లగ్నమును యేర్పాటుచేసికొని సామగ్రులనాయత్తపరచి పుత్రునికుపనయనముచేయించి మరుదినము వివాహముజరుపుటకుయత్నించియుండిరి. ఆసన్నాహములను ఆగ్రామమందు వాసముచేయుచున్న విప్రులువీక్షించి వారిచెంతకు వచ్చి బంధువులు లేక వివాహ మేరీతిగాచేయబోయెదరనివిచారించిరి. అందుకు బ్రాహ్మణులిద్దరు పలికినదేమనగా వధూవరులు మాగృహ



మునందే వున్నారు, గనుక మేమొకరిదాక్షిణ్యమునకెదురుచూడక వివాహముచేయుటకు ప్రయత్నించియున్నవారము. పశుపక్షులరీతిని నటింపుచున్న మాకు జాతినీతులతో పనిలేదని చెప్పగా విప్రపుంగవులు వారివచనములనాలకించి వీరు శ్రీహరి కృపాకటాక్షమునకు పాత్రభూతులుగానుండుటచే దేహాభిమానమును విడిచి విరక్తిపరులై భగవంతుని పరిపూర్ణకృపకు అర్హులైయుంటున్నారని వారి జ్ఞానభక్తి వైరాగ్యములను చక్కగాపరిశీలించినవారై వారివిషయమై తాము చేసియున్న జాతిభ్రష్టత్వమును నివర్తించినవారై వారి పుత్రునకు తమపుత్రికనొసంగి తమపుత్రునకు వారికన్యను ప్రీతిపూర్వకముగా నిర్ధారణచేసికొని వారు యేర్పాటుచేసికొనియున్న లగ్నమందే వివాహమును ముగించి తత్వ్వానికి జీవునికి నిత్యకర్మానుష్ఠానములను వేదవిద్యుక్తములైన కర్మాచార నిష్ఠలను త్యజించరాదని పలువిధముల హితోపదేశముచేసి వారిని తమ కులంబున చేర్చుకొనిరి. అనంతరమా బ్రాహ్మణులు యిది మనయాచార్యుని కృపయనితలంచి తక్షణమే ప్రయాణమై వారణాశికేతెంచి తమ యాచార్యుండగు కబీరుదాసుని చరణాంబుజములకు దండప్రణామము లొనరించి వివాహ సమయమందు జరిగిన యావద్వృత్తాంతములను సాంగోపాంగముగా విన్నవించుకొనిరి. ఆవచనములను కబీరుదాసు శ్రవణానందముగా విని వారి నాలింగనము చేసికొని శ్రీరామమూర్తి కృపాకటాక్షవీక్షణ్యమును అపారముగా కొనియాడుచుండ వారు పరమానందభరితస్వాంతులై తమ ఆచార్యునివద్ద అనుజ్ఞనుపొందినవారై వారణాశిని విడిచి తమగ్రామమునకేతెంచి అమందానందముతో శ్రీహరిని భజింపుచు తమ బంధుమిత్రాదులతోగూడి కాలయాపనము చేయుచు భగవంతుని కృపాకటాక్షమునకు పాత్రులైయుండిరి.

రఘునందనాయనమః.

# పుండరీకునిచరిత్రము.

కాశీపురంబున వర్తకుఁడొకఁడు ధనకనకవస్తువాహనములతో అపారమైన కీర్తిప్రతాపములుగలవాఁడై సంపత్కరుఁడై వాసముచేయుచుండెను. అతని పత్ని సుందరమైన రూపకాంతులుగలిగి పతిశుశ్రూషయందధికవిశ్వాసములుగలదై పుత్రులైదుగురిని పడసి వర్ధిల్లుచు అనుకూలురగు భృత్యులున్ను ప్రియులైన బంధువర్గములు గలదై సకలసంపదలననుభవింపుచుండెను. ఇట్లు కొంతకాలము భోగభాగ్యములనుభవింపుచు కాలమునుపుచ్చుచుండగా ఆసామంతునకు పూర్వకర్మవశముచే శరీరమందు ఘోరమైన వ్యాధియొకటి జనించి దుర్గంధముతోనున్ను వ్రణబాధచేతనున్ను మిక్కిలి శ్రమనొందుచు పరితపించుచుండఁగా అతని పత్నీపుత్రులుఁగూడ సమీపమందు చేరకుండిరి. వర్తకునికి రుగ్మత నానాటికి అధికరించుచుండుటచే తగిన వైద్యులనురప్పించి పలువిధ ఔషధప్రయోగములు చేయించియు వ్యాధి తీరకుండుటచే నవగ్రహశాంతి చేయించుటకు విప్రసమూహములను చేర్పించి విధ్యుక్తముగా జపహోమాదులనుచేసి దానధర్మములుచేయించియు వ్యాధి తీరమిచే మల్హారియను దేవతను పలువిధపూజలచే తృప్తిగావించిరి. సప్తసతియను సాంకేయగ్రహమునకు పూజలొనరించిరి, గుప్తదానములు అపారముగా చేసిరి. సూర్యనమస్కారము గాయత్రీజపము రుద్రాభిషేకము గణపతిజపము భైరవజపము మొదలగు నానావిధపరిహారములు చేయించినను వ్యాధి తీరకుండుటచేతనున్ను నానాట హెచ్చుచుండుటచేతనున్ను వర్తకుఁడు అత్యంతవిషాదమును జెందినవాఁడై తన బంధువర్గములను తనచెంతకు చేరబిలిచి మిక్కిలిదైన్యముతో పలవింపదొడంగెను. ఓ బంధుజనులారా నాకు సంభవించినవ్యాధి దినదినమునకు వృద్ధిజెందుచున్నదేగాని గుణమునకువచ్చుమార్గము కనఁబడకున్నది, నేను పూర్వజన్మమునందపారముగా పాపకృత్యములను చేసినవాఁడనగుటచేత నాకిట్టి కర్మవ్యాధి సంభవించినది గనుక మీరంతరు నాయందలి ప్రేమభావమునువిడిచి భాగీరథియందు నన్నుపార్వైచి యీబాధలోనుండి నివర్తించి తృప్తిజెందియుండుడని దృఢచిత్తముతో విన్నవించెను. ఆవచనములను బంధుజనులున్ను భార్యాపుత్రాదులున్ను విని అపారమైనశోకముతో పరితాపమునొందుచు పుండరీకుని గంగాతీరమునకు గొనిపోయి కొన్ని భాండములను తెప్పించి వ్యాధిగ్రస్తుని పాదములకు రెండుభాండములు శిరస్సునకు రెండుభాండములు నడుముకు రెండుభాండములు కట్టి నదిలో పడవేసిపోవుట కుద్యుక్తులై యుండుతరుణంబున పురజనులందరు యీవింతనుజూచుటకు గుమిగూడివచ్చియుండఁగా కబీరుదాసుగారి శిష్యుఁడగు పద్మనాభుఁడను భక్తశిరోమణి ఆచమనార్థము భాగీరథీతీరమున కేతెంచి అచట పరితాపమునొందుచు గుమిగూడియుండుజనులనువీక్షించి సర్వవృత్తాంతమునువిని ఆత్మహత్యచేసికొనుటకాయత్తుడుగానుండు వర్తకుని పరికించి ఓవర్తకుఁడా వినుము, నీవు ప్రాణత్యాగము చేసికొనుటకు ప్రయత్నించియుండుట మహాపాపకార్యముగానుంటున్నది, ఎనుబదినాలుగులక్షల యోనులయందు పుట్టి మిక్కిలి శ్రేయమైన నరజన్మమును లభ్యముచేసుకొంటివి, గనుక నీవీనరజన్మము వ్యర్థముచేసికొని ఆత్మహత్యచేసికొన్నపక్షమున నీవు ఘోరమైన నరకకూపమునందుమునిగి పరితపించవలసినవాడవుగానుంటున్నావు. నీవు మానవజన్మమెత్తినందుకు సర్వకాలములయందు శ్రీహరినిభజింపుచు కడతేరవలెనుగాన, మాధవుని భజించువారు జనన మరణ తాపంబులు జెందక ముక్తికాంతను చూరగొందురు గాన మానవుడు ధర్మమార్గమందు ప్రవర్తింపవలెనని హితోపదేశముచేసెను. అంత నావర్త

కుడు సాధుపుంగవునివరికించి మహానుభావా నేను నాకు సంభవించిన వ్యాధిని తీర్చుకొనుటకు అనేకవుపాయములు చేయించియు రుగ్మత తీరక నానాటికివృద్ధిపొందుచుండుటచేత అందువలన మహాకష్టమును భవింపుచు తాళజాలక అమితవ్యసనమునుజెంది భాగీరథియందు పడి జీవమునువిడుచుట మేలనియెంచి యీపావనమైన నదియందు పడి చచ్చుటవలన పాపంబులు నశించి పుణ్యలోకమును లభ్యముచేసు కొందుననునమ్మకముతో యేతెంచితినని విన్నవించఁగా ఆవచనములను పద్మనాభుడువిని మిక్కిలి అనుతాపముతో నీవు సౌఖ్యముగా యుండుట కుపాయమొకటికలదు, వాటిని నీవు అనుసంధింపక అలక్ష్యముచేసినాడవు, నీవు చిత్తశుద్ధితో శ్రీరామరామాయని స్మరించుచుంటివేని శ్రీరామచంద్రుని కృపాకటాక్షవీక్షణ్యముచే నీవ్యాధి తీరును, జపతపములున్ను వేదపురాణశ్రవణమున్ను విద్యుక్తముగా చేయుచు శ్రీరామమూర్తియందు భక్తియుంచకపోయినయెడల అవి నిష్ఫలితమునుగలిగింపజాలవు, మానవులు శ్రీహరినామమును స్మరింపక సర్వదేవతలను పూజింపుచు అఖిలతీర్థక్షేత్రాదులను సేవింపుచు భూప్రదక్షిణము చేసినప్పటికిన్ని కడతేరజాలరు. శ్రీరామనామపారాయణను విడిచి యోగసాధనచేసినను గోదాన భూదాన వస్త్రదాన అన్నదాన రత్నదానాదులు మొదలగునవి చేసి యేకజీవమును బలియిచ్చినయెడల సర్వపుణ్యంబులు విఫలమగునని నుడువుచు అచట గుమిగూడియున్న జనులనందరినివరికించి మీరందరు మిక్కిలి ప్రీతితో మూడుమార్లు శ్రీరామనామమును స్మరించితిరేని యితనికి సంభవించియుండెడు భవరోగమునశించి భగవంతుని కృపాకటాక్షమునకు పాత్రుడైయుండునని హితబోధముచేసిరి. ఆవచనముల నాలకించుచుండిన సర్వజనులు అమందానందముతో శ్రీరామనామమును స్మరింపుచుండిరి వర్తకుడున్ను శ్రీరామనామమును స్మరింపుచుండెను



అట్టితరుణమందు సర్వజనులు చూచుచుండఁగా వర్తకుని రోగము శమనమయ్యెను, వ్యాధిగ్రస్తులుగాయున్న యితరజనంబులరోగములున్ను తక్షణమే నశించి పరిశుద్ధమైన దేహంబులుగలవారైరి. ఆ తరుణమందు వర్తకుడు పరమానందముతో పద్మనాభుని చరణకమలములయందు వ్రాలి దీర్ఘదండప్రణామంబులు సమర్పించి అంజలీహస్తుడై నిలిచి పరిపరివిధముల నుతింపుచు భక్తునివద్ద అనుజ్ఞనుపొంది పరమానందభరితస్వాంతుడై తనబంధువర్గములనుగూడి గృహంబునకుజనెను. అచట గుమిగూడియున్న సర్వజనులు పద్మనాభుఁడు భగవద్భక్తుఁడని అమందానంద కందళిత హృదయారవిందులై శ్రీరామనామమును ప్రీతితో ధ్యానింపుచు తమతమగృహంబులకుజనిరి. ఈ వృత్తాంతమును తక్షణమే కొందరు సుజనులు పరమభాగవతుడగు కబీరుదాసువద్దకి జని విన్నవించఁగా ఆతఁడాసవిస్తారమును శ్రవణానందముగా విని తనశిష్యుఁడగు పద్మనాభుని రప్పించి మూలకారణమైన మంత్రరాజమును మూడుమార్లు యేల స్మరించునట్లు చేసితివి, భక్తితో వక్కమారు స్మరించినమాత్రంబున భవబంధములు వీడిపోవునుగదా, పేటకాడు శ్రీరామనామమును స్మరణచేయుచుండుటచే వాల్మీకిమహర్షియని ప్రసిద్ధనామమునుబడసెను. వారిచే కాలాంతరమందు శ్రీరామాయణమను మహాగ్రంథము రచింపఁబడినందునా ఆ శతకోటి గ్రంథమును శంకరుఁడు చేకొని స్వర్గ మర్త్య పాతాళ లోకములకు సమభాగముగా భాగించియిచ్చి వాటియందు మిగిలిన యేకశ్లోకము ముప్పదిరెండులక్షలగ్రంథములైనందున ఆగ్రంథమును కూడ త్రిలోకములకు భాగించియిచ్చి వాటియందు మిగిలిన రెండక్షరములను తాన్నునిలుపుకొనెను. సముద్రమథనకాలమందు హాలాహలము జనించి త్రిలోకములనుభస్మముచేయుచుండునట్టితరుణంబునందు చంద్రశేఖరుఁడు గరళమును మింగి రామాయను రెండక్షర

ములను స్మరించినమాత్రంబున చల్లదనముగలిగియుండెను. గనుక యెట్టిమనుజుండైనను వక్కపర్యాయము త్రికరణశుద్ధిగలిగి శ్రీరామ నామమును స్మరించినమాత్రంబున సకలపాపరాసులు నసింపఁజేసి కొని సర్వాభీష్టసిద్ధినిబొంది సుఖింతురని శ్రీరామనామ ప్రభావాతి శయమునుకొనియాడుచుండగా అచట విచ్చేసియున్న జనులందరు పరమానందమును జెంది తమతమగృహంబులకు జనిరి.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

## జగమిత్రుని చరిత్రము.

పరలీవైజనాభమను గ్రామమునందు జగమిత్రుఁడను భక్తుడు వాసముచేయుచు అతడు ప్రతిదినము వుదయంబున భిక్షాటనవృత్తిచే ధాన్యమును సంపాదించుకొని తనగృహంబుఁజేరి కుటుంబభారమును నిర్వహింపుచు సంతుష్టినిజెంది సర్వకాలంబులయందును భగవంతుని స్మరింపుచు సకలశాస్త్రములను పరిశోధించి తత్వహితపురుషార్థలక్షణంబుల నెఱిఁగి పామరులగుచు అహంభావమునువహించి బద్ధసంసారులై తిరుగుచున్నవారికి జ్ఞానమార్గములను బోధింపుచు దేహమునందు ఆత్మవేరుగా నుంటున్నదను విలక్షణజ్ఞానమును గలిగింపుచు వారిని భగవద్గుణానుభవమునందుఁ అభిరుచిగలవారినిగాఁ జేసి కడతేర్చుచుండును. ఈరీతిగా జగమిత్రుఁడు కొంతకాలము కాలయాపనము చేయుచుండఁగా అనేకజనులు వారిని ఆదరింపుచు వారిచేబోధింపఁబడు సత్కథాకాలక్షేపములను ప్రతిదినంబును విని ఆనందించుచుందురు. ఇహలోకంబునందు వాసముచేయుచున్న ధనవంతులు ధనహీనులు మొదలగువారు జగమిత్రుఁడు పుణ్యపురుషుఁడని తమమనంబులనెంచుచు స్తుతింపుచుండుటచే అతఁడీప్రపంచమాద్యంతము మహత్తయిన ప్రభావాతిశయములు గలవాఁడని ప్రసిద్ధి



వహించియుండెను. ఇట్లుండఁగా కొందరు అసూయాపరులు యితనికి గలిగిన ఖ్యాతినిఁ గని సహింపఁజాలక అర్ధరాత్రియందు జగమిత్రుడు నిద్రబోవుచుండఁగా వారిగృహంబునకు అగ్నితగిలించిజనిరి. ఆతరుణమందు భక్తుడు మేల్కొనిచూచునపుడు నలుప్రక్కలయందు అగ్నిచుట్టుకొనిరగులుచుండెను. భార్యాపుత్రులు తాను మధ్యలో చిక్కుపడియుండుటచే మనస్సును దృఢపరచుకొని శ్రీహరి వాసుదేవా అనాధరక్షకా ఆపద్బాంధవా శ్రీకృష్ణ గోవింద గోపాల చక్రపాణి పురుషోత్తమా పుండరీకాక్షా పాండురంగా పండరీనాధాయని పరిపరివిధముల నుతిజేయుచు అతిశీఘ్రంబున వేంచేసి రక్షింపవేయని ప్రార్థింపుచుండఁగా శ్రీపాండురంగడు భక్తుని మొరాలకించి నాక్షణంబుననే తమసుదర్శనమును పంపించి భక్తునికి యేయాపదలుజెందనీయక భార్యాపుత్రసహితము సుఖముగానుండజేసెను. ఆసమయమందు ఆవీధిలో వసించెడు యిరుగుపొరుగువారు పురివాసులు ఆర్తనాదముతో యీయింటియందు వసించెడు భాగవతుడు పత్నిపుత్రసహితముగా భస్మమైపోయెనేయని వ్యసనపడుచుండిరి. అనంతరమునాగ్రామమమునందు వాసముచేసెడు సర్వజనులు ప్రాతఃకాలంబున అచ్చటికివచ్చి వీక్షించి చింతించుచు అయ్యో భక్తుడు కుటుంబసహితముగా భస్మమైపోయెనని వకరితోనొకరుచెప్పికొనుచుండఁగా యింతలో భగవంతునిమాయచే అగ్ని కొంతచల్లారినందున పురజనులందరు పరితపింపుచు లోపలప్రవేశించిచూడఁగా అచ్చట బూడిదె బొగ్గులు మొదలగునవియేమిన్ని లేకయుండుటచే భక్తజనులందరు అమందానందముతో శ్రీపాండురంగని లీలావినోదములను కీర్తింపుచు జగమిత్రుఁడు భార్యాపుత్రసహితము సుకక్షితముగాయుండుటను వీక్షించి పూర్వము కుంతిదేవిపుత్రులు లెక్కయింటియందు చిక్కుబడి గోవిందనామస్మరణచేయఁగానే దేవరవారు వారియాపదలను

తీర్చిరక్షించినట్లు యీదినంబీభక్తునికి వారి భార్యాపుత్రులకు ప్రాణ
దానం బొసఁగి కాపాడితిరని అమందానందముతో శ్రీహరి మహిమ
లను కొనియాడుచు ఆనందభరితులై తమతమగృహంబులకు వెళ్లిరి.
అసూయాపరులైన దుర్జనులందరు తమ తెలివిహీనతకు మిక్కిలిచిం
తింపుచు శ్రీహరి కృపాకటాక్షమును కొనియాడుచు భక్తుల ప్రభా
వాతిశయములు అపారపారావారములని పునఃపునః దండప్రణామ
ములొనరించి వారివారిగృహంబులకుజనిరి. అనంతరమా గ్రామం
బునందు వసింపుచున్న సుజనులగు ధనవంతులుకొందరుచేరి మనము
జగమిత్రునికి భూదానముచేసినయెడల శ్రీహరి కృపాకటాక్షమునకు
పాత్రులై పుణ్యలోకపదవిని లభ్యముచేసికొందుమను తలంపునుగొని
భక్తునిచెంతకువచ్చి తమమనోభీష్టంబులను విశదపరచిరి. ఆవచనము
లను భక్తుఁడాలకించి ఓగృహస్థులారా నేను భిక్షాటనవృత్తిచే నా
కుటుంబభారమును నిర్వహించుచున్నాడను, నేను యీవృత్తినివద
లిపెట్టి అత్యాశచే భూమినిచేకొని మాయాజాలమునందుచిక్కి పరి
తపించుటేల, జగద్రక్షకుడగు శ్రీనివాసుడు సర్వరక్షకత్వమునుబూని
ఇహలోకవాసులను రక్షింపుచుండఁగా నేను అస్థిరమగు భూమియం
దాశయుంచుకొని శ్రమజెందుటేలయని విన్నవించిరి. అంత నావచన
ముల నాలకించుచుండిన గృహస్థులు ఓమహానుభావా తాము కష్ట
పడవలసినపనిలేదు, మేమే భూమినిసాగుబడిచేసి అవి ఫలితమునకు
వచ్చినపిమ్మట దేవరవారికి ధాన్యమును సమర్పించుటకు స్వతఃసిద్ధు
లుగా యుండగలవారమని ధర్మార్థముగా వారికి కొంతభూమిని దాన
ముగా సమర్పించగా జగమిత్రుఁడు వారు సమర్పించిన భూమిని గై
కొని శ్రీహరిని భజింపుచు కాలయాపనముచేయుచుండెను.

ఇట్లు కొంతకాలము చనినపిదప వక తురకప్రభువు గ్రామాధి
కారమును వహించివచ్చి అతఁడాగ్రామభూమిజమాఖర్చులను పరి



శోధనచేయుచు జగమిత్రుని దానభూమిని జప్తిచేసెను. ఆతరుణ
మందు పురవాసులు కొందరుగుమిగూడి తురకప్రభువుచెంతకు జని
అయ్యా మేము మాయిహపరసాధనార్థము కొంతభూమిని దానము
చేసియుంటున్నారము, గనుకవారి భూములను తాము జప్తిచేయ
కూడదని ప్రార్థింపుచు ఆభూమిని యథాప్రకారము భక్తునికి యిప్పించు
డని హితవచనములు పలికిరి. ఆవచనములను ప్రభువువిని వారిప్రా
ర్థనలను విశ్వసింపక తన పరివారముతో జగమిత్రుని గృహంబునకు
జని ఓవిప్రవర్యా నీవు జగమిత్రుడను నామమును వహించియున్నా
డవు గనుక విష్ణుప్రతిష్ఠచేయుటకుగాను మాకు వ్యాఘ్రమొక్కటి
తెచ్చియిమ్ము, తక్షణమే నీవు కాననమునకుజని పులిని తెచ్చినయె
డల యీభూమిని మరల నీకే యిప్పించుచున్నానని చెప్పఁగా జగ
మిత్రుఁడు గ్రామాధికారినివీక్షించి అయ్యా తమమనోరథమును నేను
పులిని తోడుకొనివచ్చి పూర్తిచేయుచున్నానని వారినందరిని సాగ
నంపించి అప్పుడే కాననమునకుజని అపారపారావారమైన ఆర్తనా
దముతో ఓకృష్ణా మాధవా ముకుందా మురారి కేశవా గోవిందా
గోకులవాసా వాసుదేవా శ్రీధరా శ్రీనివాసా దామోదరా దాశ
రథే శ్రీహరీ మురారీ పాండురంగా పండరీనాథా యని పరిపరివిధం
బులుగా ప్రార్థనచేయుచు ఓపరంధామా దాసునియందు కరుణా
కటాక్షమును ప్రసరించి గ్రామాధికారి పులినిజూచుటకు అపేక్షను
జెందియుండుటచే నేనాతని మనోభీష్టమునుతీర్చునట్లు వాగ్దత్తముచేసి
వచ్చియుండుటచేత నాయందు కృపయుంచిరక్షింపవే ఓలక్ష్మీనారా
యణాయని వేడుచుండుసమయంబున భగవంతుడు పులిరూపముతో
యెదుటవచ్చినిలచెను. ఆతరుణంబున జగమిత్రుడు భగవంతుని లీలా
వినోదములనునుతింపుచు సాష్టాంగదండప్రణామములొనరించి నిలిచి
యుండఁగా శ్రీహరి భక్తునివీక్షించి ఓజగమిత్రా నీఅంగవస్త్రమును

నాకంఠమునకు జుట్టికట్టి నన్ను నీవు నివసింపుచున్న గ్రామమునకు వెంటబెట్టుకొనిచనుమని ఆజ్ఞాపించఁగా జగమిత్రుఁడు నిర్మలచిత్తముతో భగవంతుని నుతింపుచు దేహమునుమరచి వ్యాఘ్రముఁను కట్టి తీసుకొని కాననమునువిడిచి తమగ్రామములోనికి ప్రవేశించి పోవు చుండఁగా పులి భయంకరమైన ఘర్జనచేసెను. ఆశబ్దమునువినిన పురివాసులగు స్త్రీపురుషులు బాలురు వృద్ధులు మొదలగువారు భీతిని జెంది నలుప్రక్కలయందు పాఱుచు మూలలయందు దాగుకొనిరి. కొందరు గోడలమీఁదనున్న మరికొందరు మేడలయందున్న యెక్కి చూచుచుండగా కొందరు గృహద్వారములను బంధించుకొని విచారపడుచుండిరి. మరికొందరు భక్తుని ప్రభావమునుగని ఆశ్చర్యపడు చుండఁగా భగవద్భక్తులుకొందరు భగవంతుఁడు జగమిత్రుని నిమిత్తముగా వ్యాఘ్రరూపమునుధరించి లీలావినోదములు జేయుచున్నారని తమతమమనంబుల నానందింపుచు శ్రీహరి కృపాకటాక్షమును కొనియాడుచుండిరి ఇంతలో యీవృత్తాంతమును గ్రామాధికారియగు తురుష్కప్రభువు విని తన భటులమూలంబున కోటవాకిలిని బంధించునట్లుచేయఁగా భక్తుడు పులిని వెంటదీసుకొని కోటలోనికి ప్రవేశించుటకు వల్లపడనందున పులితోఁగూడ హాజారమునందు నిలిచియుండెను. ఆతరుణమందు పులి గొప్పఘర్జన.చేయఁగా కోటవాకిలి తలుపు అదిరి క్రిందపడెను. తక్షణమే జగమిత్రుఁడు కోటలోనికి జనుచెంచుచు భీతిజెందెడు జనులనుపరికించి యితడు శ్రీపాండురంగడని ప్రజలభయములుబాపి సుజనాగ్రగణ్యుండగు జగమిత్రుడు ప్రభువు వాకిట నిలిచి అయ్యా మీరు పులిని తెమ్మని ఆజ్ఞాపించితిరి గనుక నేను కాననము ప్రవేశించి అమితప్రయాసతో పులిని తెచ్చినాను తాము ప్రీతితో పులిని గొనిపోవచ్చునని చెప్పుచుండఁగా అతఁడు మిక్కిలిభీతితో పీఠితలుపునుమూసుకొని భార్యాపుత్రసహితముగా



గడగడవణకుచుండెను. ఆతరుణమందు భక్తుడు అధికారి తలుపును బిగించుకొని దాగుకొనియుండుటనుపరికించి అయ్యా భగవంతుఁడే పులిరూపముగైకొని సేవయొసఁగుచున్నారు, జప తప వ్రతాదులను నియమముతో అనుష్ఠింపుచు దృఢభావముగలిగియుండెడి వారుగూడ సేవించుటకు అలభ్యుడుగానుండు పరంధాముడు యితడై యుండుటచే నీవు భీతినిమాని తలుపుతెరచి సేవింపుము. పూర్ణచంద్రునికన్నను చల్లనిగుణముగలవాఁడు, శరణాగతులను రక్షించునట్టి కరుణాసముద్రుడు అవాఙ్మానసగోచరుడు అనంతశయనుడు ఆపద్బాంధవుడుగాన నీవు సంశయింపక కవాటమును తెరచుకొనివచ్చి సేవింపుమని నుడువుచుండఁగా ఆతరుణమందు వ్యాఘ్రరూపముతోనున్న భగవంతుడు భీకరనాదముతో ఘర్జింపుచు భక్తునికట్టును విడిపించుకొనుటకు యత్నముచేయుచుండఁగా జగమిత్రుడు పులిశిరంబునుదువ్వుచు శాంతపరచుచుండుటచే భగవంతుడు భక్తపరాధీనుండగుటవలన అతని వద్ద లీలావినోదములు చేయుచుండెను. అట్టితరుణంబున గ్రామాధికారిభార్య అమితభీతిని జెంది గడగడవణకుచు తనభర్తను [illegible]ంచి నీవు వెలుపలికిబొమ్ము నీవులోపలయుండుటచేత నాకున్న నాబిడ్డలకున్ను ప్రాణహానిగలుగునని తోచుచున్నది నీవో వృద్ధాప్యదశను పొందియుండుటచే పులికి ఆహారమై కాలునిపురంబు జేరి మాప్రాణములను రక్షింపుమని నిర్బంధపరచుచుండఁగా అచట గుమిగూడియున్న జనులందరు అధికారిని పరిహాసింపుచుండిరి, అట్టితరుణంబున గ్రామాధికారి కవాటమును తెరుచుకొని వెలుపలికేతెంచి భక్తునివలగొనివచ్చి సాష్టాంగదండప్రణామంబొనరించి ఓసుజనాగ్రగణ్యా నేను అహంభావముచే తమప్రభావమును తెలియనివాడనై అపచారపడితినిగాన నాయపరాధమునుక్షమించి నాయందు కృపాకటాక్షముతో కరుణారసమునుప్రసరించి బ్రోవుడని వారిని పలువిధముల

నుతింపుచు తాము వహించియున్న తిరునామమునకుతగినట్లు ఈప్ర పంచమునకు మిత్రులేయని అమందానందముతో కొనియాడుచుండ భక్తుడు అతనిప్రార్థనలనంగీకరించి పులిని వెంటబెట్టుకొని తక్షణమే అరణ్యముబట్టి చనుచుండఁగా శ్రీహరి ప్రీతితో శ్యామళమైన సుం దర సుకుమార దివ్యమంగళస్వరూపముతో కోటిసూర్యప్రకాశము గలిగి సేవయొసఁగిరి. అట్టితరుణంబున జగమిత్రుడు పురుషోత్తముని సేవించి ఆనందభరితుడై కనులనానందాశ్రువులురాలుచుండగా పరి పరివిధముల భక్తవత్సలుని స్తుతిజేసి పూజించి పులకాంకితదేహుడై దేహమును మరిచియుండునప్పుడు పుండరీకాక్షుడు అంతర్ధానమైనం దున జగమిత్రుడు భగవంతుని కీర్తింపుచు తనమందిరమునకు వచ్చి సకలజనులచేత పూజింపఁబడుచు యథాప్రకారము తనభూములను తానేయనుభవింపుచు సుఖముగా కాలమునుపుచ్చుచుండెను.

శ్రీజగన్నాథాయనమః.

## జోగాపరమానందుని చరిత్రము.

పారశీకమను దేశము పండరీపురంబునకు పుత్తరపార్శ్వమందు నెలకొనియుండెను, ఆపురంబునం దఖండజ్ఞానపరిపూర్ణుండగు సత్పు రుషుడు విప్రవంశమునజనించి జోగాపరమానందుడను తిరునామము వహించి వాసముచేయుచుండెను. అతడు భక్తాగ్రగణ్యుడై శ్రీహరి చింతనారతుఁడై భగవదారాధనముచేయుచు భగవంతుని పూజిం పుచు భిక్షాటనముజేసి తనకుటుంబభారమును నిర్వహింపుచుండును అతఁడు కుమతులు కుటిలురు జ్ఞానహీనులు దుర్మార్గులు మందమ తులు మొదలగు దుర్జనులతోఁజేరక దారేషణ పుత్రేషణ ధనేషణా దులయందు ఆశనువదిలి ప్రాతఃకాలమునందులేచి నిత్యకర్మానుష్ఠా నములను ముగించుకొని శ్రీపాండురంగని విగ్రహమును ఆరాధించు



టకు తిరుమంజనద్రవ్యములను చేకొని షోడశోపచారములచేత పూ జించి భగవద్గీతయందు ఏకైకశ్లోకమును పఠించి ఏకనమస్కారము చేయుచు నిర్మలచిత్తముతో యేడువందలశ్లోకములను పారాయణ చేసి యేడువందల దండప్రణామములు చేసినపిమ్మట భగవత్ప్రసాద మును భుజించును. ఈరీతిగా అతఁడు ప్రతిదినము తనకాలకృత్యము లనుతీర్చుకొని పరమపురుషుని నిర్మలచిత్తముతో పూజింపుచు కాల ముపుచ్చుచుండగా ఒకానొకదినమందు కొందరు వర్తకులు ఆపురం మునకువచ్చి సన్నిధానమునందు బసచేసి భక్తాగ్రగణ్యుడగు జోగా పరమానందుని సేవించుటకు వచ్చిరి, ఆతరుణమందు కొంతవర్షము కురిసియుండుటచేత భూమి తడిగాయుండెను, భక్తుడు నిర్మచిత్తము గలిగి భగవద్గీతనుపారాయణముచేయుచు దండప్రణామములుచేయు చుండుటను వర్తకులలో నొకడు పరికించి యితఁడు విరక్తచిత్తము గలవాడని అతనికొక పీతాంబరమును సమర్పించవలయునసుతలంపు గొన్నవాడై భక్తునిప్రభావాతిశయములను కొనియాడుచు అయ్యా నేను తమకొసంగెడు పీతాంబరమును తాము ధరించి నన్ను ధన్యు నిగాఁజేసి రక్షింపుడని పలువిధముల ప్రార్థించుచుండఁగా జోగాపర మానందుడు అయ్యా శ్రీహరి కృపాళుడై ఆదరింపుచు పాతవస్త్రము లను క్షుద్బాధగలుగనివ్వక ప్రసాదమును కృపచేయుచు సర్వగతు కత్వమునుబూనియుండఁగా మేము వారికృపాకటాక్షమునకుపాత్రు లగుచు సర్వకాలములయందు సర్వాంతర్యామియగు మాధవుని భజ నమును ప్రీతితోసలుపుచు తృప్తిజెందియుండువారముగాన మాకు యిట్టిపీతాంబరము యెందుకు మీరీ పీతాంబరమును భగవంతునకు సమర్పణచేసిపొండని హితబోధములుచేయఁగా వర్తకుఁడు భక్తుని వార్తలనుపాటింపక వారిని బలవంతపరచి నడుమునకు పీతాంబరమును చుట్టిపోయెను. అనంతరము భక్తుడు పీతాంబరమునకు అడుసు తగు

లునను తలంపుతో భగవంతునకు ముందువలె ధారాళముగా దండ ప్రణామములు సల్పుటకు వెనుకదీసెను. అతనికి తాను ధరించిన పీతాంబరమువలన డాంబీకత్వముగలుగుటచే తానాచరించుచుండిన నియమమునువిడిచి కాలోచితముగా క్షుద్బాధగలిగి వాటిచే దేహాయాసముగలవాడై యుండుటచే భగవదారాధనాయాసమైన సత్కార్యములు చెడెను. అందుచే జోగాపరమానందుఁడు భగవదపచారము సంప్రాప్తమైనదేయని పరితపించుచు వర్తకునిచే లభ్యమైన పీతాంబరము గీతాపారాయణమునకు ఆటంకముగలుగచేసి నాకు మమకారముగలిగించి నానిత్యానుష్ఠానవిధులను తప్పించినందున భుజించుట తగదని సన్నిధానమును వదలి వెలుపలికివచ్చి ఈదినము నేనాచరించిన అకృత్యమునకు తగిన దేహదండన విధించుకొనుటయే వుచితంబని తలంచుచు నేను ఘోరారణ్యముప్రవేశించి ఘోరతపస్సును చేయవచ్చునా, లేక గంగాస్నానమునకు జని అచ్చట వకయాత్రమముచేసుకొనియుండవచ్చునా, అన్నపానాదులనువర్జించి అనుతాపముతో దేహమునుత్యజింపవచ్చునా, అగ్నిగుండము గావించుకొని అందులోపడి ప్రాణములను విడువవచ్చునాయని పలువిధముల తన మనంబున వితర్కింపుచుండగాఁ వ్యవసాయము చేయువాడొకఁడు రెండుయెడ్లను కాడిమ్రానునందుకట్టి పొలమును దున్నుటకు పోవుచుండుటను వీక్షించి అతనిని చేరబిలిచి పీతాంబరమును చూపించి దీనింగైకొని నీరెండెడ్లను నాకుయిచ్చెదవాయనియడిగెను, అతఁడు ధరించియున్న పీతాంబరము వాటికంటె రెండింతలుధరగా యుండుటచే పంటకాపు పీతాంబరమునుగైకొని తనయెడ్లనుయిచ్చివేసినదే భక్తుఁడు వానింజూచి అయ్యా నాకాళ్లను కాడిమాను మధ్యభాగమందు పగ్గముతోబంధించి చౌకుతో యెడ్లనుకొట్టితోలి నీవుపోవచ్చునని చెప్పఁగా అతడు మందమతియగుటచే ఆరీతిగానేచేసి చను



చుండెను, ఎడ్లు రెండును మిట్టపల్లములని తెలియక ముండ్లయందున్ను రాళ్లయందున్ను పడిచెడి దారినివిడిచి తమయిష్టప్రకారము పరిగిడుచుండఁగా భక్తునికి దేహమాద్యంతము దెబ్బలు తగిలి చిందరవందరలుగా పోవుచుండుటచే ముండ్లుపొడుచుకొని రక్తముకారుచున్నందున అమితప్రయాసతో ఓకృష్ణమూర్తీ అచ్యుతా అనంతా ముకుందా మురహరీ కేశవా మాధవా మధుసూదనా పతితపావన భక్తవత్సలా పాండురంగా పండరినాథాయని భగవంతుని తిరునామములను పలువిధముల నుతింపుచు దాసునికీదేహదండనముతగును తగునని నుడువుచుండగా జగత్కర్తయగు పండరినాథుఁడు అతివేగంబున భక్తునిచెంతకు విచ్చేసి బంధించియున్నకట్లను విడదీసి అతని దేహమును తమశ్రీహస్తముతో తుడిచి ఓభక్తాగ్రగణ్యా నీవుచింతించుటకుహేతువేమి, నీవు సల్పుచుండిన కార్యంబులన్నియు నానిమిత్తమె చేయుచుంటివి, నీవిదినరకు వకతప్పితముకూడచేయనివాఁడవై యుండిన్ని యిట్టి దేహదండనమేలచేసికొంటివని భక్తునియందు తమ కరుణారసమునుప్రసరించి అదృశ్యులైరి. శ్రీహరి శ్రీహస్తము జోగాపరమానందుని శరీరమందు తగిలినమాత్రంబున అతనికి కలిగియుండిన గాయములన్ని మాని స్వర్ణకాంతులు దేహమందుజ్వలింపుచు ప్రకాశించుచుండెను, తత్క్షణమే భాగవతుడు తనగృహంబునకువచ్చి నిత్యనియమములను క్రమప్రకారమునడిపించుచు సుఖముగాకాలమును గడుపుచుండెను.

శ్రీవాసుదేవాయనమః.

# నరహరిభక్తుని చరిత్రము.

శ్రీపండరీక్షేత్రమునందు కంసాలవారివంశంబున నరహరియను శివభక్తుడు వాసముచేయుచుండెను, అతడు శంకరునివినహా అన్య

దేవతలను ఆరాధింపనివాఁడై కామక్రోధాదులను యీషణత్రయము లను తామసరాజసములనువర్జించి ప్రాతఃకాలమునందు భీమానదికి జని స్నానసంధ్యాద్యనుష్ఠానవిధులను ముగించుకొని శంకరుని సన్నిధానముప్రవేశించి పూజించివచ్చుచుండును. అతఁడు పండరీపురమునందు వాసముచేయువాఁడుగాయుండిన్ని శ్రీపాండురంగని సేవింపక శ్రీపరంధాముఁడు నెలకొనియున్న సన్నిధిని శిఖరమును కన్నెత్తిచూడక తనకు ప్రియుఁడగు శాంబమూర్తిని సేవింపుచు అత్యానందమును జెందుచు సత్యసంకల్పుఁడై నిర్మలహృదయముగలవాఁడుగా నుండెను. ఇట్లుండఁగా నాసమీపగ్రామమునందువాసముచేయుచున్న వర్తకుఁడు పుత్రసంతానము లేనందున చింతాక్రాంతుఁడై పండరీపురమునకు వచ్చి పాండురంగని సేవించి ఓపాండురంగా పరమదయాళా నారాయణా నరహరీ నాకు వార్థిక్యదశగలిగినది, ఇంతకాలవరకు పుత్రసంతానము లేక పరితపించుచున్నాను, నేను వచ్చేసంవత్సరము మిమ్ము సేవించుటకువచ్చునంతలో నా వంశవృద్ధికొరకు సుపుత్రుని బడసిన యెడల దేవరవారికి బంగారుమొలత్రాడు చేయించి సమర్పించుచున్నానని ప్రార్థనచేసికొని తన గ్రామమునకు జనెను. అనంతరము భగవంతుని కృపాకటాక్షవీక్షణ్యముచే అతనికి సుపుత్రుఁడు జనించినందున వర్తకుఁడు భగవంతుని ప్రార్థనను చెల్లింపవలయునను తలంపుతో శ్రీపండరీపురమునకువచ్చి చంద్రభాగానదియందు స్నానానుష్ఠానములను ముగించుకొని పరంధాముని ప్రీతితో సేవించి అచ్చట అర్చకునివీక్షించి ఓస్వామీ శ్రీపాండురంగమూర్తికి నవరత్నములు పొదిగిన స్వర్ణపుమొలత్రాడు చేయివలసియుండుటచే చక్కఁగా పని చేయు కంసాలినిజూపుఁడని యడుగగా అర్చకుఁడు వర్తకుని పరికించి అయ్యా యీపురమున చక్కఁగాపనిచేయునట్టికంసాలి నరహరియని నామమునుబడసి యుంటున్నాఁడు, అతఁడు సత్యసంధుఁడు సుశీలుఁడు



శివపూజాపరుఁడు మాటతప్పనివాఁడని చెప్పఁగా వర్తకుఁడు మఱచిదని స్వర్ణమును రత్నములను చేకొని నరహరివద్దయిచ్చి శ్రీపాండురంగనికి స్వర్ణపుమొలత్రాడు పనితరముగా చేసియిమ్ము, వాటికి కూలి యెంతకోరినను అడ్డిచెప్పక యిచ్చుచున్నానని చెప్పఁగా నరహరి భక్తుఁడు వర్తకునిపరికించి అయ్యా శ్రీమన్నారాయణమూర్తియొక్క నడుముకొలత తెచ్చితిరేని చేసియిచ్చెదననినుడివెను. అంతనావర్తకుఁడు తత్క్షణమే పండరినాథుని సన్నిధానమునకువచ్చి పాండురంగని నడుముకొలతను చక్కఁగాకొలిచియెత్తుకొనివచ్చి నరహరికియివ్వఁగా తత్క్షణమే కంసాలి పనినిప్రారంభించి మిక్కిలిపనితరముగా కొన్నిదినములలో చెక్కించియిచ్చెను.

అనంతరము వర్తకుఁడు భగవదారాధనకు కావలసిన పూజాద్రవ్యములు సేకరించుకొని అపారమైనప్రీతితో తిరుమంజనమును చేయించి పట్టుపీతాంబరమును కట్టించి చందనకుసుమములచే నలంకరించి మొలత్రాటిని నడుమునకు ధరింపజేయఁగా అది నడుమునకు చాలక తక్కువపడియుండుటచే తత్క్షణమే వర్తకుఁడు మొలత్రాటిని నరహరివద్ద తెచ్చియిచ్చి ఇది భగవంతుని కటిమధ్యమునకు నాలుగు అంగుళములుతక్కువగాయున్నదనినుడువగా నరహరి మరల నాల్గంగుళములుపొడుగువచ్చునట్లుచేసియిచ్చెను, వర్తకుఁడు మొలత్రాటిని పాండురంగనికి సమర్పించఁగా అది మిక్కిలివదులుగానుండెను. మరల నరహరికి తెచ్చిచూపించి కొంచెముతక్కువగా చేసియిమ్మనియడుగఁగా తత్క్షణమే కంసాలి చేసియిచ్చెనుగాని అది నడుమునకు చాలక యుండుటనుగని విస్మయమునుజెంది నరహరిచెంతకేగి అయ్యా నేను చేసెడి కైంకర్యమునకు తాము వకతూరి చాలకయుండునట్లుగాను యింకొకతడవ వదులుగాయుండునట్లును మూఁడవతడవ తక్కువగా యుండునట్లుగాను చేసియిచ్చితిరిగనుక తాము నేరుగావచ్చి శ్రీహరి

నడుమునుకొలతయెత్తుకొని చేసియిమ్మని ప్రార్థింపగా నరహరి వర్తకునిపరికించి నేను శంకరమూర్తిని పూజించువాడను, ఇతరదైవములను కన్నెత్తిచూడకయుండునట్టివ్రతమును బూనియుండెడువాడుగా యుండుటచే నేను విఠోబా సన్నిధికి రానని వచించెను. ఆవచనములను వర్తకుడువిని నరహరిని పలువిధములుగా ప్రార్థించియు అతడు రాజాలనని పట్టుదలతోయుండుటచేత వర్తకుడు నరహరిని పరికించి అయ్యా తాము అన్యదైవమును తమనేత్రములతో చూడకూడదను వ్రతమును బూనియుండువారుగానుండుటచే మీరు చూడవద్దు. తమ నేత్రములను వస్త్రముచే చక్కగాచుట్టి కట్టుకొని శ్రీపాండురంగని నడుమునుమాత్రము అంటిచూచి యీమొలత్రాటిని సరిపరచియిచ్చిన యెడల మీ వ్రతమునకు భంగమురాదని మిక్కిలి ప్రార్థించుచుండుటచే నరహరి సమ్మతించియుండగా వర్తకుడు వస్త్రముచే అతని నేత్రములకు యేదిన్ని కనపడకయుండునట్లు చక్కగా కట్టివేసి నరహరి కరమును పట్టుకొని నడిపించుచు శ్రీపాండురంగని సన్నిధానము ప్రవేశించి వర్తకుడు నరహరిని సమీపమున తెచ్చివిడిచి శ్రీపాండురంగనివిగ్రహమును ఆపాదమస్తకపర్యంతము అతని చేతులతో స్పర్శించిచూచునట్లుచేయగా పంచముఖములతో పన్నగాభరణమును ధరించుకొని పదిచేతులతోనున్న గొప్పజడలుగలిగి వ్యాఘ్రచర్మముతోనున్న దేహమాద్యంతము విభూది చేనిండినవాడగుచు పంచాయుధములతో యుండునట్లు అతనికి తోచబడుటచే నరహరి తాను ఆరాధించుచున్న దేవుడేయని భయభ్రాంతులుగలిగి నేత్రపటమును తొలగించివీక్షింపగా పీతాంబరధారియై కటిమధ్యమునందువుభయాస్తములనిడికొని శ్యామలాకారముతో సుందరసుకుమార లావణ్యకాంతులతో సుదర్శన పాంచజన్యములుధరించి కిరీట కుండల హార కేయూరనైజయంతీవనమాలాదులతో ప్రకాశింపుచు సమచరణములతో యిటికెరాతిపై వేంచేసియుండెడు శ్రీపాండురంగని తిరుమేని సౌందర్యమును తన నేత్రములతో వీక్షించి అయ్యో నాకు యిట్టి భ్రమ యేలకలిగెను, నేను శ్రీపాండురంగని నాకరములతో స్పర్శించిచూచి నా ధ్యానమూర్తియగు శాంబశివుడనుభావముతో నేత్రపటమును వదలించుకొని చూచితిని, ఇప్పుడీవిగ్రహము పాండురంగనిరూపముగాయుంటున్నది, ఇట్టిచోద్యమునకు గతంబేమొకోయని తననేత్రములను మరల వస్త్రముతో చక్కగాకట్టుకొని శ్రీపాండురంగని కటిమధ్యమును తడివిచూడుచుండగా మరల శంకరమూర్తి చిహ్నములు కనబడుచుండెను, తక్షణమే నరహరి నేత్రపటమును తొలగించి శ్రీపాండురంగనిరూపమునువీక్షించి సంభ్రమాశ్చర్యములతో నేత్రములకు చుట్టుకొనియుండిన వస్త్రమును విప్పి పారవేసి శ్రీపాండురంగడు పరంధాముడేయని అనుతాపముతో భగవంతుని తిరువడిఘళును వుభయకరంబులతోపట్టుకొని అమందానందముతో శ్రీహరి దివ్యమంగళస్వరూపమును నేత్రానందముగా సేవింపుచు ఓ విశ్వాతీతా వేదవేద్య వేంకటవరదా విఠలా పురాణపురుషా పరమదయాళా భక్తవత్సలా మాధవా కృష్ణా మన్మధజనకా దేవరవారు భక్తులను కృపాకటాక్షముతో రక్షించుటకొరకు ఇట్టి లీలావినోదములనుజూపుచు దాసునికి కలిగియుండిన భేదభావమును నిరసించి తమదివ్యమంగళవిగ్రహసేవను కటాక్షించి ముక్తిమార్గమును కృపజేసితిరి, దాసుడు యింతకాలము భేదబుద్ధితో అజ్ఞానాంధకారమునందు మునిగియుండుటను పరికించి నాయందు దేవరవారు కృపాకటాక్షవీక్షణ్యమును ప్రసరించి నన్నురక్షించితిరి నామనంబున తమ నామరూపములను పరిశీలించిచూడగా పరమశివుడు నీవే కేశవుడు నీవే శ్రీకృష్ణమూర్తినీవే శ్రీరామచంద్రుడునీవే, ఓమాధవా లక్ష్మిపతే పార్వతీరమణా పాండురంగా పద్మనాభా నీలకంఠా రుక్మిణీపతి

దేవరహరిచరణాంబుజములే రక్షకోపాయమని శరణాగతుడనై తమ కృపాకటాక్షమునకు దాసుడు పాత్రుడగునటుల కారుణ్యారసమును ప్రసరించి బ్రోవవేయని పలువిధంబుల నుతింపుచుండఁగా పండరీనాధుడు ప్రసన్నుడై ఓనరహరీ నీవు సత్యసంకల్పుడవై చేయుచున్న పూజలు సర్వరక్షకుడైయున్న నాకు చెందుచున్నవి నాపలుకులయందణుమాత్రముకూడా వ్యత్యాసముపుండదు, నీభేదభావమును తొలగించుటకు యిట్టి వినోదమును కలిగించితినని నరహరిచేతితో సమర్పించిన కటిసూత్రమును తమకటిమధ్యమునందు ధరించుకొనగానే అంతకుమునుపు మూడుతడవలు సమర్పించినపుడు వదులుగానున్న చాలకయుండిన మొలత్రాడు సరిపడియుండెను, వర్తకుడు తనప్రార్ధన నెరవేరినందున భగవంతుని లీలావినోదములను నుతింపుచు పరమానందము జెందియుండెను, నరహరిభక్తుడు శ్రీపాండురంగని చరణాంబుజములను తనమనంబున పదిలపరచుకొని పరంధాముని ప్రభావాతిశయములను పొగడుచు తనగృహంబునకు మరలివచ్చి భాగవత గోష్ఠితోఁగూడి కాలమును పుచ్చుచుండెను.

భక్తవత్సలాయనమః.

# జనాభాయి చరిత్రము.

ఒకసంవత్సరము పండరీపురవుత్సవకాలమందు అనేకజనంబులు శ్రీపాండురంగని సేవించుటకు వచ్చుచుండుతరుణమందు వకచిన్నది జననీజనకులతోఁగలసి వుత్సవమును సేవించుటకు వచ్చియుండెను. ఆ చిన్నది వుత్సవమును సేవించినపిమ్మట తనతల్లిదండ్రులను పరికించి ఓజననీజనకులారా మీరు మీదేహయాత్రజరుపుకొనుటకే శ్రమజెందుచున్నారు గనుక ఈపండరిక్షేత్రమునందు నేను నివసించెదను శ్రీపాండురంగనాధుడు నాదేహయాత్రను జరుపుటకు రక్షకుడుగా



యుంటున్నాడు, గాన మీరు నాయాశను విడిచి మీగృహమునకు మరలిపొండని నుడువుచుండుటను అచటయుండెడు సర్వజనులువిని ఆశ్చర్యమునుజెందుచు యేడుసంవత్సరములవయస్సుగల యీచిన్నదానికి అకస్మాత్తుగా యిట్టి జ్ఞానము కలుగుటకు గతంబేమని తలంచుచు యీచిన్నదానికి భగవంతునియందు అధిక వ్యామోహము జనించియున్నదని వకరితోనొకరు ముచ్చటింపుచు సంభ్రమాశ్చర్యములను జెందియుండిరి, ఆచిన్నదానితల్లిదండ్రులు తమకుమార్తెకు అనేకవిధములుగా హితవచనములుబోధించినను ఆచిన్నది వారితో తన దృఢచిత్తమును దెలుపుచున్నది. ఓనాజననీజనకులారా నేను చంద్రభాగానది స్నానము పండరీపురి వాసము శ్రీపాండురంగని సేవ వీటెనివదిలి మీతోకూడారానని తనదృఢవ్రతమును విన్నవించెను. ఆవచనముల నాలకించిన జననీజనకులు యిది భగవంతుని లీలావినోదములుగాయుండునని శ్రీపండరినాధుని ప్రభావమును నుతింపుచు తమపుత్రికను పాండురంగని సన్నిధియదువిడిచి తమగ్రామము జేరిరి అనంతరమీచిన్నదిసన్నిధానమునందుసంచరించుచుండుటను నామదేవు పరికించి ఓచిన్నదానా నీకు బంధుజనులు యెవరున్నలేరా, నిన్ను దేవాలయమునందు విడిచిపెట్టి నీజననీజనకులు యెచటికిజనిరి నీపేరున్ను నీతల్లిదండ్రులపేరున్ను సాంగోపాంగముగా తెలియపరచుమని ప్రియవచనములతో యడుగగా నాచిన్నది భక్తునిపరికించి భక్తులకుప్రియుడు శ్రీపాండురంగడు నెలకొనియున్నాడు, నాజననీజనకులు శ్రీపాండురంగడు రుక్మిణీదేవియేయనితలంతును, నానామధేయము జనాభాయని యందురు, నా బంధువర్గములు మొదలగువారు శ్రీలక్ష్మీకాంతుడగు భక్తవత్సలుడేయని విన్నవించెను. ఆవచనములనువిని నామదేవు మిక్కిలిప్రీతితో జనాభాయికరమును పట్టుకొని గృహంబునకేగి తల్లినిపరికించి ఓజననీ యీచిన్నది జననీజన

కులమువిడిచి యాత్రార్థిగావచ్చి సన్నిధియందు సంచరించుచున్నది, ఈచిన్న దానియందు కృపయుంచి జననివలెపోషించినయెడల మనకు సుకృతము సిద్ధించునని విన్నవించగా ఆమె నాచిన్నదానిని ప్రియ వచనములతో నాచరింపుచు తనగృహమందుగలపనులను చేయుచుం డునట్లు నియమించగా జనాభాయి మహాభాగ్యమని సుశీలయై భాగ వతుల సేవాకృత్యములు ముక్తిమార్గమునకు తగిన తరుణోపాయ ముగా యుండునని దాస్యవృత్తియందు ప్రీతినియుంచుకొని గృహ మునందు యుండెడు సమస్తకార్యములను వినుకుజెందక చేయుచు భగవంతుని దివ్యచరిత్రములను పరమానందముతో వినుచు శ్రీహరి అనంతనామములను స్మరింపుచు భాగవతసేవచేయుచు నామదేవుని తండ్రిగాభావించి మిక్కిలిప్రీతితో నానాటికి వృద్ధిబొందుచుండెను. ఇట్లు కొంతకాలముగడచినపిమ్మట యొకనాడురాత్రి నామదేవు శయ నించియుండుతరుణమందు గాలివాన కురియుచుండగా భక్తునియొక్క గుడిసె పురాతనమైనదిగాయుండుటచేత గాలికి ఆకులు యెగురుచు యిల్లు వురుచుచుండుటచేత భక్తవత్సలుడు భక్తునికి శ్రమగలుగ నివ్వక తమ సుదర్శనమును పంపించి గృహమునందు వురుపులేక యుండునట్లు జాగ్రతగా చూచుకొమ్మని దిట్టపరచి తక్షణమే పండరి నాథుడు నామదేవుని గృహంబునకు వేంచేసి యింటిమీదికి యెక్కి పైకప్పును కారకుండునట్లు సరిపరచుచుండెను. ఇంతలో నామదేవు మేల్కొని వెలుపలికివచ్చి వర్షాడంబరమును పరికింపుచు పీతాంబర ధరుడు తనగుడిసెను సరిపరచుచుండుటనువీక్షించి అతిదీనత్వముతో పండరినాథుని చరణాంబుజములయందువ్రాలి తిరువడిఘళును పట్టు కొని ఓపతితపావనా దేవరవారు గుడిసెమీదికియెక్కి బాగుపరచు టకు గతంబెయ్యది ఆకారణమును నాకు వివరింపుమని వేడుకొనఁగా పరంధాముడు నామదేవును వీక్షించి యిట్లని పలుకుచున్నారు. ఓ



నామదేవా నీవు సంసారవిహారమునందు నీతలంపును ప్రవేశపెట్టక కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాది దుర్గుణములు ఈషణ త్రయములు రాగద్వేషాదులు మొదలగు నీచగుణములనువర్జించి నా చరణములే గత్యంతరమని నమ్మియున్నావు, గనుక నీయోగక్షేమ ములను కనిపెట్టి నేను నీకు హితమును చేయుచున్నాడను, అట్లు చేయక పరామరికగా యున్నపక్షమున నీజనని నన్ను నిందించును గదాయని వచింపుచుండఁగా కోణాభాయి భగవంతుని చరణాంబు జములకు దండప్రణామములొనరించి అనుతాపముజెందుచుండెను. ఆతరుణంబున జనాభాయి భగవంతుని వీపును తుడుచుచు ఓకృపా సాగరా కృష్ణమూర్తీ గోవిందా మాధవా ముకుందా శ్రీహరీ పరం ధామా దేవరవారు అపారమైనకృపాకటాక్షవీక్షణ్యమును ప్రసరించి రక్షింపుచున్నారని కొనియాడుచుండెను. ఆసమయంబున పాండు రంగడు నామదేవును వీక్షించి నీకు క్షుద్బాధగలిగియుండునట్లు కన బడుచున్నది నీవు భుజింపుమని చెప్పుచుండఁగా కోణాభాయి తట్టల యందు అన్నము కూరలు మొదలగునవి వడ్డించగానే నామదేవు భగ వంతునితోకూడా భుజించుచున్నతరుణమందు జనాభాయిని పిలువక యుండినందున ఆచిన్నది భగవంతుని స్మరింపుచు శ్రీహరీ వేంకటా చలపతే వేణుగానలోలా పాండురంగా భక్తవత్సలా నారాయణా నరహరీ దాసురాలు పరదేశినై యుండుటనుపరికించియు నన్ను పరా మరికగాజూచుట నీకుతగునా, దేవరవారు కారుణ్యరసమును ప్రస రించి నన్ను రక్షింపవే ఓలక్ష్మీపతేయని ప్రలాపించుచు తనగుడిసె యందు యుండగా పాండురంగడు జనాభాయి దీనాలాపములనువిని తనకువుంచిన అన్నమునుభుజింపక లేచెను, అప్పుడు నామదేవు శ్రీ హరిని వీక్షించి ఓభక్తవత్సలా జనాభాయిని మనబంతిలో యుంచు కొని భుజించలేదనుకొరత తమకు గలిగియున్నదిగదాయని యనగా

కోణాభాయి భగవంతుడు విడిచిపెట్టిన శేషప్రసాదమును జనాభా
యికి యిచ్చెను, ఆమె ప్రసాదమును ప్రీతితోఁ చేకొని తట్టలోనుంచి
పాండురంగనిరాకకు యెదురుచూచుచుండఁగా భగవంతుడు నామ
దేవుతోఁగూడ శయ్యయందు కొంతసేపు శయనించి అతఁడు నిద్ర
బోవుచున్నసమయంబున మెల్లగాలేచి జనాభాయియుండెడు గుడి
సెయందు ప్రవేశించి ఆమెను వీక్షించి నాకు క్షుద్బాధగాయున్నది
నీ హస్తముతో కొంతప్రసాదమువుంచుమని మందహాసముచేయగా
జనాభాయి ఓలక్ష్మీపతే దాసురాలు దేవరవారికి యీతరుణమందు
ప్రసాదము వుంచుటకు అసమర్థురాలనుగాయుంటున్నానే తమ శేష
ప్రసాదము కోణాభాయి నాకు యిచ్చెను, ఓయదుకులనందనా ఆ
యన్నము నీకువుంచుటకుతగనిదిగాయున్నది, ఓకృపాజలధే కమలా
పతే కాంచనచేలా గోవిందా గోవర్ధనోద్ధారా అఖిలజగదాధారా
అచ్యుతా అనంతాయని పలువిధములనుతిజేయుచు దేవరవారు నా
దీనదశను పరికించి నిర్హేతుకకృపాకటాక్షముతో నన్ను పావనురా
లినిగా జేయుటకు వేంచేసితిరి నావద్ద అపూర్వవస్తువులు లేవే నేను
యేమివ్వగలనని పలువిధముల చింతింపుచుండఁగా పాండురంగడు
నాకు అపూర్వములైనవస్తువులు అక్కరలేదు నీవద్దయుండెడు శేష
ప్రసాదమే నాకు భోగ్యముగాయుండును, తెచ్చియిమ్మని బలవంత
పరచుచుండఁగా జనాభాయి మధుసూదనుని మనోరథప్రకారము
తట్టలో భద్రపరచియుండెడు వుచ్ఛిష్టాన్నమును తెచ్చియుంచెను.
ఆతరుణమందు శ్రీహరి ఓ జనాభాయి నేను విడిచిపెట్టిన అన్నము
స్వాదు-రుచింపదు, నీవున్ను నాతోకలిసిభుజించినయెడల నాకు ప్రీతి
కరముగాయుండునని యిద్దరున్ను కలిసి భుజించి హస్తపాదములను
శుద్ధిచేసుకొని శయ్యయందు పరుండిరి. ఆసమయమున నామదేవు
జననియగు కోణాభాయి శ్రీహరిచర్యలనుపరికించి పుత్రునినిద్రలేపి



భగవంతుడు చేయుచున్న వినోదకృత్యములను చెప్పగా నామదేవు
తల్లివచనములను విని జనాభాయి సుశీల భక్తిప్రావీణ్యము గలిగిన
నిర్మలహృదయముగలది గనుక శ్రీపాండురంగనికి ఆమెయందు ప్రీతి
జనించి తమకృపాకటాక్షమును జూపెను, అతఁడు భక్తవత్సలుడని
మనము వినియుండలేదా, ఆమె భగవంతుని విషయమున అమిత
ప్రీతిని వుంచుకొనియుండుటనుపరికించి పరంధాముడు కృపతో సా
సుశీలయందు ప్రేమయుంచి ఆమెవాసముచేయుచున్న గుడిసెవద్దకు
వేంచేసెను, నీవాచిన్నదానిని సామాన్యురాలని యెంచకుము, శబ
రితో సమానురాలని యెంచుము, భక్తవత్సలుడు భక్తులకు ప్రియు
డనియెంచుము ఇదివింతకార్యముగాఁతలంపకుమని తల్లితో ప్రియవచ
నములు పలుకుచుండగా పాండురంగడు వీరు సంభాషింపుచుండెడు
వచనములను విని మందహాసముతో నామదేవుశయ్యవద్దకు వేంచేసి
భక్తునితోఁగూడా శయనించియుండెను. అనంతరము శ్రీహరి మరల
మూడవఝాముమునందు జనాభాయి శయనించియున్న గుడిసెలో
ప్రవేశించి ఆమెను నిద్రలేపి తిరగలిరాయినితెచ్చి నాపడతిముందు
యుంచి నేను పిండివిసరెదను నీవు తిరగలిమీదు చేయియుంచుకొని
పాటలుపాడుచుండుమని పాండురంగడు చెప్పఁగా జనాభాయి తమ
మనోభీష్టముప్రకారము చేయుచున్నాననిచెప్పి తనతలవెంట్రుకలను
ముడివేసుకొని రాతిమీదుగా కరమును వుంచుకొని భక్తాగ్రేసరుల
దివ్యచరిత్రములను పాడుచు నాకు భగవద్భక్తులసంబంధము గలిగి
నేను పావనురాలనై యుంటున్నానను అన్వయార్థమున్ప్రశించునట్లు
పాడుచు శ్రీదామోదరుని పాదచ్ఛాయయందు వొదిగి వర్తింపుచు
వారికృపాకటాక్షవీక్షణ్యమునకు పాత్రుఁడై ప్రకాశింపుచుండెడి
నామదేవు నాకు తండ్రిగాయున్నారు, జ్ఞాన భక్తి వైరాగ్యశీలురై
గురుశుశ్రూషాపరులై తత్వహితపురుషార్థలక్షణములనెఱిఁగినవారై

ఈజగతియందు తమ్ముదామెఱుగక బద్ధసంసారులుగా తిరుగుచున్న పామరజనులకు జ్ఞానోపదేశముచేసి భగవంతునిచరణారవిందములను చేర్చునటువంటి నివృత్తినాథుడు జ్ఞానదేవు నాకు సహోదరులుగా యుంటున్నారు, అష్టవిధ పుష్పములచే పరంధాముని పూజింపుచు అఖిలభూతాత్మలయందు సమభావంబుంచి పతిశుశ్రూషయందు ప్రీతి గలిగి భర్తయే దైవమని యెంచుచున్న రాజాభాయి నాకు జననిగా వలయును, అఖండజ్ఞానపరిపూర్ణులై బ్రహ్మరుద్రాదుల కలభ్యుడుగా నుండు శ్రీమన్నారాయణ దివ్యచరణారవిందమరందపానానందమత్త చిత్తుడై వెలుగుచుండెడు గోరాకుంబార్ నాకు మామగావలెను. సర్వభూతాంతర్యామియై సర్వరక్షకుడై సర్వశేషియై వేంచేసియుం డెడు శ్రీహరిని సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు యెడతెగక మననముచేయుచు అమందానందమును జెందియున్న సావతమాలి నాకు బంధువు, ఇట్టి ప్రభావసంపన్నులగు భాగవతులందరు అఖి లాండకోటి బ్రహ్మాండనాయకుడై ఆదిమధ్యాంతరహితుడై అనం తావతారుడై వేంచేసియుండు జగదాధారుడగు శ్రీమన్నారాయ ణుని వశవర్తిగాజేసుకొని ఈ భూమండలమందు అనేకమహాత్యము లనుజేయుచు వెలుగుచుండిరి, వారిప్రభావములను నేనేమని వర్ణింప గలను, నాతండ్రియగు నామదేవు యాత్రజేయుచు హస్తినాపుర మందు ప్రేతముగానున్న ధేనువును రక్షించెను, నాగనాధుని శివా లయమందు భగవద్గుణానుభవ మహాత్యముచే తూర్పుముఖముగా నున్న నాగనాధుని పశ్చిమముఖముగా త్రిప్పించెను, ఇదియునుగాక భగవంతునికి అంతరంగభక్తుండగుటచేత ఆతడు అపారకృత్యములను చేసెను. జ్ఞానదేవు మహిషముచే వేదములను పలికించెను, గోరా కుంబారు శిశువును మట్టితో కలిపిత్రొక్కి తనకరంబులను ఛేదించు కొని శ్రీపాండురంగని సన్నిధికిరాగా భగవంతుడు భక్తునికి కరంబు



లను మరణముజెందిన బిడ్డను కృపచేసెను. సావతమాలి తనపొట్టను చీల్చి శ్రీహరిని గర్భమునందు యుంచుకొనియుండగా భగవంతుడు నామదేవుని భక్తికి మెచ్చి వెలుపలికివచ్చెను, భక్తశిరోమణియగు కబీరు వస్త్రములనునేయుచుండఁగా పరంధాముం డతనికి సహకారి యగుచు నేతనేసి తమదర్శనమొసగి రక్షించెను. వేదంబులు జగధీ శుని కల్యాణగుణములను కొనియాడుటకు శక్యముకాక (అప్రాప్తా మనసాసహ) యని విడిచిపెట్టియుండగా నేను కేవలమగు మానవ స్త్రీగా జన్మించినాను, గనుక అట్టి జగన్నాధుని కొనియాడుటకు నాతరమగునా, భాగవతులకున్ను తనకున్ను ఈశ్వరునికిన్ని కలిగి యున్న బాధ్యతలను సుసర్వముతో పాడుచు భగవద్భాగవతచిం తనారతయై పులకాంకితగాత్రియగుచు గానముచేయుచుండెను. ఈ చిన్నది పాడుచుండెడి పాటలను కోణాభాయి వినుచుండి మిక్కిలి క్రోధముతో తటాలున పడకవిడిచిలేచి జనాభాయి పిండివిసరుచున్న గదిలోప్రవేశించి ఓసీజనాభాయి నీవుఅన్యులకు కూలినియిచ్చి పిండి విసరించడము బాగుగానున్నదాయని ధిక్కరించి యడుగుచుండగా జనాభాయి మరుమాటవచింపక మౌనమువహించియుండెను. ఆతరు ణంబున కోణాభాయి కఱ్ఱను చేతనుంచుకొని ఓపడుచా నీకు పిండి విసిరియిచ్చుచున్నదానికి నీవు కొంతధాన్యముయివ్వనిపక్షమునా అది నీకు సహాయపడునా, మనసంసారము తత్కాలమందు దుర్బలదశలో యుండడమును నీవు తెలుసుకొనియుండిన్ని యిట్లుచేయడము నీకు ధర్మమాయని వకదెబ్బవేసెను. ఆమెకొట్టినదెబ్బ పిండివిసరుచున్న పాండురంగనికి తగిలినందున జనాభాయి పరితాపముతో ఓజననీ శ్రీ హరియగు పాండురంగడు దాసురాలితోగూడి పిండివిసరుచున్నాడే యని భయభ్రాంతులుగలిగి విన్నవించగా కోణాభాయి తత్తరపాటు తో నిశ్చేష్టితురాలుగా నుండుతరుణంబున నామదేవు ఆపలుకుల

నాలక్షించి తక్షణమే శయ్యనువిడిచిలేచి జనాభాయియుండెడు గుడి
సెలో ప్రవేశించి తల్లిని పరికించి జగన్నాథుడు జనాభాయి జ్ఞాన
భక్తివైరాగ్యములకు మెచ్చి పరమానందభరితుడై పిండినివిసరుచు
న్నాడు, జనాభాయి సుశీలగా నున్నందున భక్తిప్రావీణ్యముచేత
జగన్నాథుని వశపరచుకొనెనని భగవంతునికల్యాగుణవిశేషములను
నుతింపుచుండగా జనాభాయి అత్యంతభక్తివిశ్వాసములతో భగ
వంతుని చరణాంబుజములను ధ్యానింపుచు తాను తెలియక చేసిన
తప్పునుసైరించి రక్షింపుమని తనస్థానమునకు తిరిగివచ్చి తనమనం
బున యిట్లు వితర్కింపుచున్నది. అయ్యో సంసారమును భరింపజా
లమను దుఃఖముచే మంచిచెబ్బరలు తెలియక మహత్తయిన పాపము
నకు పాలుపడి అతిమనోహరమై శ్యామసుందరదివ్యమంగళవిగ్రహు
డగుచు సుకుమారుడై వేంచేసియున్న శ్రీమన్నారాయణమూర్తిని
బ్రహ్మరుద్రేంద్రాదిదేవతల మనోవాక్కులకగోచరుడుగానున్న జగ
దీశుని నాహస్తములతో కొట్టితినేయని అనుతాపముజెంది పరితపిం
చుచుండెను. ఆతరుణమందు భగవంతుడు జనాభాయితో ప్రియవ
చనములుపలుకుచు అమందానందమును జెందియుండగా జనాభాయి
అపవాదము సంభవించునేయని భీతిని జెంది ఓపురుషోత్తమా పుండ
రీకాక్షా గోవిందా గోపికామనోహరా పరమపురుషా పతితపావనా
మాధవా మధుసూదనా నరహరీ పరంధామా శ్రీహరీ శ్రీరామా
దేవరవారిని సేవించుటకొరకు తమ సన్నిధానమునకు సకల భక్త
జనులు వత్తురు, తాము సన్నిధియందు లేకుండినపక్షమున బ్రాహ్మ
ణోత్తములు భక్తులు పురజనులు ఈవిశ్లేషము సహింపజాలక
వెదకుటకు ప్రయత్నింతురు, గనుక దేవరవారు యింతలో ఆస్థాన
మునందు వేంచేసియుండడము యుక్తముగాయుండునని పరిపరివిధం
బులుగా ప్రార్థింపుచు ఓనీరజనాభా దాసురాలను సర్వకాలసర్వా



వస్థలయందు తమ తిరునామములను నుతింపుచుండునట్లుగా కృపతో
రక్షింపవేయని పలువిధముల నుతింపుచుండగా శ్రీపాండురంగడు
తక్షణమే వెడలువానివలె నటనజేయుచు మణిమయఖచితమగు తన
కంఠాభరణమును అచ్చటవిడిచిపెట్టి మరచినవానివలె జనాభాయి
జీర్ణవస్త్రమును తన భుజమునందు వేసుకొని సన్నిధానము జొచ్చి
యుండెను. ఇంతలో అరుణోదయమైనందున అఖిలభక్తజన సమూ
హములు స్నానసంధ్యాద్యనుష్ఠానములను తీర్చుకొని సన్నిధానము
నందు ప్రవేశించి శ్రీపాండురంగని సేవింపుచుండ అర్చకులు హారతి
యిచ్చుచుండగా సేవింపుచున్నవారిలో కొందరు శ్రీపాండురంగని
కంఠమునందు ప్రకాశించెడు కంఠాభరణము కానకయుండడమున్ను
శ్రీహరి భుజమునందు జీర్ణవస్త్రము యుండడమును వీక్షించి భక్త
లున్ను విప్రోత్తములున్ను యీ సందర్భాసందర్భములు తెలియని
వారగుటచేత సన్నిధితలుపులకు వేసియుంచినతాళము వేసినట్లుగా
యుంటున్నదే, జగదీశుడు కంఠమునందు ధరించియున్న కంఠాభర
ణము యెవరు ముచ్చిలించుకొని ఆభరణమునకు మారుగా జీర్ణాం
బరమును వేసిపోయినారని జనులందరు వితర్కింపుచుండగా వారి
లోనొకడు జీర్ణాంబరమునుపరిశీలించిచూచుపుడు కొందరిపాతచేలము
జనాభాయిదిగాయుండవచ్చునని చెప్పినందున తక్షణమే అర్చకులు
జనాభాయియుండెడు గుడిసెకువచ్చి ఆమెను నానావిధనిందితవచన
ములతో దూషింపుచు ఓపడతీ నీవు పాండురంగని కంఠాభరణము
యెచటదాచినావు యదార్థమును చెప్పుమని కఠినోక్తులతో బెదరింపు
చుండగా నాసుశీల ఓవిప్రోత్తములారా నేను మాధవునిసాక్షిగ
కంఠాభరణమును యెత్తలేదు, నేను తస్కరించివుంచుకొనియున్నట్ల
యితే నానేత్రములు తెలియకపోవునని చెప్పుచుండగా అర్చకులు
ఆసుదతి వచనములను పాటింపక యింటిలోయుండెడు జీర్ణవస్త్రము

లను పరిశోధించుచుండునప్పుడు కంఠాభరణము దిగువపడినందున అర్చకులు ఆభరణమును చేతికెత్తుకొని ఈపడుచు భగవంతుని కంఠాభరణమును తస్కరించియుంచుకొన్నదని శిక్షకుపాత్రురాలినిగా జేసి శూలమునందు దించుటకొరకు చంద్రభాగానదీతీరమునకు నడిపించుకొనివచ్చిరి. ఆతరుణమందు జనాభాయి ఓజగదీశా నేను నిరపరాధిని; నన్ను రక్షించుటకు దేవరవారుతప్ప వేరు గత్యంతరము లేదేయని తనమనంబును పదిలపరచుకొని ఓశ్రీహరీ నరహరీ నారాయణా భక్తవత్సలా ఆపద్బాంధవా ఆదికేశవా అనంతావతారా నామొరాలకించి రక్షించుటకు యిది మంచితరుణము, రావే కావవే, దేవరవారు ఆదికాలమునందు గజేంద్రుని మొరవిని గ్రక్కున రక్షించిన రీతిగాను, దుశ్శాసనుడు ద్రౌపదిని మానభంగము గావించినప్పుడు వలువలొసగ రక్షించినట్లుగాను, ప్రహ్లాదుని బ్రోచుటకు నృసింహావతారమును ధరించిరక్షించినట్లుగా నాకు తత్కాలమందు సంభవించిన ప్రాణాపదను తొలగించి నాయందు మోపిన అపవాదమును నివర్తియగునట్లు జేయవే ఓ పురుషోత్తమా పతితపావనా దామోదరా దానవాంతకా పాండురంగా పండరినాథా భక్తవత్సలా దశరథనందనా దాసురాలు నిరపరాధినిగాయుండిన్ని యిట్టి దుఃఖసాగరమందు మునిగి దరిగానక తపించుచున్న దానను, దేవరవారుతప్ప సర్వరక్షకులు యెవరున్ను లేరుగనుక ఓనారాయణా నరకేసరీ నందకుమారా నవనీతచోరాయని పరిపరివిధముల నుతింపుచుండుతరుణంబున శ్రీపాండురంగడు వాత్సల్యముతో శూలమును నీరుగావించెను. వీటినిపరికించి సర్వజనులు సంభ్రమాశ్చర్యములు జెందుచు ఈచిత్రము శ్రీహరి కృపాకటాక్షమువలన గలిగిన మహిమావిశేషమని సన్నుతింపుచు భగవంతుని అనంతతిరునామములను భజింపుచుండఁగా జనాభాయి నామదేవును గౌరవపరచుచు పాండురంగని



కృపాకటాక్షమును బొగడుచు పరంధాముని కల్యాణగుణములను కొనియాడుచు తనగృహంబునకు జనెను.

ఒకదినము జనాభాయి తన గుడిసెయందు నిశ్చలచిత్తములో శ్రీపాండురంగని లీలావినోదములను కీర్తనారూపముగ రచించి గానముచేయుచుండఁగా ఆకవితలను పాండురంగడు సన్నిధియందు యేకాంతముగా లిఖించునట్టి తరుణమున శ్రీహరిని సేవించుటకు జ్ఞానిదేవు యేతెంచి పరంధాముడు వ్రాయుచుండుటనువీక్షించి అద్భుతముజెంది సాష్టాంగ దండప్రణామము లొనరించి శ్రీహరీ వాసుదేవా విఠలా పాండురంగా నీరజాక్షా నిర్వికారా దేవరవారు లిఖించెడు అపూర్వవిషయములు యేవైయుండును తాము దాసునికి సవిస్తారముగ కృపతో విన్నవించవలెనని ప్రార్థింపుచుండగా పరంధాముడు జ్ఞానదేవును పరికించి నాదాసురాలగు జనాభాయి ప్రీతితో పాడుచున్న కీర్తనలను లిఖించుచున్నానని ప్రీతిపూర్వకముతో పలికిరి. ఆ వచనములను జ్ఞానదేవు శ్రవణానందముగావిని ఓశ్రీహరీ దేవరవారిని భక్తురాలు నుతింపుచుండుటను తాము తమ శ్రీహస్తములతో లిఖించడము అపూర్వముగానున్న అతిశయించతగినకార్యముగా వుంటున్నదేయని విన్నవించుచుండఁగా భగవంతుడు భక్తునియందు కృపయుంచి ఆదరపూర్వకముగా జనాభాయి భక్తిపారవశ్యముచేత తన స్వబుద్ధిని వినియోగపరచి రచించి గానముచేసెడి కీర్తనలు వినను వినను మనోహరముగానున్న మధురరసముతోగూడినదిగాయుండుటనుగని నేను ప్రీతితో వ్రాయుచున్నాను నీవు సంశయించవలసిన పనిలేదని ప్రియవచనములు పలికి నామదేవు వాసముచేయుచున్న గృహమునకు భగవంతుడు వేంచేయుచుండగా జ్ఞానదేవుతోఁగూడా భక్తజనులు గుమిగూడి శ్రీహరిని వెంబడించి జనుచుండ పాండురంగడు నామదేవుల గృహము ప్రవేశించిరి, భక్తజనసమూహముతో

జ్ఞానదేవులు లోపలప్రవేశించినదే నామదేవు భగవంతునికిన్ని భక్త జనులకున్ను సాష్టాంగదండప్రణామములొనరించి వుచితాసనముల యందు గూర్చుండబెట్టి పరమానందభరితస్వాంతుడై పాండురంగని సన్నుతులుచేయుచుండఁగా భగవంతుడు నామదేవునుపరికించి జనాభాయిని యిచటికిరప్పించుమని అనుజ్ఞయొసగగా తక్షణమే నామదేవు ఆసుదతిని రప్పించెను. అంత నాసుశీల భక్తవత్సలుని నేత్రానందముగా సేవించి సాష్టాంగదండప్రణామములొనరించి నుతింపుచుండగా శ్రీహరి జనాభాయిని తమశ్రీహస్తములతో లేవనెత్తి ఓసుశీలా నీవు రచించిన కవితలను యీప్రపంచమునందు యేనరుడు పాడుచుండునో ఆనుజునికి ఇహలోకపదవులుగలిగి పుత్రమిత్రకళత్రాదులతో సుఖించుచుండునని ఆమె భక్తిప్రావీణ్యములను సర్వజనులకు తెలియునట్లు విశదపరచి తమ సన్నిధానమునకు వేంచేసిరి, ఇట్టి విచిత్రలీలలను వినోదకరముగా నాచరించుచున్న శ్రీహరి దివ్యచరిత్రములను నుతించుచుండునట్టివారు యిష్టసిద్ధిని బొందుదురు.

శ్రీసీరజాపతయేనమః.

# మత్స్యేంద్ర గోరక్షకుని చరిత్రము.

ఒకతరుణంబున శంకరుడు పార్వతీదేవితోఁగూడి సముద్రతీరమందు విహరింపుచు శ్రీరామమూర్తిని ధ్యానింపుచుండఁగా గిరిజాదేవి గరళకంఠుని పరికించి ఓనాథా దేవరవారు సకలజగత్కారణకర్తలుగాయుండిన్ని యెవరితిరునామములను సర్వకాలంబులయందు స్మరించుచున్నారని ప్రీతితో నడుగగా శాంబశివుడు యిట్లు పలుకుచున్నాడు. ఓదేవీ నేను సదాకాలము శ్రీరామమూర్తియొక్క దివ్యమంగళస్వరూపమును జ్ఞాననేత్రములతో సేవింపుచు వారితిరునామములను ధ్యానింపుచుండెదను. అతఁడు అఖిలాండములకున్ను నా



కున్ను నాతండ్రియగు బ్రహ్మదేవునికిన్ని అధిపతియై వేదాతీతుడై విశ్వంభరుఁడగుచు జ్ఞానస్వరూపముతో వెలుగుచున్నాడు, అతఁడే నీకు రక్షకుడు, వారితిరునామము నీకు జీవాధారమని యెంచుము, నీవు రామనామమును సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు నిర్మలచిత్తముతో ధ్యానింపుచుండుమని హితోపదేశముచేయఁగా గౌరీదేవి తన ప్రాణకాంతుని చరణకమలములకు దండప్రణామములొనరించి పరంధాముని పరతత్వార్థములను కృపాకటాక్షముతో విన్నవింపవేయని ప్రార్థింపుచుండఁగా శంకరుడు ప్రీతితో జీవగోప్యమగు పరతత్వార్థములను కృపాకటాక్షముతో బోధింపుచు సాగరతీరమునందు విహరించుచున్నతరుణంబున నీటిలో యుండెడు చేపయొకటి గర్భవతిగాయుండి శంకర వుమాదేవి తిరుముఖమండలములను వీక్షించుచుండఁగా గర్భములో యుండెడు పిండము వీరు భాషించుచున్న తత్వబోధములను విని తక్షణమే గర్భములోనుండి వెలుపలికివచ్చి మత్స్యేంద్రుడను తిరునామమునుధరించి ప్రపంచమాద్యంతము ప్రసిద్ధిజెందినవాడుగానుండెను. అతడుసకలార్థములనుగ్రహించియుండుటచే శంకరమూర్తితో సమానుడై మహావైరాగ్యపరుడై జ్ఞానస్వరూపుడై శరీరమందలి మమకారమును విడిచి తారకనామమును సర్వకాలములయందు మననముచేయుచు స్వేచ్ఛగా సంచరింపుచు సర్వతీర్థక్షేత్రములను సేవింపుచు స్థిరచిత్తుడై భిక్షాటనవృత్తిచే దేహయాత్రను జరుపుకొనుచు శాంతస్వరూపుడై ద్వాదశవర్షములు యాత్రచేయుచుండెను. ఇట్లు కాలయాపనముచేయుచు వకదినం బొకపట్టణపు వీధియందుబోవుచు వక వర్తకుని గృహద్వారమునందునిలిచి (అలక్) యనుశబ్దముతో భిక్షమడుగగా తక్షణమే గృహమునందు వసింపుచున్న వర్తకునిపత్ని భిక్షను తెచ్చి మహాత్ముని సుందరాకారమును పరికించి పరమానందముతో భిక్షనుయిడి దండముసమర్పించి

అమితప్రీతితో స్వామీ కమలములవంటి నేత్రములతో స్వర్ణమయం బైన శరీరకాంతినిగలిగియున్న దేవరవారు మహాత్ములవలె కనబడు చున్నారు, మాకు శ్రీహరి కృపాకటాక్షమువలన సకల భోగభాగ్య ములు మితిమీరియుండిన్ని పుత్రభాగ్యము లేనందున మేము అమిత చింతతో గుందుచున్నారము, గనుక తాము మాయందు కృపయుంచి పుత్రసంతానము గలుగునట్లు వరప్రసాదము కృపచేసి మాకోర్కెను సఫలము గావింపవలయునని భయభక్తులతో ప్రార్థింపుచుండఁగా మత్స్యేంద్రునికి ఆమెయందు కృపకలిగి విభూదినికృపచేసి పరంధా ముని కృపాకటాక్షమువలన నీకు షోడశకళలతోనిండిన పుత్రుండుద్భ వించును నీవీసవిస్తారమును యితరులతో చెప్పకుము, నేనుయిచ్చిన ప్రసాదమును నీవు ధరించినయెడల నీమనోరథము పూర్తియగునని చెప్పి వెళ్లిపోయెను. అనంతరమాయువతి మహాత్ముఁడు యిచ్చినట్టి విభూదిని మహాప్రసాదమనియెంచుచు ప్రియస్నేహితురాలగు నొక వనితను చేరబిలిచి అమితసౌందర్యముతో వెలుగుచున్న మహాత్ము డొకడు భిక్షాటనమునకు చనుదెంచినందున నేనా మహాపురుషుని వీక్షించి వందనములుచేసి నాకు పుత్రసంతానము లేనందున వరప్ర సాదము కృపచేయుడని వేడుకొన్నందున అతడు కృపాకటాక్షముతో విభూదిని యిచ్చి నీకు పుత్రుడుజనించునని చెప్పిపోయెను, అతఁడు మంత్రతంత్రములు తెలిసిన మహాత్ముఁడుగా యుండునని నేను తలం చెదను, ఇట్టివిషయములను నీవు వినియున్నను చూచియున్నను విన్న వింపవేయని యడుగుచుండగా స్నేహితురాలు యీసంగతులు కడ పంతయు విని అమ్మా అతఁడు యిచ్చిపోయిన విభూదిని నీవు ధరించు కొనవద్దు, జోగులు కపటస్వభావముతో స్త్రీలను వశపరచుకొని పగటికాలమందు వారిని కుక్కలవలె చేసియుంచుకొని రాత్రులలో వాటిని యథాప్రకారము స్త్రీలనుగా జేసికొని రమించుచుందురు



గనుక నీవు అతడు యిచ్చిపోయిన విభూదిని ధరింపక పారవేయుడము వుచితముగానుండునని హితబోధముచేయునట్లు దుర్బోధనచేసిపోగా వర్తకునిభార్య దానిమాట నిజమైయుండునని విభూదిని తత్క్షణమే పొయిలో పారవేసి విఫలయయ్యెను. ఈమాయాప్రపంచమునందు దుష్టులు మధ్యవర్తులుగాయుండి అత్తలకు కోడండ్లకు తల్లులకు బిడ్డ లకు తీరనికలహములు పెట్టుచుందురు, అటువలె పరులవచనములను విని ఈనిర్భాగ్యురాలు ఫలమును పోగొట్టుకొనెను. తదనంతరము మత్స్యేంద్రుడు ద్వాదశవర్షములు భూసంచారముచేసి మరల వర్త కునిగృహంబునకు భిక్షకురాగా గృహిణి భిక్షను తెచ్చివుంచునపుడు అతఁడాయువతిని పరికించి ఓనారీమణీ నీకు పుత్రుడుద్భవించునటుల విభూదినికృపచేసినందున నీకు పుత్రుడుజనించియుండును, నీవాపుత్ర శిఖామణిని నాకుజూపించుమని ప్రీతితో నడుగఁగా వర్తకుని భార్య మహాత్ముని వచనములనువిని నిశ్చేష్టితురాలై మరుమాట వచింపక మౌనమువహించియుండఁగా తపసి ఆమెను పరికించి యెందుకు భీతి జెందెదవు, నేనుయిచ్చిపోయినప్రసాదమును వ్యర్థపరచితివాయేమి నిజమును విన్నవింపుమని యడుగుచుండునప్పుడు ఆసుదతి వారితో యదార్థమును తెలియపరచనిపక్షమున వారు క్రోధముగలవారై శపించుదురని భీతితో భయభక్తి విశ్వాసములు గలిగి స్వామీ నా స్నేహితురాలిదుర్బోధనలనువిని తాముకృపచేసిన విభూదిని ధరించు కొనక నాదురాదృష్టమువలన ప్రసాదమును పొయిలో పారవేసితిని, నాప్రారబ్ధకర్మము నన్ను విఫలగావించెను. గనుక స్వామీ నేనొన రించిన అకృత్యమును సైరించి దేవరవారు నాయందు కృపాకటా క్షమునుజూపి రక్షించవలెనని మిక్కిలివినయముతో ప్రార్థింపుచుండ మత్స్యేంద్రుడా సుదతివచనములను విని ఓసాధ్వీ వరప్రసాదమును వ్యర్థపరచితివి, అయినను నీవు పొయిలోయుండిన కుప్పను పారవేసి

నట్టి జాగాను చూపింపుమని యడుగుచుండునప్పుడు ఆమె బహుదిన
ములుగా పంటపొలములకుగాను చేర్చియుంచుచున్న కుప్పమిట్టను
చూపెను. తక్షణమే తపసి కుప్పమిట్ట యుండెడు స్థలమున కేతెంచి
(అలక్) యని కేకవేయగా (ఆదేస్) యను ధ్వని మిట్టలోపలినుండి
వినబడెను, అట్టితరుణమందు అచట గుంపులుగూడి వేడుకార్థముగా
నిలిచియుండెడు జనులందరు వింతనుజెంది కుప్పమిట్టను పరిశీలించి
చూడఁగా ద్వాదశాబ్దముల వయస్సుతో గూడి సుందరమైన దేహ
కాంతులతో ప్రకాశింపుచున్న బాలుడొకడు ధ్యానపరుడగుచు సకల
సద్గుణములతో నొప్పుచు నిష్ఠాగరిష్ఠుడుగా కూర్చునియుండుటను పరి
కించి సర్వజనులుసంభ్రమాశ్చర్యములు జెందియుండ మత్స్యేంద్రుడు
బాలునిచెంతకువచ్చినదే అతఁడు ధ్యానమునువిడిచి నిమీలితనేత్రు
డగుచు లేచి మిక్కిలివినయముతో సాష్టాంగదండప్రణామములొనర
రించిచగా మత్స్యేంద్రుడు బాలుని లేవనెత్తి కృపాకటాక్షముతో
గోరక్షకుడను తిరునామముంచి అతనికరమునుపట్టుకొని పోవుచున్న
తరుణమందు వర్తకసతీపతులు తపసి చెంతకు వచ్చి సాష్టాంగదండ
ప్రణామములొనరించి అంజలీహస్తులై ఓస్వామీ దేవరవారు మా
యపరాధములను క్షమించి పుత్రుసిగాంచుటకు వరప్రసాదము కృప
చేసి రక్షించుడని ప్రార్థించుచుండగా తపసికి వారియందు కృపగలిగి
ఆర్యులచే పూజింపఁబడెడు సత్పుత్రుఁడు జనించి మీవంశోద్ధారకు
డుగాయుండునని ఆశీర్వదించి అరణ్యమునకు వెళ్లిపోయిరి.

అనంతరము మత్స్యేంద్రునితోఁగూడ గోరక్షకుడు సంచరిం
చుచు కొంతకాలము చనినపిమ్మట శిష్యుడు తన ఆచార్యులవారిని
పరికించి స్వామీ దేవరవారు దాసునియందు కృపయుంచి మంత్రా
ర్థమును కృపచేసి నన్ను ధన్యునిగావింపుడని ప్రార్థనచేయుచుండగా
మత్స్యేంద్రుడు శిష్యునిపేక్షించి నీవుశ్రద్ధాభక్తులుగలిగి శుశ్రూషలు



చేయుచుండినయెడల నీకు నేను మంత్రరాజమును అనుగ్రహింపు
చున్నాను. ఆర్యులు శిష్యులగుణములను అనుష్ఠానములను పరీక్షిం
పక పరమగోప్యముగానున్న తిరుమంత్రార్థమును అనుగ్రహించరని
పలువిధములైన హితములను బోధించుచుండినందున గోరక్షకుఁడు
సేవాతత్పరుడగుచు సకలశుశ్రూషలుసలుపుచు వారినియెడబాయక
సర్వతీర్థములు సేవింపుచు కొంతకాలము సంచరించుచుండగా ఒక
దినమొకపురోద్యానవనమునందు మత్స్యేంద్రుడు విశ్రమించి గోర
క్షకుని భిక్షను తెమ్మని ఆజ్ఞాపించినదే శిష్యుడు తక్షణమే పట్టణము
ప్రవేశించి వకబ్రాహ్మణుని గృహద్వారమునందునిలిచి భిక్షాందేహి
యని కేకవేయగా బ్రాహ్మణస్త్రీ ప్రసాదమున్ను వడలున్ను తెచ్చి
యుంచెను, గోరక్షకుడు బ్రాహ్మణయువతి యిచ్చిన ప్రసాదమును
గైకొని పరమానందభరితుడై జనుచున్నతరుణమందు అచట యుం
డిన జనులు ఇతడు ప్రాప్తానుసారము లభ్యమగుననుతలంపుతో నిర్భ
రత్వము గలిగియుండెడు సత్పురుషుఁడని కొనియాడుచుండఁగా గో
రక్షకుడు భిక్షనుచేకొని గురువువద్దికితెచ్చి సమర్పించెను. అతఁడా
ప్రసాదమును భుజించి వడలు అత్యంతమధురపాకముగా గనఁబడు
చున్నది గనుక రేపటిదినమున్ను యిట్టివడలతోగూడిన ప్రసాదము
తెచ్చియిమ్మని శిష్యునికాజ్ఞాపించిరి. మరుదినమాసచ్ఛిష్యుడు ఆచా
ర్యుల మనోరథము పూర్తిపరచుటకు ప్రాతఃకాలమందు లేచి స్నా
నానుష్ఠానములనుతీర్చుకొని జోల్నాను చేకొని ముందుదినము తా
నేగిన బ్రాహ్మణగృహంబునకు జని భిక్షమడిగి అమ్మా మీరు నిన్న
కృపచేసినరీతిగా వడలతో గూడిన ప్రసాదము కృపజేయుడని పరి
పరివిధములుగా. ప్రార్థించుచుండ బ్రాహ్మణయువతి స్వామీ నిన్న
టిదినము మాగృహంబునందు బ్రాహ్మణులకు తదీయారాధన జరిగి
నందున మీకు వడలతో ప్రసాదము లభ్యమయ్యెను, నేటిదినము

మేము వడలు చేయలేదు ప్రసాదముమాత్రము యిచ్చుచున్నాను గొనిపోవచ్చునని చెప్పగా గోరక్షకుడు అమ్మా నాకు అన్నముమాత్రము పెట్టనక్కరలేదు, అష్టసిద్ధులతో చతుర్విధసాయుజ్యములు యెదుర్కొనివచ్చినను నాయాచార్యులు కన్నెత్తిచూచువారుకారు గనుక తాము వారిమనోరథమును పూర్తిగావించుటకు అవశ్యము వడలనుచేసి యివ్వవలెనని నిర్బంధపరచుచుండఁగా బ్రాహ్మణవనిత అచటయున్న వారినిపరికించి సారమేయమున కొకదినము అన్నము వుంచినయెడల మరుదినమాశునకము ముందుదినము భుజించినరీతిగా కోరుచున్నది, అదేప్రకారమీవేషధారి నిన్నటిదినము వడలతోటి అన్నము గొనిపోయెను, మరల నేఁడున్ను వడలుయిమ్మని నిర్బంధపరచుచున్నాఁడని పరిహాసాస్పదముగా చెప్పుచుండుటను విని గోరక్షకుడు అమ్మా నేను కుక్కకంటె హీనమైనవాఁడననుటకు సందియముండదు, అయినను మీవద్ద వడలనుపుచ్చుకొనక నేనీస్థలమును విడిచిపోవువాడనుకానని లండతనముచేయుచుండ విప్రవనిత వాడు చేయుచున్న పిడివాదమునుపరికించి పెద్దగొంతుతో నీవు మొండితనము చేయుచుండుటచేత అలభ్యమగు పదార్థము యెట్లు లభ్యమగును, నీవు యిప్పుడు నీనేత్రమును నాకు తీసియిస్తువాయని పరిహాసముచేయుచుండగా గోరక్షకుడు అమ్మా నేను తమ కోరికెప్రకారము నిరభ్యంతరముగా నానేత్రమును తీసియిచ్చుచున్నాను, మీరు అభ్యంతరము చెప్పక వడలను చేసియివ్వవలెనని చెప్పగానే విప్రసతి అతనివచనములను విని వృథాజల్పములు పలుకుచుండుటచేత యేమి ప్రయోజనమని చెప్పఁగా తత్క్షణమే గోరక్షకుడు తననేత్రమును తీసి ఆమెకు యివ్వవచ్చుటనుపరికించి అదరిపడి భయభ్రాంతులుగొన్నదై అతని కంటిలోనుండి కారుచుండెడు రక్తమును తుడిచి అతని దృఢవైరాగ్యమునకు సంతసించి ఈమహానుభావుఁడు తాపసపుత్రుడుగా



యుండునని సాష్టాంగ దండప్రణామము లొనరించి నిలిచియుండఁగా గోరక్షకుడు విప్రసతిని పరికించి అమ్మా భీతిజెందకుడని ధీరత్వముతో శాంతశమదమాదులుగలవాడుగా నుండుటచేత గురుధ్యానము చేయుచు వేదనజెందక చికిత్సలేమిన్ని చేయక స్థిరచిత్తుడుగానుండుటను గని బ్రాహ్మణయువతి తత్క్షణమే పాకశాలప్రవేశించి పప్పును నానబెట్టి రుబ్బి వడలుచేసి గోరక్షకునికి యిచ్చి ఇచట జరిగిన సవిస్తారమును యితరులతో చెప్పకుమని దండప్రణామములొనరించెను. అటుపిమ్మట గోరక్షకుడు తననేత్రమును చేలముతో మూసియుంచుకొని పురిని విడిచి ఆచార్యులు విశ్రమించియున్న వుద్యానవనమున కేతెంచి వడలను వారిముందుగానుంచి ఆరగించుడని ప్రార్థించెను. అంత నామత్స్యేంద్రుడు శిష్యునిపరికించి యింతసేపు తాళివచ్చినందుకు కారణమునువివరింపుమనగా గోరక్షకుడు స్వామీ తనకున్ను విప్రవనితకున్ను జరిగిన సంవాదములను తాను నేత్రమును తీసియిచ్చి వడలను చేకొనివచ్చిన వృత్తాంతమును విన్నవింపఁగా గురువు శిష్యునిపరికించి అయితే నీవు నాకుయింకొకనేత్రమును తీసియిమ్మని శిష్యుని మనోభావమును పరిశీలించుటకు యడుగఁగా అతఁడు ధన్యోస్మియని తనరెండవనేత్రమునుతీసి ఆచార్యులచరణాంబుజముల చెంత నుంచెను, అట్టితరి మత్స్యేంద్రుడు శిష్యుని దృఢాధ్యవసాయమును పరిశీలించి కృపాకటాక్షముతో శిష్యుని నేత్రములను యథాప్రకారముగా యుండునట్లు కృపచేసి నీవు పరిపక్వదశలో యున్నావని నాక్షణమందే శిష్యునికి తారకమంత్రమునువుపదేశించి వడలను ప్రీతితో భుజించి శేషప్రసాదమును శిష్యునికి కృపచేసిరి. తదనంతరము అమితప్రభావసంపన్నులయిన గురుశిష్యులు యాత్రచేయుచు దివ్యక్షేత్రములను సేవింపుచుండఁగా గురువు స్వేచ్ఛగా సంచరించి రావలయునను తలంపుతో శిష్యునివిడిచి ద్వీపాంతరములయందున్న

తీర్థములను సేవించుటకు జనెను. అనంతరము శిష్యుడు భరతఖండ మందు వెలయుచున్న సకలతీర్థములను సేవింపుచు, శ్రీహరీ కేశవా గోవిందా మధుసూదనా మాధవా ముకుందా నారాయణా యని భగవంతుని అనంతనామములను ధ్యానింపుచు, దుర్జనులను సుజను లనుగా జేసి విష్ణుహంశమువలన జనించినవాడుగానుండుటచేత ప్రపంచమందు వాసముచేయుచున్న పామరజనుల నుద్ధరించవలెనను తలంపునుగొన్నవాడై వారికి తారకమంత్రమును కృపచేసి వారిని కృతార్థులగునట్లుచేసి చాలాకాలము దేశదేశములు సంచరించుచుం డెను. తదనంతరము గోరక్షకుడు ఆచార్యులను యెడబాసి చాలాకాలము గడిచినందున విషాదముతో లోభికి ద్రవ్యనష్టము సంభవించినపరితాపము జెందుచుండునట్లుగా గోరక్షకుడు మనఃఖేదముగల వాడగుచు నానాదేశములు సంచరించి గురువుయుండుచోటు తెలియ నందున అమితచింతతో పరితపించుచుండ కాళీపానాథుడను మహాత్ముడు గోరక్షకునకు మత్స్యేంద్రుడు నివసింపుచున్న ద్వీపాంతర మును తెలిపెను. అనంతరము శిష్యుడు నానాదేశములు తిరిగితిరిగి ద్వీపాంతరమునుకనిపెట్టి వచ్చుచుండుతరుణమందు దారియందగు పడిన గ్రామము ప్రవేశించి భిక్షాటనమునకై నొకయింటివద్ద నిలిచి యుండఁగా గృహిణి యితని సుందరరూపమును పూర్ణచంద్రునితో సమానమగు వదనారవిందమును యెల్లజనులను మోహింపఁజేయునట్టి లావణ్యకాంతులను పరికించి స్వామీ దేవరవారు సమీపమందుండెడు పట్టణము ప్రవేశించిన తమకు మహత్తయిన ఆపదలు సంభవించును, ఆపురము స్త్రీచేత పాలింపఁబడుచున్నది, అచట వాసముచేయుచున్నప్రజలు సాధుజనులను యోగులను చూచినదే శిరచ్ఛేదము చేయుచుందురు, ఆరాజ్యమును పాలనచేయుచున్న వనిత పేరు ప్రేమళరాణియని వాడుచుందురు, నేను దేవరవారి క్షేమము



కొరకు యదార్థమును విశదపరచితిని, గనుక మీరాదేశమును వీక్షించుటకు తలంపుగొనక వచ్చినదారిగానే పోవడము యుక్తమైయుండునని హితమును దెలిపెనుగాని గోరక్షకుడు ఆమెవచనములు నిజముగాయుండునను నమ్మకముగలవాడై యుండిన్ని ఆచార్యులవారిని సేవించవలయునను ప్రీతిచే ఆస్త్రీవిన్నవించిన వచనములను గమనింపక స్త్రీరాజ్యమునకు బోవుచుండఁగా మార్గమధ్యమందు విశాలవృక్షముక్రింద పగటివేషగాండ్లు కొందరు పరితాపముతో విచారగ్రస్తులై చింతించుచుండుటను గోరక్షకుడు పరికించి కారణమును వివరింపుడని ప్రీతితో విచారింపగా వారు మహత్తయిన వ్యసనముతో మేము వేషగాండ్లము చక్కఁగా నాట్యమాడునటువంటి శక్తి గలవారము, మేము ప్రేమళరాణి సముఖమందు నాట్యమాడుటకు బోవుచుండ మృదంగము వాయించువానికి వ్యాధిసంభవించినందున మనఃఖేదము జనించి అనుతాపముతో తపించుచున్నామని విన్నవించగా గోరక్షకుడు అయ్యలారా నేను మృదంగముచక్కఁగావాయింతును నానేర్పును పరిశీలింపుడని వారివద్దయున్న మృదంగమును చేకొని వాయించగా నాట్యమాడువారు అతనివాద్యమునకు ఆనందముజెంది వానిం దమతో కలిపికొని ప్రేమళపురమునకు వచ్చిరి, అయితే గోరక్షకుడు వీరిమూలముగా మనకు ఆచార్యులవారి సేవ లభించునను సంతోషముచే తన ప్రభావాతిశయములనుగమనింపక నాటకులకు శుశ్రూషలుచేయుచు వారిని నానావిధములుగా స్తోత్రముచేయుచు వారితోగూడియుండగా నాటకమాడువారు రాణిగారి సభామంటపమువద్ద వేషములనుధరించి ఆడుచుండ ప్రేమళరాణిన్ని మత్స్యేంద్రుడున్ను వుచితాసనములయందుండి ప్రీతితో విని ఆనందించుచుండిరి. ఆతరుణమందు గోరక్షకుడు మత్స్యేంద్రుడు రాణికి వశుడుగా యున్నాడని సతీపతులను ఆనందము జనించునట్లు అధిక

చతురతతో మృదంగమును వాయించుచు గోరక్షకుఁడు నాటకుల
తో గలిసి వచ్చియున్నాడను అర్థము ఆచార్యుడు గ్రహించునట్లు
తన చాతుర్యమును వాద్యమూలముగా తెలుపుచుండ ప్రేమళరాణి
తన ప్రాణవల్లభుని వదనారవిందమునుపరికించి ఓ ప్రాణనాథా దేవర
వారు మృదంగవాద్యము గమనింపుడని సూచనచేయగానే మత్స్యేం
ద్రుడు మృదంగవాద్యమును శ్రద్ధగావిని తనశిష్యుడగు గోరక్షకుడు
వీరితో గలిసి వచ్చినాడను వూహతో అచట నాటకమాడువారిని
పరిశీలించిచూచుచు శిష్యుని రూపకాంతులు మృదంగము వాయిం
చువానియందు యుండుటచే అతఁడు తనశిష్యుడేయని రాణిని పరి
కించి శిష్యుడువచ్చియున్నాడు, అతఁడు నన్ను విడువడు, నీవు నాట
కమును చూచుచుండుము, నేను శిష్యునితో మాట్లాడి వచ్చుచున్నా
నని ఆసనమునువిడిచి లేచి శిష్యుని సమీపమునకువచ్చి ఆలింగనము
చేసికొనఁగా గోరక్షకుడు మృదంగమును భూమియందుంచి ఆచా
ర్యుల చరణాంబుజములకు సాష్టాంగదండప్రణామములొనరించి గురు
శిష్యులు సభామంటపమునువిడిచి యేకాంతముగా కొంతసేపు తమ
యోగక్షేమములను విశదపరచుచుండ మత్స్యేంద్రుడు శిష్యునికి స్వ
వృత్తాంతమును తెలియపరచుచున్నాడు. నేను ద్వీపాంతరములలో
గల సకల తీర్థములను సేవింపుచు హఠాత్తుగా ఈపురముప్రవేశించి
సంచరించుచున్న తరుణమందు ప్రేమళరాణి నన్ను వశపరచుకొని
రాజ్యభోగసుఖములుఅనుభవించునట్లు నాకు వుత్సాహము గలిగించి
నన్ను రమింపజేయుచుండుటచే నేనారాణిసంపర్కమువలన పుత్రుని
వడసి నీరాకను నిరీక్షించుచుంటిని. నేను రాణితో పూర్వమందు
నాశిష్యుడు నన్ను దోడ్కొనిపోవుటకు నానిమిత్తము యిచటికరుగు
దెంచినతక్షణము నిన్ను విడిచి పోవుచున్నానని నాదృఢచిత్తమును
తెలియపరచినందున నేను విడిచిపోకుండుటకు తగిన సదుపాయము



లతో నాకు ప్రేమాతిశయములను గనఁబరచుచు నాయందు అమిత
వ్యామోహమును వుంచుకొని నన్ను యెడబాసియుండక తనరాజ్య
మందు సంచరించుచుండెడు సాధువులను చూచినతక్షణము చంపు
నట్లు నియమించి యుండుటచేత యీపురమునకు సాధువులు రావ
డము లేదు. నీవు నావృత్తాంతమును యెవరివల్ల తెలిసికొని యిచటిక
రుగుదెంచితివని యడుగుచుండగా శిష్యుడు గురువును పరికించి ఓగు
రువర్యా నేను దేవరవారినియెడబాసి సర్వక్షేత్రములను తీర్థములను
సేవింపుచు తమ దర్శనము యేక్షేత్రమునందు లభ్యముకానందున
చింతాసాగరమందు మునిగి నానాదేశంబులు సంచరింపుచుండఁగా
కాళీపానాథుడను సత్పురుషుడు దేవరవారు యిచట వసింపుచున్న
సవిస్తారమును తెలియపరచినందున అనంతరము నేననేకదేశములను
గడిచి తమసేవ లభ్యమగునను యాశతో వచ్చుచుండఁగా ఈపుర
మందు సాధువులు సంచరించరాదను వర్తమానములను విని పగటి
వేషధారులతోఁ గలిసివచ్చి రాణితోఁగూడ వేంచేసియున్న దేవరి
వారిని సేవించి అమందానందమును జెందితినని తన వృత్తాంతమా
ద్యంతము విన్నవించినదే గురుశిష్యులు కొంతసేపు ప్రియవచనము
లాడుచుండ గురువు ఆనందభరితుడై శిష్యునితోగూడి అంతఃపురము
ప్రవేశించియుండఁగా శిష్యుఁడు ఆచార్యులకు శుశ్రూషలు సలుపు
చుండెను. ఇట్లుండ మత్స్యేంద్రుఁడు రాణియందు అమితవ్యామో
హముతో ప్రీతిని కనఁబరచుచుండినప్పటికిన్ని ప్రేమళరాణి చింత
జెందుచు చంద్రశేఖరునితో సమానుఁడగు ప్రియకాంతుడు శిష్యు
నియందు నాకంటె అత్యంతప్రేమనుయుంచుకొనియుండునట్లు గనఁ
బడుచున్నది, ఇందుకేమిచేయనచ్చునని యేకాంతమునందు చింతిం
పుచు తన ప్రియకాంతుడు తన్ను విడిచిపోనిమార్గముగా వారిమన
స్సును రంజింపఁజేసి వశపరచుకొని యుండవలయునను తలంపుతో

అందుకుతగిన సదుపాయములు యోచింపుచుండఁగా గోరక్షకుఁడు మత్స్యేంద్రునితో సంభాషించుటకు యేకాంతసమయమును నిరీక్షింపుచు వకదినమట్టితరుణము తటస్థపడినందున గురువర్యునికి సాష్టాంగదండప్రణామములొనరించి తిరువడిఘుళును గట్టిగాపట్టుకొని స్వామీ నిష్ప్రయోజనముగా కాలమును వ్యర్థపరచుచున్నారము, గనుక దేవరవారున్ను దాసుడున్ను యింతటితో యీదేశమునువదలి వుత్తరదిక్కునందు సంచరించవలెనని విన్నపముచేసికొనఁగానే మత్స్యేంద్రుడు శిష్యుని ప్రార్థనలను విని మనకీదేశ మత్యంతసుఖమును గలిగించుచున్నదే, మనము ఇంద్రలోకమందు వాసముచేసినను యిట్టి సుఖము మనకు లభ్యమగునా, అదియునుఁగాక నేను ప్రేమళరాణి యందు బడసినపుత్రుని యెడబాసివచ్చుటకు యిష్టముండునా నేను నిర్బంధములో చిక్కుకొనియున్నందున వారిని విడుచుటకు మనసు పుట్టునాయని తనకుయుండెడు సందర్భములను చెప్పుచుండగా గోరక్షకుడు వారివచనములకు మారుపలుకక సమయమును నిరీక్షింపుచు మిక్కిలి పరితాపముతో కాలముపుచ్చుచుండెను. ఈరీతిగా కొంతకాలముగడిచినపిమ్మట మత్స్యేంద్రుడు రాణితోనున్ను పుత్రునితోనున్ను తల్పమందు శయనించియుండుతరుణంబున పుత్రుడు కడుపుబాధవలన రోదనచేయుచుండగా మత్స్యేంద్రుడు పుత్రుని పరికించి యెందుకు యేడ్చుచున్నావని విచారించి తన పుత్రుడు జలబాధకు పోవలసియుండుటచే మంచముమీదినుండి క్రిందికిదించవలెనని చెప్పినందున మత్స్యేంద్రుడు శిష్యునిచేరబిలిచి పుత్రుడగు మీననాథుడు జలస్పర్శకు పోవలసియున్నందున నీవీబిడ్డను మంచముమీదినుండి క్రిందదించి బైటికి దీసికొనిపోయి వానిబాధతీర్చి మరల మంచముమీద విడిచిపెట్టుమని ఆజ్ఞాపించఁగానే గోరక్షకుడు మీననాథుని వెలుపలికి వెంటబెట్టుకొనివచ్చి మలవిసర్జనమువిడువుమని కూర్చుండ



బెట్టి నీవు జలవిసర్జనముచేసినయెడల నీ చెవికోయుచున్నానని, భయపరచగా మీననాథుడు గోరక్షకుడు చెవికోసునేమోయని భీతితో జనకునివద్దికి గొనిపొమ్మని చెప్పగా గోరక్షకుడు బిడ్డనుగొనిపోయి మంచముమీద విడిచిపెట్టిపోయెను. అనంతరము మీననాథుఁడు మంచముమీద మలజలములువిడిచినందున దుర్గంధము వీచుచుండుటను పరికించి గోరక్షకుని బిలిచి బిడ్డను చక్కగా కడిగి తెమ్మని చెప్పిపంపగా శిష్యుడు ఆచార్యుని వుత్తరవుప్రకారము బిడ్డను నదీతీరమునకుగొనివచ్చి బండమీద చాకలవాడు వస్త్రములను గుంజు రీతిగా వుతుకుచుండ మీననాథునికి ప్రాణముపోగానే చర్మమందు యుండెడు రక్తమును చక్కగాకడిగి అస్థులు మాంసముమొదలగు వాటిని అచ్చటనేపారవేసి చర్మమునుమాత్రము చక్కగాశుద్ధిచేసి గురువు శయనించియున్న మంచమునకుసమీపమందు ఆరవేసియుంచెను. ఆచార్యుడు కొంతసేపునిద్రించి మరలమేల్కొని శిష్యునిపిలిచి కుమారుని యెచట పరుండబెట్టినావని విచారింపఁగా గోరక్షకుడు గురువును వీక్షించి స్వామీ కుమారుని చక్కగా శుభ్రపరచి ఆరబెట్టితినని ప్రత్యుత్తరముచెప్పగానే సతీపతులు తల్పముమీదనుండి క్రిందికి దిగి పుత్రుని దేహచర్మమును పరికించి మూర్ఛాక్రాంతులై కొంతసేపటికి తెలివికలిగిలేవగానే ప్రేమళరాణి పరితపించుచుండగా మత్స్యేంద్రుడు శిష్యుని పరికించి పూర్ణచంద్రునితో సమానుఁడగు పుత్రుని చంపతగునా, నాపుత్రుని మరల పునర్జీవితునిగా చేసినయెడల నిన్ను ప్రభావసంపన్నుడగు సచ్ఛిష్యునిగా భావింతునని చెప్పగానే గోరక్షకుడు గురువు పాదకమలములకు సాష్టాంగదండప్రణామములిడి తనప్రభావముచేత నూటయెనిమిదిపుత్రులను మీననాథునివలె యుండునట్లు కనుపరచగానే ఈప్రభావమును వీక్షించి ఆచార్యుడు అమందానందమును జెందియుండ ప్రేమళరాణి గోరక్షకునికి

దండప్రణామములొనరించి మహాత్మా మీరు యిపుడు కనుపరచిన ప్రభావవిశేషములను మరుగుపరచి నాపుత్రుని కృపచేసి నామనంబును స్థిమితపరచుడని ప్రార్థింపుచుండఁగా గోరక్షకుడు రాణిమనోరథము పూర్తిపరచుటకు ఆమెపుత్రుడుతప్ప మిగతవారు మాయమైపోవునట్లుచేసి తనప్రభావాతిశయమును కనఁబరచి తన ఆచార్యుల వారి చరణాంబుజములకు సాష్టాంగదండప్రణామము లొనరించి ఓ గురువర్యా యికమీదు మనమీనగరమందు వాసముచేయడము యుక్తముగానుండదు, మనమిట్టిభోగభాగ్యములయందుప్రీతియుంచు కొన్న యెడల మనసత్వమునకుహానిసంభవించునని పలువిధములుగా ప్రార్థింపుచుండ మత్స్యేంద్రుడు కొంతసేపుయోచించి మనము వీని వచనములను వినిక నిర్లక్ష్యముగాయుండినయెడల విపరీతకార్యములు చేయుచుండునని వాని యిష్టానుసారము ప్రవర్తించుటకు తలంపుగొని తనప్రియకాంతను పరికించి గోరక్షకుడు నన్నురమ్మని నిర్బంధపరచుచున్నాడు, నేను వానివచనములయం దనాదరణగాయుండిపోనియెడల మనకనేకాపదలు సంభవించగలదని దేవిని తగిన హితవచనములతో సమాధానపరచుచు నేనవశ్యము వానితోఁగూడా పోవలసియుంటున్నదని తన మనోరథమును వెలిపుచ్చగా ప్రేమళరాణి ప్రాణనాథా నేను దేవరవారిని యెడబాసి యేరీతిగా సహించగలను తమవిశ్లేషముచేత నాజీవితకాలమువరకు పరితపించవలసినదానను గా యుంటున్నానని పలువిధములుగాచింతింపుచు తనప్రియకాంతుని జోల్నాలో బంగారపుకడ్డీలను పదిలపరచి దండప్రణామములొనరించి తమచిత్తానుసారముగా ప్రవర్తింపవచ్చునని అనుతాపము జెందుచుండఁగా మత్స్యేంద్రుఁడు చింతతో ప్రియురాలిని యెడబాసియుండునట్టికాలము తటస్థించినదిగదాయని అమితదుఃఖముతో శిష్యునితోఁగూడా ప్రయాణమై పురినివదిలి అరణ్యమందుబోవుచుండునప్పుడు శిష్యుని పరికించి మన మిట్టి ఘోరారణ్యమందు వంటరిగా పోవుచుండుటచేత భయపడవలసియుండునాయని విచారించుచుండ శిష్యుడు ఆచార్యునివీక్షించి మనము సర్వసంగపరిత్యాగముచేసినవారుగానున్నారము, సదాకాలము అరణ్యవాసము చేయుచున్నవారికి యేభయము యుండదని చెప్పిన్ని ఆచార్యులవారు మిక్కిలిభీతితో నడిచిపోవుచుండిరి, ఇట్లుకొంతదూరము నడిచిపోయి అచట నిర్మలమయిన తటాకమునుగాంచి ఆచార్యులు తనజోల్నానుగట్టునందుంచి శౌచమువిడిచివచ్చుటకై దూరముగాపోయియుండుటనుగని ఆచార్యులు యేలఅప్పుడప్పుడుభయముజెందుచున్నారని వారిజోల్నాను శోధించఁగా అందులో బంగారుకడ్డీలుండుటను వీక్షించి మన గురునికి కాంచనమందున్ను కాంతామణులయందున్ను అత్యంత ప్రేమ యుండిన్ని మిక్కిలి ప్రతిబంధకమైన స్త్రీరత్నమును పరిత్యజించిరి. స్వర్ణమందలి ప్రీతిని యింకావదలలేదని యెంచి వీటిని విడిపించవలయునను తలంపుతో బంగారుకడ్డీలను తటాకమందు పారవేసి వాటికి బదులుగా జోల్నాలో రాళ్లను వేసిపెట్టి యేమితెలియనివానివలె యుండెను. అనంతరము గురుశిష్యులు కొంతదూరముపోయినపిదప మహారణ్యమందుబోవుచు ఆచార్యులు శిష్యునిపరికించి ఈనిర్మానుష్యమైన విజనస్థలమందు మనము వంటరిగా పోవుచున్నందున దారిలో భయపడవలసియుండునాయని భీతిజెందినవానిరీతి నటించుచుండగా గోరక్షకుడు ఆచార్యులవారినిపరికించి స్వామీ భయము తటాకమువద్దనే పోయినదని మరుత్తరముచెప్పినందున, ఆచార్యులవారు తనజోల్నాను పరికించి వాటిలో బంగారమునకు బదులుగా శిలలుండుటను వీక్షించి నేను దారిఖర్చుల నిమిత్తముగా తెచ్చిన స్వర్ణమును మనకైనను లేక యితరులకైనను ప్రయోజనపడనిరీతిగా వ్యర్థముగా పారవేయడము యుక్తమాయని అనుతాపము జెందు

చుండగా తత్క్షణమే గోరక్షకుడు తమయెదుటయుండెడు బండరాతి మీఁద అల్పాచమును విడువగానే బండరాయి స్వర్ణమై ప్రకాశించుచుండుటను మత్స్యేంద్రుడు పరికించి పరమానందమును జెంది యుండ శిష్యుఁడు గురువర్యుని చరణాంబుజములకు సాష్టాంగదండ ప్రణామములొనరించి స్వామీ యిట్టి ప్రభావాతిశయములు దేవరవారి తిరువడిఘుళు ప్రభావమేగాని నాప్రభావముకానేరదని పొగడుచుండగా మత్స్యేంద్రుడు తనప్రభావాతిశయములు యిట్టివని తెలిసినవారుగాయుండిన్ని శిష్యుని ప్రభావాతిశయములను ప్రపంచమందలి జనులకెరుకపరచుటకొరకు యీరీతిగా నటించినానని శిష్యుని మనంబును రంజింపజేసి స్వేచ్ఛగా సంచరించుచుండిరి.

శ్రీమధుసూదనాయనమః.

## చోఖామేళుని చరిత్రము.

పరమపావనమైన పండరీపురమందు పంచమకులంబున చోఖామేళుడను భక్తుడు భార్యతోగూడి వాసముచేయుచుండెను. అతడు హీనవంశమందు జనించినవాడైనప్పటికిన్ని ప్రపంచమందలిజనులను ఆత్మతుల్యులుగా భావించుచు దేహమనిత్యమను తలంపుతో సత్యమందును స్వరూపవిషయమందును హరిభక్తియందును యీడుపడుచు యేకాదశివ్రతమును అనుష్ఠించుచుండునట్లు యేర్పాటుచేసుకొని ఆవ్రతమును మిక్కిలి నియమముతో నాచరించుచు శ్రీహరినామసంకీర్తనములను వినుచుండినయెడల సర్వపాపంబులు పరిహారంబగునని తలంపుతో యెచ్చట హరినామ సంకీర్తనలు పాడుచుండినను విని ఆనందింపుచు భగవంతుని అనంతనామములను సదాకాలము మననముచేయుచుండును. ఇదియునుగాక అతఁడు ప్రతిదినము ప్రాతఃకాలమునందు నిద్రలేచి పురిప్రదక్షిణ మార్గమున్ను సన్నిధిప్ర



క్షిణమార్గమున్ను వూడ్చి శుభ్రముగాచేయుచు భాగవతులయందు అత్యంతప్రీతిగలిగి సేవకాకృత్యములుచేయుచుండును. ఈరీతిని కొంతకాలముచనినపిమ్మట పాండురంగమూర్తి ప్రీతితో చోఖామేళుని గృహంబునకు యేతెంచి నేడు యేకాదశిగా యుండుటవలన నాకు కొంత ఫలహారము యిప్పించుమని మధురవచనములతో నడుగగా భక్తుడు పరంధాముని పలుకులనువిని భార్యను పిలిచి పెరుమాళ్లకు మనగృహమందు ప్రస్తుతము సిద్ధముగాయుండెడు భక్ష్యములనొసగి సంతుష్టిపరచుమని ఆజ్ఞాపించినదే ఆమె ధన్యోస్మియని శీఘ్రముగా యింటిలోనికిజని మీగడపెరుగును కొనివచ్చియుంచగానే పాండురంగడు వారిజాతునీతులను పరికించక ప్రీతితో నారగించి లేచునట్టి తరుణమందు భూమియందు పడియుండిన పెరుగు కొంచెము పీతాంబరమున కంటుకొనియుండెను ఆవృత్తాంతము యెవరున్ను గమనింపకయుండిరి. భక్తుడు శ్రీహరి చరణాంబుజములకు సాష్టాంగదండప్రణామంబులొనరించి ఓయదుకులతిలకా అచ్యుతా అప్రమేయా గోవిందా పాండురంగా పరంధామా పరమపురుషా రేపటిదినము ద్వాదశిగాయున్నందున దేవరవారు దానుని గృహంబునకు వేంచేసి ఆరగించి తీర్థప్రసాదములను కృపచేసి నేను కడతేరునట్లు నాయందు పరిపూర్ణకృపను ప్రసరింపుడని పరిపరివిధంబులుగా ప్రార్థింపుచుండుటను భక్తవత్సలుడు ప్రీతితో నాలకింపుచు నీమనోరథమును పూర్తిపరచుటకు రేపుపుదయము నీగృహంబునకు వేంచేసి భుజించిపోయెదనని చెప్పిపోయిరి. ఈవృత్తాంతమును ఆయింటిప్రక్కగా జనుచుండిన బ్రాహ్మణుడు పాండురంగడు చోఖామేళుడు భాషింపుచుండిన వచనములను విని.అధికతీవ్రముగా సన్నిధిలోపలప్రవేశించి పాండురంగమూర్తిని పరీక్షించి చూచునప్పుడు పీతాంబరమందు పెరుగు అంటుకొనియుండుటను పరికించి భ్రమజెంది పురివాసులుగాయున్న

విప్రులతో నేకాంతముగా పంచముడుగాయున్న చోఖామేళుఁడు
రహస్యముగా రాత్రులయందు శ్రీ పాండురంగని సన్నిధానమునకు
పోవుచువచ్చుచు శ్రీహరిని తనచేతులతో నంటుచు ఆలయసమీప
మందు వాసముచేయుచుండుటను చూడఁగా మిక్కిలి అనుచితమైన
కార్యముగా యుంటున్నది. గనుక మనమందరు యేకీభవించి యేరీతి
గానైనా వానిని గ్రామమునకు వెలుపలవసించునట్లు చేయవలెనని
మంత్రాలోచనచేయఁగా అతనియిష్టానుసారము విప్రులందరు సమ్మ
తించి గ్రామాధికారికి విజ్ఞాపనపత్రికను పంపించిరి. గ్రామాధికారి
పత్రికను పరిశీలించిచూచి తురకభటులను పరికించి మీరు చోఖా
మేళుని గృహంబునకు జని వాని నీక్షణమే వెంటబెట్టుకొనిరావలె
నని వుత్తరవొసంగగా మహమ్మదీయభటులు అతివేగంబున భక్తుని
గృహముప్రవేశించి గ్రామాధికారి వుత్తరవును తెలిపించినదే చో
ఖామేళుడు విషాదమునొందుచు అయ్యో పాండురంగఁడు విందునిమి
త్తము వచ్చునట్లు చెప్పియున్నారే, నేను వారిని సత్కరింపక అనాద
రణచేసి గ్రామాధికారిచెంతకు పోవడము యుక్తముగా యుండదే
యిందుకేమిసదుపాయము కనబడలేదుగదాయని భటులను పరికించి
నేను మీతోకూడవచ్చుటకు సరిపడదు కొంతసేపుతాళి వచ్చుచు
న్నాను మీరు పోవచ్చునని చెప్పుచు భార్యను వీక్షించి ఓ సాధ్వీ
శ్రీహరిని ఆరగించుటకు రమ్మనిచెప్పినాముగదా ఆవిషయము నీవు
మరిచితివా పరంధాముడు వచ్చునంతలో భక్ష్యభోజ్యములను సిద్ధ
పరచియుంచుమని తీవ్రపరచుచుండుటను భటులు విని వానిని బల
వంతముగా లాగుకొనివచ్చి మర్దనముచేయుచు గ్రామాధికారివద్ద
విడువగానే చోఖామేళుడు గ్రామాధికారికి దండప్రణామములొన
రించి నాతండ్రులారా యీబీదవానిని నిర్బంధపరచి వెంటబెట్టుకొని
వచ్చుటకు కారణమును తెలియజేయవలెనని వేడుచుండగా అధికారి



పంచముని పరికించి నీవు హీనకులమందు జనించినవాడుగావుండిన్ని
రహస్యముగా రాత్రికాలములయందు యెవరికితెలియనట్లు పాండు
రంగని సన్నిధియందు ప్రవేశించి శ్రీహరిని పూజింపుచు వారితో
సల్లాపించుచున్నావని తెలియవచ్చినది. నీవు నీచకులమందు జనిం
చితివను సంకోశము యుంచుకొనక సన్నిధానమందు ప్రవేశించు
చుండుట నీకు యోగ్యతగా యున్నదాయని బెదరింపగా భక్తుడు
గ్రామాధికారిని పరికించి మహాప్రభో యీనీచుని శ్రీపాండురంగడే
బలవంతముగా సన్నిధిలోనికి రప్పించుచున్నాడు, భగవంతుడు నా
నీచకులమును తెలుసుకొనియుండిన్ని నన్ను బలవంతముగా రమ్మని
నిర్బంధపరచి రప్పించుకొనడము శ్రీహరికి వుచితమైన కార్యముగా
యుంటున్నదా, నేను పండరినాథునితో పరమనీచుడుగాయున్నానే
నేను సన్నిధానమునకు రావడము అసంగతమైనకార్యముగా యుం
టున్నదని యెన్నివిధములుగా ప్రార్థించుచున్నను భక్తవత్సలుఁడు
పాటించుటలేదు. ఇదియునుఁగాక మాధవుడు ప్రీతితో నాగృహం
బునకు వేంచేసి పరమకారుణ్యముతో ప్రసాదమారగించి వేంచేయు
చుందురు, దీనిని నివర్తించుకొనుటకు నాకు దుస్తరమైనకార్యమని
తోచుచున్నది, ఇందులో నాయపరాధము లేదియుండదు. శ్రీహరి
భక్తవత్సలుడుగా యుండుటచేత భక్తజనులయందు అమిత ప్రీతిని
వాత్సల్యమును కనఁబరచుచున్నారు, పరంధామునికి జాతినీతులతో
పనిలేదు, జగన్నాథుడు సర్వాత్మలయందు లీనమై సర్వేంద్రియము
లను ప్రవర్తింపఁజేయుచు కళంకరహితులై నిర్వికారులుగా యుంటు
న్నారుగదా, బ్రాహ్మణుఁడు పంచముఁడు భూమియందు సంచరింపు
చుండినను భూదేవి సర్వజనులనుభరించుచుండలేదా, బ్రాహ్మణుడు
పంచముడు గంగలో స్నానముచేయుచుండుటనుకని భాగీరథి జాతి
భేదములను గణింపకయుండునట్లు నారాయణుడు సర్వజనులయందు

సముభాషణము కనఁబరచుచున్నారు, గనుక వారికి కోపముసంభవిం చదని ధైర్యముతో నుడువుచుండఁగా గ్రామాధికారి అమితక్రోధ ముతో నీవు కొంచెముకూడా నీస్థితిగతులను పరికింపక సభామంటప మునందు పరతత్వము నిర్ణయించుచుండడము నీకు కొంచమైనా లజ్జ నుగలిగింపలేదుగదాయని తన సమీపమందు కాలుని దూతలవలె ఖడ్గపాణులై నిలిచియుండెడు భటులను పరికించి కాడిమాకునందు రెండెద్దులనుకట్టి సభామంటపమందు తెచ్చినిల్పుఁడని వుత్తరవుచేసి చోఖామేళుని పాదములు రెంటిని కాడికి మధ్యభాగమందు కట్టించి ఈదురాత్ముని జీవము విడుచుపర్యంతము వీధివీధిగా త్రిప్పించి శవ మును తెండని కఠినదండనవిధింపగానే భక్తుఁడు భగవంతుని తనచిత్త మందు పదిలపరచుకొని ఓ గోపాలా అచ్యుతా అనంతశయనా శ్రీ హరీ పరంధామా పాండురంగా పరమపురుషా పురుషోత్తమాయని భక్తవత్సలుని ప్రార్థింపుచు దాసుఁడీప్రపంచమందు పాపిగాను నికృ ష్టుఁడుగా జనించినాఁడను, అట్టిహేతువుచేత దేవరవారితో భాషించు చుండడము అయుక్తముగానున్నది, నాజాతినీతులకు తగినట్లు నేను తమసన్నిధి ప్రాకారమునకు వెలుపట శుభ్రముచేసెడు పని నాకు తగినపనిగా యున్నందున దేవరవారు దాసునియందు కృపాకటాక్ష వీక్షణ్యమును ప్రసరించి విముక్తునిగావించి రక్షించుభారము తమ దని తమకృపకు నిరీక్షించియున్నాఁడను, ఓ వాసుదేవా విఠలా దాశ రథీ దానవాంతకా దామోదరా దేవదేవా నారాయణా నరహరీ రావే కావవేయని అమితచింతతో ప్రార్థింపుచుండఁగా భగవంతుఁడు యెవరినేత్రములకు దృశ్యుఁడుకాక కాడిని అదిమిపట్టుకొనియుండిరి. గ్రామాధికారి భటులను పరికించి యెద్లను వేగముగా పోవునట్లు కొట్టితోలుడని వుత్తరవొసగి వీనికొరకు యేదేవుఁడడ్డపడుచున్నాఁడో చూచెదనని రౌద్రాకారముతో పలుకుచుండుటనువిని భటులు తక్ష



ణమే యెద్లనదలించి తరుమసాగిరి. భటులు యెద్లనెంత శ్రమపరచి నను అవి అడుగెత్తిపెట్టక నిలిచియున్నస్థలమందే నిలబడియుండెను. అచట గుంపులుగూడి వేడుకచూచుచున్న జనులందరు యీవింతను పరికించి సంభ్రమాశ్చర్యములు జెందుచుండిరి. ఇదియిట్లుండ పుర జనులు కొందరు భక్తునిభార్యకు యీవృత్తాంతము తెలియజేయగా చోఖామేళుని భార్య అమితరోదనముతో గ్రామాధికారి కొలువు కూటమునకు యేతెంచి తనభర్తకు సంభవించియుండెడు ప్రాణాప దను పరికించి రొమ్ముకొట్టుకొనుచు రుక్మిణీమనోహరుడు కాడిని అది మిపట్టుకొనియుండుటను వీక్షించి ఓదీనపోషకా దేవరవారు తమ అంతరంగభక్తులకు సేవయొసగుచు అభక్తులకు దర్శనమివ్వక కపట నాటక సూత్రధారివై వేడుకచూచెదవాయని అంజలీహస్తురాలై ఓపుండరీకాక్షా మేము నిరుపేదలము, మావుదరములను పోషించు కొనుటకు అత్యంతశ్రమలను జెందుచుండఁగా తాము బలాత్కార ముగా మాగృహమునకు వేంచేసి విందుభుజించి పోవడమున్ను నా భర్తను దేవాలయములోనికి బలవంతపరచి వెంటబెట్టుకొనిపోయి వేడుకార్థముగా ప్రొద్దుపుచ్చుచుండడము ఇవి తమలీలావినోదములై యుండిన్ని మాయందునిందమోపి నా భర్తకు తలవంపులుగలుగ జేసి వింతగా వేడుకచూచుచు కాడికిముందు నిలబడియున్నారే ఓ శ్రీహరీ తమదాసునియందు కృపాకటాక్షమును ప్రసరించి దేవరవారి దివ్య మంగళ స్వరూపమును అమందానందముతో సర్వజనులు సేవించి ఆనందించునట్లు తమసేవనుకృపచేసి నాభర్తప్రాణమును రక్షింపుడని అనుతాపముతో ప్రార్థించుచుండునట్టితరుణంబున ఆపద్బాంధవుఁడు చతుర్భుజములయందు శంఖచక్రాద్యాయుధములను ధరించి కిరీటాది దివ్యభూషణములతో వైజయంతీవనమాలాదులచే పీతాంబరధారియై కోటిసూర్యులు వుదయించినట్లు అప్రాకృతదివ్యస్వరూపముతో సేవ

యొసగగా ప్రజలందరు మెరుపుతీగవలె ప్రకాశించెడు దివ్యతేజమును కించి భ్రమజెంది నేత్రములుమూసుకొని హాహాకారములు చేయుచు గొప్పమెఱుపువలె ప్రకాశించుచున్న శ్రీహరి దివ్యమంగళస్వరూప విభవములను నేత్రానందముగా సేవింపజాలనివారముగాయున్నాము గదాయని చిత్రప్రతిమలవలె నిలుచుకొని నేత్రములను విచ్చిచూడ శక్యముకానివారగుచు అమందానందమును జెందియుండగా భగవంతుడు అదృశ్యుడయ్యెను. ఆతరుణమందు గ్రామాధికారి సభామంటపమందు గుమిగూడియున్న సర్వజనులు సంభ్రమాశ్చర్యములుగలవారగుచు భక్తుని బంధవిముక్తునిగాజేసి భక్తజనప్రియుడగు యీ పరమభాగవతుని కృపాకటాక్షమువలన మనకందరికి భగవంతుని సేవ లభించినదని భక్తుని ప్రభావాతిశయములను కొనియాడుచు అతనికి దండప్రణామములొనరించి తమ తెలివిహీనతకు అనుతాపపడుచుండిరి. తదనంతరము చోఖామేళుడు యిది పాండురంగని చిద్విలాసముగాయుండునని తలంచుచు ఓకృష్ణమూర్తీ గోపాలా ముకుందా మాధవా మురారీ నరహరీ నారాయణా అచ్యుతా అనంతాయని భగవంతుని తిరునామములనుకీర్తింపుచు తనగృహముప్రవేశించి పరమానందముతో శ్రీపాండురంగని సన్నిధానమునకు నిరాటంకముగా పోవుచువచ్చుచు పరమభాగవతుడని ప్రఖ్యాతిజెందియుండెను.

శ్రీపద్మనాభాయనమః

# ఏకనాథుని చరిత్రము.

పైఠణనుపురమందు భానుదాసులనెడువారు బ్రాహ్మణవంశంబునందు జనించి పరమభక్తులని ప్రసిద్ధిజెందియుండగా అతని పుత్రుడు చక్రపాణియను ద్విజోత్తముడు సూర్యనారాయణుడను పుత్రుని గాంచిరి. ఆమహానుభావుడు రుక్మిణియను పుణ్యవతిని వివాహము



చేసుకొని మహోపకారులును ప్రభావసంపన్నులగు ఏకనాథులను పుత్రునిగా బడసిరి. ఏకనాథుల బాల్యమందే జననీజనకులు పరమపదమునకు వేంచేసినందున తాతగారు వీరిని మిక్కిలిగారాబముగా పోషింపుచుండగా ఏకనాథుడు చిన్నతనమందే తనయీడు బాలురతో గూడి శిలలను ఫుంచుకొని శ్రీహరియని పూజింపుచుండును. భక్తజనులు భగవంతుని కీర్తింపుచున్న కీర్తనలను విని తానున్ను ఆరీతిగా పాడుచుండును, నిలుచుకొనియున్నను నడుచుచున్నను శ్రీహరీ పండరినాథా పరమపురుషా పాండురంగా నన్ను కృపాకటాక్షముతో బ్రోవవేయని మొఱబెట్టుచుండును. చిన్నచిన్న చిదుగుల కొనలయందు జీర్ణవస్త్రములను బంధించి కరమున బట్టుకొని ఇవి పతాకములు వీటిని చేకొని పండరీపురమునకు పోయెదనని నుడువుచుండగా పురజనులు ఈమహాత్ముడు భగవంతుని వరప్రసాదముచేత లభ్యమయ్యెనని నుతింపుచుండ ప్రీతితో పితామహుడు పోషింపుచు షష్టమాబ్దమున వుపనయనాదులు చేయించెను. అదిమొదలా సుమతి తనగురువర్యుని ఆజ్ఞానుసారము నిత్యకర్మానుష్ఠానములను నియతితో నాచరింపుచు స్నానానుష్ఠానములు చేయకగాని జలపానముగూడా పుచ్చుకొనడు. ఉపాధ్యాయుడు పాఠములను వక్కమారు చెప్పగానే ఏకసంతగ్రాహివలె తక్షణమే పాఠములను వప్పగించును, ఇతరవిద్యలను చూచినమాత్రంబున గ్రహించుచుండును, అహంభావములేక ఆర్యులవద్ద సకలవిద్యలను సూక్ష్మబుద్ధితో గ్రహించుచుండుటయేకాక శ్రీవైష్ణవసంప్రదాయనిష్ఠాగరిష్ఠుడగుచు కాలానుగుణ్యముగా తనకు సంప్రాప్తమగు వస్తువులు భగవదనుగ్రహమువలన లభ్యమగుచున్నదని స్థిరచిత్తముతో రామనామమును పారాయణచేయుచు సకలశాస్త్రములయందలి సారాంశములను యితరజనులకు బోధింపుచుండుటచేత ఇతని ప్రజ్ఞావిశేషములను పండితులుపరికించి సంభ్ర

ష్యాశ్చర్యములు జెందుచు ఇతడు సారాసారవివేకశీలుడని నుడువు
చుందురు. ఇట్లుండుతఱుణంబున నొకనాడు ఏకనాథుడు పండితోత్త
ములకు దండప్రణామము లొనరించి ఓవిప్రోత్తములారా దాసునికి
జనించియున్న సంశయములను తీర్చునట్టి మహానుభావులు యెచ్చట
వేంచేసియున్నారని ప్రీతితో నడిగినందున వారలు ఏకనాథుని పరి
కించి ఓసుజనాగ్రగణ్యా సంసారిగానున్న చేతనుడు సద్గురుని బొడ
గానక ముక్తిపథము లభ్యముచేసుకొనంజాలడు. ఆరీతిగా నీకు శ్రీ
హరి ఆచార్యుడై సద్గతికిదారిజూపును, నీకు గల్గిన సంశయములను
భగవంతుడే తీర్చగలడని ప్రత్యుత్తరము చెప్పఁగా ఏకనాథులు పరిత
పించుచు పరిపక్వము జెందిన చిత్తముతో నేనెప్పుడు సద్గురుని బొడ
గందును, అట్టి మహాత్మునికి శుశ్రూషలు సలుపుచు భగవద్భక్తుల
ఆశీర్వచనములను యెపుడు లభ్యముచేసుకొందునని తన మనంబున
వితర్కింపుచు అనుతాపము జెందుచుండెను. ఇట్లుండగా నొకదినము
ఏకనాథుడు శ్రీహరిని ధ్యానింపుచుండ రాత్రి రెండుజాముల వేళలో
గగనమార్గమందు గొప్పధ్వనితో దత్తాత్రేయులశిష్యుండగు జనార్ద
నుండు దేవగిరియందు వేంచేసియున్నాడు, ఆమహాత్ముని కృపాకటా
క్షమువలన నీమనోరథము పూర్తికాగలదని వినబడినందున అతడు
అఖండానందమును జెంది తనబంధుజనులకు తెలియపరచకనే యే
కాకియగుచు నిర్భరత్వముతో ఆరాత్రియందే ప్రయాణమై అయిదు
యోజనములదూరమందున్న దేవరగిరికటుకువచ్చి జనార్దనుల నిలవ
రమును విచారించి తెలుసుకొని ఆచార్యునిగృహముప్రవేశించి తాను
వచ్చిన సవిస్తారమును ద్వారపాలునితో విన్నవించి జనార్దనస్వామి
గారికి నామనవిని తెలియపరచుడని ప్రార్థింపగా అతడు లోపలప్రవే
శించి జనార్దనస్వామిగారితో ఏకనాథుడు వచ్చియుండెడు వృత్తాంత
మును తెలుపగానే జనార్దనుడు తక్షణమే లేచివచ్చి గృహద్వారము



నందు నిలిచియుండెడు వైష్ణవశిఖామణిని పరికించి జ్ఞానభక్తివైరా
గ్యములుగల సుజనుడని సంతోషమును జెందియుండఁగా ఏకనాథుడు
గురుపుంగవుని చరణకమలములకు సాష్టాంగదండప్రణామము లొన
రించి దాసునిమనోరథము లభ్యమగునట్లు కృపాకటాక్షముతో పరి
గ్రహింపవలెను శరణాగతుడనుగాయున్నాడను, దేవరవారి తిరువడి
త్తామరలే రక్షకమని నమ్మియున్నందున తమశ్రీహస్తమును దాసుని
శిరస్సునందిడి రక్షింపవలెను, ఆశాపాశంబులు నన్నధికరించి తొం
దరపరచుచుండుటచే నేను మాయాజాలమునందుపడి తపింపజాలక
దేవరవారిని ఆశ్రయించుటకు వచ్చినాను. గనుక తాము దాసుని
మనోరథము సఫలము గావించి రక్షింపవలెనని ప్రార్థింపుచుండఁగా
జనార్దనుండు ఏకనాథుని పరిపక్వహృదయమును పరికించి ప్రీతితో
తన గృహంబులోనికి వెంటబెట్టుకొనిపోయిరి. అనంతరము ఏకనా
థుడు పరమానందముతో ఆచార్యులకు సమయోచితముగా పరిచ
ర్యలుచేయుచు భవరోగమును తొలగించునట్టి సదాచార్యుని కృపా
కటాక్షమును లభింపచేసికొంటినిగదాయని అహంభావమును విడిచి
ఆచార్యునికి శుశ్రూషలుచేయుచుండెను.

శ్రీసుదర్శనధరాయనమః.

# జనార్దనస్వామి చరిత్రము.

ఇట్లు కొంతకాలము గడిచినపిదప నొకనాడు ప్రాతఃకాలమందు
లేచి శ్రీహరిని ధ్యానముచేసి స్నానకృత్యములుముగించుకొని యిం
టిని అలికి రంగవల్లులచే నలంకరించి భగవన్మందిరము ప్రవేశించి
అచట పరికరములను సిద్ధపరచియుంచి ఆచార్యులు మేల్కొనుసమ
యమునునిరీక్షింపుచు వారికి తాను చేయవలసిన సర్వోపచారములను
చేసినపిమ్మట తనగురువర్యుని ఆసనమందుంచి విశ్రమింపజేసి భగవదా

రాధనమునకు సిద్ధపరచియుంచవలసిన తీర్థము కుసుమములు తులసి వాసనద్రవ్యములు పూజోపకరణములు మొదలగునవి వారిముందు యుంచగానే జనార్దనుడు ప్రీతితో భగవంతుని ధూపదీపారతులతో పూజింపుచు తదనంతరము విజనస్థలమందు మానసపూజ చేయుచున్నతరుణమందు శిష్యుఁడు సదాచార్యునిచెంత నిలువంబడి వారి తిరుమేనిసౌందర్యమును సేవించి ఆనందముజెందుచు ఆచార్యు లారగించినపిమ్మట భుక్తశేషమును ప్రీతితో భుజించి ఆచార్యుని రత్నజమకాళమందు కూర్చుండబెట్టి చందనకుసుమతాంబూలాదులొసగి సమయోచితముగా వారికి పరిచర్యలుచేయుచు నాదేహావసానకాలమువరకు ఆచార్యునిసేవయందు యీఁకుపడుచుండవలెనని శ్రీహరిని ప్రార్థింపుచుండును. ఇదియునుఁగాక తన ఆచార్యుల గృహసంబంధమైన జమాఖర్చులలెక్కలను పొరబాటులేక వ్రాసిపెట్టుచుండఁగా శిష్యుని బుద్ధికుశలతను సత్ప్రవర్తనలను ఆచార్యులు పరికించి ఏకనాథుని వీక్షించి నీవు నావద్దనే కాలముగడుపుచున్నావు, నాగృహకృత్యపు లెక్కలను చక్కగా వ్రాసియుంచుచున్నావుగాని నీయొక్క జమాఖర్చులలెక్కలను యెక్కడ వ్రాసియుంచినావని యడుగఁగా ఏకనాథుడు ఆచార్యుల చరణాంబుజములకు దండప్రణామములొనరించి స్వామీ దాసుని పట్టుబడిలెక్కలు యేమివ్రాయబోయెదను, నా తాతగారున్ను అవ్వగారున్ను పైఁఠణపురమందు వాసముజేయుచున్నారు, నాజననీజనకులు దేహావియోగముజెందిరి, నేను వారిని తలంపకనే నా జన్మసాఫల్యమునకుగాను దేవరవారి తిరువడిగళును ఆశ్రయించుకొని శుశ్రూషలు సలుపుచుండడమే ప్రాపకమనియెంచి దేవరవారి తిరునామమును ధ్యానింపుచు అపరమానందమును జెందియుండెదను, దేవరవారియుచ్ఛిష్టాన్నమును దాసుడు అమృతముగా భావించి కాలయాపనము జేయుచుండడమే నాలెక్కయని ప్రీతితో



విన్నవించగా జనార్దనస్వామి శిష్యుని జ్ఞానానుష్ఠానములను పరికించి పరమానందము జెంది ఇట్టిసత్శిష్యుడు భగవదనుగ్రహమునకు పాత్రుడుగానుండునని అమందానందమును జెందియుండిరి.

జనార్దనస్వామి జ్ఞానేశ్వరీయమను గ్రంథమును ప్రతిదినము పారాయణచేసి సాధువులకు దానధర్మములు చేయుచు వక అధ్యాయము చదివిముగించిన తదనంతరము భగవంతుని పూజించి ప్రసాదమును భుజించి ఆపురమును పాలించుచున్న రాజుగారివద్ద కొలువుచేయుచు రాజ్యసంబంధవ్యవహారములను నీతితో జరుపుచు పూజ్యతగలవాడుగాయుండి కాలయాపనము చేయుచుండెను. ఇట్లుండు తరుణంబున రాజుగారి విరోధియొకడు సైన్యములను వెంటబెట్టుకొని వచ్చి పురిని ముట్టడివేసుకొనియుండఁగా ఈ వృత్తాంతమును రాజు చారులవలన తెలుసుకొని జనార్దనులచెంతకు సేవకునిపంపించి తత్క్షణమే వారిని ఆస్థానమునకు వెంటబెట్టుకొనిరమ్మని పంపించెను ఆతరుణమందు జనార్దనులు పూజాగృహమందు శ్రీహరిని పూజించుచున్నందున ఏకనాథుఁడు భగవంతుని పూజకు భంగము గలిగించరాదని ఆచార్యులు ధరింపుచున్న వుడుపులను తొడుగుకొని సేవకునితో రాజుగారి కొలువుకూటముప్రవేశించగా భూపాలుడు వీరినిపరికించి నీవీక్షణంబున సైన్యములను వెంటబెట్టుకొనిజని విరోధి పరివారములను ధ్వంసనముచేసి విజయముతో రమ్మని ఆజ్ఞాపించెను. తత్క్షణమే ఏకనాథుడు జనార్దనుని వేషమును ధరించియున్నందున సైన్యములను వెంటబెట్టుకొని యుద్ధసన్నద్ధుఁడై శత్రుసైన్యములకు శూరునివలె పరాక్రమమును చూపుచు శత్రుసేనలు నలుదిక్కులయందుపారుచు పలాయనమగునట్లు తనశౌర్యమును కనఁబరచి జయప్రదుడై రాజుగారి ఆస్థానమంతపము ప్రవేశించి రాజుగారికి సంప్రాప్తమైన భీతిని పోగొట్టి జయప్రదుడగుచు తనగృహము ప్రవేశించి ఆచార్యువారి

వుడుపులను యథాస్థానమందుచేర్చి యేదితెలియనివానివలె సేవకా కృత్యములుచేయుచుండెను. అనంతరము ఆచార్యులు భగవద్ధ్యానమునువిడిచి శ్రీహరిని షోడశోపచారములతో పూజించి ప్రసాదమును భుజించి చందనకుసుమతాంబూలాదులను గైకొని కొంతతడవు విశ్రమించి వస్త్రభూషణములనుధరించుకొని యింతకుమునుపుజరిగిన సవిస్తారములు తెలియనివారగుటచేత రాజుగారి కొలువుకూటమునకు వాడుకప్రకారము వచ్చునట్లు వచ్చియుండగా భూపాలుడు ప్రీతితో వీరిని సమీపమందు కూర్చుండబెట్టుకొని అమూల్యమైన శాల్వలను బహుమానముచేసి శత్రువిజయమునకు తగినబిరుదులనొసగి గౌరవపరచుచుండ జనార్దనస్వామి వీటిని పరికించి సంభ్రమాశ్చర్యములు జెంది తనకు జనపాలుడు యిచ్చిన బిరుదులతో తనగృహము ప్రవేశించి వీటికి కారణకర్త తన శిష్యుడుగాయుండునని ఏకనాథుని చేరబిలిచి యదార్థమునువిన్నవింపుమనియడుగగానే శిష్యుడు మౌనము వశాంచియున్నందున ఏకనాథుడు వెరచుచున్నాడని భీతిని మాన్పి సర్వవృత్తాంతములను శిష్యుడు విన్నవించుచుండ ఆచార్యులవారు చిరునవ్వుతో శ్రవణానందముగా విని యితని భక్తివిశ్వాసములకు సంతసింపుచుండగా శిష్యుడు జనార్దనస్వామిగారి చరణాంబుజములకు దండప్రణామములొనరించి దేవరవారి తిరువడిఘళుల ప్రభావవిశేషమని అమందానందమును జెందియుండెను.

ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట జనార్దనస్వామి శిష్యుని పరికించి జమాఖర్చుల లెక్కలను పరిశీలించి తెలియపరచుమని ఆజ్ఞాపించినదే ఏకనాథుడు లెక్కలను పరిశీలింపుచు జమలో వకపైసా తక్కువపడుచుండుటచే అనేకపర్యాయములు గుణింపుచు తనవద్దయుండెడు యిరువు మొత్తము పరిశీలించిచూచి వకపైసా తక్కువపడుచుండుటనుపరికించి రాత్రి రెండుజాములపర్యంతము లెక్కలను



కూర్చిచూచుచు అకస్మాత్తుగా లెక్క సరిపడివచ్చినందున పరమానందభరితుడై అమందానందమును జెందుచుండగా జనార్దనస్వామి శిష్యుని పరికించి యేమి చిత్రము గనుగొంటివని యడిగినందున ఏకనాథుడు గురుపుంగవుని వీక్షించి జమాఖర్చుల లెక్కలయందు వకపైసా విడిచిపోయినందున అనేకతడవలు పరిశీలింపుచుండియు అది సరిపడిరాక అకస్మాత్తుగా సరిపడివచ్చినందున సంతోషించుచున్నానని ప్రత్యుత్తరము చెప్పగానే ఆచార్యులు శిష్యునిపరికించి ఇట్టిస్థిరచిత్తమును భగవంతుని చరణాంబుజములయందు లయింపజేసినయెడల భవసాగరమగు సంసారసముద్రమును దాటవచ్చునుగదాయని హితమును బోధింపగానే ఏకనాథుడు తనహస్తమందు వుంచుకొనియున్న తాళపత్రము గంటము క్రిందపడవేసి ఓగురువర్యా దాసుని అభిప్రాయము యీరీతిగానే యుంటున్నదని విన్నవించగా జనార్దనస్వామి తత్క్షణమే శిష్యునిశిరస్సునందు తమశ్రీహస్తమునువుంచి తారకమంత్రమును వుపదేశించి ధన్యునిగా జేసెను. తదనంతరము ఏకనాథుడు ఆచార్యులు కృపచేసిన మంత్రార్థమును ధ్యానింపుచు ఆచార్యుల పూజాగృహమును అలికి రంగవల్లులచే నలంకరించి పరికరములను సిద్ధపరచియుంచి సమయోచితముగా శుశ్రూషలు సల్పుచుండును. ఈరీతిగా కొంతకాలము గడిచినపిమ్మట జనార్దనస్వామి శిష్యుడు చేయుచున్న పరిచర్యలను పరికించి యితడు కామక్రోధలోభమోహమదమాత్సర్యాదిదుర్గుణములను నిరసించి ఆచార్యప్రతిభక్తికలవాడుగానున్న శుశ్రూషాపరుడుగానున్న భగవద్ధ్యాననిరతుడుగా యుండుటచేత ఇకమీదు యితనికిట్టికైంకర్యముల నుంచతగదని ఏకనాథుని చేరబిలిచి ఇకమీదు తిరువారాధనగృహమును శుద్ధపరచి రంగవల్లులచేత నలంకరించియుంచువారు యెవరున్నారో వారిని తెలియజేయుమనగా ఏకనాథుడు స్వామీ తమసేవానిరతు

డగు దాసుడే సకలపరికరములను సిద్ధపరచియుంచుటకు సిద్ధుడుగా యుంటున్నాడని అహంభావమునువహింపక అత్యంతప్రీతితో విన్నవించగానే జనార్దనస్వామి శిష్యునిపరికించి నీవికమీద భగవంతుని ధ్యానింపుచుండుము, సేవారుణ్ణుడై యుండరాదని చెప్పినందున ఏకనాథుడు గురుపుంగవుని ఆజ్ఞానుసారము శిరసావహించియుండెను.

అనంతరము జనార్దనస్వామి ప్రియశిష్యునియందు అత్యంత ప్రీతినియుంచి యితనికి దత్తాత్రేయుల దర్శనములభించునట్లు చేయవలెనని తలంచినవారుగాయుండిన్ని శిష్యుని దృఢాధ్యవసాయము పరీక్షించిచూడవలెనని యెంచియుండిరి. జనార్దనులు ప్రతిశుక్రవారమందు ఆపురికి సమీపమందున్న పర్వతశిఖరమునకు పోవుచుందురు. అచ్చట కదళి నారికేళ పనస చూత కపిత్థ వకుళాది వృక్షములున్న చంపక పున్నాగ జాజి విరిజాజి పాటలి కేతకి మొదలగు పుష్పోద్యానవనములు రమణీయ్యముగాను నిర్మలమైన తటాకముచే నొప్పుచుండెను విజనస్థలముగానున్నందున ఆతటాకమందు స్నానసంధ్యాధ్యనుష్ఠానములు తీర్చుకొని వెయ్యిన్నిమూడులింగములను పరిశుద్ధస్థలంబున చేసియుంచి విధ్యుక్తముగా షోడశోపచారములతో పూజించి గురుపుంగవుడైన దత్తాత్రేయులవారిని సేవించివచ్చుచుండును. ఒక శుక్రవారము పర్వతోద్యానవనమునకు పోవునట్టితరుణమందు ఏకనాథుని వెంటబెట్టుకొని పర్వతముమీదికి యెక్కిపోయి తటాకమునందు గురు శిష్యులు స్నానసంధ్యాధ్యనుష్ఠానవిధులను తీర్చుకొనియుండగా జనార్దనస్వామి శిష్యునికి దత్తాత్రేయునిమూలముగా వరప్రసాదము లభ్యమగునట్లు చేయవలెనని తన మనంబున నెంచి ఏకనాథుని పరికించి ఇచట చేసిపెట్టిన వెయ్యిలింగములను పూజించుచుండునప్పుడు దత్తాత్రేయులు మారువేషముతో దర్శనమును కృపచేయుదురు, అట్టితరుణంబున నీవు వారినిపరికించి వికల్పభావమును



జెందియుండక ప్రీతితో సేవింపుచుండుమని నియమించి సహస్రలింగములను పూజించినపిమ్మట దత్తాత్రేయుల రూపమును స్మరింపుచు ధ్యానపరుడుగానుండుతరుణంబున దత్తాత్రేయులు తురుష్కుని రూపముతో సారమేయమును కరమునబట్టుకొని సేవయొసంగంగా జనార్దనస్వామి ఆచార్యుని చరణాంబుజములకు సాష్టాంగదండప్రణామంబులాచరించి కుశలప్రశ్నములు చేసుకొన్నపిమ్మట అగోచరముగాయుండెడు భగవత్స్వరూపమును ఆత్మస్వరూపమును దేహస్వరూపవిషయములను గురుపుంగవుని చర్చింపుచుండంగా ఏకనాథుడు పరమానందభరితుడై ప్రశ్నోత్తరములను వినుచుండెను. అనంతరము దత్తాత్రేయులు మృత్పాత్రమును కరమున పట్టుకొని జనార్దనులను పరికించి అయ్యా నీవీ పాత్రనిండుగా శ్వానముయొక్క క్షీరమును పితుకుమనంగానే తత్క్షణమే జనార్దనుండు కుక్కస్తన్యములయందలి పాలను పాత్రనిండుగా పిండుకొని దత్తాత్రేయులముందు వుంచినదే ఆమహానుభావుడు క్షీరపాత్రమును హస్తమందుచేకొని కలుపంగా. అత్యంత మధురరసముతోగూడిన పరమాన్నముగా కనబడుచుండ ఏకనాథుడు పరికింపుచుండగా గురుశిష్యులు పరమాన్నమారగించి నాపాత్రయందే హస్తములను శుద్ధిచేసుకొనిరి. పిమ్మట జనార్దనులు ఏకనాథునిపరికించి నీవీపాత్రనుకొనిపోయి చక్కగాశుద్ధిచేసి తెమ్మని పంపించగానే అతడాపాత్రను చేకొనిపోయి సచ్ఛిష్యుడు సదాచార్యుని వుచ్ఛిష్టాన్నతీర్థప్రసాదములు గంగ యమున సరస్వతి నర్మద తుంగభద్ర గోదావరితో సమానముగాభావించి పరిగ్రహించవలెను. గనుక నాకట్టి ప్రసాదము లభించినదని పరమానందభరితుడై నేనీలోకమం దదృష్టవంతుడుగాయుంటున్నానని యెంచుచు శేషప్రసాదమును స్వీకరించి పాత్రను శుద్ధిచేసుకొని వచ్చుచుండంగా జనార్దనులు తనశిష్యుని పరిపక్వదశను పరికించి తన ఆచార్యులగు దత్తా

త్రేయుఁడు తో నేకనాథుని దృఢాధ్యవసాయమును విన్నవించి యితని యందు కృపయుంచి దేవరవారి దివ్యమంగళస్వరూపమును సేవించు నటుల కృపజేసి వీనినుద్ధరింపుడని ప్రార్థింపుచుండగా దత్తాత్రేయులు తన ప్రియశిష్యుఁడగు జనార్దనస్వామినిపరికించి యితఁడీ ప్రపంచమును నుద్ధరించుటకు జనించిన మహాత్ముఁడుగాయున్నాఁడు, భాగవతుల స్వరూప స్వభావములను బైలుపరచి శ్రీరామచరితమును మహారాష్ట్రభాషయందు ప్రచురపరచి పామరజనులను భక్తిమార్గమందు నిలుచునట్లు చేయునని అమందానందముతో సుందరసుకుమారలావణ్యరూపకాంతులతోఁడనున్న ఆరుభుజములతోనున్న కోటిసూర్యులు ప్రకాశించునట్లు సేవయొసఁగుచుండ ఏకనాథుఁడు పరమాచార్యుల చరణాంబుజములకు సాష్టాంగదండప్రణామములొనరించి ప్రీతిజెంది యుండుటను పరికించి దత్తాత్రేయులు ఏకనాథుని శిరస్సునందు తన అభయాస్తమునిడి అదృశ్యులైరి. అనంతరము జనార్దనస్వామి తన శిష్యుఁడు దత్తాత్రేయుల కృపాకటాక్షవీక్షణ్యమునకు పాత్రుఁడైనాఁడని పరమానందముతో గురుశిష్యులు పర్వతోద్యానవనమునువిడిచి తనగృహంబు జేరి కాలముపుచ్చుచుండిరి.

తదనంతరము ఏకనాథుఁడు తన సదాచార్యునికి సకలసేవలు సలుపుచు పరమాచార్యులగు దత్తాత్రేయులను భజింపుచుండఁగా నాతరుణమందు జనార్దనస్వామి వేంచేయగానే ఏకనాథుఁడు దండప్రణామములాచరించి పరమానందభరితుఁడుగానున్నందున ఆచార్యులవారు శిష్యునిపరికించి ఏకనాథా శ్రీహరికృపాకటాక్షమువలన నీకు ఆత్మజ్ఞానము లభ్యమైనను సర్వేశ్వరుని సగుణరూపమును ప్రీతితో సేవించుచుండవలెను. యోగబలమువలన గగనమార్గమందు సంచరించునట్టి శక్తిని లభ్యముచేసుకొన్నవాఁడుగా నుండినను శ్రీహరిని సేవించునట్టిమార్గము అలభ్యముగాయుండును. తాను దిగంబరుఁడై



సంచరించుచుండినను పరంధాముని సేవించుటకు దుస్తరముగా నుండును, గనుక దేవగిరికి తూర్పుదిక్కునందు సులభాయను పర్వతము ప్రసిద్ధిజెంది సూర్యతీర్థమను సరోవరముతో నొప్పుచున్నది. నీవా పర్వతము ప్రవేశించి సూర్యతీర్థమందు తీర్థమాడి ధారణయోగము చేయుచుండినయెడల భగవంతునికి నీయందు ప్రీతి గలిగి ప్రత్యక్షముగా సేవను కృపచేయుదురు. గనుక నీవు స్థిరచిత్తుఁడవై యెవరితో భాషింపక పర్ణభక్షణచేసికొనుచు శ్రీపండరినాథుని నీహృదయకమలమునందు నిలుపుకొని ధ్యానింపుచుండినయెడల నీకొక దృష్టాంతము దృశ్యమగును, వాటిని తక్షణమే నాకు తెలియపరచవలెనని ఆజ్ఞాపించగానే ఏకనాథుఁడు పరమానందమునుజెంది తన ఆచార్యుని నియమనప్రకారము తక్షణమే ప్రయాణమై సులభపర్వతము ప్రవేశించి సూర్యతీర్థమందు స్నానానుష్ఠానములుముగించుకొని శ్రీహరి చరణాంబుజములయందు భక్తికలవాఁడగుచు తనచిత్తమును మాధవుని దివ్యస్వరూపమునందు లయింపజేసి నిర్మలుఁడై ధ్యానముచేయుచుండెను. ఇట్టి దృఢభావముతో భగవద్ధ్యానపరుఁడై తన్మయము జెందియున్న ఏకనాథునికి భుజంగమొకటి శీతోష్ణములు ప్రసరింపనీయక శరీరమాద్యంతము చుట్టుకొని పడిగెను శిరస్సుపైనుంచుకొని ఛత్రమురీతిగానుండును, ఏకనాథుఁడు బాహ్యదృష్టికలవాఁడై ధ్యానమును విడుచునప్పుడు భుజంగము అదృశ్యమగును. అతఁడు ధ్యానపరుఁడుగా నుండుతరుణమందు తన్మయముజెంది దేహము మరిచియుండుటచేత ఈవృత్తాంతము తెలియనివాఁడైయుండెను. ఇదియిట్లుండఁగా నాపర్వతసమీపగ్రామమందు వాసముచేయుచున్న కాపువాఁడొకఁడు హరిభక్తులయందు ప్రీతిగలవాఁడగుచు సదాచారసంపన్నులగు సాధువులను ప్రీతితో పూజించెడువాఁడుగా నుండుటచేత అతఁడా పర్వతశిఖరమందు ధ్యానపరుఁడుగానున్న ఏకనాథులకు అత్యంత ప్రీతితో

క్షీరమును తెచ్చియిచ్చి సత్కరింపుచుండగా ఏకనాథుడు కాపువాని
శాంతశమదమాది సద్గుణములను భక్తివిశ్వాసములనుపరికించి పర
మానందముతో అతడు యిచ్చుచున్న క్షీరమును స్వీకరించుచుండిరి.
ఇట్లుజరుగుచుండగా కాపువానిభార్య వకదినము ఉదయాత్పూర్వ
మందు నిద్రలేచి భక్ష్యములను పాకముచేసుకొని భర్తచెంతకు రా
గానే అతడు భార్యనుపరికించి నీవింతత్వరగా భక్ష్యములు తెచ్చుటకు
కారణమును తెలియపరచుమనగా నాసాధ్వి భర్తను పరికించి ప్రాణ
నాథా నేనర్ధరాత్రియందు మేల్కని పిండివిసిరి భక్ష్యములను చేసి
చెంబునిండుగా పాలున్ను భక్ష్యములున్ను కొనివచ్చితిని, తాము
వీటిని చేకొని పర్వతశిఖరమందు వాసముచేయుచున్న భాగవతునికి
సమర్పించిరండని ప్రీతితో విన్నవించగా కాపువాడు భార్య సుగు
ణములను పరికించి పరమానందభరితుడై స్నానానుష్ఠానములు తీర్చు
కొని శ్రీహరిని స్మరింపుచు క్షీరమునుచేకొని పర్వతముమీదికివచ్చి
ధ్యానపరుడుగానున్న ఏకనాథునిపరికించి వారినిచుట్టుకొని తన పడి
గెను వారిశిరస్సుమీద నుంచుకొనియున్న భుజంగమును వీక్షించి
భీతిచే ఆహాకారములు చేయుచు గొప్పధ్వనితో కేకలువేసినను ఆ
పాము వారిని విడిచిపోక చుట్టుకొనియున్నందున కాపువాడు తత్త
రపడుచు అయ్యో భాగవతునికి ఆపదసంభవించునేమోయని ఓజగ
ద్రక్షకా ఆపద్బాంధవా మాధవా ముకుందా నారాయణా శ్రీహరీ
పాండురంగా భక్తవత్సలా దేవరవారు భాగవతునికి ఆపద కలుగ
కుండునట్లు కృపాకటాక్షముతో బ్రోవుడని గొప్పధ్వనితో పరితా
పపడుచుండుటచేత ధ్యానపగుడుగానున్న భాగవతుడా శబ్దమును విని
ధ్యానమునువిడుచుతరుణంబున భుజంగము అదృశ్యమయ్యెను. అనం
తరము ఏకనాథుడు కాపునుపరికించి యేల ఆహాకారములుచేయుచు
కేకలువేసితివి ఆకారణమును వివరింపుమనగానే కాపువాడు భాగ



వతునిపరికించి దేవరవారు ధ్యానములోనున్న తరుణమందు సర్పమొ
కటి మీదేహమాద్యంతము చుట్టుకొనియుండుటను చూచి తమకపా
యము సంభవించునేమోయని నేను తత్తరపాటుతో కేకలువేసితి
నని చెప్పుచుండగా నావచనములను ఏకనాథుడు విని భగవంతుని
లీలావినోదములను పరికించి పరమానందముతో శ్రీహరి దివ్యమంగళ
స్వరూపమును ప్రత్యక్షముగా సేవించి కృతార్థుడుగావలెనని ఓభక్త
వత్సలా దయానిధీ దామోదరా శేషశయనా జగత్పతీ దేవరవారు
సర్వరక్షకత్వమును వహించియుండుటయేకాక సర్వప్రపంచమునకు
సాక్షిభూతులై జ్ఞానానంద పరిపూర్ణులై సగుణరూపులుగా వెలయు
చున్నారు, అట్టిశక్తిగల దేవరవారు చతుర్భుజములతోనొప్పుచున్న
దివ్యమంగళస్వరూపమును దాసుడు సేవించి కృతార్థుడగునట్లు సేవ
యొసగి బ్రోవవేయని నానావిధముల ప్రార్థింపుచు ధ్యానపరుడుగా
యుండుతరుణమందు శ్రీహరి యేకనాథుని జ్ఞాన భక్తి వైరాగ్యము
లను పరికించి కృపాకటాక్షవీక్షణ్యముతో హారకేయూరకిరీటాదిభూ
షణాదులనుధరించి చతుర్భుజములయందు శంఖచక్రాద్యాయుధము
లతో పీతాంబరధారియై కోటిసూర్యులు ప్రకాశించుచుండునట్లు తమ
అప్రాకృతదివ్యమంగళసేవ యొసగుచుండగా ఏకనాథుడు మెఱువు
తీగెతో సమానముగా ప్రకాశించుచుండెడు దివ్య తేజమును పరికించి
ధ్యానమునువిడిచి నేత్రములనువిచ్చిచూచి దేదీప్యమానముగా వెలు
గుచున్న శ్రీపాండురంగని దివ్యమంగళరూపమును సేవించి పరమా
నందముజెంది అత్యంతప్రీతితో పరంధాముని పూజించి త్రికరణశుద్ధి
గలవాడగుచు ఓగోవిందా శ్రీహరీ జగన్నాథా భక్తవత్సలా దాసుని
యందు వాత్సల్యమును గనంబరచుటకు తమ సేవను కృపచేతిరిగదా
యని అమందానందముతో భగవంతుని చరణాంబుజములను పట్టు
కొని నుతింపుచుండగా పాండురంగడు అదృశ్యుడయ్యెను, కాపువా

డున్ను ఏకనాథుల కృపాకటాక్షముచేత శ్రీపండరినాథుని దివ్యస్వ
రూపమును సేవించి కృతార్థుడైతినని పరమానందముతో ఏకనాథుని
చరణకమలములకు దండప్రణామములొనరించి దేవర వారు విష్ణ్వం
శసంభూతులని నుతింపుచు క్షీరమారగింపుడని ప్రార్థించుచుండగా
ఏకనాథుడు కాపువాని పరిశుద్ధభావములను పరికించి పాలును స్వీక
రించి పరమానందభరితుడై తమసదాచార్యులగు జనార్దనస్వామిని
సేవించుటకొరకు పర్వతశిఖరమునుండి క్రిందికిదిగివచ్చి పర్వత
మునకు సాష్టాంగదండప్రణామములొనరించి దేవగిరికి యేతెంచి జనా
ర్దనస్వామిగారి చరణారవిందములకు దండప్రణామములొనరించి నిలి
చియుండఁగా అతఁడు తనశిష్యునికి శ్రీహరిసేవ లభ్యమైనదని ఆనంద
పరవశుడై భగవంతుని కృపాకటాక్షమును కొనియాడుచుండెను.

శ్రీభక్తప్రియాయనమః.

# చంద్రభట్టు చరిత్రము.

ఒకదినము జనార్దనస్వామి శిష్యునిపరికించి మనము కాశీక్షేత్ర
మునకు పరివారసమేతముగాపోయి శ్రీహరినిసేవించిరావలెనని అశ్వ
మీదనెక్కి భటులను శిష్యుని వెంటబెట్టుకొని శ్రీహరినామ సంకీర్త
నములను పాడుచు మార్గమందలి గ్రామాదులలో శ్రీహరి పరతత్త్వ
మును నిర్ణయింపుచు నొకపట్టణముప్రవేశించి ఆనగరమందు చంద్ర
భట్టను విప్రుడు సుగుణములుగలవాడుగాయుండుటచేత అతని గృహ
మందు బసచేసి శ్రీమహాభాగవతమందు బ్రహ్మదేవుడు నారదునకు
వుపదేశించిన శ్లోకములకు వ్యాఖ్యానముచేయుచుండఁగా వాటియం
దణిగియుండిన విశేషార్థములు కర్మజ్ఞానభక్తిప్రపత్తులు విలక్షణమా
ర్గములు మొదలగువాటిని హితోపదేశముచేయుచు పరమార్థములను
బోధింపుచుండగా చంద్రభట్టు మొదలగు సుజనులు ఆనందభరితులై



వారియందు శ్రద్ధాభక్తులుగలవారై పూజింపుచుండగా చంద్రభట్టు
జనార్దనస్వామి విశ్లేషమునకు సహింపజాలక వారితోకూడా కాశీ
క్షేత్రమునకు బైలుదేరెను. జనార్దనస్వామి పరివారసమేతముగా
పోవుచు అచ్చటచ్చట వాసముచేయుచున్న యోగులను సాధువు
లను సేవింపుచు పంచవటితీరమునకు వచ్చిచేరి అచ్చట నెలకొని
యున్న గోదావరినదియందు స్నానకృత్యములు ముగించుకొని శ్రీ
రామమూర్తిని సేవించి తదనంతరము శ్రీమహాభాగవతశ్లోకములకు
వ్యాఖ్యానముచేయుచుండగా అచట వాసముచేయుచున్న పండితు
లనేకులు జనార్దనస్వామి బ్రహ్మజ్ఞానములను బోధించి పామరులను
కడతేర్చుచున్నారని పరమానందమును జెందియుండిరి. చంద్రభట్టు
ఆచార్యులు బోధింపుచున్న అర్థవిశేషములను ప్రీతితో వినుచుండ
జనార్దనులు పంచవటినుండి ప్రయాణమై త్ర్యంబకమునకు యేతెంచి
బ్రహ్మగిరిని ప్రదక్షిణముగా చుట్టివచ్చి కుశవర్తియందు తీర్థమాడి
త్రిపురారిని సేవించి దశమాసములుగడిపి కాశీక్షేత్రమునకు పోవ
లెనని తలంచియుండిన తలంపును మాని తమపురమునకు వచ్చుటకు
ప్రయాణమై కొన్నిదినములకు దేవగిరికివచ్చిచేరి దామోదర ప్రీత్య
ర్థముగా తదీయారాధనమును జరిపిరి. చంద్రభట్టుమాత్రము జీవ
గోప్యమగు శ్రీహరినామమును ధ్యానింపుచు జనార్దనస్వామిని తొడ
బాయక బ్రహ్మజ్ఞానపరుడై జ్ఞానభక్తివైరాగ్యములు గలవాడగుచు
పరమపదముచేరెను. ఆమహానుభావునిశరీరమును అచ్చట నెలకొని
యున్న పర్వతమందు సమాధిచేర్చబడి యుంటున్నదనిన్ని ఇప్పటి
కిన్ని విశేషప్రభావములు దృశ్యమగుచున్నవని కొనియాడుచు అవి
ఆచార్యుల కృపాకటాక్షవీక్షణ్యమని శ్లాఘించుచుందురు.

ఒకదినము ఆచార్యులు యేకాంతముగా వేంచేసియుండి యేక
నాథుని పిలువగా తత్క్షణమే శిష్యుడేతెంచి వారిచరణకమలములను

పట్టుకొని జయజనార్దనస్వామీ చావుపుట్టుకలులేకుండా కృపాకటా
క్షముతో పరిగ్రహించిన ఆత్మబంధువులు దేవరవారే, బ్రహ్మదేవుడు
గోవత్సములను గోపాలురను వంచనతో గొనిపోయినతరుణమందు
తాము గోవత్సములవలె గోపబాలకులవలె రూపములను ధరించి
లీలావినోదములు చేయుచుండినది దేవరవారేకదా, తదనంతరము
బ్రహ్మదేవుడు సిగ్గుపడి అహంభావముతో చేసిన తప్పును మన్నించు
నట్లు వేడుకొని కృతార్థుడు కాలేదా దేవరవారి ప్రభావాతిశయముల
వలన యింద్రియములు లయించుచున్నవి, మిమ్మువినహా ప్రత్యక్ష
దైవము వేరేలేదని ఆచార్యులను కొనియాడుచుండగా అతడు తన
ప్రియశిష్యుని జ్ఞానభక్తివైరాగ్యములకు సంతసించి ఏకనాథా నీవు
తీర్థయాత్రచేసివచ్చినమొదల వారిమూలముగా సాధుపుంగవుల సేవ
సదాచారసంపన్నత లభ్యముకాగలదు, నీవు చేసిన సుకృతమునకు
తరుణోపాయముగా నుండునని హితోపదేశము చేయగా శిష్యుడు
ఆచార్యవిశ్లేషమునకు పరితపించుచు స్వామీ ఆచార్యులసేవ అంత
రించునుగదా, దేవరవారిని యింతకాలము యెడబాసియుండుటకు
దాసునిచిత్తము తపించుచుండునుగదాయని అనుతాపముతో ఆచా
ర్యుని అధ్యవసాయప్రకారము ప్రవర్తించడమే కర్తవ్యము గనుక
తమ ఆజ్ఞానుసారము ప్రవర్తించుచున్నానని విన్నవించగానే జనార్ద
నులు శిష్యసమేతముగాభుజించి తక్షణమే శిష్యునితోగూడా ప్రయా
ణమై శిష్యుని సాగనంపుటకు అతనితోకూడా కొంతదూరము వచ్చు
చుండగా శిష్యుడు ఆచార్యుల చరణాంబుజములనుపట్టుకొని దేవర
వారు చాలాదూరము అమితప్రయాసతో నడిచివచ్చినారు, గనుక
తాము నిలువవచ్చునని అమితదుఃఖముతో యేడ్చుచుండగా గురు
పుంగవున్ను శిష్యుని నాలింగనము చేసికొని నేత్రములయందు నీరు
స్రవింపుచుండ నాజీవప్రాణములు నీవుగాయుండుటవలన నీవు సంశ



యింపక నేను నీవను భేదబుద్ధినివిడిచి సంచరించిరమ్మని హితవచన
ములతో వూరడింపుచుండగా ఏకనాథుడు ఆచార్యుల చరణాంబుజ
ములకు సాష్టాంగదండప్రణామములొనరించి వారిదివ్యమంగళస్వరూ
పమును మనస్సునందు లక్షింపచేసుకొని వారివద్ద అనుజ్ఞనుపొంది
శ్రీహరిని ధ్యానింపుచు యాత్రాపరుడై సంచరించుచుండెను.

శ్రీత్రివిక్రమాయనమః.

# పితామహ చక్రపాణి చరిత్రము.

పైఠనుపురమందు చక్రపాణియను పితామహుడు తన మను
మడగు ఏకనాథుని పోబడి తెలియనందున మిక్కిలి పరితాపముతో
నాగ్రామమాద్యంతము వెదకిచూచి అగుపడనందున యిందు కేమి
చేయుదునని పరితపించుచు పండితులతో యెల్లప్పుడు చేరికకలిగిన
మనుమని విషయము వారిమూలముగా తెలుసుకొనవచ్చునని వారు
గోష్ఠిచేరియుండుస్థలమునకేతెంచి మనుమని సంగతిని విచారింపగా,
పండితులు పితామహుని పరికించి అయ్యా కొన్నిదినముల క్రిందట
శాస్త్రులవారొకరు వేంచేసియుండగా వారితో నీమనుమడు శాస్త్ర
విచారణ చేయుచుండడమనుమాత్రము మేమప్పుడప్పుడు పరికించు
చుంటిమి, పిమ్మట శాస్త్రులుమాత్రము బదరికాశ్రమమునకు పోవు
నట్లు చెప్పిపోయిరిగాని వారితోకూడా నీమనుమడు పోయినవృత్తాం
తము మాకు తెలియదు, తాము బదరికాశ్రమమునకు పోయియుం
డెడు శాస్త్రులవారికి శ్రీముఖము వ్రాసి మనుమనిసంగతి తెలుసుకొన
డము వుచితముగానుండునని నుడివిరి. అనంతరము పితామహుడు
బదరికాశ్రమమునకు పోయియున్న శాస్త్రులకు శ్రీముఖము లిఖిం
చిపంపగానే శాస్త్రులు శ్రీముఖమునువీక్షించి వ్యసనముజెంది మీ
మనుమడు నాతోకూడా రాలేదు, అయినప్పటికిన్ని దేవగిరియందు

వాసముచేయుచున్న జనార్దనస్వామివద్ద యుండవచ్చునని నేను తలచుచున్నాను, గనుక తాము దేవగిరియందుండెడు జనార్దనస్వామిని విచారించి తెలుసుకొనవచ్చునని మరుత్తరము పంపించిరి. ఆజాబు పితామహునికి చేరగానే అతడాజాబును పండితులవద్దచూపించి తన మనుమని వృత్తాంతమును తెలుసుకొనిరావలెనని వారిని ప్రార్థింపగా పండితుడొకడు తత్క్షణమే ప్రయాణమై దేవగిరికి వచ్చిచేరి జనార్దనస్వామిని సేవించి ఏకనాథునివృత్తాంతము విచారింపగా అతడు పండితునిపరికించి ఏకనాథుడు నన్నాశ్రయించియుండి నాకు శుశ్రూషలు చేయుచుండినందున నేనాతని తీర్థయాత్రచేసివచ్చునట్లు నియమించి పంపినాను, అతనివిషయమై మీరు చింతించవద్దని పితామహునికి కొక శ్రీముఖమునులిఖించియిచ్చి పండితునికి సన్మానముచేసిపంపగా అతడు జాబును పితామహునికి తెచ్చియివ్వగానే తాతగారు అవ్వగారు ఆనందభరితులై శ్రీఖమును తెచ్చియిచ్చిన పండితుని సంతుష్టిపరచి తత్క్షణమే ప్రయాణమై దేవగిరికివచ్చి మనుమని వృత్తాంతము జనార్దనస్వామిగారితో విన్నవించుకొనిరి. అతడు వృద్ధదంపతులను తమ గృహంబున మాసమువరకు వుంచుకొనియుండి ఆదరింపుచు ఏకనాథుడు నారాయణాంశముచేత వుద్భవించినవాడని అతని సుగుణములను కొనియాడుచు వృద్ధులకు నూతనవస్త్రములు కొంతద్రవ్యమును కృపజేసి శ్రీముఖమొకటి లిఖించియిచ్చి నీవీ జాబును వీక్షించినదిమొదలు పైటనుపురమందు వసింపవలెనని వ్రాసియిచ్చి యేకనాథుడు కొన్నిదినములలో యాత్రముగించుకొనివచ్చును, అప్పుడు నాజాబును మీరు చూపించగానే అతడు మరుమాటవచింపక నిలిచియుండును, అటుపిమ్మట యితరస్థళములకు పోజాలడు, గనుక మీరు మీనివాసస్థళమునకు వేంచేసి అతని రాకకు నిరీక్షింపుచుండుడని అనుజ్ఞకృపచేయుగా వృద్ధదంపతులు పరమానందముతో తమ



పురమునకు ప్రయాణమైవచ్చి మనుమనిరాకకు నిరీక్షింపుచుండిరి. ఈవృత్తాంతములను నాపురమందు వాసముచేయుచున్న సర్వజనులు విని ఆనందమును జెంది యేకనాథునిమహాత్మ్యములను కొనియాడుచు వారిని యెప్పుడు సేవింతుమని శ్రీహరిని ప్రార్థించుచుండిరి.

ఇట్లుండుతరుణంబున ఏకనాథుడు తీర్థయాత్రచేయుచు గంగోత్పత్తి బదరికాశ్రమము బృందావనము ప్రయాగ అయోధ్య ద్వారక మథుర మొదలగు దివ్యక్షేత్రములను సేవించుకొని పైటనుపురియందున్న గోదావరికేతెంచి స్నానానుష్ఠానములు తీర్చుకొని చంద్రశేఖరుని దర్శించి సాధువులతో సంగమముచేయుచు రెండుజామములవేళయందు భిక్షాటనవృత్తిచే ప్రాప్తమగుచున్న ప్రసాదమును భుజించి తృప్తిజెందియుండగా పురవాసులుకొందరు ఏకనాథుని పరికించి మీరు యెచ్చట వసించునట్టివారని పుట్టుపూర్వోత్తరములను విచారించుచుండగా అతడు వారికిప్రత్యుత్తరముచెప్పక మౌనముగానుండుటనుపరికించి వారిలోకొందరు ఇతడు ఏకనాథుడుగానుండవచ్చునని భ్రమించి వారి తాతగారితో విన్నవించగా సతీపతులు మనుమడు వాసముచేయుచున్న స్థళమునకు యేతెంచి చూచుతరుణమందు యేకనాథుడు వారినిపరికించి సాష్టాంగముగా దండప్రణామములుచేసి అచ్చటినుండి ప్రయాణమైపోవుటకు యత్నించుచుండ వృద్ధదంపతులు నేత్రములయందు నీరుప్రవహించుచుండ అడ్డముగా నిలుచుకొని పోగూడదని ఆటంకపరచుచు జనార్దనస్వామి వ్రాసియిచ్చిన శ్రీముఖమును చూపగా అతడు జాబును పరికించి లిఖితము తమ గురుపుంగవునిదని గురుని ఆజ్ఞ శిరసావహించి అచ్చటనే కూర్చునియుండెను. అనంతరమతని బంధుమిత్రులు తమ గృహములకు రమ్మని పలువిధములుగా ప్రార్థించినను యెవరికి మరుత్తరమివ్వక మౌనమువహించి యుండుటచేత పురజనులందరు వారిని మహాపురు

షులని భావింపుచు దండప్రణామములు సలుపుచుందురు, కొందరా మహాత్ముని సేవించుటకు వచ్చునప్పుడు ఫలములను కానుకలుగా సమర్పించిపోవుచుండగా ఏకనాథుడు సర్వము శ్రీహరిమయమనితలంచుచు మూడహోరాత్రములు బయలునందే శీతోష్ణాదులుపరికించక అచ్చటనే యున్నందున సుజనులుకొందరు ఆస్థలమందు పర్ణశాలను కట్టించగానే ఏకనాథులు పర్ణశాలయందు వాసముచేయుచు మౌనమునువిడిచి హరినామసంకీర్తనలు పాడుచుండగా ప్రజలువిని ఆనందింపుచు పలువిధముల సన్మానింపుచుండిరి.

ఇట్లు కొంతకాలము కాలయాపనముచేయుచుండగా శ్రీహరి కృపాకటాక్షమువలన కవితారచనయున్ను గానవిద్యయున్ను తనంతటనే లభ్యమయ్యెను. తదనంతరము యేకనాథుడు తనవద్ద ఆశ్రయించియుండెడు జనులకు శ్రీహరినామసంకీర్తనలను నేర్పించి భగవదనుభవమందు యీడుపడునట్లుచేయుచుండగా వారివద్ద శ్రీహరి గుణానుభవములను వినుటకు సమీపగ్రామములయందు వాసము చేయుచున్న జనులందరు వచ్చి కుతూహలముతో విని ఆనందించుచుండుటచేత స్థళము చాలనందున ప్రజలందరు చేరి విశాలమయిన గొప్పమఠమును కట్టించి అనేకవిప్రులకు అన్నదానముచేయుచుండుటచేత యేకనాథుని తాతగారు అవ్వగారును ఆమఠమందే నివసింపుచుండగా ప్రతియేకాదశియందు శ్రీహరినామసంకీర్తనలు అపారపారావారముగా జరుపుచుండుటయేకాక పర్వకాలములయందు విప్రులకు సమారాధన జరుగుచుండును.

ఇట్లుండుతరుణంబున వర్తకుడొకడు శ్రీకృష్ణాష్టమి వుత్సవము ప్రబలముగాచేయుచుండగా కీర్తిప్రభావాతిశయములు దేశదేశములు వ్యాపించియుండుటచేత శిష్యునివృత్తాంతమును విని జనార్దనస్వామి ప్రీతితో పైటనుపురికి రాగానే దత్తాత్రేయులు ద్వారపాలకునివలె



శూలపాణియై ద్వారమందు నిలిచియుండుటను పరికించి వందనములొనరించి అమందానందమును జెందియుండ దత్తాత్రేయులు సేవకుని రీతిగా ఏకనాథులచెంతకు వచ్చి జనార్దనస్వామి వేంచేసియున్నారని విన్నవించగా ఏకనాథుడు ప్రపత్తి చేసుకొని వారిని యెదుర్కొని వచ్చి గురుపుంగవుని చరణకమలములకు సాష్టాంగదండప్రణామములొనరించి మఠములోనికి మర్యాదపూర్వకముగా వెంటబెట్టుకొని వచ్చి పరమానందముతో కుశలప్రశ్నములు చేయుచు కొంతసేపు కాలముపుచ్చి వుత్సవసమయము రాగానే శ్రీహరినామసంకీర్తనలు పాడుచు పరమానందముతో బ్రాహ్మణగోష్ఠికి అమితప్రసాదములు వినియోగపరచుచు వుత్సవము ముగించుపర్యంతము భక్తిశ్రద్ధలతో సర్వజనులకు అమందానందమును గలిగింపుచు గురుసేవారతుడై సమయోచితముగా పరిచర్యలుచేయుచుండగా జనార్దనస్వామి తన శిష్యుని దృఢాధ్యవసాయమును జ్ఞానభక్తివైరాగ్యములను పరికించి అమందానందమును జెంది దేవగిరికి ప్రయాణమగుచుండగా తాతగారున్ను అవ్వగారున్ను జనార్దనస్వామికి దండప్రణామములొనరించి స్వామీ వంశవృద్ధికిగాను ఏకనాథుడు సుశీలను పరిణయముచేసికొనడము శ్లాఘ్యమని తలంచుచున్నాము. గనుక దేవరవారు ప్రియశిష్యునికి వివాహము చేసియుంచినట్లయితే విశేషకీర్తి యుండునని ప్రార్థించుచుండగా జనార్దనస్వామి ఏకనాథా నీవు పరిణయముచేసికొని గృహస్థాశ్రమధర్మమును అనుష్ఠింపుచుండుమని ఆజ్ఞాపించగానే ఏకనాథుడు గురుపుంగవునకు సాష్టాంగదండప్రణామము లొనరించి ఓ స్వామీ తమ ఆజ్ఞానుసారము ప్రవర్తించుచున్నానని విన్నవించినదే ఆచార్యులు ప్రియశిష్యుని సుగుణములను కొనియాడుచు తమ వాసస్థానమునకు ప్రయాణమైపోయిరి.

అనంతరము వృద్ధదంపతులు కన్యాన్వేషణముచేయుచుండగా

సమీపగ్రామమందు వాసముచేయుచున్న విప్రోత్తముడొకడు తన పుత్రికకు తగినవరుని విచారింపుచు వరునికి కన్యకు పొంతనములు సరిపడిరానందున చాలాకాలము తగినవరుడు లభించలేదని అమిత దుఃఖముతో పరితపించుచుండగా భగవంతుడు విప్రునిస్వప్నమందు సేవయొసగి నీకుమార్తెకు తగినవరుడు పైఠనుపురమందు మహాత్ముడని ప్రసిద్ధిజెందియుండెడు ఏకనాథుడు తగియున్నాడు. గనుక నీవు అతనికి నీపుత్రికను కన్యాదానము చేసియిచ్చి కృతార్థుడవు గమ్మని హితబోధముచేసి అదృశ్యులైరి. అనంతరము విప్రుడు స్వప్నవృత్తాంతమును భార్యకు తెలియపరచి సంభ్రమాశ్చర్యములుగలవాడగుచు ఉదయాత్పూర్వమందే స్నానానుష్ఠానములుముగించుకొని పైఠను పురమునకువచ్చి ఏకనాథస్వామి వాసముచేయుచున్న మఠముప్రవేశించి అచ్చట కన్యాన్వేషణపరులుగాయున్న వృద్ధదంపతులకు తన స్వప్నవృత్తాంతమును విన్నవించగా వృద్ధులు అమందానందముతో భగవంతుడే సర్వకార్యములను నిర్వహించుచున్నాడని పురోహితులను పిలిపించి వధూవరులకు పొంతనములు చూడగా అన్నిపొంతనములు చక్కగా యున్నందున వివాహముహూర్తమును స్థిరపరచుకొని నిశ్చితార్థముచేసుకొనినతదనంతరము వృద్ధదంపతులు అతని పంచభక్ష్యపరమాన్నములతో నారగింపజేసి చందనకుసుమతాంబూలాదు లొసగి అమందానందమును జెందియుండగా చిన్నపాపతండ్రి యిచ్చటనే కల్యాణముచేయడము శ్లాఘనీయముగాయుండునుగాన కల్యాణమునకు సేఖరించవలసిన సకలసామగ్రులను చేకొనివచ్చుచున్నానని వారివద్ద అనుజ్ఞను గైకొని తన గ్రామమునకు వచ్చిచేరి సర్వ పదార్థములు సేఖరించితేగా వృద్ధదంపతులు పరిణయమునకు తాము సేఖరించియుంచవలసినసామగ్రులను సిద్ధపరచియుంచి తమ బంధుమిత్రాదులకు శుభపత్రికలను పంపించి అందరు వచ్చిచేరినదే



వధూవరులను వస్త్రభూషణాదులతో నలంకరింపజేసి వివాహవేదికయందు కూర్చుండబెట్టి మాంగల్యస్త్రీలు మంగళాష్టకములు పాడుచుండగా శ్రీమన్నారాయణమూర్తి దంపతులకు సమస్తభోగభాగ్యములు కృపచేసి బ్రోచునని మంగళాశాసనములుచేయుచుండ అమందానందముతో పాణిగ్రహణ మహోత్సవమును జరిపించి బంధుమిత్రవర్గంబులు చక్కగా భక్ష్యభోజ్యాదులతో నారగింపుచు కంకణవిసర్జనముకాగానే వారివారినివాసములకు జనిరి.

ఏకనాథస్వామి పరిణమునకువచ్చిన బంధువర్గములలో వృద్ధవుడను విప్రుడు వీరియందు గురుత్వముగలవాడగుచు శుశ్రూషాపరుడైయుండగా గిరిజాభాయను నామధేయముగలిగిన ఏకనాథులభార్య భర్తకు చేయవలసిన సకలకృత్యములు ప్రీతితోచేయుచు వృద్ధదంపతులకు అనుగుణ్యముగా ప్రవర్తించుచున్నందున ఆమె సుగుణములను పరికించి పురజనులు బంధుమిత్రులు మొదలగువారు పరమానందమును జెందియుండిరి. ఏకనాథులు వాసముచేయుచున్న మఠమందు అయాచితముగా అన్నిజాతులవారికి అన్నదానముచేయుచు అందరిని శ్రీహరిస్వరూపులని భావింపుచు జాతిభేదములు పరికింపక సంతుష్టిపరచుచుండును. ఏకనాథులు ప్రతిదినము శ్రీహరిని భక్తిశ్రద్ధలుగలిగి పూజింపుచు రెండవజామందు బ్రాహ్మణగోష్ఠితో గూడి భుజించి మూడవజామమందు శ్రీమహాభాగవతమును సర్వజనులు విని ఆనందించునట్లు వ్యాఖ్యానముచెప్పుచు రాత్రికాలములయందు భక్తజనులతోగూడి శ్రీహరినామ సంకీర్తనలను ఆర్తితో గానముచేయుచు శ్రీపాండురంగని దివ్యస్వరూపమందు చిత్తమును లయింపజేసి దేహముమరిచి ఆనందపరవశుడుగాయుండుటచేత సర్వజనులు పరమానందభరితులై వినుచుందురు. ఈరీతిగా కొంతకాలముగడిచిన పిమ్మట వార్థికత్వమును జెందియున్న తాతగారున్ను అవ్వగారున్ను

పరమపదముచేరిరి. పిమ్మట కొంతకాలమునకు జనార్దనస్వామి దేహవియోగముపొందిరని తెలిసి వృద్ధవునివీక్షించి నాయాచార్యులవారు పంగుని నెల శుక్లపక్షషష్ఠియందవతరించి ఆతిథియందే దత్తాత్రేయుల వద్ద వుపదేశమును పొంది నాకున్ను ఆతిథియందే మంత్రార్థమును కృపచేసి ఆతిథియందే పరమపదముచేరినందున వారినిమిత్తము తదీయారాధన అపారముగాజరిపించవలెనని వుద్దేశించియుండుటచేత నీవా తదీయారాధనకు విశేషద్రవ్యము శేఖరించియుంచుకొని సర్వకార్యములను నిర్విఘ్నముగాజరిపించవలెనని ఆజ్ఞాపించగా వృద్ధవుడు ఆచార్యుని మనోరథము పూర్తిచేయవలెనని వారియాజ్ఞను శిరసావహించి తనవశములో యుండెడు ద్రవ్యము చాలదని అచట వాసముచేయుచున్న వర్తకునివద్ద తన ఆచార్యులవారు వ్రాసియిచ్చినట్లు పత్రము వ్రాసియిచ్చి యేడువందల రూపాయలను అప్పుగా తీసుకొని సకల సామగ్రులను సేఖరించియుంచి మూడుదినములు పరమాచార్యునికి శ్రీకృష్ణార్పణముగా గొప్పతదీయారాధనను జరిపించి బ్రాహ్మణులను సంతుష్టిపరచి రాత్రులయందు శ్రీహరినామసంకీర్తనలు సర్వజనులు విని ఆనందించునట్లుగా మిగుల విభవముతో జరిపించుచు జనులందరికి పరమానందముజనించుచుండునట్లుచేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడిచినపిమ్మట వర్తకుడు తనకుచేరవలసిన రూపాయలను యివ్వమని నిర్బంధపరచుచు వృద్ధవునివీక్షించి యెందుకుగాను అప్పుతీసి ఆడంబరములు చేయుచు వృథాగా నాద్రవ్యమంతయు నీరుగావించితిరని నిందితవచనములు పలుకుచుండఁగా ఆతరుణమందు ఏకనాథులు స్నానానుష్ఠానములు తీర్చుకొని సంధ్యావందనము చేయుచున్నందున వర్తకుడు కొంతసేపుకాచియుండి స్వామీ నారుణము తీర్చక మీరు భుజించరాదు, అతిక్రమించి భుజించినయెడల మీకు ఆనయున్నదని నిందితవచనములాడుచు తన గృహంబునకు జనెను.



అనంతరము ఏకనాథుడు వర్తకుడు పలికిన నిందితవచనములన్ను విని సర్వరక్షకుడు కర్తగాయున్నాడని శ్రీహరియందు భారముంచి అతిథులను అభాగ్యతులను సంతుష్టిపరచుచు సతీపతులు వుపవాసముండగా వృద్ధవుడు వర్తకుని ఋణవిమోచనముచేయుటకు యెన్నివిధముల ప్రయాసపడుచున్నను తనయత్నము కొనసాగనందున మిక్కిలి పరితపించుచుండగా ఆతరుణమందు శ్రీహరి వృద్ధవునిరూపముధరించి జామురాత్రియందు వర్తకుని గృహద్వారమందు నిలిచి తలుపుతట్టగానే వర్తకుడు తలుపుతెరచి మీరెవరని విచారింపగా శ్రీహరి వణిజుని పరికించి నేను వృద్ధవుడను, మీకు యివ్వవలసిన ద్రవ్యమును తెచ్చియున్నాను, గనుక తాము ద్రవ్యమును పుచ్చుకొని మాపత్రమును యిప్పుడే యివ్వవలెనని తొందరపరచుచుండఁగా వర్తకుడు యిప్పుడు రాత్రికాలముగాయున్నందున రేపుపుదయము తీసుకొనుచున్నానని విన్నవింపుచుండుటచే శ్రీహరి వర్తకునిపరికించి నీవు నిర్దాక్షిణ్యముగా ఏకనాథస్వామిగారికి ఆనవుంచి వచ్చియున్నందున నీవీక్షణమందు ద్రవ్యముపుచ్చుకొని పత్రము యిచ్చిపంపవలెనని తీవ్రపరచుచుండుటచేత వర్తకుడు గొణుగుచు యింటిలోనికి జని లెక్కపుస్తకమును కొనివచ్చి తనకు చేరవలసిన ద్రవ్యమును రాబట్టుకొని వృద్ధవరూపమును ధరించియుండెడు శ్రీహరివద్ద పత్రమును యిచ్చివేయగా నాక్షణమందే శ్రీహరి పత్రమును ఏకనాథుని పారాయణగ్రంథమందు వుంచిపోయెను. అనంతరము వర్తకుడు తాను ఏకనాథుల విషయమందు అవివేకబుద్ధిచే ఆనపెట్టిన దుష్కార్యమును పరికించి మిక్కిలి చింతింపుచు మరుదినము వుదయంబున ఏకనాథులను సేవించుకొని క్షమాపణ చేసికొనుటకు వారి గృహంబునకు వచ్చి మహాత్ముని చరణకమలములకు సాష్టాంగదండప్రణామంబులిడి స్వామీ నేను నీతిలేనివాడను, కఠినచిత్తుడను, తమకు వృథాగా

అమితప్రయాసను గలుగఁజేసినందుకు నాయందు క్రోధముంచుకొ
నక కృపాకటాక్షముతో మన్నింపవలెనని బతిమాలుచు వృద్ధవుడు
నాకు చేరవలసిన ద్రవ్యము నిన్నటిరాత్రి యిచ్చివేసినాడని విన్న
వించుచుండగా ఏకనాథులు సంభ్రమాశ్చర్యములతో ఇది శ్రీహరి
లీలావినోదములని భగవంతుని వాత్సల్యమును వారి పరిపూర్ణకృపా
కటాక్షమును కొనియాడుచు నీవు పుణ్యపురుషుడుగాయుండుటచేత
భగవంతుని ప్రత్యక్షముగా సేవించినావని అమందానందమును జెంది
యుండగా వర్తకుడు అనుతాపము జెందుచు తన గృహంబునకు వచ్చి
చేరెను, ఏకనాథులు భగవంతునిలీలలనునుతింపుచు భుజించినపిమ్మట
వృద్ధవుడున్ను గిరిజాభాయిన్ని భుజించిరి.

ఇట్లు కొంతకాలము చనినతదనంతరము ఏకనాథుల కీర్తిప్రభా
వములు ప్రపంచమాద్యంతము వ్యాపించియుండవలెనని భగవంతుడు
బ్రాహ్మణరూపమునుధరించి విఠలుడను తిరునామముతో ఏకనాథుల
మఠమునందు వాసముచేయుచు భక్తుడు భగవద్గుణానుభవములను
పాడుచున్నతరుణంబున వెనుకప్రక్కగాయుండి తాళమువేయుచుం
డుటవలన కీర్తనల మాధుర్యము ప్రజలకు శ్రవణానందము గలిగిం
పుచు అమందానందమును గలుగఁజేయుచుండఁగా అనేకజనంబులు
దూరదేశంబులయందు వాసముచేయువారునున్నను భక్తుడు గాన
రూపముగా పాడుచుండెడు హరికథలు వినుటకు ఆసక్తి గలవారై
వచ్చుచున్నందున ఏకనాథుని కీర్తిప్రభావములు నలుక్కులయందు
వ్యాపించియుండెను. ఇట్లుండఁగా పండరిక్షేత్రమందు బ్రాహ్మణుఁ
డొకడు పాండురంగమూర్తిని ప్రత్యక్షముగా సేవించవలెనను తలం
పుతో బహుదినములు సన్నిధానమందు ధారణయోగముచేయుచు
కొంతకాలము నిరాహారుడై ఏకాగ్రచిత్తముతో భగవంతుని ధ్యా
నింపుచుండఁగా శ్రీరుక్మిణీపిరాట్టికి విప్రునియందు కృపకలిగి అతని



స్వప్నమందు సేవయొసగి ఓ విప్రోత్తమా శ్రీపాండురంగమూర్తి
పైఠనుపురమందు వాసముచేయుచున్న మహాత్ముడగు యేకనాథుని
మఠమునందు బ్రాహ్మణరూపమును ధరించి విఠలుడను తిరునామ
ముతో భక్తుడు శ్రీహరి నామసంకీర్తనలను గానము చేయుచుండగా
వెనుకభాగమందునిలుచుకొని తాళము వేయుచుండును. గనుక నీవు
పైఠనుపురమునకు చనినయెడల భగవంతునిసేవ సునాయాసముగా
లభించునని పిరాట్టి అదృశ్యముకాఁగా బ్రాహ్మణుడు మేల్కని శ్రీ
దేవి స్వప్నమందు తెలియపరచిన వృత్తాంతము యదార్థముగానుం
డునని తత్క్షణమే ప్రయాణమై పైఠనుపురమునకు వచ్చిచేరి ఏకనా
థుల మఠముప్రవేశించి విఠలుడు యెచ్చటయున్నాడని విచారించి
తెలుసుకొని బ్రాహ్మణరూపముతోనున్న శ్రీపాండురంగని పరికించి
అమందానందముతో భగవంతునిచరణాంబుజములను గట్టిగా పట్టు
కొన్నదే శ్రీహరి చతుర్భుజములతో అప్రాకృత దివ్యమంగళస్వరూ
పమును సేవించునట్లు దర్శనమొసగి అంతర్ధానమైరి. అనంతరమా
బ్రాహ్మణుడు భగవంతుని లీలావినోదములను నుతింపుచు ఏకనాథు
లెంతటి మహాత్ములని భక్తుని ప్రభావాతిశయములను కొనియాడు
చుండగా ఏకనాథులు శ్రీహరి భక్తవత్సలుడుగాయుండుటవలన వారి
ప్రభావాతిశయములు అపారపారావారములని పొగడుచు జగన్నా
థుడు సామాన్యమానవునివలెవేషమునుధరించి దాసుని ధన్యునిగా
జేసిరని భగవంతుని మహిమలను పరిపరివిధములుగా కీర్తింపుచుం
డగా పాండురంగడు ద్వాదశవర్షములు బ్రాహ్మణరూపమునుధరించి
విఠలుడను తిరునామముతో లీలావినోదములు జేయుచు ఆరూపము
విడిచి భక్తుని ప్రభావాతిశయములను వెల్లడిచేసిరి.

ఒకదినము వృద్ధవుడు యేకనాథులచరణకమలములకు దండప్ర
ణామము లొనరించి స్వామీ శ్రీమహాభాగవతమును సకలజనులకు

తెలియునట్లుగా వ్యాఖ్యానముచేయుచుండవలెనని ప్రార్థించగా ఏకనాధస్వామి శిష్యుని ఆర్తిని పరికించి వ్యాఖ్యానముచెప్పుట కుపక్రమించిరి. శ్రద్ధాభక్తులుగల భగవద్భక్తులందరు భాగవతార్థములను వినుటకు దేశదేశములనుండి వచ్చి విని అమందానందమును జెందుచుండగా శ్రీపాండురంగడు మరల విప్రరూపమును ధరించి యేకనాథుని పరికించి నేను దూరదేశవాసిగాయుండిన్ని తమవద్ద భాగవతార్థములను వినుటకు అత్యంతప్రీతితో యేతెంచితిని, దానునికి సర్వకాలములయందు మీసేవలో ఈడుపడునట్లుకృపచేయవలెను అందువలన నాకు మిక్కిలి శ్రేయస్కరముగలిగియుండునని యెంచి దేవరవారి సన్నిధికి వచ్చినాను, నాపేరు కేశవుడని విన్నవించగా యేకనాధస్వామి విప్రునిపరికించి నీమనోరథప్రకారము నిరాటంకముగానుండవచ్చును దానుడు హరిదాసుల తిరువడిత్తామరలే రక్షకోపాయముగా భావింపుచు భాగవతులకు దాసానుదాసుడైయుంటున్నానని విన్నవించి భాగవతకాలక్షేపము చేయుచున్నతరుణమందు కేశవుడు అమందానందముతోవినుచు సందేహములుజనించిన పరమగోప్యార్థములను విశదపరచుచు సర్వజనులతోగూడి శ్రవణానందముగా వినుచుండుటచే పురాణశ్రవణముకొరకు యేతెంచుచున్న పామరజనులకు శాంతశమదమాదిసద్గుణములులభ్యమై విరక్తిపరులగుచు సత్యవాక్యములు వచించునట్టివారగుచు ధర్మమార్గప్రవర్తకులై భగవంతుని తిరునామములను ప్రీతితో స్మరింపుచుందురు. ప్రతిదినమున్ను రాత్రులయందు శ్రీహరినామసంకీర్తనలను వినుటకు వైదికబ్రాహ్మణులున్ను పురవాసులగు సకలజాతులస్త్రీపురుషులున్ను వచ్చుచుండగా కొందరుబ్రాహ్మణులు అసూయాపరులై సర్వజనులు కామ్యకర్మములను విడిచిపెట్టినందున తమ జీవనోపాయములకు హానిసంభవించినది, జనులందరు భక్తిమార్గమే శ్రేయస్కరమని యెంచుచు



న్నారు, గనుక మనజీవనోపాయములకు అత్యంతశ్రమ జనించినదని ఏకనాథుని దూషింపుచుండగా ఏకనాథుడు విప్రోత్తములు అపారపారావారముగా వారు దూషింపుచున్నను వారియందు ద్వేషముంచుకొనక అవి భూషణములని ఆనందించుచు సర్వజనులకు ప్రీతితో భాగవతార్థములను బోధింపుచు తనవద్దికి యేతెంచెడు అతిథి అభ్యాగతులను సత్కరింపుచు సంతుష్టిపరచుచుండును.

ఈరీతిగా కొంతకాలము పోయినపిమ్మట యేడహోరాత్రములు అపారమైన వర్షము కురియుచున్నందున సకల పదార్థములుయుండిన్ని వంటచెఱుకుచిక్కక అవస్థను పొందుచున్నతరుణమందు నలుగురు బ్రాహ్మణులు క్షుద్బాధవలన మిక్కిలిపలవింపుచు యేకనాధస్వామి మఠముప్రవేశించి తమశ్రమను విన్నవింపగానే అతడు తనభార్యనుపరికించి నీవుతక్షణము పాకశాలప్రవేశించి పాకముచేసి వీరిని సంతుష్టిపరచిపంపవలెనని ఆజ్ఞాపించగా గిరిజాభాయి భర్తను వీక్షించి స్వామీ వంటచెరుకులులేనందున పాకముచేయుటకు ఆటంకముగాయున్నదని చింతించున్నందున ఏకనాధులు భార్యనుపరికించి మనగృహముయొక్క పైకప్పునువిప్పి యెంతకట్టెలు కావలెనో అనుమానింపక తీసుకొనుమని ఆజ్ఞాపించగానే గిరిజాభాయి స్వామీ ఇల్లు విప్పడమునకు నిండాసేపుపట్టును ఇందుకేమిచేయవచ్చునని చెప్పగా ఏకనాధులు అప్పుడే తమవుపయోగార్థములోనుండెడు మంచమును చీల్చియిచ్చినదే గిరిజాభాయి ప్రీతితో కాష్ఠములను చేకొని పాకశాల ప్రవేశించి త్వరగా పాకముచేసి విప్రుల నారగింపజేయుచుండగా బ్రాహ్మణులు తృప్తిగా భుజించి మహాత్ముని సుగుణములను కొనియాడుచు తాముచేయుచున్నకైంకర్యము శ్రేయస్కరమైనదని పలువిధముల నుతింపుచు వారిప్రభావాతిశయములకు సంతసింపుచు వెళ్లిపోయిరి.

ఇట్లు కొంతకాలము గడిచినపిమ్మట ఏకనాథుల తల్లిగారి తిరువధ్యయనము వచ్చినందున భక్తుడాపురియందు వసింపుచున్న బ్రాహ్మణుల గృహంబులకు జని తిరువధ్యయనమునకు మీరు వేంచేసి ఆరగించి రావలెనని ప్రార్థించగా విప్రులందరు స్నానానుష్ఠానములను ముగించుకొని వచ్చుచున్నామని చెప్పిపంపిరి. అనంతరము ఏకనాథులు నిత్యనియమములను తీర్చుకొని సర్వపదార్థములను భక్ష్యభోజ్యములను సిద్ధపరచుకొని విప్రులరాకకు నిరీక్షింపుచుండగా నాతరుణమందు మహాత్ములగు పకీరులు ముగ్గురేతెంచి ఓ స్వామీ మేము క్షుద్బాధవలన పరితపించుచుండుటచేత తాము మాయాకలిని తీర్చి ప్రాణములను నిలుపవలెనని బతిమాలుకొనుచు దేవరవారు కాలతామసముచేయుచుండిన మాజీవములునిలువవుగనుక మాశ్రమను పరిహరించి రక్షింపుడని ప్రార్థించుచుండగా ఏకనాథులు అనుతాపముగలవారై తల్లిగారి తిరువధ్యయనమునకు సిద్ధపరచివుంచిన సర్వపదార్థములలో వారికి కావలసినంతవరకు వుంచి తృప్తిపరచగా తురకలు ఆనందభరితులై (కుదా) భగవంతుడు దేవరవారికి సమస్తభోగభాగ్యములు కృపచేసి తమమనోరథమును పూర్తినొందింతురని ఆశీర్వదించిపోవుతరుణమందు విప్రులు స్నానానుష్ఠానములు తీర్చుకొని వచ్చి పకీరులు ఆరగించిపోవుచుండుటను పరికించి అత్యంత క్రోధముతో నీకు జాతిభ్రష్టత్వము సంభవించియున్నదని నిందితవచనములు పలుకుచుండగా ఏకనాథులు వారిని పరికించి ఓవిప్రోత్తములారా సర్వచేతనాచేతనములయందు శ్రీహరినిండియుండుటచేత నేను పకీరులను ఆదరించిపంపినాడను, గనుక యిప్పుడు సిద్ధపరచియుంచిన భక్ష్యభోజ్యములను ప్రత్యేకపరచి గృహమును శుద్ధిచేసి క్రొత్తగా సర్వపదార్థములు పాకముచేయించుచున్నానని వినయముతో దండప్రణామములొనరించి తాముకోపింపక నవీనపదార్థముల నారగించి



పోవచ్చునని యెన్నివిధముల ప్రార్థించుచున్నను విప్రులు సమ్మతింపక సర్వవృత్తాంతమును న్యాయాధిపతివద్ద విన్నవింపగా అతడు ఏకనాథుని జాతిభ్రష్టునిగావింపుడని అనుజ్ఞ చేసినదే పురజనులుకొందరీ వృత్తాంతములను భక్తునికి తెలియచేయగానే అత్తడు న్యాయాధిపతి చెంతకుజని వారిని పరిపరివిధముల ప్రార్థించినను అతడు సమ్మతించక నీవు పితృదేవతలను రప్పించి వారిని సంతుష్టిపరచిపంపుమని చెప్పినందున భక్తుడు న్యాయాధిపతిని విప్రులను వీక్షించి తమచిత్తానుసార ప్రకారము పితృదేవతలను భుజింపజేసెదనని విన్నవించి గృహమునకేతెంచి పితృదేవతలను భక్తిపూర్వకముగా ప్రార్థించుచుండ ముగ్గురు పితృదేవతలు తత్క్షణమేదృశ్యమై అచ్చటచ్చట దాగియుండెడు విప్రులకు వినునట్లుగా వేదపారాయణముచేసి తృప్తిగా భుజించి చందనకుసుమతాంబూలములను ధరించుకొని దక్షిణలుగైకొని అంతర్ధానమైనందున చుట్టుప్రక్కల దాగియుండి చూచుచుండిన విప్రులు లజ్జతో తమ తెలివిహీనతకు చింతింపుచు భయభ్రాంతులుగలవారై తమతమ గృహములకేతెంచి పరితపించుచుండిరి.

శ్రీమదనంతరూపాయనమః.

# కృష్ణదాసుని చరిత్రము.

పైఠనుపురమందు కృష్ణదాసను బ్రాహ్మణోత్తముడు వాసముచేయుచు అతడు త్రికరణశుద్ధిగా దేవినిపూజింపుచున్నందున అతని పరిశుద్ధభావమునుపరికించి దేవిప్రసన్నమై నీవుకోరినవరము కృపచేసెదను తెలియపరచుమనగానే విప్రుడు తల్లీ నాకు కవిత్వముచేయునట్టి వరము కృపచేయవలెనని ప్రార్థించుచుండగా అంబాదేవి విప్రునికా వరము కృపచేసి అదృశ్యమయ్యెను. తదనంతరము కృష్ణదాసు శ్రీరామచరిత్రను మహారాష్ట్ర భాషయందు రచింపుచు అయోధ్యా

కాండము మొదలుకొని యుద్ధకాండమువరకు రచించియుండగా కొం
దరు బ్రాహ్మణులు యేకనాథస్వామిని పరికించి కృష్ణదాసు కవిత్వ
రచనను మిక్కిలిశ్లాఘింపుచు నవరసాలంకారములతో నొప్పుచున్న
దని నుతింపుచుండగా యేకనాథులు విప్రులవచనములను విని చిరున
వ్వుతో ప్రపంచమందు యెందరోమహానుభావులవతరించియుండుట
వలన మనము వారి కవిత్వరచనయందు ప్రీతి యుంచవలెనని కృష్ణ
దాసును వారిచే రచింపఁబడిన శ్రీరామచరిత్రను శ్లాఘించుచుండ
ఆవృత్తాంతమును తెలియపరచిన విప్రులు ప్రీతితో తమతమ నివాస
ములకు జనిరి. తదనంతరము కృష్ణదాసు లక్షణలక్ష్యవిరుద్ధములు
లేక రామాయణమును రచింపుచుండఁగా గ్రంధము పూర్తియగు
టకు కొన్నిదివసములుండఁగా దేవి దర్శనమొసగి నీవు రేపటిదినము
సాయంకాలము మూడుఘంటలకు జీవమును విడువబోవుచున్నావని
తెలియపరచిపోఁగా కృష్ణదాసు మిక్కిలిచింతతో గ్రంధము సమా
ప్తముకాలేదేయని యోచింపుచు తక్షణమే యేకనాథుల మఠము
నకు వచ్చుచున్నందున ఏకనాథులు కృష్ణదాసును యెదుర్కొనివచ్చి
మర్యాద లొనరించి సన్మానింపుచుండఁగా కృష్ణదాసు దేవి దర్శన
మొసగి తెలియపరచిన వృత్తాంతము విన్నవించి మిగతగ్రంధమును
దేవరవారు పూర్తిపరచవలెనని మిక్కిలి ప్రార్థింపుచున్నందున ఏక
నాథులు కృష్ణదాసు సంతాపమును వీక్షించి గ్రంధమును పరిశీలించి
చూచి ఈగ్రంధము పూర్తియగునంతవరకు మీరుజీవించియుందురు,
తమ వాక్కుచేతనే గ్రంధము కడవరకు రచించియుంచవలెనని విన్న
వించుచుండగా కృష్ణదాసు పరమానందముతో స్వామీ నేను తమ
వద్దనేయుండి గ్రంధమును రచించెదనని వచింపుచున్నందున భక్తుడు
అట్లుచేయనక్కరలేదు, నీవిదివరకు రచింపుచుండినరీతిగా నీగృహం
బుననే రచింపవచ్చును, కాలుడేతెంచినయెడల నేనడ్డపడి నీమనోరథ



మును సఫలము గావించుచున్నానని ప్రియవచనములు పలుకుచుండ
కృష్ణదాసు మహాత్మునిఆజ్ఞానుసారము తనగృహముప్రవేశించి గ్రంథ
ము రచింపుచుండెను. దేవి చెప్పినప్రకారము మరుదినము మూడవ
జామమందు కృష్ణదాసును కొనిపోవుటకు దండధరుఁడురాఁగానే నా
క్షణమందు ఏకనాథస్వామి దండధరుని కడ్డముగానిలిచి కృష్ణదాసు
ఇదిమొదలు ఏకాదశదివసములు జీవించియుండవలెనని విన్నవించఁగా
యముఁడు భక్తుని ఆజ్ఞను శిరసావహించి తననివాసమునకు జనెను.
తదనంతర మీవృత్తాంతము దేశదేశములువ్యాపించినందున అచ్చ
టచ్చట వాసముచేయుచున్న సర్వజనులు యేతెంచి వారిని సేవించు
కొని భక్తుని ప్రభావాతిశయములను నుతింపుచుండిరి. అనంతరము
దశమదివసమున కృష్ణదాసు గ్రంధమును పూర్తినొందించి భాగవత
గోష్ఠికి గొప్పతదీయారాధనగావించి అత్యంతప్రేమభావముతో మరు
దినము స్నానసంధ్యాద్యనుష్ఠానములను తీర్చుకొని శ్రీహరిని ధ్యా
నింపుచు అంత్యకాలమును నిరీక్షించుచుండగా ఏకనాథులు భాగవత
గోష్ఠిసమేతముగా వేంచేసి శ్రీరామమూర్తి ప్రభావాతిశయములను
నుతింపుచున్న తరుణమందు కృష్ణదాసు నిశ్చలచిత్తముతో పరమ
పదముచేరెను. సర్వజనులు శ్రీహరి భక్తుల మహిమావిశేషములు
అపారపారావారములని పరమానందముతో నుతింపుచు ఇట్టివింతను
యెచ్చట చూడలేదని కొనియాడుచుండిరి.

శ్రీవేణుగానలోలాయనమః.

# కన్నడివర్తకుని చరిత్రము.

కర్నాటకదేశమందు వాసముచేయుచున్న వర్తకుడొకడు తన
గృహంబున భగవద్విగ్రహమును ప్రతిష్ఠచేసి ఆరాధింపుచుండవలెనని
శ్రీపాండురంగని విగ్రహమును చేయింపగా ఆభగవద్విగ్రహ మధిక

సుందరముగా సర్వలక్షణములతో అమరియుండి చిరునవ్వుగల వద నారవిందము గలిగి మూర్తివంతముగాయుండుటను వర్తకుఁడు పరి కించి అత్యంతప్రేమతో భగవద్విగ్రహమునకు ప్రాణప్రతిష్ఠ సంప్రో క్షణాదులుచేసి భాగవతులకు తదీయారాధనలు చేయించి ఆనందించ వలెనని వుద్దేశించియుండఁగా నాటిరాత్రి వర్తకుడు నిద్రించెడుతరు ణమందు వానిస్వప్నమున శ్రీహరి సేవయొసగి ఓవర్తకుడా ఏకనా థుడను మహాత్ముడు పైటనుపురమందు వసింపుచున్నాడు, అతఁడీ మూర్తివిగ్రహమును పూజించుటకు అర్హుడుగానుండుటవలన నీవు పరమానందమునుజెందుచు శ్రీహరివిగ్రహమును సకలాడంబరముల తో వేంచేపుచేసుకొనిపోయి వారికి మన్నపూర్వకముగా సమర్పించి రమ్ము, నీవు నావచనములను విశ్వసింపక అనాదరణ చేసినయెడల నీవత్యంతశ్రమఁను చెందుదువని పలికి అదృశ్యులైరి. అనంతరము వర్తకుడు మేల్కని సంభ్రమాశ్చర్యములుగలవాడై తత్తరపడుచు హృదయాత్పూర్వమందే స్నానసంధ్యాధ్యనుష్ఠానములను తీర్చుకొని పురజనులలో అనుభవపరులుగాయుండెడు విప్రోత్తములను రప్పించి తన స్వప్నవృత్తాంతమును విన్నవింపగా బ్రాహ్మణోత్తములు వర్త కుని పలుకులనువిని చక్కగాయోచించి మరల మూడవదినము శ్రీ హరి నీస్వప్నమందు సేవయొసగి ఆజ్ఞాపించినయెడల నీవు త్రికరణశు ద్ధిగా భగవద్విగ్రహమును ఏకనాథులకుసమర్పించిరావచ్చునని చెప్ప గానే వర్తకుడు వారివచనములను ప్రీతితో నామోదించియుండగా మూడవదినమ్మురాత్రి జగన్నాథుడు వర్తకునిస్వప్నమందు దృశ్యమై మునుపు ఆజ్ఞాపించినప్రకారము వర్తించునట్లు హితోపదేశము చేసి అదృశ్యులైరి. తదనంతరము వర్తకుడు తన స్వప్నవృత్తాంతము మి క్కిలి చిత్రముగా యున్నదని సకలాడంబరములతో శ్రీపాండురంగ మూర్తి భగవద్విగ్రహమును పల్లకియందు వేంచేపుచేసుకొని పరి



వార సమేతముగా పైటనుపురమునకు వచ్చి పురప్రదక్షిణముచేసి మఠమునందు వేంచేసియుండెడు ఏకనాథస్వామినిసేవించి సాష్టాంగ దండప్రణామములొనరించి తనస్వప్నవృత్తాంతమును విన్నవించగా భక్తుడు వర్తకునిస్వప్నవృత్తాంతమునుపరికించి పరమానందముతో శ్రీపాండురంగమూర్తిని ఆలింగనముచేసికొని ఆనందభాష్పములు స్రవించుచుండగా తన హృదయకమలమందు భగవంతుని లయింప జేసుకొని ఓ భక్తవత్సలా పద్మనాభా దాసునియందు కృపాకటాక్ష వీక్షణ్యముప్రసరించి తమకారుణ్యమును కనఁబరచితిరో, ఓ శేష శయనా దాసునిభాగ్యవశమును యేమనియెంచుదును, ఓదయానిధీ దీనబంధూయని మాధవుని మహత్యములనునుతింపుచు శ్రీహరి విగ్ర హమును ప్రతిష్ఠచేయుటకొరకు వృద్ధులనిపరికించి సర్వవస్తువులు సిద్ధ పరచియుంచునట్లు అనుజ్ఞయొసగి జోస్యులను రప్పించి భగవద్విగ్ర హమునకు ప్రాణప్రతిష్ఠచేయించుటకు శుభముహూర్తమును నిర్ణ యింపజేసి ఆశుభముహూర్తమందు బ్రాహ్మణోత్తములు వేదపారా యణ చేయుచుండగా తిరుమంజనము మొదలగు సమస్తవిభవములు క్రమప్రకారము చేయించి ప్రాణప్రతిష్ఠచేసినపిమ్మట ప్రసాదములను అపారముగా ఆరాధనచేసి సర్వజనులు అమందానందమును జెంది యుండుతరుణంబున యేకనాథులు వెన్నముద్దను చేకొని శ్రీపాండు రంగని భగవద్విగ్రహముయొక్క నోటియందు వుంచి ఓ కృష్ణా గో విందా మాధవా శ్రీహరీ దేవరవారు శ్రీకృష్ణావతారమందు అపార పారావారముగా వెన్నను భక్షించినారుగదా, ఇప్పుడీతరుణమందు దాసునియందుకృపయుంచి వెన్ననుభుజించి సర్వజనులకు ఆనందము జనించునట్లు దేవరవారి వాత్సల్యమును కనఁబరచవలెనని నుతింపు చుండగా శ్రీహరి మందహాసముతో వెన్నను భుజించుచుండ భక్తుడు భగవంతుని కృపాకటాక్షమును వీక్షించి ఆనందపరవశుడై మంగళ

హారతులతో పూజించి రెండవజామమందు బ్రాహ్మణగోష్ఠిని భక్ష్య భోజ్యములతో నారగింపజేసి సంతుష్టిపరచుచుండగా వర్తకుడు పరమానందమునుజెంది ఏకనాథుల చరణారవిందములకు సాష్టాంగ దండప్రణామములొనరించి అంజలీహస్తుడై ఓమహాత్మా దాసుని విన్నపమాలకించి నాకోరికను పూర్తిపరచవలెను. నేను నావాసస్థానము చేరి శ్రీరుక్మిణీపిరాట్టి విగ్రహమును శాస్త్రోక్తముగా చేయించియుంచుచున్నాను. దేవరవారు దానునియందుకృపయుంచి శ్రీహరి విగ్రహమును పల్లకిలోనుంచుకొని పరివారసమేతముగా వేంచేసి శ్రీహరికి తిరుకల్యాణమహోత్సవమును జరిపించి కృతార్థునిగావింపవలెనని విన్నపముచేసికొనఁగా యేకనాథస్వామి పరమానందముతో నీయిష్టానుసారము జరిపించుచున్నానని వర్తకుని తృప్తిపరచి పంపించిరి.

అనంతరము వర్తకుడు తన గ్రామమునకు వచ్చిచేరి పిరాట్టి విగ్రహము సర్వలక్షణములతోగూడియుండునట్లుచేయించి ప్రీతితో కల్యాణమునకు సేకరించియుంచవలసిన సర్వసామగ్రుల నాయత్తపరచి యేకనాథస్వామికి శ్రీముఖమును పంపగా అతడు సకలాడంబరములతో శ్రీహరివిగ్రహమును పల్లకియందుంచుకొని వుత్సవరీతిగా వచ్చుచుండిరి. ఇట్లు మహదాడంబరముతో ప్రయాణమై వర్తకుని గ్రామము సమీపించివచ్చుచుండఁగా అతడు పరివారసమేతముగా యెదుర్కొనివచ్చి సాష్టాంగదండప్రణామములొనరించి మిక్కిలివిభవముతో భగవంతుని భాగవతగోష్ఠితో వెంటబెట్టుకొనివచ్చి వుచితమర్యాదలతో సత్కరింపుచు తిరుకల్యాణమును విధ్యుక్తముగాఁ జరిపించి శ్రీహరికి అమూల్యరత్నాభరణములను పారితోషికముగా సమర్పించి సర్వజనులను భక్ష్యభోజ్యాదులతో సంతుష్టిపరచుచుండఁగా యేకనాథులు భగవంతుని కల్యాణగుణచేష్టితములను వుపన్యసించుచుండిరి. భక్తుని ప్రసంగమును వినుచుండిన జనులందరు భగ



వంతుని ప్రభావాతిశయములను ఏకనాథస్వామి భక్తిపారవశ్యమును కొనియాడుచుండిరి. తదనంతరము వర్తకుడు భగవంతుని కల్యాణమహోత్సవము ముగియగానే యెల్లవారిని తన గృహంబున నొకమాసమువరకు నిలుపుకొని షడ్రసోపేతముగా భుజింపజేసి నుపచరింపుచు అమూల్యములగు వస్త్రాభరణములను శ్రీహరికి సమర్పించి సాగనంపుటకు తలఁచినవాఁడై యేకనాథస్వామితోగూడ వేంచేసిన భాగవతులను వస్త్రాభరణాదులలతో సన్మానించగానే ఏకనాథులు పరమానందముతో భగవద్విగ్రహములను పల్లకియందు శృంగారించియుంచి భక్తజనసమేతముగా ప్రయాణమై మిక్కిలి విభవముతో పైటనుపురమునకువచ్చి మఠముప్రవేశించి తదీయారాధనను జరిపి పరమానందమును జెందియుండిరి.

ఇదియిట్లుండఁగా ఏకనాథస్వామి జనించినదిమొదలు యింతకాలమువరకు పండరీక్షేత్రమును సేవించకయుండిన్ని శ్రీపాండురంగడు తనయందు కృపయుంచి మిక్కిలికారుణ్యముతో వేంచేసి సేవయొసగుచుండుటనుపరికించి అనుతాపముతో వృద్ధునివీక్షించి నేను పండరీక్షేత్రమునకు జని శ్రీ పాండురంగని సేవించవలసియుండుటచే యాత్రకు కావలసిన సర్వవస్తువులుసిద్ధముచేయునట్లు అనుజ్ఞయొసగి ప్రయాణసన్నాహములు చేయుచుండగా వృద్ధవుడు గురుని నియామనప్రకారము సమస్తవస్తువులు సిద్ధపరచినదే ఏకనాథులు భాగవతగోష్ఠితోగూడి భార్యాసమేతముగా బైలువెడలి వృద్ధుని మఠమునయుండునట్లు నియమించి శ్రీహరినామసంకీర్తనలు పాడుచు మార్గమందలి గ్రామాదులయందు విశ్రమింపుచు గ్రామవాసులు చేయుచున్న మన్ననలనుపొంది శ్రీహరి దివ్యచరిత్రములను కాలక్షేపము చేయుచు, వారువారు ప్రీతితో వినియోగపరచుచుండెడు సన్మానములను అంగీకరింపుచు శ్రీపండరిక్షేత్రమునకు పోవుచుండిరి. ఏక

నాథులు దారియందు నడుచుచున్నప్పుడుగూడ భగవంతుని కల్యాణ గుణములను ఆర్తితో నుతింపుచు తన్మయముజెంది ఓకృష్ణా గోవిందా మాధవా ముకుందా భక్తవత్సలా పరంధామా పురుషోత్తమా యని పరిపరివిధముల స్తుతింపుచు క్షేత్రమునకు సమీపముగా యేతెంచుచున్న తరుణమందు శ్రీహరి అర్చకులస్వప్నంబున సేవయొసగి ఏకనాథుని పరివారసమేతముగా యెదుర్కొనిపోయి విభవముతో వెంటబెట్టుకొనిరండని ఆజ్ఞాపించగానే అర్చకులు భగవంతుడు నియమించినరీతిగా పరివారసమేతముతో యెదుర్కొనివచ్చి మర్యాదపూర్వకముగా సన్నిధికి వెంటబెట్టుకొనివచ్చిరి. అనంతరము యేకనాథులు అమందానందముతో చంద్రభాగా నదియందు తీర్థమాడి సన్నిధి కేతెంచి శ్రీపాండురంగని ప్రీతితో సేవించి నేత్రములయందానందబిందువులు రాలుచుండగా గోవిందుని చరణారవిందములకు సాష్టాంగదండప్రణామములు సమర్పించి ఆనందపరవశుఁడై శ్రీహరి తనయందు కారుణ్యముతో కనఁబరచిన లీలావినోదములను నుతింపుచు శ్రీహరి తిరువడిత్తామరలను పట్టుకొని పరమానందభరితుఁడై ఆలింగనము చేసికొని తన హృదయగుహయందు మాధవుని దివ్యమంగళరూపమును లయింపజేసికొని సన్నిధిని ప్రదక్షిణము చేసివచ్చి తీర్థప్రసాదములను లభించుకొని తన నిమిత్తము సిద్ధపరచియుంచిన గృహమున విశ్రమించి బ్రాహ్మణగోష్ఠిని రప్పించి పాండురంగనికి ప్రీతికరముగా వారిని భక్ష్యభోజ్యాదులతో నారగింపజేసి తామున్ను భుజించి చందనకుసుమతాంబూలాదులనుధరింపఁజేసి. వారిని తృప్తినొందింపఁగా గోష్ఠియందు వేంచేసియున్న బ్రాహ్మణోత్తములలో కొందరు ఏకనాథస్వామిని పరికించి స్వామీ దేవరవారి ప్రభావాతిశయములు నలుదిక్కులయందువ్యాపించియున్నందున తాము గానరూపముగా కీర్తింపుచున్న శ్రీహరి గుణానుభవములను మేము విని



ఆనందించి కృతార్థులగునట్లు చేయవలెనని ప్రార్థింపుచుండఁగా ఏకనాథులు ప్రీతితో సన్నిధానమునకు యేతెంచి శ్రీపండరినాథునికి ముందుగానున్న మహామంతపమున నిలిచి పాండురంగనికి సాష్టాంగదండప్రణామములుసమర్పించి అంజలిచేసి హరికథను చేయుటకుద్యమించునప్పుడు కథను వినిపించెడువారున్ను వినెడువారున్ను శ్రీజగన్నాథాయని కరతాళములు వేయుచు శ్రీధరా మాధవా గోవిందా కృష్ణా కేశవా ముకుందా మాధవాయని శ్రీహరితిరునామములనుచ్చరింపుచు దండప్రణామములు సమర్పించుచుండ ఏకనాథస్వామి భానుదాసుల దివ్యచరిత్రమును చెప్పి మంగళారతియిచ్చుచుండ సర్వజనులు అపారమైన భక్తిరసముతో గూడియున్నదని నుతింపుచుండిరి. అనంతరము యేకనాథులు శ్రీపండరీపురక్షేత్రమాహాత్మ్యమును అపారపారావారముగా నుతింపుచు శ్రీహరి దివ్యమంగళరూపమును హృదయకమలమునందు నిలిపికొని ఆనందమును జెందియుండి మరుదినమే ప్రయాణమై పురగ్రామాదులయందువిశ్రమింపుచు పైఠను పురసమీపమందు వచ్చుచుండగా పురజనులందరు ప్రీతితో యెదుర్కొనివచ్చి వెంటబెట్టుకొని వచ్చుచుండఁగా వృద్ధవుడు ఆచార్యుల చరణారవిందములకు సాష్టాంగదండప్రణామములు సమర్పించి పరమానందమును జెందియుండ ఏకనాథులు శిష్యుని ప్రీతితో నాలింగనము చేసికొని పురజనులతోఁగూడి మఠము ప్రవేశించి బ్రాహ్మణగోష్ఠికి తదీయారాధనచేసి విఠలమూర్తిని నుతింపుచుండిరి.

శ్రీగరుడధ్వజాయనమః.

# ప్రతిష్ఠాని పరమహంసుని చరిత్రము.

పైఠను పురమునకు ప్రతిష్ఠాన నగరమను పర్యాయనామము గలిగియుండెను, అచ్చట నివసింపుచున్న బ్రాహ్మణోత్తముడొకడు

పరమహంసాశ్రమపరుడగుచు శాంతశమదమాదిసద్గుణములుగలిగినవాడుగానుండెను, ఆమహాత్ముడు సర్వము హరిమయమని తలఁచుచు ప్రపంచమందలి చరాచరములను పామరులను పండితులను చండాలురను పక్షులను మృగములు మొదలగుజీవరాసులను సమభావముగా నెంచుచు అహంభావమువహింపక భూమియందుసాగిలపడి సాష్టాంగదండప్రణామములు సమర్పించుచు ఏకనాథస్వామిగారు కాలక్షేపము చేయుచున్న సత్కథలనువినుచు పరమానందభరితుడుగానుండును. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట అతఁడొకదినము స్నానార్థము నదీతీరమునకేతెంచి తీరమునందు చచ్చిపడియున్న గార్దభశవమును పరికించి సాష్టాంగదండప్రణామము సమర్పించగా ఆతరుణమున నదియందు స్నానముచేయుచున్న విప్రులుకొందరు ఆచర్యను పరికించి నవ్వుచు పరమహంసునివీక్షించి గార్దభశవము గోదావరి వెల్లువలో కొట్టుకొనివచ్చి తీరమునందు వొదిగియున్నది. గాడిదె నిర్జీవముగా యుండుటచే తాము దండప్రణామములు చేయడము అసంగతకార్యముగా నెంచవలసియున్నది, మీరు దండప్రణామములుసమర్పించిన గార్దభశవము జీవించిలేచినయెడల దేవరవారిమహత్యమును నుతింపుచున్నాము, తామారీతిగా చేయజాలనిపక్షమున వీఁగుపూనియుండెదరు ఆశ్రమధర్మమునకు అపఖ్యాతిసంభవించునని పలుకుచుండగా పరమహంసస్వామి విప్రులవచనములను విని మరుమాటపలుకక శ్రీహరిని స్మరింపుచు పరమపురుషా పండరినాథా మాధవా ముకుందా పురుషోత్తమా భక్తవత్సలా చచ్చిన గార్దభమునకు చేసిన ప్రణామము నిష్ఫలమగునాయని అనుతాపముతో భగవంతునిప్రార్థించుచుండ చచ్చిపడియుండెడు గార్దభశవము శ్వాసమువిడుచుచు లేచి సంచరించుచుండగా విప్రులు విస్మయమునుబొంది వారికి సాష్టాంగదండప్రణామములుసమర్పించి తమమనంబులయందు పరిపరివిధముల



చింతింపుచు మననగరమందు వేంచేసియుండెడు ఏకనాథస్వామిగారు పామరజనులకు బ్రహ్మజ్ఞానమును వుపదేశించుచున్నారు, అయినను ఇట్టిమహిమలను వారుచేసినట్లు మనము కనలేదు వినలేదని హెచ్చుతక్కువలు యెంచుచుండగా ఆతరుణమందు ఏకనాథులు స్నానము చేయుటకు వచ్చుచున్నందున పరమహంసస్వామి వారికి దండప్రణామములు సమర్పించగానే ఏకనాథులు మహాత్మునికి సాష్టాంగదండప్రణామములొనరించి స్వామి అద్భుతమైన ప్రభావమును కనపరచినందున తమ యోగసాధనకు విఘ్నము సంభవించునని యెంచవలసినదిగా యున్నది. ఈకలికాలమందు జను లత్యంత వికల్పభావములు గలవారగుచు ఇహలోకసంపదలను కోరెడువారుగా యుండుటచేత యెవరైనా గ్రామమందు చచ్చిపోయినయెడల జనులు మీవద్దకు యేతెంచి చచ్చినశవమును బ్రతికించవలెనని నిర్బంధపరచుచుందురు గనుక యిట్టి ప్రభావములు వినియోగపరచుచుండుటచేత తపస్సిద్ధికి భంగము తటస్థమగునని విన్నవించగా పరమహంసస్వామి భక్తాగ్రగణ్యుని హితబోధములను విని స్వామీ నేను పరమపదము చేరునట్లు సమాధిని కృపచేయుడని ప్రార్థించనదే ఏకనాథులు తక్షణమే పుష్పరవారిని రప్పించి గుంటను త్రవ్వించియుంచగా పరమహంసస్వామి పళ్లమందు కూర్చుని యోగసాధనచే శరీరమునువిడిచి పరమపదము చేరగానే ఏకనాథస్వామి వారికి చేయవలసిన సర్వక్రియలను చేసి సమాధిని మూసివేసి స్నానకృత్యములు ముగించుకొని తమమఠము ప్రవేశించిరి.

అనంతరము పరమహంసుడు సమాధికాబడిన వృత్తాంతమును పురవాసులగు విప్రులు వినబడి ఇది పాపకార్యముగా యుంటున్నదే యని ఏకనాథులను శివాలయమునకు రప్పించి సజీవుడుగాయుండిన పరమహంసను సమాధిచేసితిరి, వారిని నిష్కారణముగా చంపినం

దున మీకు బ్రహ్మహత్యాపాతకము సిద్ధించినది నిష్ప్రయోజనముగా
విపరీతకార్యమును సల్పినందున మీకు బహిష్కారమువుంచినాము,
తామొనరించిన దుష్కర్మము భగవంతునికి ప్రీతికరముగా నుండెడు
పక్షమున పరమశివునికి యెదుట రాతిరూపముతోనున్న నంది కను
వును భక్షించినయెడల తమప్రభావాతిశయమును కొనియాడెదము
లేనిపక్షమున మీరుచేసిన దుష్కర్మమునకు తగినప్రాయశ్చిత్తము
సిద్ధించునని వచింపుచుండఁగా ఏకనాధులు విప్రులకు దండప్రణామ
ములు సమర్పించి దాసుడు మూఢుడను మందమతిని వేదశాస్త్ర
ములను పరిశీలించిన పండితుడనుకానని విన్నవింపుచు నందికేశ్వరా
నేను పరమపదముచేరిన పరమహంసుని శరీరమును సమాధిచేసినా
డను, నేను జరిపించిన కార్యము సత్ప్రవర్తనగాయుండి నాకు దో
షము సంభవించనిపక్షమున పార్వతీపతి సన్నిధానమందు గూడియుం
డెడు సర్వజనులకు ప్రీతికరముగా వారు వుంచెడు కనవును భక్షిం
పుడని సాష్టాంగదండప్రణామములు సమర్పించగా నంది నాలికెను
చాపి ప్రజలు వుంచుచున్న కనువును భక్షించుచుండుటచే జనులం
దరు ఆశ్చర్యపడుచు భయభక్తులతో మేము మా తెలివిహీనతచేత
అహంభావమువహించి చేసిన బహిష్కారముతీరి దేవరవారి ప్రభా
వాతిశయములు బైలుపడినవని పరిపరివిధములనుతింపుచు తాము కన
పరచిన విచిత్రకార్యమునుపరికించి మేమత్యంతసంతోషమును జెంది
తిమని దండప్రణామములు సమర్పించుచుండగా ఏకనాధులు విప్రుల
కందరికి సాష్టాంగదండప్రణామములొనరించి మిక్కిలి వినయముతో
ఓవిప్రోత్తములారా తమ తిరువడిఘుళులప్రాప్యకమే దాసునికి రక్ష
కోపాయముగా నుండుటచేత దాసునికి సకలసిద్ధులు లభ్యమగుచు
న్నదని విన్నవించుచున్నందున పురజనులు బ్రాహ్మణులు ఏకనాధ
స్వామిగారి మహత్యములనుకొనియాడుచు తమతమ గృహములకు



జనుచుండ ఏకనాధులు ఆలయమునువిడిచి మఠమునకువచ్చి శ్రీహరి
మహత్యములను నుతింపుచుండిరి.

అనంతరమీవృత్తాంతమును క్షేత్రవాసులువిని తత్క్షణమే ప్ర
యాణమైవచ్చి శివాలయముప్రవేశించి నందినిపరీక్షించి ఏకనాధులను
రప్పించి వారికి మరల బహిష్కారమునువుంచి పరమహంసుని చంపి
నందున మీకు బ్రహ్మహత్యపాతకము సిద్ధించియున్నది, నందికేశ్వ
రుడు కనుపరచిన చిత్రమును మేముచూడనందున మాకు నిదర్శన
ముగా మేము వుంచుచున్న భక్ష్యములను నంది భుజించినయెడల
మీరు నిర్దోషులని భావింతుము, మీకున్న కీర్తియుండునని విన్న
వించుచు అట్లుచేసిచూపనిపక్షమున మీకు బహిష్కారముయుండు
నని పలుకుచుండగా ఏకనాధులు వారినిపరికించి దేవరవారి కృపాక
టాక్షవీక్షణ్యమునకు దాసుడు పాత్రుడుగాయున్నయెడల నందికేశ్వ
రుడు తమయిష్టానుసారముగా ప్రవర్తించునని నందికి దండప్రణామా
దులు సమర్పించి ఓనందికేశ్వరా దేవరవారు శంకరునికి ప్రియుల్లుగా
యుంటున్నారు తామీక్షణమున క్షేత్రవాసులకు తమప్రభావమును
చూపవలెను, మీరు నానిమిత్తము మేతను భుజింపుచుండినయెడల
పురవాసులు ప్రతిదినము తమకు శ్రమను గలిగింపుచుందురు, గనుక
వీరి మనోరథమును సఫలముగావించుటకొరకు దేవరవారి ప్రభావ
మును చూపవలెనని ప్రార్థించుచుండగా నందికేశ్వరుడు శ్వాసము
విడుచుచు లేచి అటుయిటుసంచరింపుచు గోదావరితీరమందు దుమికి
అచ్చటనే నిలిచియుండఁగా క్షేత్రవాసులు నందికేశ్వరుడు కృపతో
గనబరచిన వింతనువీక్షించి విస్మయముజెంది సంభ్రమాశ్చర్యములు
గలవారై భవిష్యత్కాలమునకు ఇది నిదర్శనముగానున్నదని నుతిం
పుచు ఏకనాధస్వామి శ్రీహరికి అంతరంగభక్తులుగనుక ఇట్టి వినో
దకరములైన విచిత్రములు చూపుచున్నారని అమందానందముతో

వారికి దండప్రణామములు సమర్పించి పోవుచుండగా ఏకనాథులు దేవాలయమునువిడిచి మఠమునకువచ్చిచేరి శ్రీపాండురంగని నుతింపుచు కాలముపుచ్చుచుండిరి, ఇప్పటికిన్ని గోదావరీతీరమందు నందికేశ్వరుని యాత్రాపరులు సేవించి ఏకనాథస్వామి ప్రభావాతిశయములను కొనియాడుచుందురు.

తదనంతరము ఏకనాథులు జ్ఞానదేవుల సమాధిని సేవించవలెనని ప్రీతితో అళకావతికివచ్చి సమాధిని సేవించి అమందానందమును జెందియుండగా నాటిరాత్రి జ్ఞానదేవులు ఏకనాథుల స్వప్నమందు సేవయొసగి సమాధికి చుట్టుప్రక్కలయుండెడు వృక్షముల వేళ్లు పెరిగి వచ్చుచున్నందున వాటిని వేరొకమార్గమందు పోవునట్లుచేయవలెనని తెలియపరచగానే ఏకనాథులు మరుదినము సమాధికి నలుప్రక్కలయుండెడు చెట్లవేళ్లను వేరుమార్గముగా పోవునట్లుచేసి సమాధికి ఆపదసంభవింపనీయక చేసియుంచి అచ్చట శ్రీహరి గుణానుభవములను కాలక్షేపము చేయుచుండ సమీపగ్రామములయందు వసింపుచున్న ప్రజలు భాగవతులు వచ్చియుండి శ్రవణానందముగా విని అమందానందమును జెందియుండగా ఏకనాథులు వారిని భక్ష్యభోజ్యములతో నారగింపజేయుటకు తగినసామగ్రులుచిక్కక పరితపించుచున్నందున శ్రీపాండురంగడు వర్తకునివలె అంగడియుంచుకొని వారికి కావలసిన సకలసామగ్రులను బలవంతముగాయిచ్చుచు క్రయమును మరుదినము తీసుకొనుచున్నానని విన్నవించి భక్తుని మనోరథమును సఫలముగావించి అదృశ్యులైరి. అనంతరము ఏకనాథులు వర్తకుడు మరుదినము కనబడనందున ఇది శ్రీకృష్ణుని లీలావినోదములని నుతింపుచు అచ్చటినుండి ప్రయాణమై తనపురమునకువచ్చి జ్ఞానదేవులు విరచించిన జ్ఞానేశ్వరీయము అపూర్వగ్రంధముగాయుండిన్ని కాలాంతరమైనందున అమితతప్పులు యుండుటవలన యేకనాథులు



గ్రంధములోని తప్పులను సరిపరచి లోకోపకారముగా యుండునట్లు చేసి సర్వజనులువిని ఆనందించునట్లు తామేచదువుటకుప్రక్రమింపగా విప్రరూపమును ధరించి కేశవుడను తిరునామముతోయుండెడు శ్రీపాండురంగడు వృద్ధుడు గ్రంధములోని సార్థాంశములను శ్రద్ధగా విని ఆనందించుచుండగా గ్రంధముసమాప్తముగానే కేశవుడు అనుజ్ఞనుపొంది పోవుచున్నందున యేకనాథులు కేశవుని విశ్లేషమునకు సహింపజాలక పరితపించుచుండిరి.

శ్రీకంసమర్దనాయనమః.

# పైటను అనామీకుని చరిత్రము.

పంచమకులమునందు జనించిన అనామికుడొకఁడు హరిభక్తుడుగాయుండి పైటనుపురమందు వాసముచేయుచు అతఁడు పత్నితో గూడి ఏకనాథస్వామిగారు చేయుచున్న శ్రీహరిగుణానుభవములను విని అమందానందమునుజెందుచు ఏకనాథులు స్నానార్థముగా నదీతీరమునకు యేతెంచుచున్న దారిని శుభ్రముగా వూడ్చియుంచుచు వారిని శ్రీహరిగాభావింపుచు అత్యంతప్రీతితో సాష్టాంగదండప్రణామములు సమర్పించుచు ఆనందపరవశుడై సదాకాలము వారికి తన శక్త్యానుసారముగా భయభక్తులతో శుశ్రూషలు చేయుచుండవలెనని తలంచియుండెను. ఇట్లుండగా నొకదినము ఏకనాథులు శ్రీహరి గుణానుభవములను వర్ణింపుచు భగవంతునివిశ్వరూపమును అపారపారావారముగా కొనియాడుచుండగా ఆతరుణమం దనామీకుడు భయభక్తివిశ్వాసములతో దండప్రణామములు సమర్పించి స్వామీ అర్జునునికి శ్రీకృష్ణమూర్తి తమ విశ్వరూపదర్శనమును సాక్షాత్కారముగా సేవయొసగినప్పుడు దాసుడు యెచ్చట యేరీతిగా యుంటినో ఆవృత్తాంతమును విన్నవించవలెనని ప్రీతితో ప్రార్థించుచుండఁగా

ఏకనాథులు అనామీకుని పరికించి నీవు శ్రీహరిరూపమునందు అన
న్యముగా నేకమైయుంటివని తెలియజేయగానే అనామీకుడు ఏక
నాథస్వామిగారి శ్రీసూక్తులాలకించి శ్రీహరి అప్రాకృతదివ్యమంగళ
స్వరూపమును తనహృదయకమలంబున పదిలపగచుకొని నిశ్చలభా
వముతో నామరూపాదులు లేక సచ్చిదానందస్వరూపుడుగా వెలుగు
చున్న పురుషోత్తముని దివ్యస్వరూపమునందు చిత్తమును లయింప
జేసికొని కొంతసేపు తన్మయముజెందియుండి అనంతరము బాహ్య
దృష్టిగలవాడగుచు యేకనాథులు పరబ్రహ్మస్వరూపులు (ఆత్మసా
క్షాత్కారులు) గా యుంటున్నారని భావింపుచు వారియందు మహ
త్తయిన ప్రేమాతిశయమును వుంచి శాంతశమదమాదిసద్గుణములు
గలిగియుండి యేకనాథస్వామిని ప్రతిదినము సేవించుచుండవలెనను
తలంపుగలవాడై తాను తత్పూర్వము వాసముచేయుచుండిన మాల
వాడను విడిచిపెట్టి యేటిగట్టున పర్ణశాలను యేర్పరచుకొని వాసము
చేయుచు యేకనాథులు ప్రతిదినము స్నానమునకు వేంచేయుచున్న
తరుణంబున వారిని సేవింపుచు కాలయాపనముచేయుచుండ అతని
పత్ని తనభర్తనుపరికించి ఓనాథా ఏకనాథస్వామి శ్రీహరిస్వరూపు
లని యెల్లవారు నుతింపుచున్నందున వారిని మనగృహంబున నొక
దినము ఆరగించునట్లు చేయవలెనని అత్యంతప్రీతితో విన్నవించుచు
న్నందున అనామీకుడు భార్యను వీక్షించి అట్లనేచేయుచున్నానని
యేకనాథులు స్నానముచేయుటకు వచ్చుచుండగా మంచితరుణము
తటస్థించినదని సాగిలపడి సాష్టాంగ దండప్రణామములు సమర్పించి
దాసునియందు కృపాకటాక్షవీక్షణ్యమును ప్రసరించి మేము వాసము
చేయుచున్న పర్ణశాలకు వేంచేసి ఆరగించివచ్చునట్లు దాసునిపత్నికి
కోరికె కలిగియున్నందున దేవరవారు అత్యంతకృపాకటాక్షముతో
వేంచేసి దాసునిగృహమును పవిత్రముచేసి వేంచేయవచ్చునని పరి



పరివిధముల ప్రార్థించుచుండ ఏకనాథస్వామి అతని మనోభావము
లను తెలుసుకొని భగవంతుని కృపచేత మీమనోరథము నెరవేరు
నని అతనికి తృప్తిగలుగునట్లు హితమును బోధించిపంపగా అతఁడు
అమందానందముతో దండప్రణామములుసమర్పించి అనుజ్ఞనుపొంది
తనగృహమునకేతెంచి యేకనాథస్వామిగారు కృపతో విన్నవించిన
వృత్తాంతమును విశదపరచగానే అనామీకునిపత్ని పరమానందము
జెంది దరిద్రదశతో కాలయాపనము జేసెడువారుగా యుండినప్పటి
కిన్ని వారిని పూజించుటకు తగినసామగ్రులను సేఖరింపుచు మహా
త్ముసికృపకు నిరీక్షింపుచు వారు యెపుడు వేంచేసి ఆరగింతురోయని
పరితపించుచు సతీపతులు తాము వాసముచేయుచున్న గృహమునకు
చుట్టుప్రక్కల తులసివనమును రమణీయముగావుంచి ధౌతవస్త్రము
లను ధరించుకొని నిర్మల హృదయములు గలవారై సదాకాలము
శ్రీహరి గుణానుభవమును ప్రీతితో చేయుచు యేకాదశీవ్రతమును
యేకనాథులు శ్లాఘ్యముగా నాచరించుచున్నందున వీరున్ను ఆవ్రత
మును అనుష్ఠింపుచుండగా అనామీకుని పత్ని తనభర్తను పరికించి
స్వామీ నేడు ద్వాదశిగా యున్నందున యేకనాథస్వామిని ఆరగిం
చునట్లుచేసినయెడల మనకుసుకృతములభ్యమగునని విన్నవించగానే
అనామీకుడు భార్య మనోరథము సఫలము గావించుటకు నాక్షణ
మందే స్నానఘట్టమునకు యేతెంచునప్పుడు ఏకనాథులు స్నానము
చేయుచున్నందున మిక్కిలివినయవిశ్వాసములతో సాష్టాంగదండప్ర
ణామములు సమర్పించి స్వామీ నేడు సుదినముగానున్నందున దా
సునియందు కృపయుంచి మాగృహమునకు వేంచేసి ఆరగించిరావలె
నని ప్రార్థించుచు దాసుడు హీనకులమందు జనించియుండుటవలన
తాము వత్తురో రారోయని సందేహించుచున్నాను దాసునియందు
కృపవుంచి నావిన్నపమాలకించి నామనోరథమును అంగీకరింతురో

లేక కోపింతురో యని సంశయించుచున్నానని విన్నవించుచుండగా యేకనాథులు అనామీకుని పరికించి నీప్రేమభావము భగవంతునికి అంగీకారముగా యుంటున్నది, వేదపురాణములను చదివినవిప్రులు భగవద్భక్తియందు అనాదరణగలిగినవారుగా నుంటున్నారు, గనుక జనులందరు శ్రీహరికి ప్రియులుగానుండజాలరు, నీవు పంచమకులమున జనించినవాడుగాయుండినను భగవంతునికి శేషభూతుడుగానుండుట చేత బ్రాహ్మణులకంటె నీవు అధికుడవని తలంచవలసియున్నది, వేషాడంబరములు నిష్ఫలములుగానుండునని గ్రహించుము ఇందుకు నిదర్శనముగా శ్రీమహాభాగవత శ్లోకమొకటియుంటున్నదని శ్లోకార్థమును విశదపరచుచుండగా ఈపరమార్థములను నదికి వచ్చుచున్న విప్రులు విని నాక్షణమందే నాపురంబున వాసముచేయుచున్న తన మిత్రులకు సర్వవృత్తాంతములను తెలియపరచి వారితోకూడా నదీతీరముచేరి ఏకనాథుని వీక్షించి నిందితవచనములతో దూషించుచు శృతులయందలి పరమార్థములను పంచమునికి తెలిపితిరి, పంచముడు పరమార్థములను తెలుసుకొనుటకు అర్హుడుగా యుండునా, మీరు అహంభావముతో చేయరాని అకృత్యములను చేసినందున తమకు దోషము సిద్ధించినది, ఇందున కేమిచేయబోవుచున్నారని విప్రులందరు యేకవాక్యముగా బలుకుచుండగా యేకనాథులు వినయముతో విప్రులకు దండప్రణామములుసమర్పించి ఓవిప్రులారా భగవంతునికి భక్తుడుగానుండెడివాడు పంచమకులమందు జనించినవాడుగానున్నప్పటికిన్ని, అతనిని అల్పజాతియందు జనించినవాడని నిదించవచ్చునా, అతనినిష్ఠకు సమతుల్యులుగాయుండెడువారు యెవరున్ను లేరు, గనుక అతడు జ్ఞానోపదేశమునకు తగినవాడుగా యున్నాడు అతడు నిర్మలభావముతో భగవంతుని వశపరచుకొని యున్నందున అతడు పంచముడైయున్నను పరమార్థములను గ్రహించుటకు తగిన



వాడని స్థిరపరచుచు మీరు నావిషయమున చేయదలచిన కార్యములను నిరభ్యంతరముగా చేయవచ్చునని విన్నవించుచుండగా విప్రులు ఏకనాథులను గంగవద్దికికొనిపోయి వారికి ప్రాయశ్చిత్తముచేయుచున్న తరుణమందు అనామీకుడు ఈవృత్తాంతములను వీక్షించి సంతాపముతో తనగృహంబునకువచ్చిచేరి భార్యనుపరికించి నాతో ఏకనాథస్వామిగారు వార్తలాడుచుండినందుకుగాను బ్రాహ్మణులందరు గుమిగూడి వారికి ప్రాయశ్చిత్తమునుచేయించిరని పరితాపము జెందుచుండగా అతనిభార్య అత్యంతదుఃఖముతో భూమియందుపడి పొరలిపొరలి యేడ్చుచున్నందున అనామీకుడు భార్యను వోదార్చి ఏకనాథులు దీనజనులయందు అమితవాత్సల్యమును కనబరచుచుండుటవలన మనమనోరథమును సఫలముగావింతురుగాని మాటతప్పెడువారుకారు, గనుక నేను మరల స్నానఘట్టమునకు పోయి వారి వృత్తాంతమును తెలుసుకొనిరావలెను, ఆమహాత్ముడు మననిమిత్తముగా విప్రులవద్ద అవస్థలు పొందవలసినవారైరి, వారికి ఆపదసంభవించినపక్షమున మన ప్రాణములను విడిచిపెట్టడమే మనకు పురుషార్థముగా యుంటున్నదని అనుతాపముతో గంగాతీరమునకువచ్చి యేకనాథస్వామిని సేవించి సాష్టాంగదండములుసమర్పించి స్వామీ దానునియందు అత్యంతకృపాకటాక్షమును ప్రసరించియుండుటచేత మాభాగ్యము ఫలించినది, గనుక దేవరవారు దానునిగృహమునకు వేంచేసి ఆరగించిరావలెనని మిక్కిలివినయవిశ్వాసములతో ప్రార్థించుచుండగా ఏకనాథులు అతని పరిశుద్ధలక్షణములనుపరికించి నేను నిత్యనియములను తీర్చుకొనివచ్చి ఆరగించుచున్నానని చెప్పిపంపించగానే అనామీకుడు అత్యంతసంతోషముతో తనగృహంబునకు వచ్చిచేరి భార్యకు స్వామిగారు వేంచేయుచున్నారని తెలియపరచి పరమానందభరితుడై భక్ష్యభోజ్యములను సిద్ధపరచుచుండెను.

ఇదియిట్లుండగా ఏకనాథులు పంచమునికి చెప్పిపంపించిన సవిస్తారములను విప్రులు విని క్రోధముతో ఏకనాథులు పంచమునితో భాషించిన నేరమునకు ప్రాయశ్చిత్తమును పొందినవారైయుండిన్ని మనయెదుటనే పంచముడు భుజించుటకు రమ్మనిపిలువగా అందుకు సమ్మతించి వాని యిష్టానుసారముగా వచ్చుచున్నానని చెప్పిపంపించెగదా, వీరిచర్యలవల్ల జాతిభ్రష్టత్వమును పొందవలసినవారుగా నుంటున్నారే, ఇందునకేమిచేయవచ్చునని యోచింపుచు మనలో కొందరు అచ్చటచ్చటదాగియుండి ఏకనాథులు పంచముని గృహంబున భుజించెడుతరుణమందు పట్టుకొని జాతిభ్రష్టునిఁగావింపవలెనని విప్రులత్యంతజాగ్రతతో పొంచియుండఁగా యేకనాథులు మఠమునకేతెంచి తిరువారాధన సమర్పించి రెండవజామందు భాగవతమును పారాయణచేసి బ్రాహ్మణోత్తముల నారగించుటకు కూర్చుండబెట్టు తరుణంబున పంచముడువచ్చి సర్వపదార్థములు సిద్ధపరిచితిమి, దేవరహొఁగు అరగించుటకు వేంచేయవచ్చునని ప్రార్థించుచుండగా ఏకనాథులు పంచమునిపరికించి నీవుయింటికిపోయియుండుము, నీవెనుకనే వచ్చుచున్నానని చెప్పిపంపించి అతడు బ్రాహ్మణగోష్ఠితోఁ గూడి బ్రాహ్మణులకు తృప్తికరముగాయుండునట్లు వారిని వుపచరించుచుండగా ఇంతలో శ్రీపాండురంగడు ఏకనాథునిరూపమునుధరించి పంచముని గృహంబునకు వేంచేయగానే సతీపతులు అపారప్రీతితో వారి తిరువడిఘుళులకు సాష్టాంగదండప్రణామములుసమర్పించి నానావిధములుగా వుపచారముచేయుచు విస్తరియందు సమస్తభక్ష్యభోజ్యములు పరిమారగా శ్రీహరి సతీపతులను కృపతో కటాక్షింపుచు అత్యంతప్రీతితో భుజించుచుండునప్పుడు దాగియుండి పొంచిచూచుచున్న విప్రుడు ఏకనాథులు పంచముని గృహంబున భుజించుచున్నారని అత్యంతక్రోధముతో తనసహచరులతోఁగూడి అచ్చటినుండి ఏక



నాథుల మఠమునకేతెంచి విప్రగోష్ఠికి వుపచారములు చేయుచు భుజించుచున్న ఏకనాథులను వీక్షించి సంశయము జెందుచుండఁగా వారిలోకొందరు వేగముగా పంచముని గృహంబునకువచ్చి, అచ్చట భుజించుచుండుటనుగని యిచ్చట యేకనాథుడు భుజించుచున్నాడు అచ్చట యేకనాథుడు గోష్ఠితోఁగూడి భుజించుచున్నాడు, ఇతడు రెండుస్థళములయందు కనబడుచుండుటకు గతంబేమని చింతింపుచు అత్యంతవిస్మయము గలవారగుచు యదార్థమును యేరీతిగా తెలుసుకొనవచ్చునని సంతాపముతో యిచ్చటికి అచ్చటికి తిరుగుచుండిరి. ఇంతలో శ్రీపాండురంగడు ప్రీతితో పంచముని గృహంబున సమస్త భక్ష్యభోజ్యములనుభుజించి హస్తపాదములుశుద్ధిచేసుకొని చందన కుసుమతాంబూలాదులను ధరించి ప్రయాణమగుచుండగా సతీపతులత్యంత ప్రీతితో శ్రీహరి పాదారవిందములను పట్టుకొని స్వామీ మేము పాపులము తక్కువజాతియందు జనించినవారము జ్ఞానహీనులము భక్తిహీనులము విశ్వాసహీనులము సేవాహీనులము నీతిమాలినవారముగాయుండిన్ని దేవరవారు మాయందు పరిపూర్ణ కృపను ప్రసరించి కడతేర్చి రక్షించితిరని అమందానందముతో ప్రార్థించుచుండగా శ్రీహరి దంపతుల భక్తి విశ్వాసములకు సంతసింపుచు మీ మనోరథములు పండినవి; మీరు భగవంతునికి అంతరంగభక్తులుగా యున్నారని సతీపతులసుగుణములను కొనియాడుచు అంతర్ధానముకాగా సతీపతులు శ్రీహరి వుచ్ఛిష్ఠప్రసాదమును భుజించి పరమానందభరితులైరి. అనంతరము అసూయాపరులగు విప్రులుకొందరు గుమిగూడి ఏకనాథులు మంత్రతంత్రములు నేర్చినవారని యోచింపుచు ఇతనిని కులభ్రష్టునిగాచేయుటకు వీలుపడలేదని చింతించుచుండిరి గాని సుజనులందరు ఏకనాథుల మహత్యములను నుతింపుచుండిరి.

శ్రీగరుడగమనాయనమః.

# ప్రతిష్ఠాని బ్రాహ్మణుని చరిత్రము.

పైటనుపురమున విప్రుఁడొకడు దారాపుత్రాదులతోఁ గూడి కీర్తిప్రతాపములు గలవాఁడగుచు వాసముచేయుచుండెను. అతనికి పూర్వజన్మ పరిపాకముచే పరుసవేది లభ్యమై అపరిమిత భోగభాగ్యములు అనుభవింపుచు సంపత్కరుడై కొంతకాలము భార్యాపుత్రులతోఁగూడి సుఖభోగములనుభవింపుచు కాలయాపనము చేయుచుండి అకస్మాత్తుగా సతీసుతాదులు దేహవియోగము చెందినందున అతడు విరక్తిపరుడగుచు తీర్థయాత్ర చేయుటకు ప్రయత్నించి పరుసవేదిని యెచ్చట భద్రపరచవచ్చునని యోచింపుచు ఏకనాథస్వామి నిరపేక్షులుగా యుండుటచేత వారివద్ద నుంచవచ్చునను నమ్మకముతో మహాత్ముడు యేకాంతముగా యుండెడు తరుణమందు వారికి దండప్రణామములు సమర్పించి స్వామీ అపూర్వమైన వస్తువొకటి నావద్ద యున్నందున తాము నేను తీర్థయాత్ర చేసివచ్చెడుపర్యంతము ఆవస్తువును భద్రపరచియుంచవలెనని ప్రార్థించుచుండగా యేకనాథులు సమ్మతించి పెట్టిపోవచ్చునని చెప్పినందున విప్రుడు పరుసవేదిని వారివద్ద యివ్వగా ఏకనాథులు పరుసవేదిని వీక్షించి యిది పాషాణమువలె గనబడుచున్నదేయని విచారింపగా బ్రాహ్మణుడు మహాత్మా ఇది యినుమును స్వర్ణముగా చేయునట్టిశక్తిగలది, ఇదే పరుసవేదని యెంచుడు, నేను యాత్రచేసివచ్చినపిమ్మట దేవరవారివద్దనుండి తీసుకొనుచున్నాను, అంతవరకు దేవరవారు భద్రపరచి యుంచవలెనని వేడుకొనుచుండగా ఏకనాథులు పరుసవేదిని తన పీటక్రింద యుంచి యుండిరి, అనంతరము విప్రుడు మహాత్మునివద్ద అనుజ్ఞనుపొంది సర్వ తీర్థక్షేత్రములనుసేవింపుచు యాత్రచేయుచుండెను. ఇదియిట్లుండగా ఏకనాథులు నిరపేక్షులుగాను నిర్భరత్వముగలవారై యుండుటచేత తనవద్ద విప్రుడు భద్రపరచియుంచునట్లు చెప్పిపోయినవచనములను వినియుండిన్ని అపరూపమైనవస్తువనితలంపక తృణప్రాయముగాభావించి పీటక్రింద యుంచినవృత్తాంతమును మరచిపోయిరి.

తదనంతరమా బ్రాహ్మణుడొక సంవత్సరము పర్యంతము తీర్థక్షేత్రములను సేవించుకొని తనపురమునకువచ్చిచేరి ఏకనాథస్వామి మఠమునకువచ్చి సాష్టాంగ దండ ప్రణామములు సమర్పించి తాను యాత్రచేసివచ్చిన వృత్తాంతములను విన్నవించి నాలుగుఘడియలపర్యంతము కూర్చునియుండిన్ని ఏకనాథులు పరుసవేదిని యిచ్చియుండనందున బ్రాహ్మణుడు రేపటిదినమువచ్చి తీసుకొనవచ్చునని తన గృహమునకువచ్చిచేరి ఏకనాథులు పరుసవేదిని యివ్వలేదని చింతింపుచు మరుదినము మఠమునకువచ్చి వారికి దండప్రణామములుచేసి తాను యాత్రపోవుతరుణమందు యిచ్చిపోయిన పరుసవేదిని తనకు కృపచేయుడని వేడుకొనుచుండ ఏకనాథులు కొంతసేపు యోచించి నీవు యిచ్చిపోయినవస్తువును నేనెచటవుంచినానో నాకు జ్ఞాపకమునకు రాలేదని పలుకుచుండగా విప్రుడు మహాత్మునిపరికించి స్వామీ పరుసవేదిని తాము వెంచేసియుండెడు పీటక్రిందుగావుంచితిరని తెలియపరచినదే అతడు పీటను యెత్తిచూచి అచ్చట పరుసవేది లేనందున విప్రునిపరికించి అయ్యా నీవు యిచ్చిపోయిన వస్తువును యిచట శుభ్రపరచెడువారు గంగలో పారవేసియుందురని తెలియపరచగా నే విప్రుడు అత్యంతవిషాదమును జెంది నేను పరుసవేదియందు వుంచుకొనియున్న ప్రేమాతిశయముచే మరల యిచ్చటికి తరుగుదెంచితిని నాభార్యాపుత్రులు గతించినప్పుడే బంధములన్ని విడిపోయెనుగదా నేనిందునకేమిచేయుదునని పరితపించుచుండగా ఏకనాథులు తత్క్షణమందే విప్రుని వెంటబెట్టుకొని నదీతీరమునకువచ్చి నీపరుసవేది గంగయందు పదిలముగానుండునని నీటిలోదిగి యిసుకతోఁగూడిన పిడికెడు

రాళ్లను యెత్తుకొనివచ్చి, తాము తమపరుసవేదినిమాత్రము యెత్తు
కొనుడు, తతిమ పరుసవేదులను గంగలో భద్రపరచియుంచుచున్నా
నని విన్నవించుచుండఁగా విప్రుడు ఆనందపరవశుడై యొకరాయిని
యెత్తుకొని యివియంతయు పరుసవేదులుగాయున్న వేయని విస్మయ
ముజెందియుండునప్పుడు ఏకనాథులు మిలిగినవాటిని గంగలో పార
వేసి స్నానముచేసి తమమఠమునకు పోవుచుండగా పురజనులందరు
మహాత్ముని ప్రభావాతిశయములను నుతింపుచు పరమానందభరితు
లుగాయుండిరి.

శ్రీశాంతాకారాయనమః.

# ద్వారక బ్రాహ్మణుని చరిత్రము.

ఒకదినము ఏకనాథస్వామి ప్రాతఃకాలమందు లేచి శ్రీహరిని
ధ్యానించి శౌచమునకుజని హస్తపాదములు శుద్ధిచేసుకొని నదీతీర
మునకువచ్చి స్నానసంధ్యాద్యనుష్ఠానములను తీర్చుకొని మఠమున
కేతెంచి శ్రీహరిని ఆరాధించి భాగవతమును పారాయణచేసి అతిథి
అభ్యాగతులకు సదావర్తిని కృపచేయుచు పితృతర్పణములను నిర్వ
ర్తించి బ్రాహ్మణోత్తములను పూజించి శ్రీపాదతీర్థమును స్వీకరించి
భక్ష్యభోజ్యములతో నారగింపఁజేసి వారు చందనకుసుమతాంబూ
లాదులను ధరించినపిమ్మట శ్రీమహాభాగవతమును వ్యాఖ్యానపరచి
వినిపించుచు అస్తమయసమయమందు నదీతీరమునకేతెంచి స్నాన
సంధ్యావందనాదులు చేసి మఠమునకు వచ్చి శ్రీహరికథలను కాల
క్షేపముచేయుచు పూజార్చనాదులతో శ్రీహరిని పూజించి ఆర్తితో
హరినామసంకీర్తనలను పాడుచు దేహముమరిచి ఆనందపరవశుడుగా
యుండి శ్రీహరిగుణానుభవములను వర్ణింపుచు సర్వజనులకు హిత
మునుబోధింపుచు పామరులను కడతేర్చుచుండగా శ్రీపాండురంగడు



మరల బ్రాహ్మణరూపమునుధరించి ఏకనాథుల మఠమునకు వచ్చి
వారికి దండప్రణామములు సమర్పించి స్వామీ దేవరవారిని ఆశ్ర
యించియున్న పామరజనులకు మందమతులకు సాధు సజ్జనోత్తముల
సేవయున్ను ఈశ్వర భక్తిన్ని లభ్యమగుచున్నందున దాసునికిన్ని
అట్టిపదవి లభించునను ప్రేమభావముగలవాడై దేవరవారికి యెల్లప్పు
డున్ను పరిచర్యలు చేయవలయుననెడు తలంపుతో యేతెంచితినని
విన్నవించుచుండగా ఏకనాథులు విప్రుని కటాక్షించి నీనామధేయ
మును వాసస్థానము మొదలగు వృత్తాంతములను తెలియపరచుమని
ప్రియవచనములు పలుకుచుండఁగా శ్రీహరి ఏకనాథులను వీక్షించి
నేను యేకాకినిగా యుండి ప్రపంచమునందు సంచరించుచుండువాఁ
డను, నన్ను శ్రీఖండ్యాయని జనులు పిలుచుచుందురు, నాకు సతీ
సుతాదులయందు ప్రేమలేదు నేను ఋగ్వేదశాఖలో చేరినవాడను
నేను జీతముతీసుకొనక కొలువుచేయుటకువచ్చియున్నానని మిక్కిలి
వినయముతో విన్నవించుచుండఁగా ఏకనాథులు విప్రుని వృత్తాంత
ములను తెలుసుకొని నీవు నాకు పరిచర్యలు చేయనక్కరలేదు, నీవు
యెంతకాలముయుండినను అన్నవస్త్రములకు కొదువయుండదు నిర
భ్యంతరముగా యుండవచ్చునని తెలియపరచగానే బ్రాహ్మణరూప
మునుధరించియున్న శ్రీహరి స్వామీ నాశరీరమందు శక్తియుండెడు
పర్యంతము వృథాగా ప్రొద్దుగడపజాలను, ఈమానవజన్మము అస్థి
రముగానున్నందున మహాత్ములకు సర్వోపచారములు చేయుచుండు
టచేత నాజన్మము సాఫల్యమగునుగదాయని విన్నవించి ఆదినము
గడిపి మరుదినము మొదలు వుదయాత్పూర్వమందే నిత్యనియమములను
తీర్చుకొని స్థలశుద్ధిచేసినపిమ్మట పాత్రలనుశుద్ధిచేసియుంచుచు తిరు
వారాధనసమర్పించుటకు కావలసిన చందనపుష్పఫలాదులను తీర్థ
మును తెచ్చియుంచి సర్వకార్యములను నిర్వహించుచు పాకశాలలో

చేయవలసిన కార్యములను విసుకుచెందక నిర్వహించుచున్నందున పురజనులందరు పరమానందముతో కొనియాడుచుండునట్లు ప్రవర్తించుచు ద్వాదశవర్షములుగడిపిరి.

ఈరీతిగా శ్రీహరి పన్నెండుసంవత్సరములు పైఠనుపురమందు ఏకనాథుల మఠమునందు శిష్యునివలె సర్వకార్యములను నిర్వహింపుచుండగా ద్వారకాపురియందు విప్రుడొకడు భగవంతుని ప్రత్యక్షముగా సేవించవలెనని ధారణయోగముచేయుచు కొంతకాలము నిర్మలభావముతో ధ్యానింపుచు భగవంతునిసేవ లభ్యముకానందున పన్నెండుసంవత్సరములు అన్నాహారములను వర్జించి యేకనిష్ఠతో ధ్యానించుచుండగా శ్రీదేవి విప్రునియందు కృపతో అతని స్వప్నమునందు సేవయొసగి నీవింతకాలము ఆహారమువర్జించి శల్యావశిష్టుడవై అత్యంతశ్రమను పొందుచున్నావు; ఇపుడు శ్రీహరి ద్వారకలో లేదు, పైఠనుపురియందు వసింపుచున్న మహాత్ముడగు ఏకనాథుల మఠమందు విప్రరూపమును ధరించి శ్రీకంఠ్యాయను తిరునామముతో పరిచారకత్వము చేయుచున్నారని తెలియపరచి అదృశ్యముకాగా విప్రుడు రుక్మిణీపిరాట్టి తెలిపిన హితవచనములకు సంతసింపుచు తత్క్షణమే ప్రయాణమై పైఠనుపురమునకువచ్చిచేరి గోదావరినదియందు స్నానానుష్ఠానములు తీర్చుకొనుచుండగా శ్రీహరి నదీతీరమునకు వచ్చి బిందెలో తీర్థమునుముంచుకొని తననిమిత్తము ద్వారకనుంచి వచ్చియున్న విప్రుని పరికించి అయ్యో నేనునిశ్చింతగా కాలముగడుపుచు అత్యంతసుఖమును చెందుచున్నా నే, రుక్మిణీపిరాట్టి నన్ను వుండనివ్వక చేసినదే, అయ్యో నేను మరల ద్వారకకు పోవలసినవాడనై యుంటున్నానుగదాయని మిక్కిలి పరితపించుచు తీర్థమును తెచ్చి యుంచి చందనముతీయుటకు యత్నించుచుండగా ఇంతలో ద్వారకలోనుండి వచ్చియుండెడు విప్రుడు యేకనాథస్వామిగారి మఠము



నకు రాగానే మహాత్ముడు విప్రుని వీక్షించి సంతసింపుచు దండప్రణామములుసమర్పించి ఆసనమందు విశ్రమింపుడని హితవచనములుపలుకుచుండగా ద్వారకవిప్రుడు వినయముతో దండప్రణామములుసమర్పించి స్వామీ శ్రీహరి విప్రరూపమునుధరించి శ్రీకంఠ్యాయను తిరునామముతో దేవరవారికి కైంకర్యములు చేయుచున్నారని తెలిసికొని భగవంతుని సేవించి ఆనందించుటకుగాను యిచ్చటికి వచ్చితానని విన్నవించగానే ఏకనాథులు విప్రునిపరికించి ఓవిప్రోత్తమా శ్రీహరి సర్వాంతర్యామియై భక్తవత్సలుడుగాను సర్వవ్యాపిగాను వెలుగుచున్నారనివిన్నవించుచుండ ద్వారకవిప్రుడు స్వామీ భగవంతుని సగుణరూపము చేతనులకు రక్షకోపాయముగానుండునని విన్నవించినందున ఏకనాథులు వుద్ధవునిపరికించి శ్రీకంఠ్యా యెచ్చట యేమిచేయుచున్నారని విచారించగా వుద్ధవుడు స్వామీ అతను చందనమరగదీయుచున్నారని తెలుపగానే ఏకనాథులు ద్వారకవిప్రసమేతముగా భగవన్మందిరమునకు వచ్చుచున్న తరుణంబున శ్రీకృష్ణమూర్తి సర్వాభరణములుధరించి శంఖచక్రాద్యాయుధములతో పీతాంబరధారియై వైజయంతీ వనమాలాలంకృతుడై కోటిసూర్య ప్రకాశముతో సేవయొసగుచుండగా ఏకనాథులత్యంతప్రీతితో పురుషోత్తముని స్వరూపరూప విభవములను కొనియాడుచు అమందానందముతో శ్రీహరీ గోవింద మాధవా దేవరవారు తమదాసునియందు కృపాకటాక్షము చూపుచు అద్భుతమహత్యములను కనపరచుచున్నారుగదా, దేవరవారి లీలావినోదములను పరిశీలించి తెలుసుకొనుటకు శేషునికిన్ని చతుర్ముఖునికిన్ని అగోచరములై యున్నందున మందమతిగానున్న దాసునికి శక్యముగునా, ఓగోవర్ధనోద్ధారా జగదీశా జానకీరమణా దయానిధీ దామోదరా దేవరవారు భక్తవత్సలుడనుబిరుదును నా విషయమున బైలుపరచితిరని పలువిధములకొనియాడుచు సాష్టాంగ

దండప్రణామములుసమర్పించి నుతింపుచుండఁగా శ్రీహరి ఏకనాథుని
కృపతో నీక్షించి నేను కొంతకాలమునకుముందు విఠలుడనునామ
ధేయముతో నీవు పాడునప్పుడు తాళమువేయుచుంటిని, అనంతరము
కేశవుడను పేరుతో పన్నెండుసంవత్సరములు భాగవతమును విను
చుంటిని, ఇప్పుడు శ్రీకంఠ్యాయను నామమును ధరించి ద్వాదశాబ్ద
ములు పరిచర్యలను చేయుచుంటినని సర్వవృత్తాంతములను విశదప
రచి అంతర్ధానమైన తదనంతరము ద్వారకబ్రాహ్మణుడు భగవంతుని
శ్రీసూక్తుల నాలకించి సంభ్రమాశ్చర్యములు జెందినవాడై అత్యంత
ప్రీతితో ఏకనాథుల చరణారవిందములయందు సాగిలపడి సాష్టాంగ
దండప్రణామములుసమర్పించి దేవరవారు పుణ్యపురుషులుగా యుం
టున్నారని కొనియాడుచుండగా ఏకనాథులు అనుతాపముతో ఓ
విప్రోత్తమా శ్రీహరి కపటనాటకసూత్రధారివలె మానవరూపుతో
పరిచర్యలు సలుపుచున్నతరుణంబున పరంధాముని సత్కరింపక అనా
దరణచేయుచుంటినని పరితపించుచు భగవంతుని లీలావినోదములు
అపారపారావారములుగా యుంటున్నదని నుతింపుచు ప్రేమాతిశ
యముచే కొంతసేపు తన్మయముజెందియుండి అనంతరము ద్వారక
బ్రాహ్మణుని అత్యంతప్రీతితో కూర్చుండబెట్టి వారిని సర్వోపచార
ములతో పూజించి చక్కగా నారగింపచేసి చందనకుసుమతాంబూ
లాదులను ధరించినపిమ్మట భక్తులిద్దరు నొకరొకరిని స్తుతించుకొను
చుండగా సర్వజనులు అమందానందముతో ఇది శ్రీహరి కారుణ్య
విశేషమని కొనియాడుచుండిరి.

అనంతరము నొకానొక సుదినమున రాత్రికాలమందు ఏకనా
థులు శ్రీహరి నామసంకీర్తనలతో కాలక్షేపము చేయుచున్న తరుణ
ములో సకలజాతుల స్త్రీపురుషులు సత్కథను వినుటకుగాను వచ్చి
యుండఁగా ఏకనాథులు బ్రహ్మానందముతో అచ్యుతా ఆదికేశవా



గోవిందా మాధవా ముకుందా పురుషోత్తమా భక్తవత్సలాయని
దేహముమరచి భగవంతుని ప్రభావములను అపారపారావారముగా
వర్ణింపుచుండగా సర్వజనులు వారివారి దేహములను మరిచియుండి
ఆనందపరవశులుగా నున్నతరుణంబున నలుగురుదొంగలు వారితో
కలిసి సత్కథను వినుచున్నవారివలె నటించుచుండిరి. అనంతరము
కొంతసేపటికి హరికథ ముగిసినదే సర్వజనులు తమతమ గృహము
లకు పోయినపిమ్మట వృద్ధపుడు ద్వారమును బంధించుకొని నిద్రిం
చుటకుపోగానే గిరిజాభాయి తన గదియందు పరుండెను, పిమ్మట
ఏకనాథులు యేకాంతముగా కూర్చునియుండి శ్రీహరిని ధ్యానించు
చుండుతరుణంబున చోరులు లోపలప్రవేశించినదే వారికి నేత్రములు
కనపడనందున అటుయిటుతిరుగుచు తలలు ఢీకొట్టుకొనుచు దీపము
లన్నియు ప్రకాశమానముగా వెలుగుచుండినన్ని కన్నులు కనబడనం
దున యిల్లంతా తిరిగితిరిగి ఏకనాథులు వేంచేసియున్న స్థళమునకు
రాగానే చోరులకు నేత్రములు చక్కగా కనబడుచున్నందున దొం
గలు తమకుటిలస్వభావమునువిడిచి మహాత్మునికి సాష్టాంగదండప్రణా
మములుసమర్పించి మిక్కిలివినయముతో పలువిధముల నుతింపుచుం
డగా ఏకనాథులు దొంగలనువీక్షించి మీరు అకాలమందు వచ్చిన
కారణమును తెలియపరచుడనగా చోరులు స్వామీ మేము చోర
త్వముచే కాలయాపనముచేయువారము, మేము దేవరవారి ప్రభా
వాతిశయములను తెలియనివారుగానున్నందున యుక్తాయుక్తములు
యోచింపక తమ గృహంబున ప్రుచ్చలించుటకువచ్చి లోపలప్రవే
శించగానే మాకు నేత్రములు తెలియక అవస్థపడుచు యిల్లంతా
తిరిగితిరిగి తమసేవ లభించినదే మాకు నేత్రములు చక్కగా కన
బడుచున్నందున మాకుటిలస్వభావములనువిడిచి పరిశుద్ధభావములు
గలవారముగాయున్నామని తమ వృత్తాంతమును తెలియపరచగానే

ఏకనాథస్వామి అత్యంతకృపాకటాక్షముతో చోరులను కటాక్షించి
అయ్యో మీరు ప్రయత్నించినపని కొనసాగకపోయినందున అధిక
శ్రమలుజెందిన్ని కార్యసాఫల్యము చెందకపోతిరేయని కరుణతో
చోరులను వెంటబెట్టుకొనిపోయి ధాన్యరాసులను ద్రవ్యరాసులను
చూపించి మీకు యెంతమాత్రము కావలసియుండునో అంతవరకు
కొనిపోవచ్చునని తెలియపరచగా దొంగలు తమ కుటిలస్వభావము
లను విడిచియున్నందున స్వామీ మాకు ప్రసాదముమాత్రము లభిం
చినయెడల మేము తృప్తిజెందుచున్నామని వినయవిశ్వాసములతో
వేడుకొనుచుండిరి. ఇంతలో యేకనాథులు భార్యను నిద్రలేపి నీవు
తక్షణమే పాకశాలప్రవేశించి పాకముచేసి వీరినిసంతుష్టిపరచవలెనని
అనుజ్ఞచేయగానే గిరిజాభాయి భర్తకునమస్కరించి పాకశాలప్రవే
శించి రెండువిధములకూరలతో ప్రసాదమునుసిద్ధపరచి ఆకులయందు
పరిమారుచుండగా ఏకనాథులు వారిని హేయముగాభావింపక ప్రియ
వచనములతో నాదరింపుచు తీర్థప్రసాదములనుకృపచేసి చోరులను
చక్కగాభుజింపజేసి తృప్తిజెందునట్లు చేయగానే వారు తమ దుష్ట
స్వభావములనువిడిచి కళంకరహితులగుచు భక్తిమార్గమును అవలం
బించి కీర్తిప్రతాపములతో కాలయాపనముచేయుచుండిరి.

శ్రీనిత్యకల్యాణాయనమః.

# చెఱసాల అంత్యజుని చరిత్రము.

పైటనుపురమునందు అనామికుడొకడు దారిద్ర్యదశ ననుభ
వింపుచు చోరవృత్తిచే ధాన్యములను ముచ్చలించుకొనివచ్చి జీవిం
పుచు కాలయాపనముచేయుచుండగా ఒకదినము దొంగలింపబోయి
ధాన్యములను ముచ్చలించుచుండగా గృహాధిపతి దొంగనుపట్టుకొని
తలారులకు వప్పగించగానే మరుదినము న్యాయాధిపతి వాని దుష్ట



చేష్టితములను విని వానిని చక్కగా మర్దించి కాళ్లకు సంకెళ్లు తగిలించి
చెఱసాలయందు యుంచి, అన్నాహారములను పెట్టకయుండునట్లు
దిట్టపరచియుండినందున చోరునికి నానాట దేహశక్తి తగ్గుచు వచ్చు
చుండెను. గ్రామాధికారియున్ను వీని అశక్తిని పరికించి వీడు పారి
పోవుటకు కూడా శక్తిలేకయుంటున్నాడని వాని కాళ్లలో తగి
లించియున్న, సంకెళ్లను విడదీయించి యుంచగా ఆనాటిరాత్రియందే
దొంగ, తన సంకెళ్లు తీసివేసినందున తాను పారిపోవుట మంచిదని
యోచించి అట్లు పోవుటకు శక్తిలేకయున్నదే యని మిక్కిలి చింతతో
దుఃఖించుచుండెను. ఆసమయమందు చెఱసాలకు సమీపముగా యేక
నాథుల గృహంబున శ్రీహరికథ జరుగుచుండుటను విని మెల్లగాపోయి
శ్రీహరికథ జరుగుచున్న స్థలమునకువచ్చి యేకనాథులను సేవించి ఆయం
కణమందొక ప్రక్కగా కూర్చుని వినుచుండెను. అనంతరము కథ ముగి
యగానే జనులందరు యేకనాథులను స్తోత్రముచేయుచు తమతమ
గృహంబులకు పోవుచుండగా అంత యేకనాథులు శ్రీహరిని ధ్యానిం
పుచు అంత్యజుడున్న స్థలమును దృష్టించిచూచి అచ్చట నొక మను
ష్యుడుండునట్లు యోచించి పిచ్చివాడుగా యుండవచ్చునని వాని సమీప
మున కేతెంచి నీవెవరని విచారించిరి. వాడు మరుమాట వచించుటకు
శక్తిలేనివాడగుటచేత చేతితో సౌజ్ఞచేసి చూపగా, యేకనాథులు
వెంటనే శయనించియున్న తన భార్యనులేపి క్షుద్బాధచే నొక మను
ష్యుడు మన యంకణమందు వచ్చియుంటున్నాడు, నీవు వానికి ప్రసాద
ముంచి సంతుష్టిపరచి పంపవలయునని చెప్పిరి. అంత నాసతి భర్తకు
దండము సమర్పించి వంటచేయు స్థలమునకు శీఘ్రముగాపోయి అన్న
మును వార్చి పాలున్ను చక్కెరయున్ను చేర్చి అన్నమును తన పురు
షుని ముందుంచగా వారు దానిని చేతకెత్తుకొని వీనికి అన్నదోష
ముగా యుండవచ్చునని తలచి కొంచెము కొంచెముగా ఆచోరుని నోటి

యందు విడివగా వాడు కొంచెము తీసుకొనినదే జలమును వాని నోటి యందుంచగా వాడు బడలికతీరి తనయొక్క సవిస్థారమంతయు విన్నవించెను. అంత యేకనాథులు వాని వచనము లాలకించి కరుణగలవారై వానికి ధైర్యము చెప్పి నీయొక్క దేహమునకు పటుత్వము గలుగు పర్యంతము సుఖముగా యిచ్చటనేయుండి రాత్రింబవళ్లు చక్కగా భుజించుచుండుమని చెప్పి వానికి వస్త్రముల నిచ్చి శయనించుమని నుడివిరి. అనంతరము యేకనాథులు ఉదయమైన వెనుక తమ నిత్యనియమములను ముగించుకొని వొక మనుష్యునిచే చెఱలోనుండిన మనుష్యుడొక్కడు తనవద్ద వచ్చియున్నాడని గ్రామాధికారులకు తెలియపరచి రమ్మని చెప్పిపంపగా గ్రామాధికారులు ఆవచనములను విని యేకనాథుల యిష్టప్రకారము చేయవచ్చునని చెప్పి పంపిరి. అంత యేకనాథులు చోరునికి అన్నపానాదు లొసంగి రక్షించగా వానికి దేహమునందు శక్తికలిగి సదా శ్రీహరికథలను వినుచుండినందున వాని యొక్క దుర్మార్గగుణములు నశించి మంచిగుణములుగలవాడై ప్రవర్తించుచుండెను.

ఇట్లుండగా మాలవాని తమ గృహంబున యుంచుకొని పోషించుచున్నారని యేకనాథులను పైటను పురమునందున్న బ్రాహ్మణులందరు విశేషముగా నిందించుచుండిరి. ఒకదినము యేకనాథులు గంగకు పోవుచున్న సమయమందు ఒక బ్రహ్మరాక్షసుడు రాగిచెట్టులోనుండి క్రిందికిదిగి చేతులు జోడించుకొని విన్నవించుచున్నాడు. నేను సంస్కారబంధముననుండి బ్రాహ్మణద్వేషము సంభవింపజేసికొనినందున నా కిట్టిజన్మము ప్రాప్తించినది, మీరు బ్రాహ్మణ జనులకపరిమితముగా ప్రసాదములుంచుచున్నారు, ఇదికాక ఒక రాత్రి కాలమందు మాలవానికి అన్నముంచితిరి, మీవద్ద యీరెండు సుకృతములుండుటచేత యీ సుకృతములలో నొకటిని నాకు దత్తముచేసిన



యెడల నా జననము పవిత్రమగుచున్నది, మీకున్ను విశేష కీర్తియుండునని విన్నవించెను. ఆ బ్రహ్మరాక్షసుని వచనములను యేకనాథులు పరమానందముతో నేను ఈషా యిష్టములను తెలుసుకొనువాడనుగాను, నీ యిష్టప్రకారము నీవే కోరవచ్చును, నేనవశ్యము యిచ్చుచున్నాను, నామాట సత్యమని వచించిరి. ఆ వచనములను, బ్రహ్మరాక్షసుడు విని మీరు మాలవాని రక్షించిన పుణ్యమును, మాత్రము నాకనుగ్రహించిన యెడల నాకు చాలునని చెప్పగా యేకనాథులు చేతులయందు జలమెత్తుకొని ఆ పుణ్యమును బ్రహ్మరాక్షసునకు వుదకపూర్వకముగా దత్తముచేసిరి ఆ జలము బ్రహ్మరాక్షసుని యొక్క హృదయమునందు పడగానే వాడు పైకిలేచి మీయొక్క దర్శనముచేతను, పరమకారుణ్యముచేతను, నేను సద్గతి పొందుచున్నానని గగనమార్గముగా, బోవుచుండెను, ఆ వింతనుజూచి యేకనాథులను నిందించిన బ్రాహ్మణ జనులందరు, తలవంచుకొనియుండగా కొందరు భక్తులు వారి దివ్యచరిత్రములను కొనియాడుచుండిరి.

శ్రీ జగత్కారణాయనమః.

ప్రథమభాగము సంపూర్ణము.



